ఒక వాక్యంలో అంతర్నిహితంగా ఉండి బయటికి వెంటనే స్ఫురించనిది గుప్తనిర్మాణం సాధారణంగా బయటికి కనిపించేది వ్యక్త నిర్మాణం గుప్త నిర్మాణాన్ని గుర్తించటం వక్త నిర్మాణం ఇచ్చే సాక్ష్యం మీదనే ఆధారపడి ఉంటుంది ఇంతకు పూర్వము ఉదాహరించిన 2 3 4 సంఖ్యగల వాక్యాల్లో ఇందుకు సాక్ష్యం ఉంది ఒక వాక్యానికి వ్యాకరణ సంబంధమూలకమైన అర్థ భేదాలుంటే దానికి భిన్న గుప్త నిర్మాణాలను సూచించాలి రెండు వాక్యాలు పైకి ఒకటేగా కనిపిస్తున్నా వ్యాకరణ సంబంధాల్లో భేదం (నామ్నీకరణాదులవల్ల) కనిపిస్తే కూడా భిన్న గుప్త నిర్మాణాలను గుర్తించాలి రెండు వాక్యాల్లో ప్రధానంగా ఒకే అర్థం ఉంటే రెంటికి ఒకే గుప్త నిర్మాణాన్ని చూపించాలి రెండు చూపించాల్సివస్తే రెండిట్లో ఆ సామ్యాన్ని చూపించాలి గుప్త వక్త నిర్మాణాల మధ్య ఉండే సంబంధాల్ని ఈ కింది విధంగా బొమ్మతో చూపించవచ్చు

8




ఇందులో X గుప్తనిర్మాణాన్ని Y వ్యక్త నిర్మాణాన్ని సూచిస్తై మొదటి బొమ్మలో ఉన్న పరిస్థితి మాత్రమే ఉంటే గుప్త వ్యక్త నిర్మాణ భేదాల్ని గుర్తించక్కర్లేదు కాని మిగతా రెండు స్థితులూ భాషలో ఉన్నై రెండో బొమ్మలో ఒక గుప్తనిర్మాణానికి రెండు వ్యక్త నిర్మాణాలు సూచింపబడిన్నై (ఈ బొమ్మల్లో 2 బహుత్వానికి గుర్తు) మూడో బొమ్మలో రెండు గుప్త నిర్మాణాలూ ఒకే వ్యక్త నిర్మాణంగా వ్యక్తమయినై వీటికి కొన్ని ఉదాహరణలు

9 రా వి శాస్త్రి కుక్కపిల్లమీద కథ రాశాడు

రా వి శాస్త్రి కుక్కపిల్లను గురించి కథ రాశాడు

పై రెండు వాక్యాలు పైకి భిన్నంగా ఉన్నై భిన్నవిభక్తులు ప్రయుక్తమయినై అయినా బోధించే కారకం ఒకటే పైన రెండో బొమ్మలో సూచించిన పరిస్థితికి ఇది ఉదాహరణ

10 అతను బీరు తాగి కవిత్వం రాయలేదు

ఇందులో 1 అతను బీరు తాగాడు కాని కవిత్వం రాయలేదు 2 అతను కవిత్వం రాశాడు కాని బీరు తాగలేదు అనే రెండర్థాలున్నై ఈ అర్థాలు భిన్నార్థాలున్న శబ్దాలవల్ల రాలేదు వ్యతిరేకాన్ని సూచించే శబ్దం అన్వయించే తీరులోని భేదంవల్ల వచ్చింది వ్యతిరేక బోధకశబ్దాన్వయ భేదాన్ని సూచించే భిన్న గుప్త నిర్మాణాల ద్వారానే పైన పేర్కొన్న రెండర్థాలు సాధ్యమవుతై

11 నేను కమలతో వెళ్ళాను
నేను కమలతో చెప్పాను

పై రెండు వాక్యాలు స్థూలదృష్టికి ఒకే రకంగా ఉన్నా గుప్తనిర్మాణంలో భేదం ఉంది నామ్నీకరణంలో వ్యక్తమవుతుంది రెండో వాక్యం నుంచి నేను చెప్పిన కమల అనే నామబంధాన్ని నిష్పాదించినట్లుగా మొదటి వాక్యం నుంచి నేను వెళ్ళిన కమల అని నిష్పాదించలేం మొదటి వాక్యంలో కమల అముఖ్య కర్త రెండో వాక్యంలో కమల అముఖ్య కర్మ ఇది మూడో బొమ్మలో సూచించిన పరిస్థితికి ఉదాహరణ

ఒక్కోసారి వ్యక్తనిర్మాణంలో కనిపించని వాటిని గుప్తనిర్మాణంలో నిర్దేశించాలి అట్లాంటి నిర్దేశం లేకపోతే వ్యవహర్త వాక్యాన్ని అర్థం చేసుకునే తీరుకు గతి కల్పించ లేకపోతాం

12 సుమిత్ర వంటచెయ్యటం పూర్తి చేసింది

పై వాక్యంలో సుమిత్రను రెండు క్రియలకూ కర్తగా అర్థం చేసుకుంటున్నాం పై వాక్యం సంశ్లిష్టవాక్యం అంటే ఒక వాక్యంలో ఇంకోటి ఇమిడి

ఉంది గుప్త నిర్మాణంలో ఈ రెండు వాక్యాల్ని చూపి వాటి కర్తలను కూడా సూచించాలి అప్పుడే వ్యవహర్త ఈ వాక్యాన్ని అర్థంచేసుకునే తీరు తెలుస్తుంది

పై ఉదాహరణలనుబట్టి ఈ వాక్యనిర్మాణంలో గుప్త వ్యక్త నిర్మాణాల భేదం అవసరమని అట్లాంటి భేదాన్ని గుర్తించిన వ్యాకరణమే వ్యవహర్త ప్రతిభను సరిగ్గా ప్రతిఫలించ గలుగుతుందని తేలుతుంది ఈ రకమైన భేదాన్ని సంస్కృత వ్యాకర్తలు కూడా గుర్తించినట్టు కారక విభక్తి సంబంధాల వ్యత్యయ నిరూపణంవల్ల మనం గ్రహించవచ్చు గుప్త వ్యక్త నిర్మాణాల సంబంధాన్ని తెలియపరిచేవి పరివర్తన సూత్రాలు గుప్త నిర్మాణాన్ని వ్యక్తనిర్మాణంగా పరివర్తింప జేస్తై గనక వీటి కాపేరు వచ్చింది ఇట్లాంటి సూత్రాలున్న వ్యాకరణాన్ని పరివర్తన వ్యాకరణం అంటారు ఈ వ్యాకరణ రూపాన్ని నిర్వచించేదే పరివర్తన సిద్ధాంతం

## సౌలభ్యం లేక సంక్షిప్తత
## (Simplicity)

భాషకుగాని భాషైకదేశానికిగాని సాధ్యమైన వ్యాకరణాల్లో మేలైనదాన్ని ఎన్నికచేసేపని భాషాసిద్ధాంతానిదని పూర్వం చెప్పుకున్నాం సౌలభ్యం అనే కొలబద్దను భాషాశాస్త్రం ఇస్తుంది ఈ సౌలభ్యం రచనాసౌలభ్యం కాదు వ్యాకరణ రచన ఎప్పుడూ క్లిష్టమైనదే దానికి అడ్డదార్లు లేవు ఈ సౌలభ్యం ప్రక్రియా సౌలభ్యం ప్రక్రియాసౌలభ్యాన్నే సంక్షిప్తత అని కూడా వ్యవహరిస్తారు సౌలభ్యం సంక్షిప్తత అనేవి భాషాశాస్త్రంలో సమానార్థకాలు ఒకే విషయాన్ని రెండు వ్యాకరణాలు ఒక భాషా సిద్ధాంతం సరఫరా చేసిన గుర్తులు(symbols) సూత్రాలు (rules) వాడి వ్యాకరిస్తే తక్కువ గుర్తులు తక్కువ సూత్రాలు వాడిన వ్యాకరణం మేలైనది అవుతుంది ఉదాహరణకి (7) సంఖ్యతో ఇచ్చిన సూత్రాల్ని పరిశీలించండి ఒందులో నాలుగో సూత్రం ఇక్కడ 13 సంఖ్యతో సూచించిన విధంగా ఉంది

13 నామబంధం ⟶ { నామం / సర్వనామం / వాక్యం }

దీన్నే (14) లో సూచించిన విధంగా కూడా రాయవచ్చు

14
1 నామబంధం ⟶ నామం
11 నామబంధం ⟶ సర్వనామం
111 నామబంధం ⟶ వాక్యం

( 4) లో మూడు సూత్రాలలో చెప్పింది 13 లో ఒక సూత్రంలో చెప్పింది ఒకే విషయం కాని (14) కన్నా (13) సంక్షేపమైనది అందువల్ల (14) కన్నా (13) ఉత్తమమైనది బ్రాకెట్ల వాడకంవల్ల ఈ సంక్షిప్తత సాధ్యమయింది అట్లాగే తెలుగు వర్ణ విభాగంలో సాధ్యమైన ఈ సూత్రాలను పరిశీలించండి

15

1 [ + స్పర్శం, + కంఠ్యం, + నాదం ] ⟶ [ + స్పర్శం, + కంఠ్యం, — నాదం ] / — [ + స్పర్శం, + కంఠ్యం, — నాదం ]

తెలుగు సంధిలో సర్వలోపానంతరం వచ్చే సూత్రం ఇది క వర్ణ ముందు గ వర్ణం క వర్ణంగా మారుతుందని దీని అర్థం

ఉదా అడుగు + కో > అడుక్కో

[ + స్పర్శం, + కంఠ్యం, — నాదం ] ⟶ [ + స్పర్శం, + కంఠ్యం, + నాదం ] / — [ + స్పర్శం, + కంఠ్యం, + నాదం ]

గ వర్ణం ముందు క వర్ణం గవర్ణంగా మారుతుందని ఈ సూత్రార్థం

ఉదా పడక + గది > పడగ్గది

ఇట్లాంటి సూత్రాలే చ > జ జ > చ త > ద ద > త ప > బ బ > ప అనే మార్పులకు కూడా అవసరం అప్పుడు పైన ఇచ్చిన సూత్రాల వంటివి మొత్తం 3 అవుతై ఈ సూత్రాల్లో నిస్సంశయంగా సాధారణీకరణ (general zation) లోపించింది ఈ సంధికార్యాన్నే (16) లో చూపించిన విధంగా సంక్షేపించవచ్చు

$$16 \quad [+ \text{స్పర్శం}] \longrightarrow [\alpha \text{ నాదం}] \; / \; - \begin{bmatrix} + \text{స్పర్శం} \\ \alpha \text{ నాదం} \end{bmatrix}$$

పై (15) లో సూచించిన సూత్రాలు ఎనిమిదింటిలో చెప్పిన విషయాన్ని (16) లో ఒక సూత్రం చెప్పగలిగింది

పరస్పర్శం నాదం అయినప్పుడు పూర్వ స్పర్శం నాదం అవుతుందని పరస్పర్శం శ్వాసం [-నాదం] అయినప్పుడు పూర్వ స్పర్శమూ శ్వాసమవుతుందని పై సూత్రం చెపుతుంది α అనే గుర్తు + నీ – నీ కూడా సూచిస్తుంది (15) లో సూత్రాలకన్నా (16) లో సూత్రం సంక్షేపమైనదని స్పష్టమే కేవలం సూత్ర సంఖ్యను వాడిన గుర్తులను లెక్క పెట్టటం ద్వారా ఈ సంక్షిప్తతను కొలవవచ్చు మొదటే చెప్పినట్టుగా ఒక శాస్త్ర సిద్ధాంతాన్ని పాటించి రచించబడ్డ వ్యాకరణాల్లో మాత్రమే ఈ సంక్షిప్తతను కొలవటం సాధ్యం అవుతుంది

## భాషా - వ్యాకరణ సామాన్యాలు

## (Language and Lingu stic Universals)

భాషా సిద్ధాంతం వ్యాకరణ స్వరూపాన్ని నిర్వచించి నిర్ణయిస్తుందని చెప్పుకున్నాం సర్వభాషలకూ సంబంధించిన సామాన్య విషయాలు భాషా సిద్ధాంతంలో భాగాలవుతై ప్రతి భాషలోనూ విధి ప్రశ్నార్థక వ్యతిరేక అనుకరణ వాక్యాలు నామ క్రియా బంధాలు వ్యంజనాలు స్వరాలు స్పర్శాలు అనునాసి

కాలు ఉంటయ్యని భాషా శాస్త్రమే చెప్పుతుంది వీటిని భాషా సామాన్యాలు (Language Universal or Substantive Universals) అంటారు ప్రతిభాషా వ్యాకరణంలోనూ గుప్త వ్యక్త నిర్మాణాల వేర్పాటు అవసరమని గుప్తనిర్మాణాన్ని వ్యక్త నిర్మాణంగా మార్చే పరివర్తన సూత్రాలుంటయ్యని ఈ సూత్రాల వరస నియతమని ఇవి వర్తుల క్రమవర్తన (cyclical order)కలిగి ఉంటయ్యని భాషా శాస్త్రమే చెపుతుంది వీటిని వ్యాకరణ సామాన్యాలు (Linguistic universal or Formal universals) అంటారు భిన్న భాషలమీద పరిశోధన పెరిగినకొద్ది ఆయా భాషలకు భాషా వ్యాకరణాలకు గాని ప్రత్యేక మనుకొన్న ఎన్నో విషయాలు సర్వభాషా వ్యాకరణ సామాన్యాలుగా తేలి భాషా సిద్ధాంతంలో భాగాలుగా కలిసిపోతై సర్వభాషా వ్యాకరణ సామాన్యాలు భాషా సిద్ధాంతంలో భాగాలవుతై గనక విడివిడిగా రచించే భాషా వ్యాకరణాల్లో వీటిని ప్రస్తావించకక్కరైదు

ఈ విధంగా భిన్న భాషలమీద లోతైన పరిశోధన జరిగిన కొద్దీ వ్యాకరణాల మధ్య అంతరం తగ్గిపోతుంది ఇటీవల భాషలన్నిటికీ ఒకే గుప్త నిర్మాణం సాధ్యమని కొందరు ప్రతిపాదించారు పరివర్తన సూత్రాల్లో కూడా కొన్ని సర్వ వ్యాకరణ సామాన్యమైనవి ఉండవచ్చు ఉదాహరణకు ప్రత్యక్షానుకృతిలో (direct report) సర్వనామాన్ని పరోక్షానుకృతి (indirect report)లో ఇంకో సర్వనామంగా మార్చే పరివర్తన సూత్రం సర్వ వ్యాకరణ సామాన్యమై ఉండాలని ఈ వ్యాసకర్త ఊహ అట్లాగే ఈ వ్యాసంలో (4) సంఖ్యతో ఉదాహరించిన వాక్యాల్లో చూపించిన విధినిషేధాలు చాలా భాషల్లో కనిపిస్తున్నై ఇవి అన్ని భాషల్లోనూ కనిపిస్తే ఈ రకపు వాక్యాలను సాధించే ఈ పరివర్తన సూత్రం సర్వవ్యాకరణ సామాన్య మవుతుంది ఇదే నిజమైతే ఇది కూడా భాషా సిద్ధాంతంలో భాగమే అవుతుంది ఈ పరిశోధనలవల్ల వ్యాకరణాల మధ్య భేదం కూడా నియతమైన పద్ధతుల్లోనే ఉంటుందని తేలుతున్నది నామ్నీకరణ విధానంలో టర్కిష్ జాపనీస్ ద్రావిడ భాషల మధ్య ఎన్నో సరూప ధర్మాలున్నై ఈ భాషల్లో ఒకేరకపు పరివర్తన సూత్రాలు చాలా ఉండవచ్చు ఇంతేకాక ఈ

భాషల పరివర్తన సూత్రాలకీ ఇంగ్లీషు మొదలైన భాషల పరివర్తన సూత్రాలకీ బింబ ప్రతిబింబ భావం (m rrorimage) ఉన్నట్టు కూడా ఇటీవలి పరిశోధన వల్ల తేలింది ఇదంతా ఒక భాషా సిద్ధాంత పరిధిలో పరిశోధన సాగటం వల్లనే సాధ్యమయింది అందువల్ల భాషా పరిశోధనకు భాషా సిద్ధాంతబలం అవసరం అట్లాగే ఈ పరిశోధన వల్ల భాషా సిద్ధాంతం కూడా విస్తృతమూ పటిష్టమూ అవుతుంది దీన్ని బట్టి భాషా వ్యాకరణ సిద్ధాంతాలు పరస్పరాశ్రితాలని రుజువవు తున్నది భాషలను గురించిన మన అవగాహన పెరగటమే ఈ నిరంతర పరిశోధనకు ఫలితం

# తెలుగులో నామ్నీకరణాలు

భాషలో నామాలు క్రియలూ నామ-క్రియా విశేషణాలు లాంటి భాషా భాగా లుంటయ్యని అక్షరాస్యులైన వారందరూ ఎరిగిందే భౌతిక ప్రపంచం లోని వస్తువులను తదాధారంగా మానవ మేధలో జరిగే ప్రతిక్రియారూపమైన కొన్ని రకాల భావవిశేషాలను ప్రత్యేకంగాగాని సామూహికంగాగాని మనం కొన్ని సంజ్ఞలతో వ్యవహరిస్తాం అట్లాంటి సంజ్ఞలను నామపదాలంటాం సాధారణంగా ఇట్లాంటి పదాలు స్వతస్సిద్ధంగానే నామపద వాచ్యాలు ఈ నామపదాలు వాక్యంలో ప్రవర్తించే విధానాన్నిబట్టి బహుధా విభక్తాలు భాషా వ్యవహర్తల ప్రయోజనాల్ని అనుసరించి ఒక్కోసారి ఒక బాషాభాగాన్ని ఇంకో భాషా భాగంగా వ్యవహరిస్తూంటాం అటువంటి వ్యవహారానికి భాషలో కొన్ని నియతమైన పద్ధతులుంటై ఒక భాషా భాగానికి చెందిన శబ్దానికి కొన్ని ప్రత్యయాదుల్ని చేర్చి వేరొక భాషాభాగంగా వ్యవహరించుకోటం భాష అనుమతించే ఒక పద్ధతి ఉదాహరణకు నామాల్ని క్రియలుగా ఉపయోగించే ఈ పద్ధతిని గమనించండి

| నామం | క్రియ |
|---|---|
| బాధ | బాధించు |
| | బాధపడు |
| | బాధపెట్టు |
| కష్ట(ము) | కష్టించు |
| | కష్టపడు |
| | కష్టపెట్టు (కొను) |

నామాల్ని క్రియలుగా వాడుకున్నట్టుగానే క్రియల్ని కూడా నామాలుగా వ్యవహరించుకోవచ్చు పూర్వ వ్యాకరణాల్లో కృదంతపరిచ్ఛేదం ఈ పద్ధతుల్లోని నియమాల్ని సూచించటానికే

పృథక్పదాల్ని మాత్రమే కాక వాక్యాల్ని కూడా కొన్ని మార్పులు చేసు కొని భాషా భాగాల స్థానంలో మరో బృహద్వాక్యంలో ప్రయోగించవచ్చు నామ పదాల స్థానంలో వాక్యాలను ప్రయోగించటం ఈ వ్యాసానికి విషయం ఇదే నామ్నీకరణమని ఈ వ్యాసంలో వ్యవహరించ బడింది నామ్నీకరణమంటే నామంకాని దాన్ని నామంచెయ్యటం ధాతువులకు ప్రత్యయాదుల్ని చేర్చి నామాటుగా వ్యవహరించటాన్ని కూడా నామ్నీకరణం అనవచ్చుగాని ఈ పదం ఈవ్యాసంలో వాక్య నామ్నీకరణానికి పరిమితం ధాతు నామ్నీకరణం పద నిర్మాణానికి సంబం ధించిన విషయం వాక్యనామ్నీకరణం వాక్యనిర్మాణానికి సంబంధించిన విషయం

## విషయార్థక

1 ఖలీల్ జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించాడు

2 ఆ విషయం (లేక ఆ సంగతి) నాకు తెలుసు

సాహితీప్రియులైన ఇద్దరు తెలుగువాళ్ళ మధ్య జరగటానికి వీలున్న ఈ పై సంభాషణ పరిశీలిస్తే రెండో వాక్యంలోని ఆ విషయం (లేక ఆ సంగతి) మొదటి వాక్యం మొత్తానికి బదులుగా వాడబడిందని గ్రహించవచ్చు ఆ విషయ మేమిటో మొదటి వాక్యంలో చెప్పబడింది కాబట్టి మళ్ళీ ఆ విషయాన్ని చెప్పే అవసరం లేకుండా రెండో వ్యవహర్త ఆ విషయం అని సంగ్రహించి చెప్పాడు మొదటి వాక్య సందర్భం లేనప్పుడు ఆ వాక్యాన్ని రెండో వాక్యంలో ఏదోవిధంగా మిశితంచేసి చెప్పాలి ఆ విషయం అనే మాటకు బదులుగా మొత్తం వాక్యాన్ని ప్రయోగించాలి ఇక్కడ విషయ శబ్దానికి వాక్యంలో చెప్పిన యావద్విషయం అని అర్థం విషయార్థక నామ్నీకరణం అని అనటం కూడా ఇందుకే ఇట్లా విషయార్థంలో వాక్యాన్ని ప్రయోగించటానికి కొన్ని మార్గాలున్నై అందులో ఒకటి వాక్యానికి అని అనే రూపాన్ని తగిలించటం (అని శాబ్దికంగా అను ధాతునిష్పన్నమైన క్త్వార్థకరూపం ఆర్థికసంబంధం కనిపించదు ) అప్పుడు రెండు వాక్యాల్ని అని చేత అనుసంధిస్తే-

౩ ఖలీల్‌జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించాడని నాకు తెలుసు

అన్న సంక్లిష్టవాక్యం ఏర్పడుతుంది వ్యాకరణ సూత్రాలవల్ల కలిసిన రెండు వాక్యాల సంయోగ రూపం సంశ్లిష్ట వాక్యమని వ్యవహృతం ఈ పై సంశ్లిష్టవాక్యంతో అని కి పూర్వమున్నభాగం విషయి అని కి తరవాత ఉన్న భాగం విషయం ఇవి పారిభాషిక పదాలుగా ఈ వ్యాసంలో ప్రయుక్తం వీటిని ఇంగ్లీషులో Topic and comment అంటారు అలంకార శాస్త్రంలో వీటి అర్థాలు భాషావేత్తలకు తెలుసు తత్తుల్యమైన అర్థంలోనే ఈ వ్యాసంలో ప్రయుక్తం

ఈ పై సంశ్లిష్టవాక్యంలో నామప్రవర్తన కలిగిన (నామీకృతం చేయ బడిన) వాక్యాన్ని విశేషణీకృతం చేయవచ్చు అని ని అన్న లేక అనే అని మార్చి సంగతి లేక విషయం అనే మాటల్ని చేరిస్తే మొదటివాక్యం విశేషణీ కృతం అవుతుంది అప్పుడావాక్యం ఇట్లా ఉంటుంది అర్థంలో భేదం ఉండదు

౪ ఖలీల్‌జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించాడన్న సంగతి నాకు తెలుసు

అను ధాతువుకున్న బహు విశేషణ రూపాల్లో రెండు మాత్రమే ఇక్కడ (అర్థభేదం లేకుండా) ప్రయోగించగలుగుతాం వీటికి వ్యతిరేక రూపాలు కూడా ఇక్కడ ఉండవు అంటే అన్నసంగతి స్థానంలో అననిసంగతి అని ప్రయో గించలేం పై వాక్యాల్లో అని ప్రత్యయతుల్యం అంటే శబ్దరూప సాధనలో ప్రత్యయంచేసే పనిని వాక్య నిర్మాణంలో అని చేస్తున్నదన్నమాట ఇట్లాంటి వాటిని అవయవి సూచకాలు (Construction markers) అనవచ్చు అంటే ఇక్కడ అని చేసే పల్లా తనకు పూర్వపు వాక్యం పద్ధతి ప్రవర్తనా ఈ వాక్యంలో ఇదీ అని సూచించటం అంతకన్నా ఈ అని కి ప్రత్యేకమైన ప్రయోజనమున్నట్టు కనిపించదు అంతర్నిర్మాణఉన్న వాక్య వాక్యాంశాలు అవయవులు (Construct ons) వాటిలో పృథగ్భాగాలు అవయవాలు

(Constituents) (అవయవి-అవయవం అనే మాటల్ని పై అర్థంలో ప్రయోగించవచ్చునని శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు సూచించారు).

విషయార్థక నామ్నీకరణంలో తచ్ఛబ్ద ప్రయోగం మరో పద్ధతి తెలుగులో అది అనే శబ్దానికున్న బహుళ ప్రయోజనాల్లో ఇది ఒకటి ఒక వాక్యాన్ని మరో వాక్యానికి అది చేత అనుసంధించాలంటే ఆ వాక్యంలోని కాలబోధక ప్రత్యయ సహితమైన సమాపక క్రియారూపాన్ని విశేషణ రూపంగా మార్చాలి ఈ రూపాల్నే చిన్నయసూరి ధాతుజ విశేషణాలని వ్యవహరించాడు ప్రౌఢ వ్యాకర్త క్రియాజన్య విశేషణాలనేమాట కూడా ఈ అర్థంలోనే వాడాడు కాల వాచి ప్రత్యయ ప్రాధాన్యమున్న ఈ రూపాల్ని క్రియాజన్య విశేషణా లనటమే సముచితంగా కనిపిస్తున్నది ఆధునిక భాషలో ఒక్కో క్రియారూపానికి నాలుగేసి క్రియాజన్య విశేషణరూపాలుంటై వండు ధాతువున్ను ఉదాహరణంగా తీసు కుంటే ఈ రూపాలిట్లా ఉంటై

భూత వండిన

తద్ధర్మ వండే వ్యతిరేక వండని

వర్తమాన వండుతున్న

ఈ విశేషణరూపాల తరువాత తచ్ఛబ్దంలోని అకారం లోపించి ది అనే రూపం మాత్రమే మిగుల్తుంది ఇంతకు ముందటి వాక్యాన్నే ఉదాహరణంగా తీసు కుంటే నామ్నీకరణం తరవాత ఇట్లా ఉంటుంది

5 ఖలీల్‌జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించింది నాకు తెలుసు

ఈ నామ్నీకరణం భూతకాల క్రియారూపం మీద చేసింది మిగతా క్రియా రూపాలికి కూడా ఇదే పద్ధతి సాధ్యమని స్పష్టం

ఇంతవరకు క్రియలున్న వాక్యాల్ని నామ్నీకరించే పద్ధతి మాత్రమే పరిశీ లించాం క్రియలేని వాక్యాల్ని నామ్నీకరించటం ఎట్లా అనే సమస్య ఉంది తెలు గులో రెండు నామాల్ని (నామం అనే శబ్దం నామబంధానికి కూడా గ్రాహ్యం)

అనుసంధించటంవల్ల కొన్ని రకాల వాక్యాలేర్పడతాయని అందరూ ఎరిగిన విషయమే. ఉదాహరణకు —

6 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త

ఈ వాక్యం రెండు నామాలు సన్నిహితావయవాలుగా గల అవయవి ఈ వాక్యాన్ని నాకు తెలుసు అన్న వాక్యంతో అనుసంధించాలంటే అని చేర్చటం ఒక పద్ధతి అక్కడ చిక్కులేదు అది చేర్చాలంటే మాత్రం క్రియ కావాలి 'అది కాలబోధక ప్రత్యయ సహితమై ఉండాలి దాన్ని విశేషణంగా మార్చాలి ఇట్లాంటి సందర్భాల్లో క్రియలేని వాక్యాలికి అగు ధాతు క్రియా రూపాల్ని అనుబంధించటంవల్ల ఉద్దిష్టలక్ష్యాన్ని సాధించవచ్చు

7 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త అయింది (అయిన సంగతి) నాకు తెలుసు

ఈ పై వాక్యంలో అస్పష్టత ఉంది అంటే ఈ వాక్యానికి రెండు రకాలుగా తాత్పర్యం చెప్పవచ్చు

8 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త అని నాకుతెలుసు

9 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త అయినాడని నాకు తెలుసు

ఈ భిన్నార్థబోధ అగు ధాతువుకున్న రెండు ప్రయోజనాలవల్ల ఏర్పడింది అగు ధాతువు ప్రత్యేక క్రియగా ఉపయుక్తమైనప్పుడు పరిణామార్థకం ఆ అర్థమే వాక్యం (9) లో సూచితం క్రియారహిత వాక్యాన్ని ఇంకో వాక్యంతో కలపటానికి అనుసంధిక రూపంగా ఉపయోగపడటం రెండో ప్రయోజనం అది వాక్యం (8) లో వ్యక్తంచేసిన తాత్పర్యంవల్ల సూచితం పై రకపు నామబంధ వాక్యాల్ని ఆపి చేదాద్యర్థాల్లో వాడాలన్నా అగు ధాతు క్రియారూపాల్ని అను బంధించాలి ఉదాహరణకు

10 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త అయినా చిన్న వ్యాకరణం రాశాడు

11 చిన్నయసూరి గొప్ప వ్యాకర్త అయితే చిన్న వ్యాకరణం ఎందుకు రాశాడు ?

ఈ పై వాక్యాల్లో అగు ధాతువు అనుసంధిక రూపంగా ప్రయుక్తం అయిన సంగతి స్పష్టమే

తచ్ఛబ్ద నామ్నీకరణానికి కాలవాచి ప్రత్యయం అవసరమని పూర్వమే ఉక్తం కాలవాచి ప్రత్యయం అసలే చేరని లేదా పరిమితంగా చేరే క్రియలు కొన్ని ఉన్నై వాటిలో బుద్ధ్యర్థక ధాతువులైన వచ్చు తెలియు పేర్కొ్నదగినవి ఉదాహరణకు

12. తెలుగు వ్యాకర్తలకు సంస్కృతం వచ్చు(ను)

అభ్యసనయుక్తమైన నామాలు మాత్రమే ఈ వచ్చు కు కర్తృపద స్థానంలో రాగలవు ఈ పై వాక్యాన్ని తచ్ఛబద్ధమైన అది తో నామ్నీకరించలేం వచ్చు అన్న సమాపక క్రియలో కాలవాచి ప్రత్యయం లేకపోవటమే అందుకా్కరణం అని తో నామ్నీకరించటానికి ఎటువంటి ఆటంకమూ లేదు కాలవాచి ప్రత్యయమున్నపుడు తచ్ఛబ్ద నామ్నీకరణమూ సాధ్యమే

తెలియు ధాతువుకు కర్తృపద స్థానంలో అమూర్త పదార్థ (Abstract) వాచియైన నామం వచ్చినప్పుడు మాత్రమే భూతకాలవాచి ప్రత్యయం సాధ్యం అప్పుడు తచ్ఛబ్ద నామ్నీకరణం చేయవచ్చు రానప్పుడు వీల్లేదు

3 వాడికి వ్యాకరణం చదివే పద్ధతి తెలుసు

14 వాడికి వ్యాకరణం చదివే పద్ధతి తెలిసింది

పై రెండు వాక్యాల్లో రెండో వాక్యానికి మాత్రమే తచ్ఛబ్ద నామ్నీకరణం సాధ్యం

15 వాడికి వ్యాకరణం చదివే పద్ధతి తెలిసింది (తెలిసిన సంగతి) నాకు తెలియదు

ఈ వాక్యంలో తెలిసింది అనే రూపం క్రియకాదు క్రియాజన్య విశేషణానికి తచ్ఛబ్దం చేర్చటం వల్ల ఏర్పడిన నామరూపం

ఈ పైన ఉదాహరించిన వాక్యం కొంత కృతకంగా కనిపించేమాట వాస్తవమే ఈ వాక్యం ఇంతకుముందు ఎప్పుడూ ఎవరూ ప్రయోగించి ఉండక పోవచ్చు ఇకముందు ప్రయోగించక పోవచ్చు కూడా ప్రయుక్త వాక్యాల్ని మాత్రమే వ్యాకరించాలనటం వ్యాకరణ ప్రయోజనాన్ని సంకుచితం చేయటమె ప్రయోగించటానికి వీలున్న వాక్యాలుకూడా వ్యాకరణ విషయాలే ఈ పై వాక్యానికి ఈ వ్యాసకర్త చెప్పిన అర్థం తెలుగు భాషా వ్యవహర్త అంతరీకరించుకున్న వ్యాకరణం అనుమతిస్తుంది ఈ పై వాక్యాల్ని సృష్టించగలిగిన వ్యవహర్త శక్తిని ప్రతిభ అనీ వాక్యాల్ని వ్యవహారంలో ప్రయోగించటాన్ని ప్రవృత్తి అనీ అనవచ్చు ప్రతిభా ప్రవృత్తులు (Competence and Performance) భాషా శాస్త్రంలో పారిభాషిక పదాలు

తెలుగులో అన్నంత క్రియల తరవాత కొన్ని భావ విశేషాలను వ్యక్తీకరించటానికి కొన్నిరకాల ధాతువుల్ని వాడతాం ఆ ధాతువులకు కాలబోధక ప్రత్యయాలను సాధారణ ధాతువులకు వాడినంత విస్తృతంగా వాడరేం ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలను గమనించండి

6 ఏ శాస్త్రమైనా మాతృభాషలో బోధించవచ్చు

17 ఇతరుల విషయాల్లో తలదూర్చగూడదు

18 అరసికుణ్ణి ఎవరు మెప్పించగలరు

9 తింటే గారెలు తినాలి వింటే భారతం వినాలి (విన+వలయును)

అనుమత్యర్థంలో వచ్చు కు నిషేధార్థంలో కూడు కు కాలవాచి ప్రత్యయాలు చేరవు సామర్థ్యార్థంలో కలుగు కు కాలవాచి ప్రత్యయాలు చేరతై కాని-కల-అనే రూపంలో ఉన్నప్పుడు మాత్రం చేరవు వలయు కు భూతకాల

వాచి ప్రత్యయం మాత్రమే చేరుతుంది అదీ అసమాపక క్రియగా ఉన్నప్పుడు మాత్రమే ఉదాహరణకు

20 రావాల్సి వచ్చాను

వలయు ధాతువుకి కాలబోధ వ్యక్తీకరించి సమాపక క్రియగా వాడాలంటె వలయు ధాతుక్త్వార్థక రూపానికి వచ్చు గాని ఉండు గాని అనుప్రయుక్తం చెయ్యాలి

ఈ ధాతువు లీ సందర్భాల్లో కాలబోధక ప్రత్యయవాహకాలు (Tensc carriers)గా మాత్రమే వర్తిస్తాయి ఉదాహరణకు

21 తెలుగు పండితులు భాషాశాస్త్ర ప్రాధాన్యం గుర్తించాల్సి ఉంది

22 అయిదేళ్లకి తెలుగులోనే భాషాశాస్త్రం బోధించాల్సి వస్తుంది

కాలవాచి ప్రత్యయయుక్త క్రియారూపాలున్న (21) (22) సంఖ్యగల వాక్యాలు తచ్ఛబ్ద నామ్నీకరణార్హాలు కాని (16) నుంచి (19) వరకూ సంఖ్యలుగల వాక్యాలు కాలవాచి ప్రత్యయ రహితాలు గనక తచ్ఛబ్ద నామ్నీకరణానర్హాలు

పై వాక్యాల్లో (16) (9) సంఖ్యలుగల వాక్యాలు క్రియావిభక్తి రహితాలు (17) లో ఉన్నది క్రియావిభక్తి అవునో కాదో చెప్పలేం (21) (22) సంఖ్యలుగల వాక్యాల్లో క్రియావిభక్తి వంటి రూపం కనిపిస్తున్నదికాని కర్తృపదాన్వయం - అంటే కర్తృపదస్థ లింగవచనాదుల బోధ-ఉన్నట్టులేదు ఈ సందర్భాల్లో పూర్వవ్యాకర్తలు అన్నంత రూపంలో ఉన్న ప్రధాన క్రియను ధాతువుకు భావార్థంలో ముజీ ని విధించటంవల్ల నామంగా సాధించి వలయ్వాద్యను బంధ క్రియలకు దీన్ని కర్తగా నిర్దేశించారు ఆ సందర్భంలో వారు రచించిన సూత్రాలివి

వలయ్వాది క్రియలకుం గర్తయగు భావంబునందు ముజీ యగు

వలయ్వాది క్రియలకు కర్తృభూత క్రియా వృత్తియగు ధాతువునకు ముజీ వర్ణకంబగు

బాలవ్యా-క్రియ-సూ 122

కర్తృభూత క్రియతోడం దత్కర్త కన్వయంబగు

ప్రౌఢ వ్యా క్రియ సూ 27

పూర్వ వ్యాకర్తల నిర్దేశం ప్రాచీన భాషకు సరిపోవచ్చు ప్రాచీన భాషలో క్రియాబంధంలోని వలయ్యాద్యనుబంధ క్రియలు అన్నంత క్రియలతో సంహితగానేకాక వ్యవహితంగా కూడా ప్రయుక్తం అంతేకాక భూతభవిష్య త్కాల బోధక క్రియారూపాలకు ప్రథమ పురుష క్రియా విభక్తి లింగ వచన భేదాలను సూచించదు అందువలన అన్నంతమైన ప్రధాన క్రియా రూపాన్ని భావార్థక నామంగా భావించి వలయ్యాద్యనుబంధక్రియలకు కర్తగా నిర్దేశించ టంలో అంత చిక్కులేదు కాని ఆధునిక భాషలో క్రియా విభక్తి కర్తృపదస్థ లింగవచనాలను సూచించాలి అందువల్ల ఈ పద్ధతి ఆధునిక భాషకు ఎంత వరకు సరిపోతుందో చెప్పలేం అదీగాక బుద్ధ్యర్థక ధాతువులైన ఎరుగు తెలియు వచ్చు కాలవాచి ప్రత్యయం లేనప్పుడు క్రియా విభక్తి రహితంగానే ఉంటై ఇవి అన్నంత క్రియా సహాయం లేకుండానే ప్రయోగ యోగ్యాలు అందువల్ల ఆధునిక భాషలో అన్నంత క్రియలను వలయ్యాద్యనుబంధ క్రియలకు కర్తగా నిర్దేశించటంకంటే వ్యవహితత్వంలేని అన్నంత క్రియారూప యుక్త వలయ్యాదులను ఏకపదబంధంగానే గ్రహించి అన్నంత క్రియకు కర్తృభూతమైన నామాన్నే మొత్తం క్రియాబంధానికి కర్తగా చెప్పి ఎరుగ్వాచు లక్కు వలయ్యాదులకు కాలవాచి ప్రత్యయాభావంలో క్రియావిభక్తి ఉండదనీ వలయుకు కాలవాచి ప్రత్యయ వాహకాలైన ఉండు వచ్చు లకు సర్వలింగ వచనాల్లోనూ ది ప్రత్యయం మాత్రమే విహితమనీ సూత్రించుకోటం సము చితంగా కనిపిస్తున్నది

ఇంతవరకు పరిశీలించిన నామ్నీకరణాల్లో మూలవాక్యంలోని కాలబోధకి బాధ కలగలేదు విషయార్థక నామ్నీకరణంలోనే ధాతువుకు భావ ప్రత్యయం చేర్చటం ఇంకోపద్ధతి ప్రాచీన భాషలో ట భావ ప్రత్యయం ఆధునిక

భాషలో అటం (అడం కూడా అటంచేత గ్రాహ్యం) పూర్వ వ్యాకర్తలు భావ ప్రత్యయాన్ని ధాతువుకి విధించారు ( ధాతువునకు బాలవ్యా క్రియ సూ 1 ట ఎర్థకంబు భావంబు నందగు బాలవ్యా క్రియ సూ 35 ) ఆధునిక భాషలో కాలబోధక సమర్థమైన ధాతువులకె (కాలవాచి ప్రత్యయ వాహకాలుకూడా గ్రహించాలి) భావ ప్రత్యయం చేర్చగలుగుతాం గనక ధాతువునకు అనకుండా కాలవాచి ప్రత్యయయుక్త సమాపక క్రియారూపాలకు అనటం సమంజసంగా కనిపిస్తున్నది భావ ప్రత్యయం చేరినప్పుడు ధాతువుకు పూర్వ హితమైన లిడాదులకు డుజౌదులకు లోపం వస్తుందని చెప్పుకోవచ్చు కాల వ్యక్తి భావార్థక రూపంలో కలిసిపోతుందన్నమాట అందువల్ల భావార్థక రూపం సర్వకాల బోధకమవుతుంది కాలవాచి ప్రత్యయయుక్త సమాపక క్రియలకే భావ ప్రత్యయం చేరుతుందనటంవల్ల తదభావంలో చేరదని తాత్పర్యం. కాలవాచి ప్రత్యయం చేరని వలయ్వాదుల కాధునిక భాషలో భావ ప్రత్యయం చేరకపోవటం గమనించదగింది అంటే అనుబంధంగా వచ్చే వలయు వచ్చు కూడు (చూ వాక్యాలు 16 17 19) తగు చాలు మొదలైన ధాతువులకు కాలవాచి ప్రత్యయం చేరదు కాబట్టి భావప్రత్యయమూ చేరదు స్వతంత్ర క్రియలుగా వర్తించే ఎరుగ్వాదుల్లో ఎరుగు కు కాలవాచి ప్రత్యయ యుక్త సమాపక క్రియారూపమూ లేదు భావప్రత్యయమూ చేరదు ఎరగటం అనే రూపం తెలుగులో ప్రచురంగాలేదు ఎరిగి - ఎరక్క అనే అసమాపక క్రియారూపాలూ ఎరిగిన ఎరగని అనే క్రియాజన్య విశేషణరూపాలు మాత్రం కనిపిస్తున్నై తెలియు వచ్చు లకు తెలియటం (లేక తెలవటం) రావటం అనే రూపాలున్నైగాని అవి ఆ ధాతువుల కాలవాచి ప్రత్యయయుక్త సమాపక క్రియారూపజన్యాలని గ్రహించాలి

ఆధునికాంధ్రంలో భావ ప్రత్యయం చేరినప్పుడు ధాతువుకు ముత్తు పరమైనప్పుడు జరిగే ఆదేశకార్యం జరుగుతుంది (ప్రాచీనాంధ్రంలో భావ ప్రత్యయం ముందిట్లాంటి ఆదేశం లేదు) ఉదాహరణకు ముత్తు పరమైనప్పుడు వచ్చు కు రా అని తెచ్చు కు తే అని ఆదేశాలవుతై ఈ ఆదేశరూపాలే

అటం ముందు ప్రయుక్తం దీర్ఘాంతైకస్వరయుత ధాత్వాదేశ రూపాలకు అటం పరమైనప్పుడు వడాగమం (వకారాగమం) అవుతుంది పై రెండు ధాతువులకి అటమంత రూపాలకు ఈ విధంగా నిష్పత్తి చూపించవచ్చు

వచ్చు + అటం > రా + అటం > రా + వ్ + అటం > రావటం
తెచ్చు + అటం > తే + అటం > తే + వ్ + అటం > తేవటం

కాలవాచి ప్రత్యయాలు లోపించిన అటమంత రూపాలు ఆయా సందర్భాల ననుసరించి సర్వకాల బోధకాలవుతై ఉదాహరణకు—

(23) ఖలీల్ జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించటం నేనెరుగుదును.

(24) ఖలీల్ జిబ్రాన్ కవిత్వాన్ని కాళోజీ తెలిగించాడు-తెనిగిస్తున్నాడు-తెలిగిస్తాడు

(23) సంఖ్యగల వాక్యం (24) సంఖ్యగల వాక్య సమూహంలో ఏ క్రియా రూపాన్నుంచైనా నిష్పన్నం కావచ్చు కాలబోధ ప్రధానం కానప్పుడు భాషా వ్యవహర్త అటమంత నామ్నీకరణాన్నెన్నుకోవచ్చు

ఈ విషయార్థక నామ్నీకరణం అన్నిరకాల వాక్యాలకూ సాధ్యపడదు విధ్యర్థక ప్రశ్నార్థక వాక్యాలకు విషయర్థక నామ్నీకరణం లేదు అవిధ్యర్థక అప్రశ్నార్థక వాక్యాలకు వాటి వ్యతిరేక రూపాంతోసహా ఈ నామ్నీకరణం సాధ్యం ఎరుగ్వాదులకు వలయ్వాదులకు విధ్యర్థక రూపాలు లేకపోవటం గమనించదగింది ఈ నామ్నీకృత వాక్యాలను మరో వాక్యంతో అనుసంధించాలంటే ఇంకా కొన్ని విధి నిషేధాలున్నై అని చెత నామ్నీకృతం చేయబడిన వాక్యం నామబంధ వాక్యాల్లో (క్రియా రహిత వాక్యాలు) ప్రయోగార్హం కాదు నామ్నీకృతం చెయ్యని రెండో వాక్యంలో బుద్ధ్యర్థక ధాతువులు శ్రవణార్థక వచ్యర్థక ధాతువుల్లాంటివి మాత్రమే క్రియా రూపాలుగా ఉండాలి

ఈ వ్యాసంలో అని అది అటం విషయార్థక నామ్నీకారకాలుగా ప్రతిపాదితం వీటికి భాషలో వేరే ప్రయోజనాలు కూడా ఉన్నై ఇవి ఇతర నామ్నీకరణాల్లో ఉపయుక్త మవుతై (వాటి వివరాలు ఇంకోసారి

# సందేహార్థక

అని అడి, అటం శబ్దాలు వాక్యాలకు చేర్చటంవల్ల అవి విషయార్థక నామాలుగా వేరే వాక్యాల్లో ప్రవర్తిస్తాయని పూర్వ వ్యాసంలో ప్రతిపాదించబడింది ఈ వ్యాసంలో వాక్యాలకు సందేహార్థ బోధ కల్పించె పద్ధతులూ అవి వేరే వాక్యాల్లో సందేహార్థక నామాలుగా ప్రవర్తించే తీరుతెన్నులూ చర్చించబడతై తెలుగులో ఓ శబ్దాన్ని సందెహార్థకంగా పూర్వవ్యాకరణాలు గుర్తించినై అది పదాంతంలోగాని పదబంధాంతంలోగాని వాక్యాంతంలోగాని చేరుతుంది ఓ శబ్దం సర్వస్వతంత్రంకాదు యత్కిమర్థక శబ్దాపేక్షకం యత్కిమర్థక శబ్దాభావంలొ ఇంకొక ఓ శబ్దయుక్త దళం కావాలి ఈ రెండూ లేనప్పుడు కిమర్థక శబ్ద రూపమైన ఏం తెచ్చుకోవాలి ఉదాహరణకు

(25) అంగారకగ్రహంలో జీవరాసులున్నయ్యా?

అన్న ప్రశ్నకు మనకు సమాధానం తెలియనప్పుడు ఏమో అంటాం నిజానికిక్కడ ఓ శబ్దమే సందేహ సూచకం కిమర్థక శబ్ద రూపమైన ఏం స్వతంత్రప్రయోగార్హతలేని ఓ శబ్దంకోసం వచ్చింది యత్కిమర్థక శబ్దరహిత వాక్యాలకు సందేహార్థబోధ చేయాలంటే ఈ ఏమో శబ్దాన్ని వాక్యాంతంలో అనుబంధిస్తాం ఉదాహరణకు

(26) మాంసాహారం మనిషికి మంచిది కాదు + ఏమో

ఈ ఎమో శబ్దయుక్త వాక్యాల్ని మరో వాక్యంలో నిబంధించవచ్చు ఈ నామ్నీకరణానికి విషయార్థక నామాల్లోలాగా వేరే అవయవి సూచకాలక్కర్లేదు వాక్యాంతంలొని ఓ లేక ఎమో శబ్దమె ఆ పనిని నిర్వహిస్తుంది లెకపోతె ఓ శబ్దాన్నే నామ్నీకారకంగా చెప్పి సందేహార్థకనామాన్ని స్వతంత్ర ప్రయో

గార్హతగల నామంగా గుర్తించవచ్చు ఈ సందేహార్థక నామాలు వేరే వాక్యంతో నిబంధించటానికి కొన్ని నియమాలున్నై ఏమో శబ్దయుక్త వాక్యం నామంగా ప్రవర్తించే వాక్యంలో క్రియ—కనుక్కొను చూచు తెలియు వంటి విషయ సేకరణ సంబంధి అయిన ధాతు నిష్పన్నం కావాలి ఆ సంక్లిష్ట వాక్యంలో క్రియ విధ్యర్థకంగాని ప్రశ్నార్థకంగాని వ్యతిరేకార్థకంగాని అయిఉండాలి ఈ మూడూ కానిపక్షంలో క్రియాపదం భూతేతర కాలబోధకమై ఉండాలి ఉదాహరణకు

(27) ఊర్మిళ ఊరినుంచి వచ్చిందేమో
కనుక్కో
కనుక్కున్నావా ?
కనుక్కోలేదు
కనుక్కుంటాను

(27) లో సమాపక క్రియలు క్రమంగా విధి ప్రశ్న వ్యతిరేక కావ్యర్థకాలు

* (28) ఊర్మిళ ఊరినుంచి వచ్చిందేమో కనుక్కున్నాను

అనే వాక్యం ప్రశ్న వ్యతిరేకార్థకాలులేని భూతకాల బోధక సమాపక క్రియాపదయుక్తం కావటంవల్ల వ్యాకరణ సమ్మతమైన ఏకవాక్యం కాదు

[2]కిమర్థక శబ్దయుక్త వాక్యాలకు అంతంలో ఓ శబ్ద సంయోజనంవల్ల సందేహార్థబోధ చేయవచ్చు ఎక్కడ ఎందుకు ఎప్పుడు ఎటు ఎట్లా వంటి

---

* ఈ గుర్తుగల వాక్యాలు వ్యాకరణ విరుద్ధాలు

2 యత్కిమర్థకాలు రెంటికీ తెలుగులో ఒకే రూపం ఉంది సౌలభ్యం కోసం ఈ వ్యాసంలో కొన్నిచోట్ల కిమర్థకమనే వాడబడింది

శబ్దాలు క్రమంగా స్థల హేతు కాల దిక్ రీతులను గురించి ప్రశ్నించే శబ్దాలు ఇవి క్రియా విశేషణాలుగా ప్రవర్తిస్తే ఏం, ఎవరు—మొదలైన శబ్దాలు కర్తగా గాని కర్మగాగాని ప్రవర్తించే నామాల్ని గురించి ప్రశ్నించేవి వీటి సంయోజనంతో కూడిన పదబంధాలకు అంతంలో ఓ శబ్దానుబంధంవల్ల సందేహార్థబోధ కలుగుతుంది

(29) ఉదాహరణకు—

ఎక్కడ ఉన్నాడో
ఎందుకు వచ్చాడో
ఎప్పుడు వెళ్లాడో
ఎటు పోవాలో
ఎట్లా చెయ్యాలో
ఏం చెప్పాడో
ఎవరు తెచ్చారో

ఈ పై ఏ శబ్దయుక్తపదరూపాల్లో కొన్నిటికి విభక్తి ప్రత్యయాలు చేర్చవచ్చు ఉదాహరణకు

(30) ఎప్పటికి అవుతుందో ?
ఎక్కడికి వెళ్ళాడో

స్థల కాలబోధక ప్రశ్నార్థక శబ్దాలకి నుంచి కు అనే విభక్తులు క్రియపదాపేక్షితాలు ఎందుకు శబ్దం విభక్తి సహితం ఎందు అనే శబ్దానికి— కు లో వల్ల కోసం వంటి విభక్తులు చేరతై క్రియావిశేషణాలకి నామాలకు మాదిరిగా విభక్తి ప్రత్యయాలు చేరటం విశేషమేకాని ఒక రకంగా క్రియావిశేషణాలు కూడా నామపదాలుగానే గ్రహించాలి అంటే కొన్ని నామాలు క్రియా విశేషణాలుగా కూడా ప్రవర్తించగలవన్నమాట ఉదాహరణకు పై క్రియా విశేషణాలను విశ్లేషించి చూస్తే గర్భితంగా ఉన్న నామపదార్థబోధకతను గుర్తించవచ్చు

ఏ + <స్థలం> = ఎక్కడ
ఎ + <హేతువు> = ఎందుకు

ఏ + <కాలం> = ఎప్పుడు
ఏ = <దిక్కు> = ఎటు
ఏ + <రీతి> = ఎట్లా

నామాల్ని ప్రశ్నించే మిగతా ప్రశ్నార్థక శబ్దాలతో వీటిని పోల్చిచూస్తే అంతర్లీనంగా ఉన్న సామ్యం తెలుస్తుంది

ఏ + <మానవ> = ఎవరు
ఏ + <మహతి> = ఎవతె
ఏ + <మహత్తు> = ఎవడు

ఈ పై ఎక్కడాది శబ్దాలకు సరాసరి ఓ శబ్దం చేరిస్తే అజ్ఞాతార్థక శబ్దాలుత్పన్నమవుతై ఉదాహరణకు

ఎక్కడ + ఓ = ఎక్కడో అజ్ఞాత స్థలం
ఎప్పుడు + ఓ = ఎప్పుడో అజ్ఞాత కాలం
ఎందుకు + ఓ = ఎందుకో అజ్ఞాత హేతువు

కిమర్థక శబ్దయుక్తపదాలకు వాక్యాలకు వేరువేరుగా ఓ శబ్దాన్ని చేర్చటంవల్ల అర్థభేదం కలుగుతుంది ఉదాహరణకు ఈ కింది వాక్యాలను పరిశీలించండి

(31) అక్కడ ఎవరున్నారో
(32) అక్కడ ఎవరో ఉన్నారు

---

<> ఈ గుర్తుల మధ్య ఉన్న శబ్దంకన్నా దాని అర్థం ప్రధానం అర్థబోధకతకు రూపకల్పన కోసం వ్యాపర్తి కల్పించుకున్న ద్వారే ఇవి భాషా వ్యవహారంలో ఇవి రూపపరివర్తనచెందుతై This is an abstract characterization of underlying features

ఈ పై (3 ) ( 2) వాక్యాల్లో ఒ శబ్ద స్థానభేదంవల్ల అర్థభేదం కలి గిందనేది స్పష్టం అర్థభేదమేకాక నామ్నీకరణ విధానంలోనూ భేదముంది వాక్యం (3 ) ని వేరె నామ్నీకారకం అవసరం లేకుండా—

(33) అక్కడ ఎవరున్నారో నాకు తెలీదు

అని మరో వాక్యంలో నామపదస్థానంలో ప్రయోగించవచ్చు వాక్యం (32) ని ఆ స్థానంలో ప్రయోగించాలంటే అని శబ్దానుప్రయుక్తం చేయాలి

(34) అక్కడ ఎవరో ఉన్నారని నాకు తెలియదు

వాక్యం (31) కి కూడా అని శబ్దం చేర్చవచ్చుగాని ఓ శబ్దాంత వాక్యాల్ని అని హేత్వర్థంలో క్రియావిశేషణాలుగా మార్చి కొన్ని రకాల ధాతువులతో ప్రయోగయోగ్యం చేస్తుంది [3]ఆఖ్యాత (Predicate) పదాంతా గమ ఓ శబ్దం వాక్యబోధిత విషయ సర్వస్వానికి సందేహబోధ చేస్తుంది ఆఖ్యాతేతర పదాంతాగమ ఓ శబ్దం ఆ పదార్థానికే సందేహబోధ చేస్తుంది (32) (31) సంఖ్యగల వాక్యాలకున్న భేదం ఇదే

వ్యతిరేకావ్యతిరెకనిర్దేశక వాక్యాలకి ఎమో శబ్దం కిమర్థకశబ్దయుక్త వాక్యాలకి ఓ శబ్దం సందేహార్థంలో అంతాగమంగా వస్తుందనీ ఈ వాక్యాలని ఇంకో వాక్యంలో నామపదస్థానంలో ప్రయోగించవచ్చుననీ పై చర్చ సారాంశం

---

3 ఆఖ్యాత శబ్దాన్ని క్రియాపదం అనే అర్థంలో పూర్వవ్యాకర్తలు ప యోగించారని ఈ వ్యాసకర్త అభిప్రాయపడుతున్నాడు కాని దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు రమణీయము అనే పేరుతో బాలవ్యాకరణానికి రాసిన సమీక్షాగ్రంథంలో ఆఖ్యాతము = క్రియావిభక్తి ఒండు రెండు టీకలలో ఆఖ్యాత శబ్దమునకు క్రియాపదము అను నర్థము నిర్దేశింపబడినది అది ప్రామాదికము ఉపేక్షణీయము (పెజి 333) అని రాశారు ఈ వ్యాసంలో ఆఖ్యాతశబ్దం Predicate (Verbal or non verbal) అనే అర్థంలో ప్రయుక్తం

ఏమో శబ్దయుక్తనామాల ప్రయోగానికి విషయసేకరణార్థక ధాతుసంబంధి క్రియాపదం కావాలనీ అది విధ్యర్థకంలోనూ వ్యతిరేకార్థకంలోనూ ప్రశ్నార్థకం లోనూ ఇవి లేకుండా కాలబోధ ఉన్నప్పుడు అభూతకాలంలోనూ ఉండాలని ఇంతకుపూర్వమే చెప్పబడింది ఈ రెండు రకాల సందేహబోధకి కొంత భేదం ఉంది ఏమో శబ్దయుక్తవాక్యం ఆ అంతంగాగల ప్రశ్నార్థక వాక్యానికీ ఓ శబ్దయుక్తవాక్యం కిమర్థకశబ్దయుక్త ప్రశ్నార్థక వాక్యానికీ సందేహార్థంలో సమాధానాలుగా క్రమంగా వ్యవహరిస్తై ఇంగ్లీషు వ్యాకరణాల్లో మొదటి రకపు ప్రశ్నల్ని Yes or no questions అనీ రెండో రకపు ప్రశ్నల్ని question word questions అనీ అంటారు పైన పేర్కొన్న రెండు రకాల సందేహార్థక వాక్యాల్ని ప్రశ్నార్థక వాక్యాల్లో నిబంధించి చూపి పై వాక్యంలో చెప్పిన రెండు రకాల ప్రశ్నార్థక వాక్యాలతో పోల్చిచూస్తే ఈ భేదం విశదమవుతుంది ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలను పరిశీలించండి

(35) i ఊర్మిళ ఊరినుంచి వచ్చిందా ?

ii ఊర్మిళ ఊరినుంచి ఎప్పుడు వచ్చింది ?

(36) i ఊర్మిళ ఊరినుంచి వచ్చిందేమో నీకు తెలుసా ?

ii ఊర్మిళ ఊరినుంచి ఎప్పుడు వచ్చిందో నీకు తెలుసా ?

(36) సంఖ్యగల వాక్యాలు (35) సంఖ్యగల వాక్యాలకి వాటి క్రమంలో వివరణాత్మకాలుగా గ్రహించవచ్చు (36) సంఖ్యగల వాక్యాలనుంచి నీకు తెలుసా? అన్నభాగం తొలగిస్తే (35) సంఖ్యగల ప్రశ్నలకి సందేహద్యోతక సమాధానా లవుతై అయితే వ్యవహారంలో ఇంత దీర్ఘ సమాధానాలు సాధారణంగా ఉండవు బహుశా ఏమో శబ్ద మొక్కటే చాలు (35) సంఖ్యగల ప్రశ్నలు రెంటికీ కాకపోతే ఏమో నాకు తెలియదు అని అనవచ్చు కాని వాటిని(36)లో నీకు తెలుసా అన్న భాగం తీసెయ్యగా మిగిలిన వాక్యభాగాలుగానే వక్త ఉద్దేశిస్తాడు శ్రోత గ్రహిస్తాడు సందేహార్థబోధక -ప్రత్యయ స్వరూపాన్ని గురించి ఈ చర్చ ఇంకో మార్గం సూచిస్తున్నది ఏమో శబ్దాన్నే సందేహార్థక

ప్రత్యయంగా గ్రహించి దాన్ని కిమర్థశబ్దయుక్త వాక్యాల కనుబంధించినప్పుడు ఏమో లోని కిమర్థకశబ్దంతో సమరూపతఉన్న భాగానికి లోపం చెప్పుకోవచ్చు ఈ రెంటిలో ఏ పద్ధతి మేలో ఇంకా ఆలోచించాల్సిఉంది

సందేహార్థబోధలో మూడో పద్ధతి ఓ శబ్దయుక్త వాక్యాల్నిగాని వాక్యాంశాలనుగాని కొన్నిటిని ఏకవాక్యంగా ప్రయోగించటం దీన్ని ఉతార్థక మనవచ్చు ఇల్లాంటి సందర్భాలలో ఇంగ్లీషులో or అనే పదం ప్రయోగిస్తారు భిన్న వ్యాపారాలకు వికల్పబోధ చేయాలంటే అవి ఏకాశ్రయాలై ఉండాలి అంటే ఏకకర్తృకాలై ఉండాలి

ఉదాహరణకు

(37) వెంకట్రావు చదువుకుంటున్నాడో నిద్రపోతున్నాడో చూసిరా అనే వాక్యంలో వికల్పాన్ని చెప్పిన చదువుకోటం నిద్రపోవడం అనే భిన్న వ్యాపారాలకు వెంకట్రావు ఆశ్రయుడు

* (38) వెంకట్రావు చదువుకుంటున్నాడో సుబ్బారావు గుంటూరు వెళ్తున్నాడో చూసిరా

చదువుకోటం గుంటూరు వెళ్లటం అనే భిన్నవ్యాపారాలు భిన్నాశ్రయాలు గనుక వాక్యం (38) వ్యాకరణ సమ్మతమైన ఏకవాక్యం కాదు

ఏకకర్తృకమైన వ్యాపార వ్యతిరేకావ్యతిరేకతలకు మధ్య కూడా వికల్పాన్ని చెప్పవచ్చు

(39) వెంకట్రావు వస్తాడో రాడో

వ్యతిరేకావ్యతిరేక క్రియలకు వికల్పాన్ని చెప్పినప్పుడు వ్యతిరేకక్రియకు సర్వకాలాదిబోధలో లేదు అనే రూపం క్రియారహిత వాక్యాలకు కాదు అనే రూపం ఆదేశాగమాలుగా క్రమంగా వికల్పంగా వస్తై ఉదాహరణకు

(40) వెంకట్రావు వస్తాడో లేదో (రాడుకు లేదు ఆదేశం)

(41) వెంకటావు మంచివాడో కాదో ? (ఇక్కడ కాదు ఆగమం)

క్రియారహిత వాక్యాలకు ఉదార్థబోధలో కాదు అనే రూపం చేర్చినప్పుడు పూర్వవాక్యానికి అవును శబ్దం వికల్పంగా చేరుతుంది అయినప్పుడు ఓ శబ్దం అవును శబ్దానికే చేరుతుంది

(42) వెంకట్రావు మంచివాడు అవునో కాదో
(ఎవరికి తెలుసు ?)

ఇట్లా అగు ధాతునిష్పన్నరూపాలు క్రియారహిత వాక్యాలకు అపిచేదాది వివిధార్థకాల్లో చేరటం పూర్వవ్యాసంలోనే ప్రోక్తం ఈ కారణాలవల్లనే క్రియారహిత వాక్యాలు నిజంగా క్రియారహితవాక్యాలు కావేమో అనిపిస్తున్నది ఈ రకపు వాక్యాల లోపలి నిర్మాణం (Deep Structure) లో అగు ధాతువు వంటిది ఉన్నదని ఊహించి వెలుపలి నిర్మాణం (Surface Structure)లో అది ఆకార రహితమని వ్యాకరించటం ఒక పద్ధతి అయితే ఆ పద్ధతిలో కొన్ని చిక్కులున్నై వాటిని ప్రస్తావించటాని కిది సమయం కాదు క్రియారహిత వాక్యాలను ప్రత్యేకంగా చర్చించినప్పుడు వాటి విషయం విపులంగా మాట్లాడుకోవచ్చు ప్రస్తుతాని కిట్లాంటి సమస్య ఉన్నదని తెలుసుకుంటే చాలు ఏదెట్లా ఉన్నా స్థలకాల విషయ ప్రధానంకాని అస్తిత్వబోధార్థకమైన అగు ధాతువు వ్యాపారబోధకం కానేది నిర్వివాదం సర్వధాతువులూ వ్యాపార బోధకాలు కావని ఇక్కడ సూచన

భిన్నవాక్యాల్లో వాక్యాంశాలకి ఉతార్థబోధ చేయాలంటే ఆ అంశాలు భిన్నార్థకాలయి వ్యాకరణరూపైకత కలిగిఉండాలి వ్యాకరణరూపైకత అంటే కారకబోధైకత అని స్థూలంగా చెప్పుకోవచ్చు అంటే ఉతార్థ వివక్షితాంశాలు భిన్నార్థకాలయి భిన్నవాక్యాల్లో ఒకేరకపు వ్యాకరణ ప్రవర్తన (Grammatical Function) కలిగిఉండాలి భిన్నవాక్యాల్లో ఉతార్థోద్దిష్టేతర సర్వ

శబ్దాలూ సరూపా (Identical) లయి ఉండాలి ఉదాహరణకు (43), (44) సంఖ్యగల వాక్యాల్ని పరిశీలించండి

(43) కమల పొద్దున 10 గంటలకు బస్సులో కాలేజికి వెళ్తుంది

(44) కమల పొద్దున 10 గంటలకు కారులో కాలేజీకి వెళ్తుంది

(43) (44) సంఖ్యగల వాక్యాల్లో బస్సులో కారులో అన్న పదాలకు ఉతార్థాన్ని వివక్షించాలి ఈ రెండూ ఏకకారకబోధకాలే మిగతా పదాలన్నీ సరూపాలు

అప్పుడు (43) (44) కలిసి (45) గా ఏర్పడతై

(45) కమల పొద్దున 10 గంటలకు బస్సులోనో – కారులోనో కాలేజికి వెళ్తుంది

(43) (44) సంఖ్యగల వాక్యాలలో ఒకదాంట్లో కమల బదులు విమల ప్రయోగించి మిగతా వాక్యాంశాల్ని సరూపంచేస్తే కమల విమలలకు ఉతార్థాన్ని వివక్షించవచ్చు అట్లాగే మిగతా శబ్దాలకూ ఊహించుకోవచ్చు

ఓ శబ్దయుక్త భిన్నవాక్యాలకు ఉతార్థాన్ని వివక్షించినప్పుడు సరూప సార్థకశబ్దాల పునరుక్తి అనవసరం వాటిని లోపింపచెయ్యవచ్చు (43) (44) (45) సంఖ్యగల వాక్యాలను పరిశీలస్తే ఈ విషయం స్పష్టమవుతుంది ఒక్క ఉతార్థంలోనేకాదు క్వార్థకాదుల్లోనూ ఇంతే

ఈ ఓ శబ్దం సర్వత్రా సందేహార్థకంగా ప్రయుక్తమైనప్పటికి తద్భిన్న మైన ప్రయోజనం ఒకటి కనిపిస్తున్నది అది యత్తదర్థబోధకత అప్పుడు ఏ శబ్దయుక్త ప్రశ్నార్థక రూపాలు కిమర్థక రూపాలుగా కాక యదర్థక రూపాలుగా ప్రవర్తిస్తై అప్పుడు యదర్థకవాక్యం తదర్థక వాక్యానికి విశేషణంగా ప్రవర్తిస్తుంది యత్తదర్థక శబ్దయుక్త పదాలకుగాని పద బంధాలకుగాని కారకైకత అక్కర్లేదు కాని అవి ఆ వాక్యంలో ఏకవస్తుసూచక పదాశ్రయాలై ఉండాలి తదర్థక శబ్దయుక్తపదం యదర్థక శబ్దయుక్తపదంతో సంపూర్ణసామ్యం

లేకపోయినా ఆ శబ్దార్థాన్నే సూచించాలి  ఉదాహరణకు యదర్థక శబ్దయుక్త పదం ఔపశ్లేషికాధికరణకారక సమన్వితమైతే తదర్థకశబ్దం స్థలసామాన్యవాచియైన అక్కడ కావచ్చు అట్లాగే యదర్థక శబ్ద యుక్తపదం మహన్మహతీతరబోధక నామమైతే తదర్థకశబ్దం ఏతదర్థ బోధకమైన సర్వనామం కావచ్చు  ఈ రెంటికీ (46) (47) సంఖ్యగల వాక్యాలు క్రమంగా ఉదాహరణలు

(46) నీ కలం ఏ పెట్టెలో పెట్టుకున్నావో అక్కడే ఉంటుంది

(అక్కడే = ఆ పెట్టెలోనే)

(47) నీకు క్లాసులో ఇవ్వాళ ఏ పాఠం చెప్పారో అది చదువు

(అది = ఆ పాఠం)

తక్కినవి ఇట్లాగే ఊహ్యాలు

ఈ యత్తదర్థక వాక్యాల్లో తదర్థక పదబంధం కొన్నిచోట్ల లోపించవచ్చు  లోపించినా యత్తదర్థక శబ్దయుక్తపదాలు ఒకే విషయాన్ని సూచిస్తై గనక అర్థావగాహన కాటంకం ఉండదు  ఉదాహరణకు-

(48) ఈ చీరెల్లో నీకేది కావాలో తీసుకో

(49) ఈ ప్రశ్నకి సమాధానం ఎవరు చెప్పగలరో చేతులెత్తండి

(48) (49) సంఖ్యగల వాక్యాల్లో అది వారు అనే తచ్ఛబ్దాలు క్రమంగా లోపించినై  అయినా వాక్య నిర్మాణాన్నిబట్టి ఉద్దిష్టార్థాన్ని శ్రోత గ్రహిస్తాడు ఈ తచ్ఛబ్దలోపం ఒక్క విధ్యర్థకంలోనే సాధ్యమయ్యేట్టు కన్పిస్తున్నది

* (50) ఆ చీరెల్లో నా కేది కావాలో తీసుకున్నాను

*(51) ఆ ప్రశ్నకు సమాధానాలు ఎవరు చెప్పగలరో చేతులెత్తారు

(50), (51) సంఖ్య గల వాక్యాల్ని (48) (49) సంఖ్య గల వాక్యాలతో పోల్చిచూస్తే అవి వ్యాకరణ సమ్మతమైనవిగా కనిపించవు

ఈ యత్తదర్థక వాక్యాలు విషయబోధలో క్రియాజన్య విశేషణ వాక్యాలకు సమానం ఉదాహరణకు (48) (49) సంఖ్య గల వాక్యాల్లో క్రియాజన్య విశేషణా లుపయోగిస్తే ఈ క్రింది విధంగా చెప్పవచ్చు

(52) ఈ చీరెల్లో నీకు కావాల్సింది తీసుకో

(53) ఈ ప్రశ్నకు సమాధానం చెప్పగలవాళ్ళు చేతులెత్తండి

విషయబోధకతౌల్యం ఉన్న ఈ రెండు రకాల వాక్యాలు వ్యవహర్త ఏ భిన్న ప్రయోజనాన్ని ఆశించి ప్రయోగిస్తాడో ప్రస్తుతం చెప్పటం కష్టం బహుశా విషయైకదేశ ప్రాధాన్యవివక్ష కావచ్చు యత్తదర్థక వాక్యనిర్మాణం ఆర్యభాషల్లో ఉన్నంత ప్రచురంగా ద్రావిడభాషల్లో ఉన్నట్టు కనిపించదు

తెలుగులో సాధారణంగా ఏ ఆ అనే రెండు ప్రశ్నార్థకాలూ ఏక వాక్యంలో ప్రయోగించటానికి వీల్లేదు కాని ఆ ప్రశ్నార్థకంగా అంతంలో వచ్చే వాక్యాలమీద విషయ గౌరవబోధనార్థం ఏం శబ్దం ప్రయోగం కనిపిస్తున్నది

(54) వాళ్లు ఇల్లు ఖాళీ చేశారా ఏం ?

ఈ ఏం శబ్దం నిర్దేశక వాక్యాల మీద ఎందుకు అనే అర్థంలో ప్రయోగించబడుతుంది

(55) ఇంత తొందరగా వచ్చేశావేం ?

కొన్ని అసమాపక క్రియల తర్వాత ఏం శబ్దమూ మరికొన్ని కిమర్థక శబ్దాలూ వస్తై వస్తే ఏం ? రాకపోతే ఎట్లా ? వంటి వాక్యాలు ఇట్లాంటివే

సందేహార్థక గురుత్వంలో ఏమో శబ్దం కూడా ఓ శబ్దాంత వాక్యాలకు అను ప్రయుక్తం అవుతుంది ఏమో శబ్దంతో సందేహార్థ వివక్ష చేసిన వాక్యాల మీద మళ్ళీ గురుత్వ బోధన కోసం ఏమో శబ్దాన్ని అనుప్రయుక్తం చేసినప్పుడు మొదటి ఏమో శబ్దంలోని కిమర్థక భాగానికి లోపమవుతుంది (56) (57) సంఖ్య గల వాక్యాలు అందుకు క్రమంగా ఉదాహరణలు

(56) వాళ్ళు ఎప్పుడు వస్తారో ఏమో
(57) వాడు పరీక్ష తప్పాడో ఏమో

విషయ గురుత్వబోధకు కొన్ని శబ్దాల్ని పునరావృత్తి చేసే పద్ధతి చాలా భాషల్లో ఉంది ఇంగ్లీషులో వ్యతిరేకార్థకరూపం అట్లాగే ఆవృత్తి అవుతుంది I don t know noth ng అనే వాక్యం అమెరికన్ గ్రామీణ వ్యవహారంలో సర్వసాధారణం

ఏమో శబ్దాన్ని గురించి ఇంకో చిన్న విశేషంతో ప్రస్తుత వ్యాసం ముగుస్తుంది కళింగాంధ్ర (గోదావరి కెగువ ప్రాంతపు తెలుగుదేశం) వ్యవహారంలో ఏమో శబ్దాని కొక చిత్రమైన ప్రయోగ విశేషం ఉంది కొన్ని వాక్యాంశాలక్కు సందేహార్థబోధ లేకుండానే ఏమో శబ్దాన్ని అనుప్రయుక్తం చేసి వారు వ్యవహరిస్తారు అప్పుడు ఏమో శబ్దానికి ప్రత్యేకమైన అర్థబోధ ఉన్నట్టు కనిపించదు వాక్యంలోని ఒక అంశంనుంచి ఇంకో అంశానికి పోవటానికి సంధిప్రాయం (Transition) గా గాని లేక ఒక అంశాన్ని చెప్పి తరవాత అంశాన్ని చెప్పేలోగా మధ్యలో ఆలోచించుకోవటంవల్ల ఏర్పడే నిశ్శబ్దాన్ని పూరించటం (Gap Filling) కోసంగాని ఈ ఏమో శబ్దాన్ని ప్రయోగిస్తారు ఒక్కోసారి ఇవేవీ లేకుండా కేవలం అలవాటుగాకూడా ప్రయోగించవచ్చు వీరి భాషలోనైనా ఏమో శబ్దం వాక్యాంతంలో అర్థరహితంగా ప్రయుక్తంకాదు ఈ ఆధారంవల్ల ఏమో శబ్దం ప్రయోగం కళింగాంధ్రంలో ఆసక్తిరక్షణ కోసమని ఈ వ్యాసకర్త అభిప్రాయపడుతున్నాడు

ఉదాహరణకు

(58) అప్పుడేమో నేనేమో ఆయనతో ఇలా అన్నాను

(58) లో ఏమో శబ్దాన్ని వాక్యాంతంలో తప్ప మిగతా ఏ పదబంధమీదనైనా ఆసక్తిరక్షకంగా ఉపయోగించవచ్చు వాక్యాంతంలో ఆ అవసరంలేదు గనక అక్కడ ప్రయోగించిన ఏమో శబ్దం తప్పనిసరిగా అర

వంతమవుతుంది ఇట్లాంటి సంధి ప్రాయమైన నిశ్శబ్దపూరక అసత్తిరక్షక శబ్ద ప్రయోగంలో వ్యవహర్తలు ఎంతో వైవిధ్యం చూపిస్తారు వీటినే Manne-risms అంటారు ఆంధ్ర దేశంలో కొన్ని ప్రాంతాల పిల్లలు వాక్యాదిన మరే శబ్దంతో ప్రారంభించి ప్రతి పదాంతంలోనూ (వాక్యాంత పదం తప్ప) ఏ శబ్దాన్ని దీర్ఘంతీసి ప్రయోగిస్తారు ఇంగ్లీషులో I mean You know You see వంటి పదాలు-ఇటువంటివే పూర్వకవుల కావ్యాల్లో పాదపూరణ కోసం (ఉమాకాంత పండితులు వీటిని దండగ్గణం అన్నారు) ప్రయోగించే శబ్దాలతో వీటి సామ్యం గమనించవచ్చు ఉమాకాంత పండితుల విమర్శ కావ్య శిల్పానికి సంబంధించింది ఏ యే రకాల శబ్దాలు ఈ విధంగా ప్రయోగించ టానికి ఉపయోగపడతాయో అనేది పరిశోధనార్హమైన విషయం ఇక్కడ ఇవి దిఙ్మాత్రంగా ప్రదర్శితాలు

# ఇత్యర్థక

విషయార్థక నామ్నీకారకాలుగా ప్రతిపాదితమైన అని అటం అది శబ్దాలు ఇతర నామ్నీకరణాల్లో కూడా ఉపయుక్త మవుతయ్యని మొదటి వ్యాసంలో చెప్పబడింది వాటిల్లో అని కున్న ఇతర ప్రయోజనాలను గురించి చర్చించటం ఈ వ్యాసోద్దేశం

ఒక వక్త ప్రయోగించిన భాషాంశాలను అదే వక్తగాని మరో వక్తగాని ఇతరులకు నివేదించే అవసరం భాషావ్యవహారంలో సర్వసామాన్యం అందుకు భాషలు వేరువేరు పద్ధతులు అవలంబిస్తై అనువదించదలచుకున్న భాషాంశానికి సంస్కృతంలో ఇతి శబ్దాన్ని సంధిస్తారు ఈ నామ్నీకరణానికి పేరు ఈ శబ్దం నుంచే వచ్చింది తెలుగులో ఇతి స్థానంలో అని అని ప్రయోగిస్తాం ఇతర ద్రావిడ భాషల్లో కూడా అని కి సరూపమైన పదమే ఇట్లాంటి సందర్భాల్లో ఉపయోగిస్తారు తమిళంలో అది ఎన్ఱు అనే రూపంతోనూ కన్నడంలో ఎందు అనే రూపంతోనూ ఉంటుంది తెలుగులో లాగానే ఆ భాషల్లోకూడా ఈ రూపాలకి ఇత్యర్థబోధతోపాటు విషయార్థబోధకూడా ఉంది ఈ రకమైన తులనాత్మక పరిశీలన విస్తృతంగా జరిపితే ప్రాచీన ద్రావిడంలో వాక్యనిర్మాణానికి సంబంధించిన విశేషాలు బయటపడవచ్చు కాని ప్రస్తుతం ఈ వ్యాసావళి పరిమితి వర్ణనాత్మక పరిశీలన మాత్రమే

ఈ ఇత్యర్థక నామ్నీకరణం ఇతర నామ్నీకరణాలకన్నా కొన్ని విషయాల్లో భిన్నమైంది మిగతా నామ్నీకరణాలు కొన్ని రకాల వాక్యాలకే సాధ్యమవుతై ఇత్యర్థకాని కీఆంక్ష వర్తించదు ఏ వాక్యమైనా ఇత్యర్థక నామంగా వర్తించవచ్చు అసలు వాక్యమే కానక్కర్లేదు వాక్యాంశమూ కావచ్చు పదమూ కావచ్చు పదాంశమూ కావచ్చు మహావాక్యమూ కావచ్చు అంటే ఈ ఇత్యర్థకి నామ్నీకరణానికి పరిమితి లేదు ఇంకో విశేషమేమంటే ప్రపంచంలో మానవ

వ్యవహారంలో ఉన్న ఏ భాషైనా దీనికి విషయమే ఇతర నామ్నీకరణాలు భాషలో ప్రతిపాదించబడిన అర్థ ప్రధానాలు ఇత్యర్థక నామ్నీకరణానికి భాషే విషయం ఇంతకు పూర్వపు వ్యాసాల్లో చర్చించిన విషయార్థక సందేహార్థక నామ్నీకరణాలకి భాషలో ప్రతిపాదితమైన విషయం (informat on) ప్రధానం ఈ నామాలు విషయగ్రహణ విషయసేకరణ సంబంధి ధాతువులతో ప్రయోగ యోగ్యాలు ఇత్యర్థక నామం శబ్ద కర్మ ధాతువులతో ప్రయోగ యోగ్యం అడుగు అను చెప్పు వ్రాయు విను మొదలైన ధాతువులు శబ్ద కర్మ ధాతువులు ఇత్యర్థకనామం ప్రశ్నార్థక వాక్య గర్భితమైనప్పుడే అడుగు ధాతువు సమాపక క్రియగా రాగలదు అడుగు అంటే తదర్థకమైన పృచ్ఛించు ప్రశ్నించు వంటి ధాతువులుకూడా గ్రాహ్యాలే 'అడుగు ధాతువు ప్రశ్నార్థక శబ్ద కర్మ ధాతువు మిగతా శబ్ద కర్మ ధాతువుల కీనియమం లేదు ఉదాహరణ కీకింది వాక్యాలు గమనించండి

(59) మాట్లాడే భాషకు వ్యాకరణం ఎట్లా రాస్తారు? అని పండితులు అడుగుతారు

(60) వ్యాకరణంలేని భాషె ఉండదు (అని) అంటారు భాషా శాస్త్రజ్ఞులు

వాక్యం (59) లో అడుగు స్థానంలో ఏ శబ్ద కర్మ ధాతువునైనా ప్రయోగించవచ్చు కాని వాక్యం (60) లో ప్రశ్నార్థకేతర శబ్ద కర్మ ధాతువులే ప్రయోగార్హాలు వాక్యం (60) లో అను ధాతు నిష్పన్న క్రియా రూపపరక మైన అని కి వికల్పాన్ని సూచించటంకోసం బ్రాకెట్లలో ఉంచబడింది ఇత్యర్థక శబ్దం చేర్చిన విధ్యర్థక వాక్యంలో కొన్ని మార్పులు జరుగుతై ఇత్యర్థకి శబ్ద పరక విధిని పరోక్షవిధి అనవచ్చు గాని అందులో కొన్ని చిక్కులున్నై విధిని మరొకరిద్వారాచేస్తే పరోక్ష విధి అనవచ్చు కాని ఒకే వ్యక్తి తను ఇచ్చిన విధి (C. mmand)ని తానే విధి గ్రహీతకు కాని మరొకరికిగాని వేరొక సమయంలో వర్తి చెయ్యవచ్చు నివేదించవచ్చు అప్పుడు ఆది విధి నివేదన అవుతుంది ఈ రెండు సందర్భాల్లో ఏ విధ్యర్థక వాక్యానికి అని చేరుతుంది పరోక్షవిధిలో

అని కి ముందున్న వాక్యంలోనేగాక ఆ వాక్యం నామంగా ప్రవర్తించే వాక్యం లోనూ క్రియ విధ్యర్థకం కావాలి విధి నివేదనలో అది అవిధ్యర్థకం కావాలి ఉదాహరణకి ఈ కింది వాక్యాలు గమనించండి

(61) పిల్లలని త్వరగా అన్నం తినమని చెప్పు

(62) ఊర్మిళని ఊరినుంచి వెంటనే రమ్మని రాశాను

వాక్యం (61) లో అని కి ముందూ తర్వాతా విధ్యర్థక క్రియలే ఉన్నై. దీన్ని పరోక్షవిధి అనవచ్చు వాక్యం (62) లో చివరిక్రియ ( అని కి తరవాత క్రియ) అవిధ్యర్థకం దీన్ని విధి నివేదన అనవచ్చు ఈ పై వాక్యాల్లో ఇంకా గమనించవలసిన విశేషాలున్నై అవి ఇవి 1 తినమని రమ్మని అనే రూపాల్లో మకారాగమం 2 పిల్లలిని ఊర్మిళని అనే రూపాల్లో ద్వితీయా విభక్తి ప్రత్యయం

మకారాగమాన్ని సాధించటానికి రెండు మార్గాలున్నై ప్రాచీన భాషలో ము వర్ణకం విధి బోధకం ఆధునిక భాషలోకూడా దాన్నే గ్రహించి అని పరమైనప్పుడు తప్ప మిగతా అన్నిచోట్లా ఆ ప్రత్యయానికి లోపం చెప్పుకోవటం ఒక పద్ధతి అప్పుడు ముவర్ణకం మిగిలినచోట పరరూప సంధివల్ల అంత్యస్వర లోపమూ సమస్వరసూత్రం వల్ల క్రియాపదంలోని ప్రథమేతర ఉ వర్ణానికి అ వర్ణాదేశం చెప్పుకోవచ్చు బాలవ్యాకరణ పద్ధతిలో ఆధునిక భాషలో ము ప్రత్యయాన్ని ముజి గా విధించుకొని ఉద్దిష్టరూపాన్ని సాధించుకోవచ్చు స్పష్టత కోసం రూపనిష్పత్తి నీ కింది విధంగా చూపించవచ్చు

తిను + ముజి + అని —> తినను + అని —> తినమని దీర్ఘాంతైక స్వరయుతధాత్వాదేశ రూపాలదీర్ఘ స్వరానికి ము ప్రత్యయం పరమైనప్పుడు స్వర హ్రస్వీకరణం మకారద్విత్వం ప్రాచీన భాషలోనూ ఉన్నై [చూ బాలవ్యా- క్రియ-సూ- 61] అవే ఆధునిక భాషకూ పర్తించుకోవచ్చు అప్పుడు రూప నిష్పత్తినిట్లా చూపించవచ్చు

రా + ముఙ్ + అని ⟶ రా + మ + అని ⟶ రమ్మని

ఈ పద్ధతి ప్రాచీన వ్యాకరణానుసారి భాషాపరిణామ సూచి కాని ఈ పద్ధతిలో లోపమల్లా ఒకటే కేవలం అని కి ముందు మాత్రమే కనిపించే మకారంకోసం మధ్యమపురుషైకవచన ప్రత్యయంగా ముఙ్ ని విధించుకోవటం మళ్ళీ దానికి లోపం చెప్పుకోవటంలో ప్రక్రియాలాఘవం కనిపించదు విధ్యర్థక క్రియారూపానికి అని పరమైనప్పుడు మ కారం కాని ఆమ్ శబ్దం కాని ఆగమం అవుతుందని చెప్పటం తేలికైన పద్ధతి ఈ ప్రక్రియలలో ఏదో ఒక దానిని ఎన్నుకోవటం వ్యాకర్తల దృష్టి భేదాన్నిబట్టి ఉంటుంది

ఇక పిల్లలి ని ఊర్మిళ ని అనే శబ్దరూపాల్లో ద్వితీయా విభక్తిగురించి (61) (62) సంఖ్యగల వాక్యాల్లో పిల్లలు ఊర్మిళ అనే నామాలు తిను వచ్చు అనే ధాతువుల నుంచి ఏర్పడిన క్రియలకు కర్తృపదాలు అని యోగంలో అవి కర్మబోధకాలవుతై కాని అట్లా అనటంలో ఒక చిక్కుంది కర్మ అంటే ఏ క్రియకు ? అనే ప్రశ్నకు వ్యాకర్త సమాధానం చెప్పాలి ఆ వాక్యాల సమాపకక్రియలకు కర్మ అనలేం ఎందుకంటే అవి శబ్దకర్మ ధాతువుల్ను పైగా అని అనుప్రయుక్తమైన మొత్తం వాక్యం ఆధాతువులకి కర్మ కాగలదు కాని అందులోని పృథక్పదంకాదు ఇంకో పద్ధతి ఇత్యర్థకమైన అని కే పైన పేర్కొన్న నామాల్ని కర్మలుగా భావించటం కాని అని కి అను ధాతువుతో రూపసంబంధం ఉన్నప్పటికి దాన్ని క్త్వార్థకంగా గ్రహించక అవయవి సూచకం (Construct on Marker)గా నిర్దేశించాం కాబట్టి అదీ సరిపడదు ఏదెట్లా ఉన్నా ఈ ద్వితీయావిభక్తి యోగానికి అని కీ దగ్గరి సంబంధం ఉన్నట్లు కనిపిస్తున్నది దీన్ని సాధించటానికి సంతృప్తికరమైన ప్రక్రియ ఏదీ ఈ వ్యాస కర్తకింకా గోచరించలెదు

ఇక్కడ ఇంకో విశ్వ ప్రక్రియవిశేషం కూడా ఉంది (61) (62) సంఖ్యగల వాక్యాలలో సమాపక క్రియాపదాలైన చెప్పు రాశాను అనే క్రియలు అముఖ్యకర్మ పదాపేక్షకాలు ఎవరికి అన్న ప్రశ్న వేసుకుంటే సమా

ధానంగా వచ్చే పిల్లలకి ఊర్మిళకి అన్నపదాలే ఈ పై క్రియలకు అముఖ్య కర్మలు ఈ పదాలు పై వాక్యాల వెలుపలి నిర్మాణం (surface structure) లో కనిపించకపోయినా లోపలి నిర్మాణం (deep structure) ఉన్నయ్యని ఊహించుకోవాలి అవి కొన్ని సందర్భాలల్లో వెలుపలి నిర్మాణంలోకి వస్తయ్యని ఈ వ్యాసం తరువాత భాగంలో తెలుస్తుంది ఈ అముఖ్య కర్మపదాల సంయోగంలో అని నామ్నీకరించిన విధ్యర్థక వాక్యాల కర్తృపదాలైన మధ్యమపురుష సర్వనామాలకు లోపం వస్తుంది అముఖ్య కర్మపదాలూ విధ్యర్థక వాక్యాల కర్తృపదాలైన మధ్యమపురుష సర్వనామాలకు లోపం వస్తుంది అముఖ్య కర్మ పదాలూ విధ్యర్థక వాక్యాల కర్తృపదాలూ ఒకే వ్యవహర్తని (ఇక్కడ శ్రోత) సూచిస్తై గనక రెండూ కలిసి ఒకే పదంగా ఏర్పడతై అర్థావబోధ కవసరం లేని పునరుక్తిని తొలగించటం ప్రయోజనం కావచ్చు

ఇంగ్లీషులో direct speech indirect speech అని రెండు రకాల వాక్యాలున్న direct speech లో వక్తవాచకం యధాతధంగా అనూదితం indirect speech లో కొంత మార్పుజరుగుతుంది రాతలో direct speech కి quotation marks పెడతారు Indirect speech లో 'that' అనే శబ్దంతో clause ఆరంభిస్తారు Direct speech లోని కర్తను సూచించే ఉత్తమ పురుష సర్వనామానికి బదులు Indirect speech లో ప్రథమ పురుష సర్వనామం ఉపయోగించబడుతుంది తెలుగులో ఈ రకమైన వాక్యవిభాగం లేదని తెలుగుభాషలో కృషిచేసిన భాషాశాస్త్రజ్ఞులు కొందరు అభిప్రాయపడ్డారు ఉదాహరణకు ప్రొఫెసరు భద్రిరాజు కృష్ణమూర్తిగారు Telugu has no indireet (or reported) speech of the kind found in English in clauses connected by that to the main clause అని రాశారు కాని తెలుగులో కొన్ని వాక్యాల్లో ఈ రకమైన విభాగం చేయవచ్చునని తోస్తున్నది అని కి ముందున్న వాక్యం విధ్యర్థకమైనప్పుడూ అవిధ్యర్థకమైతే ఆవాక్యంలో వక్తృబోధకపదం ఉత్తమ పురుషలో ఉన్నప్పుడూ

తెలుగులో direct and ndirect speech విభాగం చెయ్యటానికి వీలున్నది ఇంతకుముందు ఉదాహరించిన (౬౧) (౬౨) సంఖ్యగల వాక్యాల్ను indirect speechకి ఉదాహరణలుగా గ్రహించవచ్చు ఆ వాక్యాల్లో ఇత్యర్థక నామాలు విధ్యర్థక వాక్యాలనుంచి నామ్నీకృతాలు ఆ వాక్యాలు direct speechలో ఇట్లా ఉంటై

(౬౩) పిల్లలకి మీరు త్వరగా అన్నం తినండి అని చెప్పు

(౬౪) ఊర్మిళకి నువ్వు ఊరినుంచి త్వరగా రా అని రాశాను

విధ్యర్థక వాక్యాలు ఇత్యర్థక నామాలుగా ప్రవర్తించినప్పుడు direct speech లో గమనించాల్సిన విశేషాలు కొన్ని ఉన్నై direct speechలో కర్తృపదాలు మధ్యమపురుష సర్వనామాలు indirect speechలో కనిపించని చెప్పు వ్రాయు ధాతువుల అముఖ్య కర్మలు direct speech లో తమ సహజ రూపంతో కనిపిస్తై ind rect speechలో లోపించిన విధ్యర్థక క్రియల ఏకవచన బహువచన భేదం direct speech లో ప్రత్యక్షమవుతుంది indirct speech లో కనిపించే మ కారాగమం direct speech లో ఉండదు ఈ రెండు రకాల వాక్యాలకీ ఒకేరకపు లోపలి నిర్మాణం (deep structure) ఉందనుకుంటే (ఉందనటమే సమంజసం) direct speech లోపలి నిర్మాణానికి ఎక్కువ సన్నిహితం అనవచ్చు

ఇంతకుపూర్వం (౬౧) (౬౨) సంఖ్యగల వాక్యాల్లో కనిపించే ద్వితీయా విభక్తి ప్రత్యయాన్ని సాధించటానికి రెండుపద్ధతులు సూచింపబడినై ఇప్పుడు మూడోపద్ధతిని గురించికూడాఆలోచించవచ్చు నామ్నీకరించిన విధ్యర్థకవాక్యకర్తృ పదం ఈ వాక్యం నామంగా ప్రవర్తించే వాక్యంలోని సమాపక క్రియతో అన్వయించే అముఖ్య కర్మ ఒక మనిషిని సూచిస్తే అముఖ్యకర్మపదం కర్తృపదాన్ని తొలగించి ఆ స్థానాన్ని ఆక్రమించుకుంటుంది ఆ ప్రయత్నంలో అముఖ్యకర్మ తన కారకాన్ని మార్చుకుంటుంది కు విభక్తి ను విభక్తిగా మారుతుంది ఈ పద్ధతి అయినా ఈ వాక్యాల్లో జరిగే వ్యాకరణ కార్యాన్ని పూర్తిగా నిరూపిస్తున్నట్టు

అగపడదు ద్వితీయావిభక్తి ప్రత్యయంగా కనిపించే ను శబ్దం ఏ క్రియతో అన్వయిస్తుందో ఈ పద్ధతిలోనూ అస్పష్టమే ఇంకా ఎక్కువ పరిశోధన జరిగి తేనేగాని దీనికి ఒక సుష్ఠుమార్గం కనిపించదు

dıreet speechకి ındırect speechకి భేదం కనిపించే ఇంకో చోటు అనూదిత వాక్యంలో వక్తృ బోధక పదం ఉత్తమ పురుషలో ఉన్నప్పుడు ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలను d rect speechకి లక్ష్యాలుగా గ్రహించవచ్చు

(౬౫) నాది ప్రజల వుద్యమం (అని) అన్నారు గురజాడ అప్పారావుగారు

(౬౬) మా కవిత్వాన్ని వచన కవిత్వం అని అనసీయం (అని) అన్నారు దిగంబరకవులు

పై వ్యాక్యాల్లో వక్తృబోధకపదాలు ఉత్తమ పురుషలో ఉన్నై వాక్యం (౬౫)లో అది ఏకవచనంలోనూ (౬౬)లో బహువచనంలోనూ ఉంది ఈ నేను మేము శబ్దాలకి బదులు ındıreet speechలో తన తమ శబ్దాలుఉంటే (౬౫) (౬౬) సంఖ్య గల వాక్యాలు ındırect speech లో ఇట్లా ఉంటై

(౬౭) తనది ప్రజల వుద్యమం (అని) అన్నారు గురజాడ అప్పారావు గారు

(౬౮) తమ కవిత్వాన్ని వచన కవిత్వం అని అనసీయం (అని) అన్నారు దిగంబర కవులు

(౬౫) (౬౬) సంఖ్యగల వాక్యాల్లో నేను మేము శబ్దాల విశేషణరూపాలైన నా మా శబ్దాలను ప్రయోగించింది అనూదిత వాక్యంలోని వక్త (౬౭) (౬౮) సంఖ్యగల వాక్యాల్లో తను తము విశేషణరూపాలైన తన తమ శబ్దాలను ప్రయోగించింది వాక్యం అనువదించిన వక్త ఇంగ్లీషులో ఈ సందర్భంలో తను తము శబ్దాలస్థానంలో ప్రథమ పురుషసర్వనామరూపాలను ప్రయోగిస్తారు తెలుగులోకూడా ఈ శబ్దాలను ఉత్తమ పురుష సర్వనామాలకు కాకుండా ప్రథమపురుషసర్వనామాలకు ఆదేశమైన రూపాలుగానే గ్రహించవచ్చు

ఉదాహరణకు ఈ క్రింది వాక్యాన్ని గమనించండి

(69) ఆయన తన స్వార్థంకోసం ఈ పని చెయ్యలేదు

ఈ పై వాక్యంలో ఇత్యర్థక నామం లేనే లేదు అయినా తన అనే శబ్ద ప్రయోగం లేకుండా అనాలంటే ఈ కిందివిధంగా ఉంటుంది

(70) ఆయన ఆయన స్వార్థంకోసం ఈ పని చెయ్యలేదు

వాక్యం (70 లో ఆయన అనే శబ్దం పునరుక్తమైంది వాక్యం (69)లో పునరుక్తమైన ఆయన శబ్దానికి తన ఆదేశం అయింది ఇప్పుడు ఈ ఆదేశ కార్యాన్ని ఈ విధంగా సూత్రించుకోవచ్చు ఒక వాక్యంలో రెండు పదాలు ఒకే మనిషినిగాని మనుషుల్నిగాని సూచించినప్పుడు అందులో ఒక పదానికి ఏకత్వంలో తను బహుత్వంలో తము శబ్దాలాదేశాలవుతై అంటే నామ పునర్గ్రహణంలో వచన భేదానుసారిగా తను తము అనే రూపాలు వస్తయ్యన్న మాట ఈ శబ్దాలు ప్రాచీనభాషలో తాను తాము అనే రూపంతో ఉంటై ఆత్మార్థం బొకానొకచోట నామాస్మదార్థాభిధాయియు నగు (ప్రౌఢవ్యా శబ్ద సూ 78) అనే ప్రౌఢవ్యాకర్త సూత్రం ఆధారంగా తా శబ్దమును దానియొక్క రూపములును తెనుగున నేను అతడు అనునట్టి యర్థములలోఁ బ్రయోగింపబడినవి* అని శ్రీ జోగి సోమయాజులుగారు ప్రమాద వశాన రాశారని తోస్తున్నది

పైన పేర్కొన్న సూత్రానికి లక్ష్యంగా నన్నయ్య గారి భారతావతారికలో నుంచి తన కిష్టుఁడున్ సహాధ్యాయుడు నైనవాడు అనే ప్రయోగం ఇచ్చి తనకున్-నాకు అని ప్రౌఢవ్యాకర్త అర్థ వివరణ చెయ్యటం కూడా పొరపాటు వల్లనే నన్నయగారు తన్ను గురించి ఎప్పుడూ ప్రథమ పురుషలోనే చెప్పుకొన్నారు ఆ తరవాత పద్యంలోనే నానా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె నని ప్రథమ పురుషలో ఉంది ఈ పై ప్రౌఢవ్యాకరణ సూత్రానికి వ్యాఖ్యలో శ్రీ భాష్యకారాచార్యులుగారు నా శబ్దమునకుఁ బునర్గ్రహణమున దా శబ్ద మెప్పుడును బ్రయో

---

* గంటి జోగి సోమయాజి ఆంధ్ర భాషా వికాసము విశాఖపట్టణం 1947 పేజీ 484

గింపఁజనదు [1] అని అనటం సమంజసంగా ఉంది తాను శబ్దాన్ని గురించి Arden చెప్పిన ఈ క్రింది విషయాన్ని కొద్ది మార్పులతో అంగీకరించవచ్చు

The reflexive pronoun తాను except when used in the plural number instead of మీరు can only be used in reference to the sub ect of a principal verb in the third person and whenever such a reference is required to be made తాను should always be used [2] అని Arden తన వ్యాకరణంలో రాశాడు Arden రాసిన పై వాక్యంలో Subject అనకుండా Repetition of a noun అనటం ఉచితం అందు వల్లనే తెలుగులో నామ పునర్గ్రహణం అనటం

విషయార్థక నామంలాగే ఇత్యర్థక నామాన్ని కూడా విశేషణంగా మార్చి శబ్దార్థక శబ్దాల ముందు ప్రయోగించవచ్చు ఇత్యర్థక నామం శబ్ద ప్రధానమైంది అనటానికి ఇదొక ఆధారం మాట పదం వాక్యం మొదలైనవి శబ్దబోధక శబ్దాలు అని కి ఉన్న విశేషణ రూపాల్ని గురించి విషయార్థక నామ్నీకర ణాన్ని గురించి చర్చించేటప్పుడు చెప్పుకున్నాం ఇక్కడ అవే ప్రయుక్తం ఉదాహరణకు వాక్యం (65) ని ఈ విధంగా మార్చవచ్చు

(71) నాది ప్రజల పుద్యమం అనే వాక్యం అన్నారు గురజాడ అప్పారావుగారు

(65) (71) సంఖ్యగల వాక్యాలు సమానార్థకాలుగా గ్రహించవచ్చు

---

1 భాష్యం వెంకట నరసింహ భాష్యకారాచార్యులు త్రిలిఙ్గలక్షణశేషము అను ప్రౌఢ వాక్యరణము-తత్వబోధినీవ్యాఖ్యాసమేతము శ్రీ విలాస ప్రచురణ ములు ఇచ్ఛాపురం 1968 పేజీ 139

2 A H Arden A progressive Grammar of the Telugu Language The Christian L terature Society Madras 1955-Page 88

ఈ అని శబ్దానికున్న భిన్నప్రయోజనాల వల్ల ఒకోసారి కొన్ని వాక్యాలు భిన్నార్థబోధ చెయ్యవచ్చు ఉదాహరణకి ఈ క్రింది వాక్యం గమనించండి

(72) ఆతను నేను ఎల్లుండి వస్తాను అని మీతో అన్నాడా ?

ఈ పై వాక్యానికి రెండర్థాలున్నై (73) (74) సంఖ్యగల వాక్యాలలో ఆ అర్థాలు స్పష్టమవుతై

(73) అతను నేను ఎల్లుండి వస్తాను అనే మాట మీతో అన్నాడా ?

(74) అతను నేను ఎల్లుండి వస్తాను అనే విషయం మీతో అన్నాడా?

వాక్యం (73) లో అతను నేను అనే శబ్దాలు ఒకే వ్యవహర్తను సూచిస్తయ్ వాక్యం (74)లో భిన్న వ్యవహర్తలను సూచిస్తయ్. ఇంకో రకంగా చెప్పాలంటే వస్తాను అన్నాడు అనే క్రియలు వాక్యం (73)లో ఏక కర్తృకాలు (74) లో భిన్నకర్తృకాలు ఇట్లాంటి భేదంవల్లనే అని కున్న భిన్న ప్రయోజనాల్ని వేరు చెయ్యాల్సి వచ్చింది

వాక్యం (73) లో అస్మదర్థక శబ్దానికి బదులు ఆత్మార్థకశబ్దం ప్రయోగిస్తే మాట అనే శబ్దానికి బదులు విషయం అనే శబ్దం ప్రయోగించవచ్చు. అంటే Indirect speech లో ఉన్న అనూదిత వాక్యాన్ని విశేషణంగా మారిస్తే విషయం అనే శబ్దానికి ముందు ప్రయోగించవచ్చు ఉదాహరణకు ఈ వాక్యం గమనించండి

(75) అతను తను ఎల్లుండి వస్తాను అనే విషయం మీతో అన్నాడా?

ఈ పై వాక్యం ఆధారంగా ఇంకో విషయాన్ని ప్రతిపాదించవచ్చు indirect speech లో ఉన్న వాక్యంలో విషయం అనే మాట చేర్చవచ్చు direct speech లో వీలుండదు అందువల్ల indirect speech లో అని కి ముందున్న వాక్యం ఇత్యర్థకనామం అనకుండా విషయార్థక నామంగా గ్రహించటమే సముచితంగా కనిపిస్తున్నది అంటే Direct speech కి indirect speech కి ఉన్న భేదం ఇత్యర్థక నామీకరణానికి విషయార్థక

నామ్నీకరణానికీ ఉన్న భేదంలాంటిదే ఈ ప్రతిపాదనలో ఉన్న సాధకబాధకా లను గురించి ఈ వ్యాసకర్త ఇంకా లోతుగా పరిశీలించలేదు ప్రస్తుతాని కిది సూచనప్రాయమే ఇంగ్లీషులో కూడా that అనె శబ్దమే indirect speech లోనూ విషయార్థక నామ్నీకరణం (fact ve nom na ızat on) లోనూ ప్రయోగించటం ఈ ఊహకు మరో ఆధారం

ఈ వ్యాసం మొదట్లో శబ్ద ప్రధానమైన ఇత్యర్థక నామ్నీకరణానికి వాక్య సంఖ్యా పరిమితిగాని దీర్ఘపరిమితిగాని లేదని చెప్పబడింది అంతేకాదు అనూదిత శబ్ద సముదాయం కాని వాక్య సముదాయం కాని వలాని భాషే కావాలన్న నియమం కూడా లేదని చెప్పబడింది ఇది ఇంగ్లీషులో అయినా ఇంతే తెలుగులో అయినా ఇంతే బహుశ ప్రపంచ భాషలన్నిట్లోనూ ఇంతే కావచ్చు కాని indirect speech లో ఈ స్వేచ్ఛ లేదు ind rect speech లో అని ముందున్న శబ్ద సముదాయం అంతర్నిర్మాణం (internal structure) ఉన్న వాక్యమే కావాలి ఆ వాక్యమైనా అనువక్త (reporter) భాషలోనే ఉండాలి ఇంగ్లీషులో కూడా ఇట్లాంటి నియమమే వర్తిస్తుంది అందువల్ల ఇంగ్లీషులోనూ తెలుగులోనూ ind rect speech లోని గర్భ వాక్యాలను విషయార్థక నామాలుగానే గుర్తించటం సమంజసం ఇంగ్లీషులోనూ తెలుగులోనూ indirect speech విషయ ప్రధానం direct speech శబ్ద ప్రధానం బహుశా dırect speech nd rect speech భేదం ఉన్న భాషలన్నిటికీ ఈ సూత్రీకరణ వర్తించవచ్చు

# కాంక్షార్థక

అని కున్న ఇంకో ప్రయోజనం కొన్ని వాక్యాల్ని కాంక్షార్థక నామాలుగా మార్చటం ఈ నామ్నీకరణానికి వలయు అనే అనుబంధ క్రియఉన్న వాక్యాలే విషయాలు ఆధునిక భాషలో వలయు కు వ్యస్త ప్రయోగం లేదు నుజ్యంత క్రియల తరవాతనే ప్రయోగించబడుతుంది వ్యవహారంలో వలయు కు - అలి కొందరి భాషలో ఆల అనే శబ్దం ఆదేశం అవుతుంది తమిళంలో వలయు అనే అర్థంలో వేంటుం లేక వేణుం అనే శబ్దం స్వతంత్ర క్రియగానూ అను బంధక్రియగానూ ఉపయోగిస్తారు వలయు కు కాలబోధలో వచ్చు ఉండు ధాతువులు కాలవాహకాలుగా వస్తయ్యని పూర్వం చెప్పబడింది ఈ నామ్నీకర ణానికి కాలబోధ లేకుండా వలయు ధాతువు సమాపకక్రియగా అంతంలో వచ్చే వాక్యాలే విషయాలు ఆ వాక్యాలకు అని చేర్చటం వల్ల కాంక్షార్థకనామం ఏర్పడుతుంది ఈ నామం ఉండు కలుగు పుట్టు వంటి ధాతువులకు కర్తృపదంగా వ్యవహరించబడింది ఉదాహరణకు ఈ క్రింది వాక్యాన్ని పరిశీ లించండి

(76) నాకు వ్యవసాయం చెయ్యాలని ఉంది

వాక్యం (76) లో ఉంది అనే క్రియకు అని కి పూర్వమున్న వాక్యం కర్తగా వ్యవహరిస్తుంది ఈ వాక్యం వక్తకున్న కోరికను సూచిస్తున్నది అందుకే దీన్ని కాంక్షార్థకనామ్నీకరణం అనటం వాక్యం (76)లో చెయ్యాలి అనే క్రియా పదానికి కర్తృ పదమైన నేను శబ్దం లోపించింది కాని లోపలి నిర్మాణంలో ఈ శబ్దాన్ని ఊహించాలి ఈ పై వాక్యాన్ని ఈ విధంగా విశ్లేషించి చూపించ వచ్చు

(77) i నాకు | ఒక కోరిక ఉంది

↑

ii నేను వ్యవసాయం చెయ్యాలి/

(77) ని గురించి వివరించే ముందు ఇక్కడ రెండు పారిభాషిక పదాలు ప్రవేశ పెట్టాల్సి ఉంది ఇందులో (77) ను గర్భివాక్యం (matr x sen-

tence) (77) ii ను గర్భవాక్యం (cɩnst tuent-sentence) అని అన వచ్చు గర్భివాక్యం గర్భవాక్యాన్ని తనతో ఇముడ్చుకుంటుంది ఈ సంద ర్భంలో మొదటి వ్యాసంలో ప్రవేశపెట్టిన అవయవి-అవయం అనే పదాలమధ్య సంబంధం గుర్తు తెచ్చుకో తగింది గర్భివాక్యంలో కాంక్షించే వ్యక్తి గర్భ వాక్యంలో కర్త ఒకే మనిషిని సూచిస్తే గర్భివాక్యంలో ఒక కోరిక స్థానంలో గర్భవాక్యానికి అని చేర్చి ప్రయోగించవచ్చు అట్లా చేర్చినప్పుడు గర్భవాక్యంలో కర్త లోపిస్తుంది ఈ ప్రక్రియాగతి (grammatical Process)ని ఈ క్రింది విధంగా నాలుగు దశల్లో వివరించ వచ్చు

(78) i నేను + కు - ఒక కోరిక - ఉంది

↑

నేను వ్యవసాయం చెయ్యాలి

ii నేను + కు-నేను వ్యవసాయం చెయ్యాలి అని-ఉంది

iii నేను—లోపం

iv నేను + కు = నాకు

(78) i లో బాణం గుర్తుతో సూచించిన విధంగా ఆదేశ కార్యం జరుగు తుంది ఈ ఆదేశ కార్యానికి ఏకరూపత (identity) నియమం (78) i లో సూచించిన ఆదేశం జరగగానే గర్భ వాక్యానికి అని చేరుతుంది 78 ii లో గర్భివాక్యంలో నేను శబ్దం గర్భవాక్యంలో తనతో ఏకరూపత ఉన్న నేను ను తొలగిస్తుంది ఈ రకమైన ప్రక్రియాగతి మిగతా నామ్నీకరణాలకి కూడా చూపించవచ్చు

ఈ పై ప్రక్రియాగతిని పరివర్తన వ్యాకరణంలో (transformational grammar) సూత్ర పద్ధతిని సూచించాల్సి ఉంటుంది అవి ఎన్నో రకాల వాక్యాలకు ప్రక్రియాగతిని సూచించగల సమర్థమై ఉండాలి

ఏక రూపత ఒక నియమంగా పైన ప్రతిపాదించబడింది ఈ ఏకరూపత లేనప్పుడు 78) లో సూచించిన ఆదేశ కార్యాలు జరగవు ఉదాహరణకు ఈ కింది వాక్యం పరిశీలించండి

(79) మా తండ్రిగారికి—నేను వ్యవసాయం చెయ్యాలని ఉంది

వాక్యం (79) లో గర్భివాక్యంలో కాంక్షించే మనిషిని సూచించే పదం గర్భవాక్యంలోని కర్తృ పదం ఒకటికాదు అంటే ఏకరూపత లేదు అందువల్ల (78) 11 లో సూచించిన ఆదేశకార్యం జరగడానికి వీల్లేదు

తెలుగు ఇంకో రకమైన కాంక్షార్థ వ్యక్తి ఉంది వాక్యం (76) నే ఆ పద్ధతిలో ఈ విధంగా చెప్పవచ్చు

(80) నాకు – వ్యవసాయం చేద్దామని-ఉంది

వాక్యం (80) అని కి ముందు చేద్దాం అనే క్రియా పదం ఉంది ఆధునికాంధ్రంలో దాం ఉభయ ప్రార్థనని సూచిస్తుంది కాని అని అను ప్రయుక్తమైనప్పుడు అది ఉభయ ప్రార్థనను సూచించదు ఉభయ ప్రార్థన క్రియకు వక్తృ శ్రోతల నిద్దరినీ సూచించే పదం మాత్రమే కర్త కాగలదు కాని వాక్యం (80)లో అట్లాంటిది లేదు దీన్ని వ్యాకరించటానికి కూడా రెండు మార్గాలున్నై దాం ను ఉభయ ప్రార్థన బోధకంగానే అంగీకరించి అని కి ముందు ఉభయ ప్రార్థనత్వం పోతుందని చెప్పటం ఒకటి ఉభయ ప్రార్థన క్రియగ అంగీకరించాలంటే వక్తృశ్రోతలని సూచించే ఉభయార్థక పదాన్ని గర్భవాక్యంలో కర్తగా నిర్దేశించాలి అందకు వాక్యం (80)లో లోపలి నిర్మాణంలో ఆధారం కనపడదు రెండో పద్ధతి వలయు కి దాం ను ఆదేశంగా చెప్పటం అప్పుడు దాం ను ఉభయ ప్రార్థన బోధకంగా కాక ఆదేశంలో వచ్చే శబ్ద మాత్రంగానే గ్రహించాలి ఈ ఆదేశానికి కూడా పైన పేర్కొన్న ఏకరూప విధి వర్తిస్తుంది ఏకరూపత లేనప్పుడు ఈ ఆదేశకార్యం నిరోధిత మవుతుంది ఉదాహరణకు ఈ కింది వాక్యం చూడండి

* (8 ) మా తండ్రిగారికి–నేను వ్యవసాయం చేద్దామని ఉంది

ఈ పై వాక్యం వ్యాకరణ సమ్మతం కాదు గర్భివాక్యంలోని కాంక్షించే వ్యక్తి గర్భవాక్యంలోని కర్త ఒకరైనప్పుడే ఈ దాం ఆదేశం అవుతుంది ఈ ప్రక్రియాగతిని ఈ క్రింది విధంగా చూపించవచ్చు

(82) $X_1$ + కు - కోరిక - ఉంది

↑

$X_2$ - (కర్మపదం) - క్రియ [వ-యు⟶దాం

$X = X_2$

X $X_2$ ఒకటే అయినప్పుడు $X_2$ లోపిస్తుంది

అని చేర్చటం వల్ల ఉత్పన్నమయ్యే ఇతర నామాలకు లాగే ఈ కాంక్షార్థక నామాన్ని కూడా విశేషణంగా మార్చి కోరిక అనే పదం ముందు ప్రయోగించవచ్చు ఉదాహరణకు

(83) నాకు వ్యవసాయం చెయ్యాలనే కోరిక ఉంది

అని ఇంతవరకు విషయ ఇతి కాంక్షార్థాల్లో నామ్నీకారకంగా పరిశీలించబడింది అని చేర్చిన గర్భవాక్యాలు గర్భవాక్యాలకు హేత్వర్థంలో విశేషణాలుగా ప్రవర్తించటం గమనించవచ్చు ఉదాహరణకు ఈ కింది వాక్యాలను గమనించండి

(84) అత్తగారు పెత్తనం చేస్తున్నదని కోడలికి కోపం వచ్చింది

(85) చుట్టాలెప్పుడు వస్తారో అని బస్తీవాళ్ల భయపడతారు

(86) వ్యవసాయం చెయ్యాలని మా ఊరు వెళ్ళాను

ఈ పై వాక్యాల్లో అని కి పూర్వం వాక్యాలు ఎందుకు అనే ప్రశ్నకు సమాధానాలు (84) లో విషయార్థక నామం (85) లో సందేహార్థక నామం (86) కాంక్షార్థకనామం హేత్వర్థంలో వాక్య విశేషణాలుగా ప్రయోగించబడినై క్రియా విశేషణానికి నామానికి లోపలి నిర్మాణంలో ఉన్న పోలిక సందేహార్థక నామ్నీకరణాలను చర్చించినప్పుడు పేర్కొనబడింది క్రియా విశేషణం అనే పదం adverb అనే ఇంగ్లీషు మాటకు సమానార్థకం adverbs ని Predicate adverbs (ఆఖ్యాత విశేషణాలు) Sentential adverbs (వాక్య విశేషణాలు) అని విభజించవచ్చు ఈ adverbs ని లోపలి నిర్మాణంలో నామపదాలుగానే గ్రహించాలని ఇటీవలి భాషా శాస్త్రజ్ఞులు ప్రతిపాదిస్తున్నారు అందుకు తెలుగులో కూడా ఆ సాక్ష్యం కనిస్తున్నదని పై నామాల ప్రవర్తన తెలియ పరుస్తున్నది

(భారతి 968 ఆగస్టు)

# వ్యాపారార్థక

క్రియ వ్యాపార బోధకం వ్యాపారం భౌతికమూ కావచ్చు మానసికమూ కావచ్చు అర్థమవు అర్థంచేసుకొను ఎరుగు తెలియు మొదలైనవి మనో వ్యాపార బోధకాలు అడు పాడు కొట్టు పెట్టు మొదలైనవి భౌతిక వ్యాపార బోధకాలు చూచు విను వంటి ధాతువులు పై విభాగంలో దేనికిందకి వస్తయ్యో చెప్పలేం బహుశా ఇంద్రియ వ్యాపార బోధక ధాతువులని వేరే విభాగం చెయ్య వచ్చేమో ఈ ధాతువుల్లో కొన్ని కర్త్రపేక్షకాలు మరికొన్ని కర్త్రనపేక్షకాలు ఆకలిఅవు జబ్బుచేయు దాహం వేయు మొదలైన క్రియలకు కర్త అవసరం ఉన్నట్టు కనిపించదు ఉదాహరణకు-

(87) నాకు అకలి అవుతున్నది
నీకు దాహం వేస్తున్నదా ?
మా అమ్మాయికి జబ్బు చేసింది

పై వాక్యాల్లో ఫలాని పదం కర్త అని చెప్పలేం అవు వేయు క్రియలకు క్రమంగా ఆకలి దాహం జబ్బు అనే పదాలు కర్తలుగా చెప్పటం ఒక పద్ధతి కాని పై వాక్యాల్లో ఈ క్రియలు వ్యక్తం చేసే అర్థం అవి వ్యస్తంగా ఉపయోగించినప్పటి కంటె భిన్నం పైగా ఆకలి దాహం జబ్బు వంటి నామాలు అమూర్త పదార్థవాచకాలు ముఖ్యంగా దేహస్థితిని తెలియజేసేవి ఇవి వ్యాపార కరణ సమర్థాలు కావు అందువల్ల ఇవి Agent అనే అర్థంలో కర్తలుగా ప్రవర్తించలేవు అందువల్ల పైన పేర్కొన్న ధాతువులు ఆ నామాల్ని క్రియలుగా ప్రవర్తింపజేయటానికి తెచ్చుకున్నవే కొన్ని నామాల్ని క్రియలుగా ఉపయోగించవలసి వచ్చినప్పుడు అగు చేయు పడు వేయు వంటి ధాతువుల్ని అనుసంధించి శబ్ద పల్లవక్రియలను తయారుచేసుకోవటం తెలుగు భాష అనుమతించే పద్ధతి ఇంగ్లీషులో అయితే అవసరం వచ్చినప్పుడు ఏ నామాన్నైనా సునాయాసంగా క్రియగా ఉపయోగిస్తారు అంటే ప్రత్యయాన్ని విధించకుండానే

ఇంగ్లీషులో నామాన్ని ధాతువుగా వాడుకునే పద్ధతి విరివిగా ఉంది తెలుగులో ఇంచుక్ వంటి ప్రత్యయంగాని ఆ పనిని నిర్వహించే ధాతువునుగాని అనుసంధిం చటం అవసరం అవుతున్నది అట్లా ఏర్పడిన అవస్థపడు బాధపడు చిక్కుపడు మొదలైన ధాతువు లుపయోగించినప్పుడా వాక్యాలు కర్త్రపేక్షకాలు మరి కొన్ని శబ్ద పల్లవ క్రియలు-(87) లో ఉదాహరించిన వాక్యాల్లోలాగా- కర్త్ర నపేక్ష కాలు ఈ రకపు క్రియలు కొన్ని (88) లో ఉదాహరించబడుతున్నై

| (88) | ఆకలి అవు | పిచ్చి ఎక్కు |
|---|---|---|
| | కష్టంవేయు | పిచ్చి ఎత్తు |
| | జబ్బుచేయు | మదం ఎక్కు |
| | జలుబుచేయు | తిక్కపుట్టు |
| | జర్వం వచ్చు | తిక్కరేగు |
| | కొవ్వుఎక్కు | |

పైన పేర్కొన్న శబ్ద పల్లవక్రియలు ఉదాహరణ ప్రాయాలు మాత్రమే ఇట్లాంటివి ఆలోచిస్తే ఇంకా పై పట్టికను పెంచవచ్చు పై క్రియలు ప్రాణుల దేహ మనస్థితులను తెలియపర్చేవి ఇవి ఉపయోగించిన వాక్యాల్లో ఈ క్రియలకు కర్త ఉండదు ఈ స్థితి కి ఆశ్రయమైన ప్రాణుల్ని బోధించే నామాలకు తెలుగులో కు విభక్తి చేరుతుంది ఆ నామాన్నే కర్తగా చెప్పి దేహమనస్థితి బోధక క్రియల కాశ్రయమైన కర్తకు కు వర్ణకం బహుళంగా అవుతుంది అని సూత్రం చెప్పుకోవచ్చు. బహుళం అనటం పడు పెట్టు లతో వచ్చే క్రియలను (బాధపడు బాధ పెట్టు మొ ) నిరోధించటం కోసం పై పద్ధతి సూత్రీకరణ ఈ ప్రస్తుత సమస్యను తాత్కాలికంగా పరిష్కరిస్తుంది కాని కర్త అనే పదప్రయో గానికి కొన్ని చిక్కుల్ని తెచ్చిపెడుతుంది కర్త అనేపదం మన వ్యాకరణాల్లో ముఖ్యంగా agent అనే అర్థంలో వాడారు కర్త అనే పదాన్ని ఉపయోగిం చటంలో మన వ్యాకర్తలు అన్ని చోట్లా సరి అయిన మార్గాన్ని అవలంబించారని చెప్పటానికి వీల్లేదు ఈ విషయం ముందు ముందు తెలుస్తుంది

ధాతువుల్లో అకర్మకక్రియలు సకర్మకక్రియలు అని రెండు రకాలున్నై ఇంచుగాది ప్రత్యయాలు (ప్రత్యయ తుల్యమైన ధాతువులు కూడా) చేర్చటంవల్ల

వ్యాపారార్థక

కొన్ని అకర్మకక్రియలు సకర్మక క్రియలుగాను సకర్మకక్రియలు ప్రేరణార్థకాలుగానూ మారతై ఈ పద్ధతులు ప్రాచీన వ్యాకరణాల్లో ప్రసిద్ధమే కాని ఈ పై విభాగం వాక్యంలో వ్యక్త నిర్మాణాన్ని * (surface structure) సూచించినట్టు గుప్త నిర్మాణాన్ని (deep structure) సూచించదు

ఉదాహరణకు ఈ కింది వాక్యాల్ని పరిశీలించండి

(89) అద్దం పగిలింది

(90) కిష్టప్ప అద్దం పగలగొట్టాడు

(89) లో *పగులు* అకర్మకం (90) లో *పగలగొట్టు* సకర్మకం (89) లో *పగలగొట్టు* సకర్మకం (89) లో *అద్దం కర్త* (90) లో *అద్దం* కర్మ *కిష్టప్ప* కర్త కాని ఈ రకమైన సాంప్రదాయిక విభాగం ఈ వాక్యాల గుప్త నిర్మాణాలకున్న సామ్యాన్ని సరిగ్గా సూచించదు నిజానికి రెండు వాక్యాలూ ఏక వ్యాపార బోధకాలే ఈ రెండు వ్యాపారాలూ జరిగింది అద్దంమీదే అంటే ఈ రెండు వాక్యాల్లోనూ అద్దం

---

* పూర్వవ్యాసాల్లో Deep Structure కి లోపలి నిర్మాణం అనీ Surface Structure కి వెలుపలి నిర్మాణం అనీ వాడాను ఈ వ్యాసంలో పై పదాలకు బదులుగా గుప్త నిర్మాణం అనీ వ్యక్త నిర్మాణం అనీ వాడుతున్నాను

Christopher Caudwell తన Illusion and Reality అనే కవిత్వతత్వ గ్రంథంలో (Published by People s Publishing House Delhi 1956 Page 213) latent content manifest content అనే రెండు మాటల్ని దాదాపు Deep and Surface అనే అర్థాల్లోనే కవిత్వపరంగా వాడాడు ఈ మాటల్ని కె వి రమణారెడ్డిగారు గుప్తవస్తువు వ్యక్తవస్తువు అని Caudwell మీద వ్యాసం రాస్తూ తెనిగించారు (చూ సంవేదన త్రైమాసిక కడప అక్టోబరు 1968) రమణారెడ్డిగారి తెలుగు మాటల్ని భాషా శాస్త్ర పారిభాషక పదాలుగా ఈ వ్యాసంలో ఎంచుకుంటున్నాను పూర్వం వాడిన లోపలి నిర్మాణం వెలుపలి నిర్మాణం అనే మాటలు వివరణకోసం పనికొస్తై

అనే నామ ప్రవర్తన గుప్త నిర్మాణంలో ఒకటే ఈ సామ్యాన్ని సాంప్రదాయికమైన కర్త కర్మ విభాగం సూచించదు (89) గుప్త నిర్మాణంలో అద్దం కర్త (Agent) కాదు ప్రాణి వాచకాలు మాత్రమే వ్యాపారకరణ సమర్థాలు కనక అవే కర్తలుగా ప్రవర్తించగలవు పై రెండు వాక్యాలకి భేదం ఇది (89) లో కర్త లేదు (90) లో కర్త ఉంది అయితే (89) లో అద్దం ఏమిటి ? అనే ప్రశ్న ఉంది ఈ కింది చిత్రణను పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది

| (91) 1 | 2 | 3 |
|---|---|---|
| operator | operand | operation |
| (agent) | (affected) | (action) |
| — | అద్దం | పగిలింది (89) |
| కిష్టప్ప | అద్దం | పగలగొట్టాడు (90) |

తెలుగులో 1 3 వరసలకు కర్త వ్యాపారం అనే పేర్లుపయోగించుకో వచ్చుగాని 2 వ వరసకి సరి అయిన మాట ప్రసిద్ధంగా లేదు అట్లాంటి మాట (89) (90)ల మధ్య ఉన్న సామ్యాన్ని సూచించటానికి అవసరం అది (91) లో చిత్రణను చూస్తే తెలుస్తుంది ఈ పద్ధతిలో కర్త అనే పదానికి అర్థం సంకోచించి పటిష్ఠం అయింది

తెలుగులో సకర్మక క్రియలకు ప్రత్యయాదుల్ని చేరిస్తే ప్రేరణార్థక రూపాలువస్తై ఉదాహరణకి (90) ని ప్రేరణార్థక వాక్యంగా మలిస్తే ఇట్లా ఉంటుంది

(92) లచ్చప్ప కిష్టప్పచేత అద్దం పగల గొట్టించాడు

సాంప్రదాయిక వ్యాకరణ పద్ధతిలో (90) లో కర్తఅయిన కిష్టప్ప (92) లో కర్మ అయింది (92) లో లచ్చప్పను కర్త అనాలి దీనికి ప్రయోక్త అనే మాట ప్రసిద్ధంగా ఉంది కాని (92)లో అద్దం ఏమవుతుందో సాంప్రదాయిక వ్యాకరణ పద్ధతిలో తెలీదు (91) లో చిత్రణను కొద్దిగా మార్చి చూస్తే ఇక్కడున్న చిక్కు ఏమిటో తెలుస్తుంది

| | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| (93) | initiator (causer) | operator (agent) | operand (affected) | operation (action) |
| | ప్రయోక్త | కర్త | ? | వ్యాపారం |
| | | — | అద్దం | పగులు (89) |
| | — | కిష్టప్ప | అద్దం | పగులు (+కొట్టు (90) |
| | లచ్చప్ప | కిష్టప్ప (+చేత) | అద్దం | పగులు(+కొట్టు+ఇంచు)(92) |

ఈ సందర్భంలో సూరిగారి గతిబుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మకంబులక ప్రేరణంనం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు- (బాలవ్యాక్రియ 128) అనే సూత్రం (90) - 92) ల మధ్య వ్యక్తనిర్మాణంలో జరిగిన మార్పునే సూచిస్తుందిగాని (89) (90) (92) వాక్యాల గుప్త నిర్మాణాల్లో సామ్యాన్ని సూచించదు

అంటే ఈ పద్ధతిలో కిష్టప్ప (90) (92) రెండు వాక్యాల్లోనూ కర్తే అన్నమాట (93) సంఖ్యగల పట్టికలో బ్రాకెట్లతో ఉంచిన రూపాలు వ్యక్త నిర్మాణంలో వస్తై ఈ రకమైన పరిశీలనవల్ల కర్తకు చేత వర్ణకంబగు అనే సూరిగారి సూత్రానికి ఆయన ఉద్దేశించిన దానికంటె ఎక్కువ వ్యాప్తి ఉన్నట్టు గ్రహించవచ్చు అంటే కర్మార్థంలోనేకాక ప్రేరణార్థంలో కూడా ఈ వ్యాసంలో ఉపయోగించిన అర్థంలో కర్తఅయిన చేత వర్ణకం అవుతుందన్నమాట

పై చర్చవల్ల తేలిన ముఖ్యాంశాలివి 1 సాంప్రదాయికమైన అర్థాల్లో కర్త కర్మ విభాగం వాక్యాల గుప్తనిర్మాణాల్లో సామ్యాన్ని సరిగ్గా సూచించదు 2 గుప్త నిర్మాణాల్లో మారని ప్రవర్తన గల పదాల వ్యాకరణ ప్రవర్తన సూచించటానికి వేరే పదాల్ని ఎంచుకోవాలి 3 సకర్మక అకర్మక క్రియా విభాగం భాషలో వ్యక్త నిర్మాణాన్ని సూచించటానికి మాత్రమే పరిమితం

బహుశా క్రియ అనే మాటనికూడ వ్యక్తనిర్మాణపుపదంగానే గ్రహించి వ్యాపారం అనే మాటని గుప్తనిర్మాణపుపదంగా ఉంచవచ్చునని తోస్తున్నది సౌలభ్యంకోసం గుప్త వ్యక్త నిర్మాణాల్లో ఉపయోగించదగిన పరిభాషా పదాలని కింద సూచిస్తున్నాను

| deep structure | | surface structure | |
|---|---|---|---|
| ఇంగ్లీషు | తెలుగు | ఇంగ్లీషు | తెలుగు |
| initiator | ప్రయోక్త | sub ect | ? |
| operator | కర్త | ob ect | కర్మ |
| operand | ? | verb | క్రియ |
| operation | వ్యాపారం | | |

పైన ప్రశ్నార్థకాలుంచిన చోట సరిఅయిన తెలుగు మాటలు దొరకలేదు ఈ విషయాల్ని గురించి ఆలోచించ దల్చుకున్నవారికోసం పైపట్టిక కూర్చ బడింది

ఈ పైచర్చ వివరణ కొంత దీర్ఘమైనా వ్యాపారానికి అందులో భాగ్యస్వా ములకీ (Patricipants) ఉన్న తార్కికసంబంధాన్ని సూచించటానికి చెయ్య బడింది ఇదైనా ఏమాత్రం సమగ్రమనటానికి వీల్లేదు సూచనప్రాయంగానే గ్రహించాలి పైన సూచించిన పద్ధతుల్లో ఇతోధికమైన పరిశోధన జరిగితేనే తప్ప ఒకపాటి సమగ్రమైన వివరణ అయినా సాధ్యంకాదు ప్రస్తుతవ్యాసంలో ఈ వ్యాసకర్త చెప్పదల్చుకున్నది గ్రహించటానికి కొంతైనా పనికొస్తుంది ఇక వ్యాపారార్థకనామ్నీకరణాన్ని గురించి

ఆధునికభాషలో అటం భావార్థక ప్రత్యయమనీ అది క్రియాపదానికి చేరటంవల్ల కాల పురుష బోధక ప్రత్యయాలకు లోపం జరిగి ధాతువు మాత్రమే మిగిలి ఈ రెంటి సంయోగంవల్ల భావార్థక రూపం నిష్పన్నమవుతుందనీ నామ్నీకరణాల మొదటి వ్యాసంలో సూచించబడింది భావార్థకరూపనిష్పత్తికి ఆ సూచన అంగీకరించక పోయినా కాలబోధక ప్రత్యయగ్రహణ సమర్థమైన ధాతువులకు మాత్రమే అటం చేరుతుండటం నిర్వివాదం ఆ భావార్థక రూపంతో కూడిన వాక్యాలు విషయార్థకనామాలుగా ప్రవర్తించే పద్ధతి

ఆ వ్యాసంలో చర్చించబడింది ఆ రకపు వాక్యాలు వ్యాపారార్థక నామాలుగా కూడా ప్రవర్తించే విధానం ఈ వ్యాసానికి విషయం అంటే ఆటం వ్యాపారార్థక నామ్నీకారకంగా కూడా ఉపయుక్తమవుతుందన్నమాట

క్రియ వ్యాపారబోధకమని ఈ వ్యాసం మొదటే చెప్పబడింది క్రియలేకాక కొన్ని నామాలుకూడా వ్యాపార బోధకాలు ఉదాహరణకి పెట్టె-పెండ్లి అనే రెండు నామాల్ని పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది పెట్టె ద్రవ్యబోధకం ఆ ద్రవ్యం మన ఇంద్రియాలచేత ద్రష్టవ్యం పెండ్లి ద్రవ్యంకాదు కార్యం అంటే వ్యాపారం పెట్టె ఉంటుంది (exists) పెండ్లి జరుగుతుంది (happens) ఎన్నికలు (పంట) కోతలు నాటకం (పుస్తకంకాదు) (వరి) నాట్లు పని పరిశోధన పదర్శన యుద్ధం సమావేశం వంట పెండ్లివంటి నామాలు వ్యాపారాన్ని బోధిస్తై ఈ నామాలుకొన్నిరకాల క్రియలతోనే ప్రయుక్తమవుతై ఈ వ్యాపారార్థక నామాలస్థానంలో కొన్ని వాక్యాలు కూడా ప్రయోగించవచ్చు

ఒక వ్యాపారానికి కాలంలో ప్రారంభం ముగింపు ఉంటై ఈ పై రకపు నామాలు ఆ అర్థంలో నామ్నీకృత వాక్యాలు ఏతదర్థబోధకక్రియలతో ప్రయుక్తమవుతై ఉదాహరణకు ఈ వాక్యాలు పరిశీలించండి

(94) తెలుగులో కావ్యాలు రాయటం పదకొండో శతాబ్దంలో మొదలయింది

(95) మా పొటిచేలో జొన్న ఎదబెట్టటం మొన్ననే పూర్తి అయింది

(94) (95) వాక్యాల్లో వ్యాపారార్థకనామాలు (నామ్నీకృతవాక్యాలు) మొదలగు పూర్తి అగు అనే క్రియలకు క్రమంగా కర్తృ పదస్థానంలో వచ్చినై ఈ పై క్రియలు అకర్మకాలు ఇవే నామాలు సకర్మకక్రియాయోగంలో కర్మపదాలుగా వ్యవహరిస్తై కర్తృస్థానంలో వచ్చినా కర్మస్థానంలో వచ్చినా ఈ నామాలు బోధించే వ్యాపారంలో భేదం ఉండదు ఉదాహరణకు (96) (97) వాక్యాలను పై వాక్యాలతో పోల్చిచూడండి

(96) తెలుగులో కావ్యాలు రాయటం పదకొండో శతాబ్దంలో నన్నయ్య మొదలుపెట్టాడు

(97) మా పాటిచేలో జొన్న ఎదబెట్టటం మొన్ననే పూర్తి చేశాం

మొదలుపెట్టు పూర్తిచేయు అనే క్రియలు సకర్మకాలు కాబట్టి ప్రాణివాచక కర్తృపదాలు అవసరమయినై నామ్నీకృత వాక్యాలు కర్మపదాలుగా మారినై (94) (95) వాక్యాలకూ (96) (97) వాక్యాలకూ మధ్యనున్న సంబంధం (89) కి (90) కి మధ్యనున్న సంబంధంలాంటిది (9 ) లో చూపించిన పద్ధతిలో (94) (95) వాక్యాలనీ (95) (97) వాక్యాలనీ విభజించి చూసుకుంటే ఈ సంబంధం విశదమవుతుంది (విస్తరభీతివల్ల ఆ పని ఇక్కడ చెయ్యటం లేదు ) అంటే-(91) లో చూపించిన పద్ధతిలో (94) నుంచి (97) వరకూ ఉన్న వాక్యాల్లో నామ్నీకృతవాక్యాలు ( అటం అంతరూపాలు) గుప్తనిర్మాణం (deep structure) లో operands గానే ఉంటయ్యన్నమాట సకర్మకా కర్మక క్రియాభేదంవల్ల వ్యక్త నిర్మాణం (surface structure) లో కర్తృ కర్మాది భేదా లుత్పన్నమవుతై ఈ పైన పేర్కొన్న వ్యాపారార్థక నామాలతో వచ్చే క్రియలు ఈ కింది పట్టికలో చూపించబడుతున్నై ఈ పట్టిక సమగ్రమని ఇక్కడ ఉద్దేశించబడలేదని వేరే చెప్పనక్కర్లేదు ఈ క్రియలన్నీ వ్యాపారారంభాన్నో అంతాన్నో సూచించటం ఇక్కడ విశేషం

(98)

| అకర్మక | సకర్మక |
|---|---|
| ప్రారంభమగు | ప్రారంభించు |
| మొదలగు | మొదలుపెట్టు |
| పూర్తిఅవు | పూర్తిచేయు |
| ముగియు | ముగించు |
| ఆగిపోవు | ఆపివేయు |
| | మానివేయు |

వ్యాపారబోధకనామాల్లో ఎన్నో అంతర్విభాగాలుండవచ్చు ముఖ్యమైన రెండు రకాల్ని మాత్రం ఇక్కడ పరిశీలించటం అవసరం వ్యాపారం కొంత కాలంపాటు ( <durat on> ) జరగటానికి వీలున్నవి కొన్ని వ్యాపార ప్రారంభం ముగింపు ఏకకాలంలో జరిగినట్లు ( <ev nt> ) బోధించేవి మరికొన్ని ఉదాహరణకు సంఘటన అనే నామం అట్లాంటిది సంఘటన మొదలయింది అనిగానీ సంఘటన పూర్తి అయింది అనిగానీ అనలేం అట్లాగే ప్రమాదం కూడా ఇట్లాంటి నామాల్ని సంఘటనాత్మక నామాలు అనవచ్చు వీటి స్థానంలో వచ్చే వాక్యాలు కూడా జరుగు అనే క్రియతోగాని తదర్థకమైన మరో క్రియతోగాని వస్తై సంఘటనాత్మకంకాని నామాలతో కూడా జరుగు అనే క్రియ ప్రయుక్తం కావచ్చు అప్పుడు ఆ నామాలు బోధించే వ్యాపారానికి పట్టే కాలపరిమితికన్నా కాలావకాశసమ్మిశ్రంలో ఆ వ్యాపారానికున్న అస్తిత్వ (occurrence) ప్రాధాన్యమే వివక్షితమన్నమాట ఇంకో రకంగా చెప్తే durat on అనే అంశం కలిగిన నామాలన్నిట్నీ సంఘటనాత్మకాలుగా కూడా భావించే వీలున్నదన్నమాట ఈ కింది వాక్యాలను పరిశీలిస్తే పై విషయాలు విశదమవుతై

(99) పట్టాలు తప్పి రైలు పడిపోవటం జరిగింది

(100) ఆంధ్ర ప్రభుత్వంవారు తెలుగు అకాదమీని స్థాపించటం జరిగింది

ఈ పై వాక్యాల్లో సమాపకక్రియ అయిన జరుగును తొలగించి నామ్నీకృతక్రియను వినామ్నీకరిస్తే-అంటే మళ్ళీ క్రియగా మారిస్తే అర్థబోధకు ఏ ఇబ్బందీ రాదు పైగా ఆ వాక్యాలే సహజంగా ఉంటై అయినప్పటికీ (99) (100) సంఖ్యగల వాక్యాలవంటివి భాషలో ప్రయోగించటం జరుగుతూనేఉంది ఒక రకమైన శైలీవైవిధ్యంకోసం కావచ్చు ప్రయోజనం ఏదైనా తెలుగుభాష అనుమతించే వాక్యభేదాల్లో ఇది కూడా ఒకటని ఒప్పుకోక తప్పదు ఈ రకపు వాక్యాల ప్రాచుర్యం మన రాజకీయనాయకుల ఉపన్యాసాల్లో ఎక్కువగా కనిపిస్తుంది పెద్ద వాక్యాలు ప్రయోగించటం ఉపన్యాసకుల కిష్టం కాబట్టి కొన్ని అట మంత నామాలతో వాక్యాన్ని కొంతదూరం సాగదీసి ఆ తరవాత వీలుపడక జరుగు అనే క్రియతో ఆ వాక్యాన్ని ముగిస్తారనుకుంటాను

అంటే వాక్యాన్ని కొనసాగించే ఉద్దేశంతో అటం అంతరూపాన్ని ముందెన్నుకొంటే దాన్ని ముగించటానికి జరుగు అనే క్రియ నుపయోగించటం ఒక తేలికైనమార్గం అసెంబ్లీలో వాగ్వాటి కలిగిన ఒక ప్రతిపక్ష సభ్యుడు అనటానికి వీలున్న ఈ వాక్యాన్ని గమనించండి

(101) దేశంలో ఆహారసమస్యను సక్రమంగా పరిష్కరించలేకపోతే నాలుగుకోట్ల తెలుగు ప్రజలకు సంజాయిషీ చెప్పుకోవాల్సినరోజు వస్తుందని ఏనాడో మా పార్టీ హెచ్చరించటం జరిగింది

(101) సంఖ్యగల వాక్యం (99) (100) సంఖ్యగల వాక్యాలంత కృతకంగా కనిపించకపోవటానిక్కారణం రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లోనూ రేడియోవార్తాప్రసారాల్లోనూ దినవార పత్రికల రాతల్లోనూ ఈ రకపు వాక్యాలకి మనం విరివిగా అలవాటుపడి ఉండటమే

వ్యాపారార్థక నామం స్థానంలో ఉపయోగించిన వాక్యం —పూర్వవ్యాసంలో (భారతి అగస్టు 1968) ప్రవేశపెట్టిన పరిభాష ప్రకారం-గర్భవాక్యం అవుతుంది గర్భవాక్యం గర్భివాక్యంలోని వ్యాపారార్థకనామం స్థానంలో నామ్నీకృతమై చేరుతుంది గర్భివాక్యంలో క్రియ సకర్మకమైతే గర్భవాక్యం ఆ క్రియకు కర్మగా వ్యవహరిస్తుంది ఇట్లా వ్యవహరించటానికి గర్భి గర్భవాక్యాల్లో కర్తృపదాలు భాషలో ఏకరూపత (identity in form) భావంలో సమబోధకత (co-referentiality) కలిగి ఉండాలి

ఉదాహరణకు ఈ క్రింది వ్యాకాలు వ్యాకరణ విరుద్ధాలు

*(102) సుమిత్ర వంటచెయ్యటం సుజాత పూర్తిచేసింది

*(103) మా అమ్మాయి వంటచెయ్యటం సుమిత్ర పూర్తిచేసింది

వాక్యం(102) లో సుమిత్ర– సుజాత అనే పదాలకు ఏకరూపత సమబోధకత-రెండూలేవు వాక్యం (103) లో మా అమ్మాయి పేరు సుమిత్ర అని అనుకునే టట్టయితే సమబోధకత ఉండటానికి వీలున్నది అయినా మా అమ్మాయి- సుమిత్ర అనే పదాలకు ఏకరూపత లేకపోవటాన వాక్యం (103) వ్యాకరణ విరుద్ధం పై రెండు వాక్యాల్ని వ్యాకరణసమ్మతమైన ఈ కింది వాక్యంతో పోల్చి చూడండి

వ్యాపారార్థక

(104) సుమిత్ర వంటచెయ్యటం పూర్తిచేసింది

వాక్యం (104) లో వంటచేయు పూర్తిచేయు అనే రెండు క్రియలకూ ఒకేవ్యక్తిని కర్తగా మనం అర్థం చేసుకుంటున్నాం సారూప్య సమబోధకత ఉన్న నామాల్లో ఒకటి వ్యక్త నిర్మాణంలో లోపించటంవల్ల వాక్యం (104) ఏర్పడింది ఈ వాక్యానికి గుప్తనిర్మాణాన్ని సూచిస్తే ఈ విషయం విశదమవుతుంది గుప్తనిర్మాణాన్ని ఈ క్రింది విధంగా పదబంధ నిర్మాణసూచిక 'Phrase marker) లో సూచించవచ్చు

(105) వాక్యం

క్రియాబంధం
Verb Phrase

నామబంధం
Noun Phrase

నామబంధం
Noun Phrase

గర్భ
వాక్యం

నామబంధం

నామం నామం నామం క్రియ క్రియ
(వ్యాపారం)

సుమిత్ర -సుమిత్ర వంటచేయు- పూర్తిచేయు

(105) సంఖ్యగల చెట్టు బొమ్మలో (104) సంఖ్యగల వాక్యానికి వ్యాకరణనిర్మాణం సూచితమైంది వాక్యనిర్మాణంలో పదాల పరస్పర సంబంధాన్ని

కళ్లకు కట్టేటట్టుగా చూపి చటమే వ్యాకరణంలో ఈ చెట్లబొమ్మ ప్రయోజనం ఈపై చెట్టు బొమ్మకు ఈ కింది విధంగా అర్థ వివరణ చెయ్యొచ్చు

వాక్యం (చెట్టుబోదె) మొదట రెండు కొమ్మలుగా చీలింది ఎడంపక్క నామబంధం కుడిపక్క కొమ్మ క్రియాబంధం ఈ రకపు కొమ్మల్లో ఎడంపక్క కొమ్మ చెప్పకపోయినా కర్తృపదంగా అర్థం చేసుకోవటం సంప్రదాయం ఈ వాక్యంలో నామబంధపు కొమ్మకు మళ్లీ చీలికలు లేకపోవటంవల్ల అదే నామం కుడిపక్క క్రియాబంధపుకొమ్మ మళ్లీ రెండుగా చీలింది క్రియాబంధపు కొమ్మలో మళ్లీ నామబంధపుకొమ్మ ఉండటం గమనించవచ్చు క్రియాబంధపు కొమ్మలో నుంచి చీలివచ్చే నామబంధం కర్మగా అర్థం చేసుకోటం ఇక్కడ ఇంకో సంప్రదాయం గర్భవాక్యంకూడా నామబంధంలోనుంచే వచ్చింది గాబట్టి అది గర్భి వాక్యంలో నామబంధంగానే ప్రవర్తిస్తుందని గ్రహించవచ్చు గర్భవాక్యపు కొమ్మ తనకు పక్కనేఉన్న సజాతీయమైన కొమ్మని తొలగించి ఆ స్థానాన్ని ఆక్రమించుకుంటుంది ఇట్లా జరగటానికి గర్భవాక్యంలో మొదటి చీలికలో ఎడంకొమ్మ గర్భి వాక్యంలో మొదటి చీలికలో ఎడం కొమ్మ ఒకేరకపువై ఉండాలి అంటే పూర్వం చెప్పుకున్నట్టు గర్భి గర్భ వాక్యాల్లో కర్తృపదాలు ఒకేరూపం కలిగిఉండి ఒకే ప్రాణిని సూచించాలి (ఈ లక్షణాల్నే సారూప్య సమబోధకతలు అని వ్యవహరించాను )

వ్యక్తనిర్మాణంలో గర్భవాక్యంలోని కర్తకు లోపం క్రియకు అటం చేరటమూ జరుగుతై ఈ మార్పుల్ని పూర్వవ్యాసంలో (చూ భారతి ఆగస్టు 1968) పేర్కొన్న పరివర్తన సూత్రాలు (transformational rules) ద్వారా సూచించాలి గుప్త వ్యక్త నిర్మాణాలమధ్య సంబంధాన్ని నిర్దేశించటమే పరివర్తన సూత్రాలపని గుప్త నిర్మాణాన్ని వ్యక్తనిర్మాణంగా పరివర్తింపజేస్తై గనక వీటికి పరివర్తన (క?) సూత్రాలని పేరు ఈ రకపు సూత్రపద్ధతిలో కూర్చిన-వ్యాకరణ గ్రంథాన్ని పరివర్తన వ్యాకరణం (transformational grammar) అంటారు

(105) సంఖ్యగల బొమ్మలో సూచించిన గుప్తనిర్మాణపుచెట్టుని పరివర్తనసూత్రం వ్యక్తనిర్మాణపు చెట్టుగా మారుస్తు ది అప్పుడు వ్యక్త నిర్మాణపు చెట్టు ఈ క్రింది విధంగా ఉంటుంది

వ్యాపారార్థక

వా క్య ం

క్రియాబంధం

నామబంధం నామబంధం క్రియ

సుమిత్ర వంటచెయటం పూర్తిచేసింది

పై చెట్లబొమ్మల్లో వ్యాకరించిన (వాక్యం 104) వాక్యంలో సమాపక క్రియఅయిన పూర్తిచేయు కు బదులుగా పూర్తిఅవు అనే క్రియను వాడినట్లయితే గర్భవాక్యంలో కర్తృపదానికి లోపం జరగదు పైన పేర్కొన్న సారూప్య సమబోధకతలు ఉండాలి అన్న లక్షణమే ఇట్లాంటి లోపాన్ని నిరోధిస్తుంది ఉదాహరణకు —

(107) సుమిత్ర వంట చెయ్యటం పూర్తి అయింది—

అనే వాక్యంలో సుమిత్ర గర్భవాక్యంలో భాగంగానే గ్రహించాలి వాక్యం ( 04)లో సుమిత్ర గర్భివాక్యంలోదిగా (106)సంఖ్యగల బొమ్మలో సూచించాం వాక్యం ( 07)లో జరిగిన వ్యాకరణకార్యాన్ని ఈ కింది పద్ధతిలో సూచించవచ్చు

(109) X — పూర్తి అయింది — గర్భి వాక్యం

↑

సుమిత్ర వంట చేసింది — గర్భ వాక్యం

X = వ్యాపార బోధక అమూర్తనామం

గర్భవాక్యం తన సమాపకక్రియారూపాన్ని అటమంతరూపంగా మార్చుకుని గర్భివాక్యంలోని వ్యాపారబోధక అమూర్తనామం స్థానాన్ని ఆక్రమించటం (108) లో సూచించబడింది గర్భవాక్యంలోని సుమిత్ర కు లోపం జరక్కపోవటం మనం గమనించవచ్చు

పై చర్చలవల్ల వ్యాపారార్థక నామాలు కేవల వ్యాపార ఆది మధ్య అంతాలను సూచించే క్రియలతోమాత్రమే రాగలవని అనిపించే ప్రమాదం ఉంది

ఇది సరిగాదని వ్యాపారనామాలు తదితర క్రియలతోగూడా రాగలవని ఈ క్రింది వాక్యాలను పరిశీలిస్తే తెలుస్తుంది

(109) నాకు కారు నడపటం వచ్చు

(110) మా ఆవిడ మిషను కుట్టటం నేర్చుకుంటున్నది

వచ్చు, నేర్చుకొను వంటి క్రియలు విద్యా (skill) సంబంధమైన నామాలతోవస్తే ఆ నామాలు వ్యాపారార్థకాలు కావచ్చు కాకపోవచ్చు నేర్చుకోదగిన దేదైనా విద్యేఅని ఇక్కడ అర్థం ఉదాహరణకు పై వాక్యాల్లో వ్యాపారార్థక నామాలకు బదులుగా భాషానామాలైన ఫ్రెంచి ఇంగ్లీషువంటివిగాని లేక నేర్చుకోదగిన పాట పద్యం మొదలైన నామాలనుగాని ప్రయోగించటాన్ని వ్యాకరణం సమ్మతిస్తుంది

పై వాక్యాల్లో గర్భివాక్య నిర్మాణం స్పష్టంగానే ఉంది కాని గర్భవాక్యాల నిర్మాణం మాత్రం స్పష్టంగా లేదు (109) (1 0) సంఖ్యలుగల వాక్యాల్లో-కారు నడపటం మిషను కుట్టటం- అనేవి గర్భివాక్యోత్పన్నాలు ఈ గర్భ వాక్యాల నిర్మాణంలో ఈ పైన చెప్పిన వ్యాపారాలకు కర్తను ఊహించాలా అక్కర్లేదా అనేది సరిగ్గా ఇక్కడి సమస్య ఈ వ్యాసారంభంలో పేర్కొన్న దేహ మనస్థితులను తెలియపర్చే నామాలతో ఏర్పడ్డ క్రియాబంధాలైతే ఇవి కర్తృనిరపేక్షకాలు అని తేల్చివెయ్యవచ్చు కాని-కారు నడుపు మిషను కుట్టు-అనేవి కర్త్రపేక్షక వ్యాపార బోధక క్రియలు గర్భి వాక్యాల్లోని ప్రాణుల్నే గర్భవాక్యాల్లో కూడా కర్తలుగా నిర్దేశిద్దామా అంటే అందులోనూ చిక్కులున్నై ఆ ప్రాణులే గర్భవాక్యాల్లో కూడా కర్తలైతే ఇక వాళ్ల నేర్చుకోవలసిందేమిటి? ఇంక మిగిలిన పద్ధతి గర్భవాక్యాల లోపలి (గుప్త) నిర్మాణంలో అవ్యక్త కర్తను (unspec fied agent) స్థాపించటం కేవలం ఈ వాక్యాల నిర్మాణాన్ని వివరించటం కోసమే ఈ రకంగా అవ్యక్త కర్తను స్థాపించటం అంత పొదుపైన పద్ధతికాదు ఇంకా మిగతా రకాల వాక్యాల్లో కూడా ఇట్లాంటి నిర్మాణమే కనిపిస్తే కొన్ని రకాల వాక్యాల్లో (వ్యాకరణ గ్రంథంలో ఆ రకాలేవో నిర్దిష్టంగా చెప్పాలి గర్భవాక్యాల గుప్తనిర్మాణంలోని అవ్యక్తకర్త గర్భివాక్యంలో గర్భవాక్యం చేరినప్పుడు లోపిస్తుంది అని సూత్రించుకోవచ్చు ప్రస్తు

తానికి తగిన సాక్ష్యం చూపించలేకపోయినా ఈ అవ్యక్తకర్త చాలా రకాల వాక్యాల నిర్మాణాన్ని అర్థం చేసుకోటానికి అవసరం అని ఈ వ్యాసకర్త నమ్మకం ముందు ముందు పరిశోధనలో అట్లాంటివి కనిపించవచ్చునని ఆశ అల్పాక్షర మసంధిగ్ధం సారవ ద్విశ్వతోముఖం అని ప్రాచీన సూత్ర విదులు సూత్రనిర్మాణాన్ని గురించి చెప్పిన లక్షణం ఆధునికులకూ అనుసరణీయమే ఈ విషయాన్ని ఇంత దీర్ఘంగా చర్చించడానికి ప్రధాన కారణం ఆధునిక వ్యాకరణ నిర్మాణంలో నిరంతరం ఎదుర్కొనే సమస్యల స్వరూప స్వభావాలను సూచించటానికే అంతేకాదు ఒక్కొక్క చిన్న సమస్యను పరిష్కరించటానికి భాషలో ఎన్నో విషయాలను దృష్టిలో ఉంచుకోవాలని కూడా వ్యాకర్తలు నేర్చుకోవాల్సిన ఇంకో పాఠం

వ్యాపారార్థక నామాలతో వచ్చే మరి రెండు క్రియలు విను చూచు గర్భివాక్యాల్లో సమాపకక్రియ విను అయినప్పుడు దానికి < శ్రవ్యత (audibility > అనే అంశం (feature) కలిగిన నామాలు కర్మపదాలుగా రాగలవు అట్లాంటి నామాలకు ఆదేశంగా వచ్చే గర్భవాక్యాలు కూడా<శ్రవ్యత> అనే లక్షణాన్ని కలిగిఉండాలి అట్లాంటి లక్షణం గర్భవాక్యంలోని క్రియవల్ల వస్తుంది ఇట్లాంటి వాక్యాలు సాధారణంగా భిన్నార్థబోధకాలు అవుతై ఉదాహరణకు ఈ క్రింది వాక్యాన్ని పరిశీలించండి

( 11) రవీంద్రభారతిలో సుమిత్ర పాడటం విన్నాను

ఈ పై వాక్యంలో ఉన్న భిన్నార్థాలు ఈ కింది వివరణవాక్యాల్లో (paraphrases) గమనించవచ్చు

(1 2) రవీంద్రభారతిలో సుమిత్ర పాడిందని విన్నాను

(118) రవీంద్ర భారతిలో సుమిత్ర పాట విన్నాను

( 2) లో సుమిత్ర పాడిందన్న విషయం మాత్రమే విన్నది ( 18) లో విన్నది సుమిత్ర పాట ఈ రెండర్థాలూ (111) లో ఉన్నై ఒకే వాక్యం భిన్నార్థకం ఎందుకవుతుందో వ్యాకర్త వివరించాలి వ్యాకర్త కర్తవ్యాల్లో ఇది ఒకటి కన్నడంలో కూడా ఈ రకపు వాక్యాలు సరిగ్గా అట్లాంటి అర్థాల్నే ఇస్తే

య్యని ఎ కె రామానుజన్‌గారు పేర్కొన్నారు (చూ A K Ramanu an A Generat ve Grammar of Kannada Unpubl shed Ph D Disse tat on Indiana 1963 Page 66 ) కన్నడంలో కేళు తెలుగులో 'విను కు సమానార్థకం రామానుజన్ కేళుకు hear hear of అని రెండర్థాలు సూచించారు తెలుగు విను కు కూడా ఈ రెండర్థాలు సూచించవచ్చు ఈ పద్ధతి ప్ర కా ర ం పైరెండర్థాలను విను అనే క్రియకు సూచించటం ద్వారా పై రకపు వాక్యాల్లో భిన్నార్థ బోధకతను వ్యాక రణం వివరిస్తుంది కాని ఈ ప్రస్తుత వ్యాసకర్త పద్ధతి ఇందుకు భిన్నం గుప్త నిర్మాణాల్లో భేదాన్ని సూచించటంద్వారా ( ) వంటి వాక్యాల భిన్నార్థబోధక సామర్థ్యాన్ని వివరించటం ఈ వ్యాసకర్తకు ఇష్టం విను క్రియకు విషయార్థక నామంకాని శ్రవ్యతాంశం ఉన్న నామంకాని కర్మపదాలుగా రావచ్చు ఒక అర్థంలో విషయం ( i format on) ప్రధానం ఇంకో అర్థంలో నాదం (చప్పుడు) ప్రధానం విషయార్థకనామ్నీకారకంగా అటం ప్రవర్తించే విధానాన్ని నా మ్నీ క ర ణా ల మొదటి వ్యాసం లో పరిశీలించాం అంటే గర్భవాక్యం ఆదేశంగా వచ్చింది గ ర్భ వా క్యం లో ని <విషయం> అన్న అంశంగల నామానికా <శ్రవ్యత> అన్న అంశం గల నామానికా అన్నదానిమీద వాక్యం (1 )కు చెయ్యాల్సిన అర్థవివరణ ఆధారపడి ఉంటుంది శ్రవ్యతాంశం కొన్ని క్రియలకు కూడా ఉంటుందని పైన సూచించబడింది *అడుగు, అను, అరచు ఏడుచు, తిట్టు* పాడు వంటి క్రియలకు వ్యాకర్త శ్రవ్యతాంశాన్ని నిర్దేశించాలి ఈ రకమైన క్రియలు గర్భవాక్యంలో ఉన్నప్పుడే అటమంత నామం విను అనే క్రియతో రాగా సంశ్లిష్టవాక్యం భిన్నార్థ బోధకమవుతుంది

ఇంతకు పూర్వం వ్యాపారార్థక నామానికి గర్భవాక్యం ఆదేశంగా వచ్చి నప్పుడు గర్భి గర్భ వాక్యాల క్రియలు ఏక కర్తృకాలై ఉండాలన్నాం విద్యా బోధక నామానికి ఆదేశంగా వచ్చినప్పుడు గర్భవాక్యంలో కర్త అవ్యక్తం అన్నాం

గర్భవాక్యకంలో విను చూచు సమాపక క్రియలైనప్పుడు గర్భిగర్భ వాక్యాల్లో క్రియలు ఏక కర్తృకాలు కాగూడదనే నియమం ఒకటి ఇక్కడ చెప్పు కోవాలి లేకపోతే—

*(114) సుమిత్ర పాడటం సుమిత్ర విన్నది

అనే వాక్యం వ్యాకరణనిష్పన్నం కావాల్సివస్తుంది పునశ్చర్వితమైన సుమిత్ర అనే పదం భిన్నప్రాణుల్ని సూచిస్తే తప్ప పై వాక్యం సమ్మతం కావటానికి వీల్లేదు కొన్ని విచిత్ర సన్నివేశాల్లో పై రకపు వాక్యాలు వ్యాకరణ సమ్మతం కావచ్చు ఈకింది వాక్యాలట్లాంటివి

(115) రాత్రి కలలో నేను పాడటం నేనే విన్నాను

(116) రాత్రి కలలో నేను గాలిలో ఎగరటం నేనే చూశాను

(115) (116) సంఖ్యలుగల వాక్యాల్లో గర్భి గర్భవాక్యాల కర్తృపదాలకు సారూప్య సమబోధకత ఉన్నప్పటికీ (114) లాగా వ్యాకరణ విరుద్ధాలుగా కనిపించటంలేదు ఇందు క్కారణం ఆ కర్తృపదాలు స్వప్నప్రపంచంలో భిన్నరూపాలుగానే భావితాలవుతై స్వప్నప్రపంచంలోగాని జానపద గాథల్లోగాని లేక మరే ఇతర మిథ్యా ప్రపంచంలోనైనా ఇట్లాంటి సన్నివేశాలు తటస్థపడవచ్చు జాగ్రదవస్థలో ఉన్న మానవుడు పంచేంద్రియాలద్వారా గ్రహించే జ్ఞానానికి మిథ్యాప్రపంచజ్ఞానానికీ ఉన్న భేదం తత్వశాస్త్రజ్ఞులు తేల్చవలసిన విషయం రూపైకత ఉన్నప్పటికీ (పైన చెప్పిన అర్థంలో సమబోధకత లేకపోవడం వల్ల ఏకకర్తృకాలు కాగూడదని పైన విధించిన నియమానికి భంగం కలగలేద నేదే వ్యాకర్త గ్రహించవలసిందీ సూచించవలసిందీ

ఇంతవరకు వ్యాపారార్థక నామాలు కొన్ని క్రియలకు కర్తలుగాగాని కర్మలుగాగాని ప్రవర్తించే విధానాల్ని పరిశీలించాం అంతేకాక ఇవి కొన్ని నామాలకు కర్తృపదస్థానంలో (కర్త (agent) గాకాదు)–అంటే స్థూలంగా విషయులు అనవచ్చు– (చూ విషయార్థక) రాగలవు కొన్ని నామాలు తెలుగులో ఆఖ్యాతాలు (predicates)గా ప్రవర్తిస్తే ఇట్లాంటి నామాలు ఆఖ్యాతనామాలని (predicative nominals) వ్యవహృతం ఉదాహరణ ప్రాయంగా ఈ కింది పట్టికను గ్రహించండి అలవాటు ఇష్టం కష్టం గుర్తు తేలిక మామూలు సుఖం సుఖం

ఈ పై నామాలు ఆఖ్యాతలుగా వచ్చే వాక్యాలకు వ్యాపారార్థకనామాలు విషయులు (topics or subjects?) గా వ్యవహరిస్తే పై పట్టికలోని నామాలు ఒక ప్రాణిపరంగా ప్రయుక్తమవుతై ఆ ప్రాణిని సూచించే నామానికి క్కు విభక్తి బంధాన్ని ప్రస్తుతానికి అముఖ్య కర్మబంధం (indirect object phrase) అందాం ఈ కింది వాక్యాలను పరిశీలిస్తే పై విషయం విశదమవుతుంది

(117) నాకు సినిమాలు చూడడం అలవాటు
నాకు వ్యాకరణం చదవటం ఇష్టం
నాకు వ్యాయామం చెయ్యటం కష్టం
నాకు అలస్యంగా నిద్రపోవటం మామూలు

ఈ పై వాక్యాల్లో వ్యాపారార్థక నామానికి బదులు ఒక్కోసారి నిర్వ్యాపార నామాలుకూడా కనిపిస్తున్నై ఈ కింది వాక్యాలు అందుకు ఉదాహరణలు

( 8) నాకు కాఫీ అలవాటు
నాకు నిద్ర ఇష్టం
నాకు వ్యాయామం కష్టం

ఈ పై వాక్యాల వ్యక్తనిర్మాణంలో వ్యాపార నామం లేకపోయినప్పటికీ వాటిని అర్థం చేసుకోట లో మాత్రం కాఫీతాగటం నిద్రపోవటం వ్యాయామం చెయ్యటం అనే గ్రహిస్తున్నాం అందువల్ల పై రకపు వాక్యాల గుప్తనిర్మాణంలో వ్యాపారార్థక నామాన్ని భావించాలి

పైన పేర్కొన్న ఆఖ్యాతనామాలున్న వాక్యాల్లో కొన్ని భేదాలు అందువల్ల వ్యాకరణ రచనలో వచ్చే చిక్కులు కొన్ని ఉన్నై ఉదాహరణకు అలవాటు కష్టం తేలిక సులభం మామూలు మొదలైన నామాలకి విషయులు గా వచ్చే గర్భవాక్యాల్లో కర్త గర్భివాక్యంలో అముఖ్య కర్మబంధం (కు-బంధం) ఒకే ప్రాణిని సూచించాలి ఇట్లాంటి వాక్యాల్లో జరిగే ప్రక్రియాగతి (grammatical process) (1 9) లో సూచితం

(119) నేను + కు — X — అలవాటు
↑
నేను సినిమాలు చూస్తాను

X = వ్యాపారబోధకనామం

పై ఆదేశకార్యం జరగాలంటే ఏటవాలు పదాలు సరూపసమబోధకాలై ఉండాలి ఆదేశం జరిగినప్పుడు గర్భవాక్యంలో నేను కు లోపకార్యం జరుగుతుంది

(119) లో లాగా గర్భవాక్యపు కర్త గర్భివాక్యపు కు–బంధంలోని నామమూ సరూపసమబోధకాలు కాకపోతే (120) లో లాగా ఆదేశకార్యం నిరోధితమవుతుంది నిరోధితం కాకపోతే (121) వంటి వ్యాకరణ విరుద్ధమైన వాక్యం నిష్పన్న మవుతుంది

(120) నేను + కు — X — అలవాటు
↓
నువ్వు సినిమాలు చూస్తావు

*(121) నాకు నువ్వు సినిమాలు చూడటం అలవాటు

ఏటవాలు పదాలు సమబోధకాలు కానందువల్లనే వాక్యం (121) వ్యాకరణ విరుద్ధమయింది

కాని పై పదాల్లో ఇష్టం ఆఖ్యాతగా వచ్చినప్పుడు ఈ సమబోధక నియమం వర్తించదు అంటే (122)లో సూచించే ప్రక్రియాగతి జరిగి వ్యాకరణ సమ్మతమైన (123) నిష్పన్న మవుతుందన్నమాట

(122) నేను + కు — X — ఇష్టం
↑
నువ్వు పద్యాలు చదుతావు

(123) నాకు నువ్వు పద్యాలు చదవటం ఇష్టం

(122) లో ఏటవాలు మాటలు వేరైనప్పటికీ ఆదేశ కార్యం జరిగింది ఒకటే అయితే గర్భవాక్యపు కర్తకు లోపం జరిగిఉండేది దీన్నిబట్టి

ఇష్టం అలవాటు అనే నామాల ప్రవర్తనలో భేదం ఉందని తెలుస్తుంది ఈ విషయంలో గుర్తు అనే నామం కూడా ఇష్టం లాగే ప్రవర్తిస్తుంది అంటే (122) లో ఇష్టం బదులు గుర్తు అనే నామాన్ని వాడినా ఈ ఆదేశకార్యం జరుగుతుందన్న మాట ఇట్లా ఒకే రకం ప్రవర్తన కలిగి ఉన్నట్టు కనిపించినా లోతుగా పరిశీలిస్తే ఇష్టం గుర్తు అనే నామాల ప్రవర్తనలో కూడా భేదమున్నట్టు మనం గ్రహించగలం ఈ కింది వాక్యాలను పరిశీలించండి

(124) నాకు నువ్వు పద్యాలు చదవటం ఇష్టం

(125) నాకు నువ్వు పద్యాలు చదవటం గుర్తు

పై రెండు వాక్యాలకి కింది రెండు వాక్యాలూ సమానార్థకాలుగా గ్రహించవచ్చు

(126) నాకు నువ్వు పద్యాలు చదివే పద్ధతి ఇష్టం

(127) నాకు నువ్వు పద్యాలు చదివిన విషయం గుర్తు

వాక్యం (125) లో గర్భ వాక్యానికి అని తగిలించవచ్చు (124) కు సాధ్యం కాదు సాధ్యం కాదంటే ఉద్దిష్టార్థంలో వీలుకాదని ఉదాహరణకు (128) (129) సంఖ్యలుగల వాక్యాల్ని చూడండి

(128) నాకు నువ్వు పద్యాలు చదివావని గుర్తు

*(129) నాకు నువ్వు పద్యాలు
చదివావని }
చదువుతావని } ఇష్టం

(129) సంఖ్య గల వాక్యంలో అని హేత్వర్థకం (128) లో విషయార్థకం (125) (127) సంఖ్యలుగల వాక్యాలను కూడా విషయార్థకాలుగానే వ్యాఖ్యానించాలి (124) కి ఈ పద్ధతి సరిపడదు (124) (125) వాక్యాల్లో గర్భవాక్యం ఒకటే అయినప్పటికీ గర్భివాకాల్లో ఉన్న ఇష్టం గుర్తు అనే నామాల వల్ల ఈ భేదం వచ్చింది (123) లో సూచించిన అర్థాన్నిబట్టి (124) గర్భ వాక్యం పద్ధతి ని సూచించే నామంగా ప్రవరిస్తున్నదని తెలుసుకోవచ్చు అంటే రీత్యర్థకి నామ్నీకరణాన్ని కూడా గుర్తించాలా? గుర్తిస్తే దాని లక్షణ మేమిటి?

రీత్యర్థకనామం ఏ రకపు క్రియలతో వ_ర్తిస్తుంది?— ఇట్లాంటి ప్రశ్న లుత్పన్న మవుతై ఈ ప్రశ్న లన్నిటికీ ఈ వ్యాసక_ర్త దగ్గర సమాధానాల్లేవు అసలు ఈ రకపు ప్రశ్నలే కొత్త ఇంకా లోతుగా పరిశోధన జరిగితేనే గాని వీటికి సమాధానాలు దొరకవు సమాధాలు ప్రస్తుతానికి దొరక్కపోయినా ఈ ప్రశ్నలు రేపటానికి కారణం ఈ విషయాల్ని గురించి ఆలోచించే జిజ్ఞాసువుల మేధలకు మరింత పని కల్పించటానికే

ఇంకో చిన్న విషయాన్ని ప్రస్తావిస్తే వ్యాపారార్థక నామ్నీకరణాన్ని గురించి ఈ వ్యాసక_ర్త ప్రస్తుతానికి చెప్పదల్చుకున్నది దాదాపు పూ_ర్తి అవు తుంది ముందుగా ఈ కిలది వాక్యసమూహాన్ని పరిశీలించండి

(180)

నువ్వు ఎక్కడ ఉంటున్నావు? ⟶ నువ్వు { ఉండటం / ఉంటున్నది } ఎక్కడ?

నువ్వు ఎప్పుడు వచ్చావు ? ⟶ నువ్వు { రావటం / వచ్చింది } ఎప్పుడు?

నువ్వు ఎందుకు వెళ్లావు? ⟶ నువ్వు { వెళ్లటం / వెళ్లింది } ఎందుకు?

పై వాక్యాల జంటల్లో ఎడంవైపు వాక్యాల్లో ఉన్న ఎక్కడ ఎప్పుడు ఎందుకు అనే ప్రశ్నార్థక క్రియావిశేషణాలు చివరికి జరగటం వల్ల కుడివైపు వాక్యాలు నిష్పన్నమయినై అందువల్ల ఉపో_త్తమ స్థానానికి చేరిన క్రియాపదం నామ్నీకృతమయింది ఇది రెండు రకాలు ఒకటి అటం వల్ల ఫలితం కాల పురుష బోధక ప్రత్యయాలు లోపించినై రెండోది తచ్ఛబ్దం ( అది ) వల్ల ఫలితం పురుషబోధక ప్రత్యయాలు మా_త్రం లోపించినై పూర్వం చర్చించిన నామ్నీకరణాలు గర్భవాక్యాలు గర్భివాక్యాల్లో చేరినప్పుడు జరిగినవి అంటే సంశ్లిష్ట వాక్య సందర్భాల్లో నన్నమాట ఇప్పుడివి ఏకవాక్యంలో జరిగిన మార్పులు (180) లో ఎడంపక్క వాక్యాలకీ కుడిపక్క వాక్యాలకీ శైలీ

విన్యాసంలో (stylistic differences)భేదం తప్ప ప్రధానార్థబోధలో భేద మున్నట్టు కనిపించదు వీటిని శైలీవిన్యాస హేతుకనామ్నీకరణాలనవచ్చు ఈ రకపు పరివర్తనకు ప్రశ్నార్థక క్రియా విశేషణాలకూ దగ్గరి సంబంధం ఉన్నట్టు కనిపిస్తున్నది ఉదాహరణకు (180) లో ఉదాహరించిన వాక్యసమూహాన్ని (181)తో పోల్చిచూడండి

(18 ) నేను హైదరాబాదులో ఉంటున్నాను ⟶*నేను ఉండటం హైదరాబాదులో

నేను నిన్న వచ్చాను ⟶*నేనురావటం నిన్న

నేను పనిమీద వెళ్ళాను ⟶*నేను వెళ్లటం పనిమీద

(181) లో జరిగిన పరివర్తన (180) లో జరిగిందానిలాంటిదే కాని (181) లో జరిగిన పరివర్తన వల్ల నిష్పన్నమైన (చుక్క గుర్తు పెట్టిన కుడి పక్క) వాక్యాలు వ్యాకరణ సమ్మతమైనవిగా కనిపించవు కనీసం వీటివ్యాకరణ ప్రతిపత్తి (180) లో కుడిపక్క వాక్యాల వంటిది కాదన్నంత వరకైనా తెలుగు భాషా వ్యవహర్తలంతా అంగీకరిస్తారనుకుంటాను మళ్ళీ (181) లో చుక్క గుర్తున్న కుడిపక్క వాక్యాల్లో నామ్నీకరణానికి అటం బదులు అది ఉపయోగిస్తే వీటి వ్యాకరణ ప్రతిపత్తి మారుతుంది (180) లో లాగానే సందేహం లేకుండా వ్యాకరణ సమ్మతంగా కనిపిస్తై

(181) లో చుక్క గుర్తుకి కుడిపక్క ఉన్న వాక్యాల్ని (182) లో వాక్యాలతో పోల్చిచూస్తే ఈ విషయం అర్థం అవుతుంది

( 82) నేను ఉంటున్నది హైదరాబాదులో

నేను వచ్చింది నిన్న

నేను వెళ్లింది పనిమీద

ప్రశ్నార్థకం కాని క్రియా విశేషణ పదాన్ని వాక్యాంతానికి జరిపినప్పుడు అది నామ్నీకరణం వ్యాకరణసమ్మతమై అటం నామ్నీకరణం వ్యాకరణ దూరం కావటానికి కారణమేమిటి? ప్రశార్థక క్రియావిశేషణాలు జరిపినప్పుడు రెండు రకాల నామ్నీకరణాలూ వ్యాకరణసమ్మతం ఎందుకయినై ? మళ్లిప్రశ్నలే సంతృప్తికరమైన సమాధానాల కోసం ఇంకా పరిశోధించాలి

పైన వీటిని శైలీవిన్యాసహేతుక నామ్నీకరణాలన్నాను ఈ రకమైన శైలికి ప్రయోజనం ఏమిటి? వాక్యం చివరికి జరిగిన పదానికి వాక్యం ప్రయోగంలో ప్రాధాన్యం కనిపిస్తున్నది ప్రాధాన్య వివక్ష ననుసరించి వాక్యంలో ఒక మాట చివరికి జరుగుతున్నది ఉదాహరణకి (౧౪౪) లో బాణం గుర్తుకు పక్కా వాక్యాల్ని పరిశీలించండి

(౧౪౪) యూసఫ్ బస్సులో యూనివర్సిటీకి వెళ్ళాడు

⟶యూసఫ్ బస్సులో వెళ్ళింది యూనివర్సిటీకి

⟶యూసఫ్ యూనివర్సిటీకి వెళ్ళింది బస్సులో

⟶బస్సులో యూనివర్సిటీకి వెళ్ళింది యూసఫ్

(౧౪౪)లో బాణం గుర్తుకు కుడిపక్కనున్న మూడు వాక్యాలూ బాణంగుర్తుకు పైన ఉన్న వాక్యం నుంచే నిష్పన్నమయినట్లు మనం గ్రహించాలి ఈ వాక్యాలన్నీ ఒకే విషయాన్ని గురించి చెప్తున్నాయి ప్రధానంగా చెప్పదల్చుకొన్న అర్థంలో భేదంలేదు కాని చెప్పే పద్ధతిలో తేడా ఉంది ఈ తేడా వాక్యాంతానికి జరిగిన పద భేదాన్నిబట్టి వచ్చింది చివరికి జరిగిన మాట వక్త ఉద్దేశించిన ప్రాధాన్యాన్ని సూచిస్తుంది అంటే ఈ పైన చెప్పిన శైలీ విన్యాస భేదం విషయైకదేశ ప్రాధాన్య వివక్ష కోసం ఏర్పడిందని తాత్పర్యం ఇక్కడ విషయం అంటే వాక్యం వ్యక్తం చేసే information

ఈ వ్యాసంలోనూ ఇంతకు పూర్వపు నామ్నీకరణాల వ్యాసాల్లోనూ వ్యాకరణ సమ్మతి అనే మాట ప్రవేశ పెట్టబడింది దానికి కొంచెం వివరణ అవసరం భాషా వ్యవహర్త మనస్సులో అవ్యక్తంగా ఉండి భాషా వ్యవహారాన్ని నడిపించే సూత్రావళి లేక నియమావళి అనే అర్థంలో వ్యాకరణ శబ్దం ఈ వ్యాసావళిలో ప్రయుక్తమయింది ఆ అవ్యక్త సూత్రావళిని అందుకోటానికే వ్యాకర్తలు చేసే ప్రయత్నం- అంటే అవ్యక్త సూత్రాలకు వ్యక్తరూపాన్నియ్యటమే వ్యాకర్త సాధించాల్సింది ఈ సూత్రావళి అనుమతించే వాక్యంవ్యాకరణ సమ్మతమనీ నిరాకరించే వాక్యం వ్యాకరణ విరుద్ధమనీ ఈ వ్యాసాల్లో వ్యవహరించాను వ్యాకరణ

సమ్మత వాక్యాలను వ్యాకరణ విరుద్ధ వాక్యాలను వేరు చెయ్యటం అన్ని సంద ర్భాల్లోనూ అంత తేలికైన పని కాదు మంచీ-చెడూలాగా వ్యాకరణ సమ్మతి అసమ్మతి అనేవి ద్వంద్వ భావాలు కావు ఈ రెండు ద్వంద్వాలమధ్య అసంఖ్యాక మైన అంతరువు లుండవచ్చు ఈ కారణంగానే ఒక్కోసారి ఫలాని వాక్యం వ్యాకరణ సమ్మతమా ? కాదా అంటే అవును కాదు అని తేల్చి చెప్పలేం కొన్ని వాక్యాల మధ్య వ్యాకరణ సమ్మతిలో తరతమ భేదాలుండవచ్చు ఒక్కోసారి ఈ విషయంలో భాషా వ్యవహర్తల మధ్య అంగీకారం కుదరకపోవచ్చుకూడా ఈ విషయాలను గురించి ప్రత్యేకంగా చర్చించినపుడు ఇంతకన్నా వివరంగా చెప్పుకోవచ్చు

భారతి 1969 మార్చి

# లుప్త విభక్తిక

తెలుగులో విభక్తుల సంఖ్య గురించి పండితులలో ఏకాభిప్రాయం లేదు సాంప్రదాయిక వ్యాకర్తలు ఏడు విభక్తులన్నారు అందుకు కారణం సంస్కృత వ్యాకర్తలు సంస్కృత భాషకు ఆ సంఖ్యను నిర్ణయించటం తెలుగువ్యాకర్తల సప్తసంఖ్యానిర్ణయానికి ఈ రెండు కారణాల్ని ఊహించవచ్చు 1 తెలుగు సంస్కృతజన్యమైన భాష కాబట్టి సంస్కృతంలో ఉన్నన్ని విభక్తులే తెలుగు లోనూ ఉండాలి 2 సంస్కృత వ్యాకర్తల నిర్ణయం సర్వభాషలకూ వర్తి స్తుంది ఈ రెండిట్లో ప్రాచీనాంధ్రవ్యాకర్తలను ఏది ఎక్కువ ప్రభావితం చేసిందో చెప్పటం కష్టం తరవాత వచ్చిన చారిత్రక వ్యాకర్తలు ప్రాచీనాంధ్ర వ్యాకర్తల సప్తసంఖ్యానిర్ణయాన్ని ఒప్పుకోలేదు కొందరు మూడు విభక్తులే నన్నారు మరి కొందరు నాలుగు విభక్తులన్నారు ఈ వివాదాలకు మూల కారణం భాషలో గుప్త (deep) వ్యక్త (surface) నిర్మాణాలను స్పష్టంగా గుర్తించకపోవటమే ఈ భేదాన్ని సంస్కృత వ్యాకర్తలు గుర్తించారనటానికి ఆధారాలున్నై

వాక్యాల్లో నామాలు క్రియలూ ప్రధానమైన భాషా భాగాలు (major categor es) నామాలకూ క్రియలకూ ఉండే సంబంధాన్ని సంస్కృత వ్యాకర్తలు కారకాలన్నారు ఈ కారక సంబంధాల్ని సంస్కృత వ్యాకర్తలు ఆరి టిని గుర్తించారు అవి కర్త, కర్మ కరణ సంప్రదాన అపాదాన అధికరణ కార కాలు ఈ కారకాలు భాషలో విభక్తులద్వారా వ్యక్తమవుతై కొన్ని భాషల్లో విభ క్తులుచేసే పనిని వాక్యంలో పదక్రమం (word order) నిర్వహించవచ్చు కారకం విభక్తి అనేవి పర్యాయపదాలు కావు అంటే కారకాలకీ విభక్తులకీ ఏకైక సంబంధం (isomorphism) లేదు రెండు మూడు విభక్తులు వాక్య నిర్మాణ భేదాన్నిబట్టి ఒకే కారకాన్ని వ్యక్తం చెయ్యవచ్చు సః కుంభాన్ కరోతి తేన కుంభః క్రియంతే కుంభాః కృతా కుంభానాం కర్తా అనే వాక్యాల్లో కుంభ శబ్దం భిన్న విభక్తులతో వ్యక్తమయినా అవి బోధించే కారకం ఒకటే అట్లాగే ఒకే విభక్తి భిన్న సందర్భాల్లో భిన్న కారకాల్ని బోధించవచ్చు రామేణ

బాణేన హతో వాలీ అనే వాక్యంలో తృతీయావిభక్తి రామశబ్దంతో ఉన్నప్పుడు కర్తృకారకాన్ని బాణశబ్దంతో ఉన్నప్పుడు కరణ కారకాన్నీ బోధిస్తున్నది పై ఉదాహరణలవల్ల అర్థానికి మూలమైన కారకం నిశ్చలమైందని వ్యక్తీకరణ భేదాలను అనుసరించి వచ్చే విభక్తి చలనశీలమైనదనీ తేలుతున్నది

పూర్వ నామ్నీకరణ వ్యాసాల్లో ప్రవేశపెట్టబడిన పరిభాషప్రకారం కారకం గుప్త నిర్మాణానికి సంబంధించిన పదమనీ విభక్తి వ్యక్తనిర్మాణానికి చెందిన పదమనీ ఇంతకుముందు వ్యాసాలతో పరిచయమున్నవారు ఈ పాటికి గుర్తించే ఉంటారు భాషల మధ్య వ్యక్త నిర్మాణంలో కనిపించినంత భేదం గుప్త నిర్మాణంలో ఉండదు అంతేకాక సర్వ భాషలకూ ఒకే గుప్త నిర్మాణాన్ని ప్రతిపాదించవచ్చునని ఇటీవలి భాషా శాస్త్రవేత్తల విశ్వాసం వాక్యాల అర్థ నిర్ణయం గుప్త నిర్మాణంమీద ఆధారపడి ఉంటుంది అర్థానికి బాధ్యత వహించే గుప్త నిర్మాణం సర్వ భాషలకీ సామాన్యమని ఈ శాస్త్రవేత్తల అభిప్రాయం ఇట్లాంటి అభిప్రాయమే సంస్కృత వ్యాకర్తలకీ ఉండి ఉంటుందని ఊహించటం అసమంజసమేమీకాదు గుప్త వ్యక్త నిర్మాణ భేదాల్ని సంస్కృత వ్యాకర్తలు గుర్తించారని సంస్కృత భాషను ఆధునిక పద్ధతులలో అధ్యయనం చేస్తున్న ఇటీవలి పాశ్చాత్య శాస్త్రజ్ఞులు కూడా గ్రహించారు J F Stall (1967) Word order in Sanskrit and Universal Grammar అనే గ్రంథంలో ఇట్లా అంటారు

The Karaka theory can in fact be understood from the purely semantic interpretations of the deep structure Alternatively and equivalently it can be understood by studying the various sentences of surface structure in which identical grammatical relations of the deep structure are expressed (Page 86)

సంస్కృత వ్యాకర్తలు పరిగణించిన ఆరు కారకాలు సర్వభాషలకు సామాన్యమని వారు ఉద్దేశించి ఉంటారని అనుకున్నాం ఇటీవలి పరిశోధనల

వల్లకాని ఇకముందు పరిశోధనలవల్లకాని ఈ సంఖ్య పెరగవచ్చు లేక తరగ వచ్చు అది ప్రధానం కాదు భాషలో నామాలకి క్రియలకి ఉండే సంబంధం స్థిరమనీ ఆ సంబంధాల్ని పరిమిత సంఖ్యలో భాగాలుగా విభజించవచ్చుననీ అవి సర్వభాషలకి సామాన్యమని ఈ సంబంధాలు ఆయా భాషల్లో విభక్త్యాదుల వల్ల వ్యక్తమవుతయ్యని సంస్కృత వ్యాకర్తలు గుర్తించారన్నదే ఇక్కడ ప్రధాన విషయం

ఈ విధమైన కారక-విభక్తి విభాగం పాశ్చాత్య వ్యాకర్తలు ఇటీవలి వరకు గుర్తించినట్టు మన కాధారాల్లేవు విభక్తి కారకాలు రెండింటికి వారు case అనే మాటనే వాడారు పరివర్తన సిద్ధాంతంలో ఒక భాగంగా ఇటీవలే (1967 లో) Charles Fillmore అనే ఆయన ప్రతిపాదించిన Case Grammar లో మొదటిసారిగా ఈ విభాగావశ్యకతను గుర్తించారు సంస్కృత వ్యాకర్తల సంప్రదాయాన్ని ఆయన పరిశీలించినట్టు ఆయన వ్యాసంలో మనకు ఆధారాలు దొరకవు అయినా సంస్కృత సంప్రదాయంతో పరిచయం లేకుండా విడిగానే ఒక అత్యాధునికుడైన శాస్త్రవేత్త ఇదే రకమైన నిర్ణయానికి వచ్చాడంటే కొన్నివేల ఏండ్ల కిందటే ఈ విభాగాన్ని ప్రతిపాదించిన సంస్కృత వ్యాకర్తల ప్రతిభా సంపన్నతకు ఆశ్చర్యపడకమానం కారకం-విభక్తి అనే మాటల్లాగా Fillmore కి ఇంగ్లీషు భాషలో వేరు వేరు మాటలు దొరకలేదు అందుకాయన deep case surface case అనే మాటల్ని వాడారు deep case కారకానికి surface case విభక్తికీ పర్యాయ పదాలని వేరే చెప్పక్కర్లేదు అందువల్ల ఈ వ్యాసంలో Fillmore వాడిన మాటలకు బదులు సంస్కృత వ్యాకర్తల సంప్రదాయాన్ననుసరించి కారకం-విభక్తి అనే పదాలే ఆ అర్థాల్లో ప్రయుక్తమవుతయి

Fillmore కూడా ఆరు కారకాల్నే సూచించడం [illegible] యాదృచ్ఛిక మైనా గమనించదగిన విశేషం [illegible] సంస్కృత వ్యాకర్తల కారకాలకి Fillmore కారకాలకి వివరాల్లో భేదాలున్నప్పటికీ వాటన్నిటినీ సమగ్రంగా చర్చించటానికిది అనువైన సమయం కాకపోయినా కొన్ని విశేషాంశాలను స్థూలంగా పరిశీలించటం అప్రస్తుతం కాదు

illmore ప్రతిపాదించిన ఆరు కారకా లివి

Agentive
Dat ve
Ob ective
Factive
Instrumental
Locative

Agent ve మన వ్యాకర్తల కర్తృకారకానికి సరిపోతుంది క్రియా వ్యాపారానికి ప్రధానాధారమైన ప్రాణివాచకమే Agentive కర్తృ కారకమన్నా ఇదే స్వతంత్రః కర్తా కర్తు రీప్సితతమం కర్మ కర్తుః క్రియయా వ్యాప్తు మిష్టతమం కారకం కర్మ సంజ్ఞస్యాత్ అనే సూత్రాల్లోనూ వివరణలోనూ కర్త ప్రాణివాచకమనే సూచన* ఉంది ఈప్సితమూ ఇష్టమూ ప్రాణులకు మాత్రమే కలిగే మనోవికారాలు కదా వ్యాపారంవల్ల లాభనష్టాలు పొందిన దేహ మనః స్థితుల్లో మార్పు కలిగిన ప్రాణి వాచకాన్ని సూచించేది Dat ve ఇది సంస్కృత వ్యాకర్తల కర్తృ కర్మ సంప్రదాన కారకాల్లో కొన్నికొన్ని భాగాలతో సరిపోతుంది వ్యాపార నిర్వహణతో ఎట్లాంటిపాత్రలేక న్యూట్రల్ గా ఉండే కారకాన్ని సూచించేది Object ve ఇది సంస్కృత వ్యాకర్తల కర్తృ కర్మ కారకాల్లో కొంత కొంత భాగానికి సరిపోతుంది. వ్యాపారోద్భూతమైన పదార్థాన్ని సూచించే కారకం Factitive ఇది సాధారణంగా సంస్కృత వ్యాకర్తల కర్మ కారకంలో ఒక భాగానికి సరిపోతుంది వ్యాపార సాధనకు ఉపయోగించే అప్రాణివాచకమైన ఉపకరణాన్ని సూచించేది Instrumental సాధక తమం కరణం క్రియా సిద్ధౌ । ప్రకృష్టోపకారకం కరణ సంజ్ఞం స్యాత్ అనే

* ఈ విషయాన్ని గమనించి నా దృష్టికి తెచ్చిన వారు నా సహోపాధ్యాయులు డాక్టర్ ఎచ్ ఎస్ అనంతనారాయణగారు ఈ సందర్భంలో ఆయన రచించిన Karaka theory and Cas garmmar అనే వ్యాసం చూడదగింది

సూత్రమూ వివరణా దాదాపు ఇదే అర్థాన్ని ఇస్తై వ్యాపారం జరిగిన స్థానాన్ని సూచించేది Locative ఇది సంస్కృత వ్యాకర్తల అధికరణ కారకం Fillmore కాలాన్ని Locative కారకం నుంచి వేరు చేశాడు కాని వేరే కారకాన్ని కల్పించలేదు అదీగాక పైన ఆరు కారకాలే కారక సర్వస్వం అని Fillmore భావించలేదు ఇంకా ఎక్కువ కారకాలు అవసరమని ఆయన గుర్తించకపోలేదు అవి ఇకముందు పరిశోధనలో తేలవలసినవి సంస్కృత వ్యాకర్తల అపాదాన కారకానికి సరిపోయే కారకాన్ని Fillmore ఎక్కడా ప్రతిపాదించలేదు *

ఇక్కడ సంస్కృత వ్యాకర్తల అధికరణ కారకాన్ని గురించి కొంత చెప్పాల్సిఉంది ఇది Fillmore ప్రతిపాదించిన Locative case కి పూర్తిగా సమానం కాదు దేశ కాలాల అవినాభావ సంబంధాన్ని సంస్కృత వ్యాకర్తలు గుర్తించారు ఈ రెంటికీ చాలా భాషల్లో ఒకే రకమైన ప్రత్యయాన్ని ఉపయోగించటం మనం గమనించవచ్చు అంతేకాక అధికరణ కారకంలో మూడు అంతర్విభాగాలున్నై ఔపశ్లేషికం అభివ్యాపకం వైషయికం అని ఆధారభూతమైన పదార్థంలో నిర్వచించదగిన వ్యాప్తిని సూచించేది ఔపశ్లేషికం ఆధారాన్ని సర్వత్రా ఆశ్రయించి ఉండటాన్ని సూచించేది అభివ్యాపకం ఇచ్ఛ కోపం కోరిక ఇత్యాది మనో వికారాల కాశ్రయమైన మూర్త అమూర్త పదార్థాలను సూచించేది వైషయికం వైషయికాధారం కేవలం భావితం సందర్శనీయం కాదు ఈ మూడు ఆధారాలకూ తెలుగులోనూ సంస్కృతంలోనూ ఇంగ్లీషులోనూ ఒకే రకపు ప్రత్యయాల్ని (పూర్వ పర విహిత విభేదాన్ని ఇక్కడ పరిగణించటం లేదు) ఉపయోగిస్తారు అందుకు వేరే ఉదాహరణలు కూడా అవసరం లేదు బహుశా చాలా భాషల్లో ఇట్లాగే ఉపయోగించవచ్చు ఈ దృష్టితో చూస్తే సంస్కృత వ్యాకర్తల అధికరణ కారకం Fillmore ప్రతిపాదించిన Locative case కన్నా పటిష్ఠమైందని అంగీకరించక తప్పదు సంస్కృత వ్యాకరణాంగనుల్లోనుంచి ఆధునికులు గ్రహించాల్సిన వజ్రాలింకా చాలా ఉన్నాయన్న మాట

సంస్కృత కారకాలకి deep cases కి ఉన్నసంబంధాల్ని గురించి అవి సర్వ భాషలకు సామాన్యంగా అనువర్తించే పద్ధతిని గురించి ఇంకా ఎంతో చెప్ప

* దీన్ని తరవాతవ్యాసాల్లో Source అనే పేరుతో సూచించాడు

దగింది ఉన్నప్పటికీ ఇది ఈ వ్యాసానికి ఆనుషంగికమే గనుక ఈ చర్చ ఇంతటితో ముగుస్తుంది వేరే సందర్భం వచ్చినప్పుడు మరికొన్ని విశేషాలు ముచ్చటించుకోవచ్చు

ఒక వాక్యాన్ని మరో వాక్యంలో నామంగా ప్రవర్తించేట్టు చెయ్యటానికి జరిగే వ్యాకరణ ప్రక్రియా విశేషాలను నామ్నీకరణాలని వ్యవహరిస్తున్నాను అట్లాంటి పద్ధతుల్లో ఒకటి లుప్త విభక్తిక నామ్నీకరణం ఈ పద్ధతిలో గర్భ వాక్యం (మరో వాక్యంలో నామంగా ప్రవర్తించే వాక్యం)లో పదాల వరసలో మార్పులు కలుగుతుంది వాక్యంలో ఒకానొక నామం ఉద్దేశ్యం (head) అయి మిగతా వాక్యభాగం విధేయం (a tr bute) అవుతుంది * ఈ ప్రక్రియాగతిలో ఉద్దేశ్యంగా మారిన నామం అంతకు ముందున్న విభక్తిని కోల్పోతుంది అందుకే దీన్ని లుప్త విభక్తిక నామ్నీకరణం అనటం విభక్తి పోయినా కారకం నిలుస్తుంది కాబట్టి దీన్ని కారక నామ్నీకరణం అన్నా అన వచ్చు అందుకే ఇంతకు ముందటి పేరాల్లో కారకం నిశ్చలమైనదనీ విభక్తి చలనశీలమైనదనీ అనటం ఈ క్రింది ఉదాహరణను గమనిస్తే ఈ ప్రక్రియా గతిలో విశేషాలు తెలుస్తై

(184) కిష్టప్ప కర్రతో కుక్కను కొట్టాడు
→కర్రతో కుక్కను కొట్టిన కిష్టప్ప
→కిష్టప్ప కర్రతో కొట్టిన కుక్క
→కిష్టప్ప కుక్కను కొట్టిన కర్ర

(184) లో ఒక వాక్యంనుంచి ఉద్దేశ్య భేదాన్నిబట్టి మూడు నామ బంధాలు నిష్పన్నమైనై ఆ నామాలు మూలవాక్యం (kernel sentence)

---

* ఉద్దేశ్యం=h ad విధేయం = attribute అనే అర్థాల్లో డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాడుతున్నారు పూర్వ వ్యాకరణాల్లో వీటిని వాక్యం వ్యక్తం చేసే విషయ (Informat o ı) భాగాలకు వాడారు ఆ వాడుక ప్రస్తుత ప్రయోగానికి కొంత బాధకమే చూ ప్రౌఢ వ్యాకరణము వాక్య పరిచ్ఛేదము సూ 6

లోనూ నిష్పన్ననామబంధాల్లోనూ క్రమంగా కర్తృ కర్మ కరణ కారకాల్ని బోధిస్తున్నై ఈ నామాలు నిష్పన్న నామబంధాల్లో ఉద్దేశ్యాలయినప్పుడు మూలవాక్యంలోని విభక్తులకు లోపం జరిగింది కర్తృ కారకాన్ని సూచించటానికి మూల వాక్యంలోను విభక్తి ప్రత్యయం లేదు కర్మ కారకాన్ని బోధించే ను కరణ కారకాన్ని బోధించే తో విభక్తులకు లోపం జరిగింది అయినా కారక సంబంధాలు నిల్చే ఉన్నై గనుక అర్థబోధకే ఇబ్బందీ లేదు ఈ నామ్నీకరణంలో మూల వాక్యంలోని సమాపక క్రియ నిష్పన్న నామబంధంలో క్రియాజన్య విశేషణంగా మారుతుంది

నేటి తెలుగులో వ్యతిరేక క్రియకి ఒక క్రియాజన్య విశేషణం అవ్యతిరేక క్రియకు కాలభేదాన్ని అనుసరించి మూడు క్రియాజన్య విశేషణాలు ఉంటయ్యని పూర్వనామ్నీకరణ వ్యాసాల్లో సూచించబడింది

(134)ని బట్టి మూలవాక్యంలో నామం మాత్రమే ఉద్దేశ్యం అవుతుందని నామంతోపాటు ఉన్న విశేషణాలు అట్లాగే ఉండిపోతయ్యని అనిపించవచ్చు (135) ని పరిశీలిస్తే ఈ సందేహం తీరుతుంది

(135) సరళ మద్రాసులో ఒక జరీ అంచు పచ్చ పట్టుచీర కొన్నది

→సరళ మద్రాసులో కొన్న జరీ అంచు పచ్చ పట్టుచీర

మూల వాక్యంలో నామం ఉద్దేశ్యస్థానానికి జరిగినప్పుడు అది తనతోపాటు తన వెనక ఉన్న విశేషణాలను కూడా వెంట తీసుకొని పోతుంది

ఈ విధంగా నిష్పన్నమైన నామాలు సాధారణంగా భిన్నార్థ బోధకాలవుతై (134) లో నిష్పన్నమైన నామబంధానికు (135) లో నిష్పన్నమైన నామబంధానికి- ఒక్కొక్క దానికి రెండేసి అర్థాలున్నై ఉదాహరణకు (134) లో చూపించిన కిష్టప్ప కుక్కను కొట్టిన కర్ర అనే నామబంధాన్ని తీసుకుంటే రెండర్థాలు సాధించవచ్చు ఒకటి ఒక కర్ర ఉంది ఆ కర్రతో కిష్టప్ప కుక్కను కొట్టాడు రెండు కొన్ని కర్రలున్నై అందులో ఒకదానితో కిష్టప్ప కుక్కను కొట్టాడు అట్లాగే (135) లో నిష్పన్నమైన నామబంధానికీ రెండర్థాలు చెప్పవచ్చు ఒకటి సరళ ఒక జరీ అంచు పచ్చ పట్టుచీర కొన్నది అదీ కొన్నది

మద్రాసులో రెండు సరళ కొన్ని జరీ అంచు పచ్చ పట్టుచీరలు కొన్నది అందులో ఒకటి మద్రాసులో కొన్నది ఈ రకమైన భిన్నార్థ బోధకత ఈ లుప్త విభక్తిక నామ్నీకరణం ద్వారా నిష్పన్నమైన నామబంధాలన్నిటికీ ఉన్నట్టుంది దీనికి సరి అయిన కారణం చూపించాల్సిన బాధ్యత వ్యాసకర్త మీద ఉన్నప్పటికీ వీటిని గురించి ప్రస్తుతం మనకు తెలిసింది చాల తక్కువ ఇంకా కొంత పరిశోధన జరిగితే తప్ప దీన్ని సాధించలేం

పై వాక్యాల ఆధారంతో ఒక విషయం చెప్పవచ్చు ఒక వాక్యంలో కర్తృ కర్మ కారక బోధక నామాల్లో ఏదైనా నిష్పన్న నామబంధాల్లో ఉద్దేశ్యంగా రాగలదు కాని మిగతా విభక్తులు కారకాలు అట్లా కాదు వాటిల్లో గమనించాల్సిన విధినిషేధాలు చాల ఉన్నై కొన్ని విభక్తులు వాటి అర్థాలు అవి లుప్తవిభక్తిక నామ్నీకరణంలో నిర్వహించే పాత్ర ఈ కింద చూపించబడుతుంది తెలుగులో తో తృతీయా విభక్తి అంటారు సాంప్రదాయిక వ్యాకర్తలు అంటే సంస్కృతంలో తృతీయావిభక్తి వ్యక్తంచేసే అర్థాల్లో చాలా వాటిని తో వ్యక్తం చేస్తుందని ఈ కింది వాక్యాలని పరిశీలించండి

(36) అతను కలంతో పరీక్ష రాశాడు
→అతను పరీక్ష రాసిన కలం

(37) అతను శ్రద్ధతో పరీక్ష రాశాడు
→*అతను పరీక్ష రాసిన శ్రద్ధ

(38) అతను జ్వరంతో పరీక్ష రాశాడు
→*అతను పరీక్ష రాసిన జ్వరం

పై మూడు ఉదాహరణల్లో మూలవాక్యాల (బాణంగుర్తుకు ఎడం వైపున ఉన్న వాక్యాలు) వ్యక్త నిర్మాణాల్లో భేదం కనిపించదు కాని గుప్త నిర్మాణాల్లో భేదం ఉంది అదే నామ్నీకరణాల్లో వ్యక్తమైంది (136) లో తో కరణార్థకం అందువల్ల నామ్నీకరణం సాధ్యమైంది (37) లో శ్రద్ధతో అనేది పరీక్ష రాసిన పద్ధతి (manner) తెలియజేస్తుంది ఈ అర్థంలో నామ్నీకరణం సాధ్యంకాదు నామ్నీకరిస్తే వ్యాకరణ విరుద్ధమైన నామబంధం నిష్పన్నమయింది (138) లో జ్వరంతో అనేది పరీక్ష రాయ

టానికి ఉపకరణమూ కాదు రాసే పద్ధతీ కాదు రాసినవాడి దేహ స్థితి ఈ అర్థంలోనూ నామ్నీకరణం వ్యాకరణ విరుద్ధమయింది. (137) లో -డతో స్థానంలో గా అదేశం చెయ్యవచ్చు (36) (38) లలో అది సాధ్యం కాదు.

విభక్తులకున్న భిన్నార్థాలవల్ల ఒక్కొక్కసారి చమత్కారాన్ని పుట్టించవచ్చు రచయితలు వీటిని ఉపయోగించుకోటం గూడా మనం గమనించవచ్చు ముళ్ల పూడి వెంకటరమణ కూర్చిన నవ్వితే నవ్వండి అనే పుస్తకంలో ఈ క్రింది జోక్ ఒకటుంది

'అయితే ముద్దాయి నిన్ను విద్వేషోద్రేకాలతో కొట్టాడన్న మాట

కఱ్ఱతో గొట్టిండని చెబితే సీగ్గాదయ్యా ఆ మాయదారి మాటలు మనకొద్దు

పై ఉదాహరణలో న్యాయవాది సంభాషణలో తో (137) లో ఉదాహృతమయిన వాక్యంలో తో వంటిది న్యాయస్థానంలో బోనులో నిలబడ్డవాడి వాక్యంలో తో (36) లో ఉదాహృతమైన వాక్యంలో తో' వంటిది

తో సహార్థంలోనూ వచ్యర్థ ధాతువుల అముఖ్య కర్మతోనూ ప్రయుక్త మవుతుంది సహార్థంలో నామ్నీకరణం సాధ్యం కాదు.

(139) నేను సరళతో చెప్పాను
→నేను చెప్పిన సరళ

(140) నేను సరళతో వెళ్లాను
→ *నేను వెళ్లిన సరళ

తో ప్రయోగంలో ఇంకో చిన్న విశేషం ఉంది. ముందు ఈ కింది వాక్యాలను గమనించండి

(141) సరళ సెనగ నూనెతో గారెలు వండింది
→సరళ గారెలు వండిన సెనగనూనె

(142) సరళ మినప్పప్పుతో గారెలు వండింది
→సరళ గారెలువండిన మినప్పప్పు

పైన ఉదాహరించిన వాక్యాలు నిష్పన్నమైన నామాలు పైకి ఒకే రకంగా కనిపిస్తున్నప్పటికీ తో ప్రయోగంలో భేదం ఉంది నిష్పన్నమైన నామాలు ప్రయోగించిన ఈ వాక్యాలు గమనించండి

(141) a సరళ గారెలు వండిన సెనగనూనె సూపర్ బజార్లో కొన్నది
b సరళ గారెలు వండిన సెనగనూనె పారబోసింది

(142) a సరళ గారెలు వండిన మినప్పప్పు సూపర్ బజార్లో కొన్నది
b సరళ గారెలు వండిన మినప్పప్పు పారబోసింది

(141 a) (142 a)లో సెనగనూనె మినప్పప్పు వంట అనే వ్యాపారంలో పాల్గొన్నవే కావచ్చు లేక వక్త అవే పదార్థాలు కావు ఆ రకం పదార్థాలు (not the same but the kind) అని ఉద్దేశించవచ్చు b వాక్యాలలో రకం అనే అర్థం రాదు అదే పదార్థం అనే అర్థంలో 142 వ్యాకరణ నిష్పన్నం కాదు- గర్భ వాక్య గుప్త నిర్మాణాల్లో తో ప్రయోగం పై వాక్యాల్లో భిన్నమన్న మాట వంట అనే వ్యాపారంలో పాల్గొన్న మినప్పప్పుకి వ్యాపారానంతరం అస్తిత్వం లేదు రూపాంతరం చెందింది కాని సెనగనూనె వంట అయింతర్వాత కూడా మిగుల్తుంది అందువల్లనే పారబొయ్యటం సాధ్యమైంది

తెలుగులో కు విభక్తిని షష్ఠి అన్నారు పూర్వులు దాన్ని చతుర్థిగా భావించారు ఆధునికులు సప్త సంఖ్యా విభాగంలో దాని స్థానం ఏది అనే ప్రశ్న అప్రధానం కు తెలుగులో ఎన్నో అర్థాల్లో ప్రయుక్తమవుతుంది అందులో కొన్ని అర్థాల్లో నామ్నీకరణం సాధ్యమవుతుంది

(143) వాళ్లు సినిమాకు వెళ్లారు
⟶వాళ్లు వెళ్లిన సినిమా

పై వాక్యంలో కు గమ్యాన్ని సూచిస్తుంది ఈ అర్థంలో నామ్నీకరణం సాధ్యమైంది

(144) పక్కింటామె పంచదారకు వచ్చింది
⟶*పక్కింటామె వచ్చిన పంచదార

(145) అత్తగారు మడి గట్టుకొని నీళ్లకు వెళ్లింది
→* అత్తగారు మడిగట్టుకొని వెళ్లిన నీళ్లు

(146) అతను తెలుగు చదవటానికి అమెరికా వెళ్లాడు
→* అతను అమెరికా వెళ్లిన తెలుగు చదవటం

పై మూడు వాక్యాల్లో కు (కి ు కు రూపాంతరమే) వ్యాపార ప్రయోజనాన్ని సూచిస్తుంది ఈ అర్థంలో నామ్నీకరణం సాధ్యంకాదు పైవాక్యాల్లో కు బదులు కోసం కూడా ఉపయోగించవచ్చు (146) లో 'కు క్రియా నిష్పన్నమైన వ్యాపారనామం తరువాత వచ్చింది ఇట్లాంటి సందర్భాల్లో కు సాధారణంగా వ్యాపార ప్రయోజనాన్ని సూచిస్తుంది

దేశ కాలార్థాల్లో ప్రయోగించినప్పుడు కు ప్రవర్తనలో గమనించాల్సిన విశేష మొకటుంది ఈ కింది వాక్యాల్ని పరిశీలిస్తే ఆ విశేషం తెలుస్తుంది

(147) ప్రసాదు మద్రాసు (కు) వెళ్లాడు
→* ప్రసాదు వెళ్లిన మద్రాసు
→ప్రసాదు వెళ్లిన ఊరు

(148) ప్రసాదు పది గంటలకు కాలేజీకి వెళ్తాడు
→* ప్రసాదు కాలేజికివెళ్లే పది గంటలు
→ప్రసాదు కాలేజి వెళ్లే టైం

(147) లో పువ్వు గుర్తున్న నామం ఇంకో మద్రాసు నగరం ఉంటే తప్ప వ్యాకరణ సమ్మతం కాదు విశేషనామాల (proper nouns) కన్నిటికీ ఈ నియమం వర్తిస్తుంది విశేషనామం బదులు సాధారణ నామం (common noun) ఉపయోగిస్తే వ్యాకరణ సమ్మతమే (148) లో పువ్వు గుర్తున్న నామం విశేషనామం లాంటిదే అంటే కాలంలో ప్రత్యేకమైన (specific) point ని సూచిస్తుంది గనుక వ్యాకరణ నిష్పన్నం కావటానికి వీల్లేదు అదే మళ్లీ సాధారణ నామాన్ని ఉపయోగిస్తే వ్యాకరణ సమ్మతమైంది General, Specific అనే విభాగాన్నాశ్రయించి ఇక్కడ నామ్నీకరణం సాధ్యం అయ్యిం దన్నమాట

వాక్యంలో సమాపక క్రియ ఉండు ధాతు నిష్పన్నమైనప్పుడు కు స్వామ్యాద్యర్థాల్లో ప్రయుక్త మవుతుంది ఈ అర్థాల్లో నామీకరణం సర్వసాధారణంగా సాధ్యమవుతుంది ఈ వాక్యాల్ని పరిశీలించండి

(149) a వాడికి డబ్బుంది
→ డబ్బున్నవాడు
→ డబ్బుగలవాడు

b ఆయనకు ఇల్లుంది
→ ఇల్లున్నవాడు
→ ఇల్లుగలవాడు

c వాళ్లకు పిల్లలున్నారు
→పిల్లలున్నవాళ్లు
→పిల్లలుగలవాళ్లు

d ఆ అమ్మాయికి తెలివి ఉంది
→ తెలివి ఉన్న అమ్మాయి
→ తెలివిగల అమ్మాయి

స్వామ్యాద్యర్థాలలో–స్వామిబోధక నామం కు ను వదుల్చుకొని నిష్పన్న నామబంధానికి ఉద్దేశ్యమయింది ఈ అర్థంలో నిష్పన్నమయిన నామబంధంతో ఉన్న శబ్దానికి వికల్పంగా గల శబ్దం ఆదేశమవుతుంది ప్రాచీన భాషలో అస్త్యర్థంతో స్వతంత్ర ప్రయోగార్హమైన కల (కలుగు) ధాతువు ఉంది అది ఆధునిక భాషలో పైరకపు నామబంధాల్లో మిగిలిందన్నమాట

గురించి concerning because of for the purpose of'–అనే అర్థాల్లో ప్రయుక్త మవుతుంది ఇది చారిత్రకంగా క్త్వార్థకరూపం కావచ్చు గురించిన అనే క్రియాజన్య విశేషణ రూపం కూడా ఆధునిక భాషలో క్వాచిత్కంగా కనిపిస్తుంది ఇట్లాంటివే నేటి తెలుగులో సంబంధించి సంబంధించిన అనే రూపాలు కూడా వీటికి గురించి సంబంధించు అనే మూల ధాతువులు నిర్మించి క్త్వార్థక క్రియాజన్య విశేషణ రూపాలను సాధించవచ్చు అయితే ఈ మూలధాతువుల ప్రయోజనం ఆ రూపాలను (రెండేసి మాత్రమే) –

సాధించటం వరకే పరిమితం గురించి రూప నిష్పాదన ప్రక్రియ ఏదైనా దాని ప్రవర్తన మాత్రం ఆధునిక భాషలో విభక్తి ప్రత్యయం వంటిదేనని చెప్పక తప్పదు బట్టి అనేది నామాల తర్వాతనే కాక అన్నంత క్రియమీద కూడా హేత్వర్థంలో వచ్చే ఒక విభక్తి ప్రత్యయం దీన్ని కూడా పట్టు ధాతువుకు క్త్వార్థకరూపంగా నిరూపించవచ్చు తెలుగు భాషలో వాక్య నిర్మాణానికవసరమైన వ్యాకరణ ప్రవర్తనైక ప్రయోజనం కలిగిన శబ్దజాలం క్రియా పద నిష్పన్న మయ్యే ప్రక్రియాగతి ఒకటున్నట్టు తోస్తున్నది నామ్నీకారకమైన 'అని' అను ధాతు నిష్పన్నం కష్టమైన సులభమైన వంటి విశేషణాల్లో విశేషణత్వాన్ని సూచించే 'అయిన' 'అగు ధాతు నిష్పన్న మయింది కాని కదా అనే రూపాలు అగు ధాతు వ్యతిరేక క్రియారూపంనుంచి నిష్పన్నమైనట్టు భావించవచ్చు అందు వల్ల ఒకవేళ గురించి ధాతు నిష్పన్నమైన రూపమైనా వ్యాకరణ ప్రవర్తన ననుసరించి దాన్ని విభక్తి ప్రత్యయంగా భావించటంలో వైరుధ్యమేమీ లేదు

గురించి — Concerning — అనే అర్థంలో ప్రయుక్తమైనప్పుడు మాత్రమే నామ్నీకరణం సాధ్యమైనట్టు తోస్తున్నది

(150) నేను సరళను గురించి చెప్పాను⟶
నేను చెప్పిన సరళ

(151) నేను ఆయన్ని గురించి వచ్చాను⟶
* నేను వచ్చినాయన

(152) వాడు డబ్బు గురించి వచ్చాడు⟶
*వాడు వచ్చిన డబ్బు

పైన ఉదాహరించిన వాటిల్లో (151) (152) సంఖ్యల నామబంధాలు వ్యాకరణ నిష్పన్నాలు కావు అక్కడ *గురించి* For the purpose of అనే అర్థంలో ప్రయుక్తమైంది

నుంచి దేశ కాలార్థాల్లో ప్రయోగించినప్పుడు వ్యాపారం మొదలైన చోటును కాలాన్ని సూచిస్తుంది ఈ అర్థాల్లో ఇది ప్రయోగించినప్పుడు క్రియ గమనార్థక ధాతుజన్యమై ఉండాలి కాలార్థంలో బహు వచన నామం తరువాత

ప్రయోగించినప్పుడు వ్యాపారోద్భవకాలాన్నేకాక కాలంలో వ్యాపార వ్యాప్తిని కూడా తెలియపరుస్తుంది ఉదాహరణకు-

(153) అతను పదేళ్లనుంచి మెడిసన్ చదువుతున్నాడు

అనే వాక్యంలో 'నుంచి' చదువు అనే వ్యాపార వ్యాప్తిని తెలియపరుస్తుంది

ప్రాచీన భాషలో— కొలెన్ శబ్దానికి దాదాపు ఇవే అర్థాలున్నట్టు మనం గ్రహించవచ్చు

ఈ అర్థాల్లో నామ్నీకరణం సాధ్యంకాదు

నుంచి ని వల్ల because of అనే అర్థంలో కూడా ఉపయోగిస్తాం ఉదాహరణకు-

(154) నీ నుంచి మేం ఇన్ని కష్టాలు అనుభవిస్తున్నాం

ఈ అర్థంలోనూ నామ్నీకరణం సాధ్యం కాదు కాని Arden తన వ్యాకరణంలో-

(155) నేను పువ్వులు కోసిన చెట్టు ఇదే

అనే వాక్యం (A progress ve grammar of Telugu -2 nd edition P 248) Arden ఉదహరించాడు ఈ వాక్యంలో నామబంధం నేను (ఒక) చెట్టునుంచి పువ్వులు కోశాను అని వాక్యంనుంచే నిష్పన్నమయి ఉండాలి ఈ నామబంధం వ్యాకరణ సమ్మతమయిందే అట్లాంటిదే ఇంకొకటి చూడండి

(156) అత్తగారు బావినుంచి నీళ్లు తెచ్చింది
→ అత్తగారు నీళ్లు తెచ్చిన బావి

దీన్నిబట్టి 'నుంచి' అనే విభక్తి ఏకదేశ పృథక్కరణార్థంలో (Part from the whole) ప్రయోగించినప్పుడు నామ్నీకరణం సాధ్యమవుతుందని స్థూల్తిరించుకోవచ్చు. కాని ఈ కింది ఉదాహరణను గమనించండి

(157) మా ఆవిడ మార్కెట్‌నుంచి కూరగాయలు తెచ్చింది
→ మాఆవిడ కూరగాయలు తెచ్చిన మార్కెట్

వ్యాకరణ సమ్మతమైన ఈ నిష్పన్న నామబంధంలో కూడా ఏకదేశ పృథక్కరణార్థం ఉన్నదా అనేది సమస్య

(57) లో తెచ్చింది బదులు కొన్నది అనే క్రియ ఉపయోగిస్తే మార్కెట్ నుంచి బదులు మార్కెట్-లో అని మార్చాలి దీన్నిబట్టి ఇక్కడ ((157) లో) '*నుంచి*'ని '*లో నుంచి*' అని సంకీర్ణ విభక్తిగా భావించి లో కు లోపం జరిగిందనవచ్చు (53) లో కూడా ఇట్లాంటి వివరణ సరిపోతుంది (55) లో *నుంచి* ని *మీదనుంచి* అని వివరించాలి లో '*మీద*'— రెండూ స్థలనిర్దేశకాలయిన విభక్తి ప్రత్యయాలు ఈ ప్రత్యయాలతో ఉన్న నామాలను ఉద్దేశ్యాలుగా చేసి నామబంధాలు నిష్పాదించవచ్చునని ముందు ముందు తెలుస్తుంది పై వాక్యాలను *లో-నుంచి* అని మీద–నుంచి అని వివరించటంవల్ల గుప్త నిర్మాణంలో ప్రదేశాన్ని సూచించే కారకమే ప్రధానమైనదనీ *నుంచి* గమనార్థక క్రియ (motion verb) వచ్చినప్పుడు వ్యక్త నిర్మాణంలో (అర్థ ప్రాధాన్యం లేకుండా వచ్చే) ప్రత్యయ విశేషమనీ చెప్పాల్సి ఉంటుంది ఈ పై పద్ధతుల్లో దేన్ని ఎన్నుకోటానికైనా ప్రస్తుతమున్న ఆధారాలు చాలవు

వ్యాపారోద్భూతమైన చోటు అనే అర్థంలో *నుంచి* ని ప్రయోగించినప్పుడు నామ్నీకరణం సాధ్యం కాదని పైన చెప్పబడింది ఈ సూత్రీకరణ ప్రకారం-

(58) అతను వెళ్ళిన ఊరు

అనే నామబంధం అతను ఊరినుంచి వెళ్ళాడు అనే అర్థంలో సాధ్యం కాదు కాని ఈ సూత్రీకరణకు విరుద్ధమైన ప్రయోగాలు భాషలో కనిపిస్తున్నాయి సి విజయలక్ష్మి రాసిన కారు చీకటిలో కాంతి రేఖ అనే కావ్యంలో శవం వెళ్ళిన ఇల్లులా అనే ప్రయోగం ఉంది దీనికి ఇంటి నుంచి శవం వెళ్ళింది అనే అర్థం చెపితే పై సూత్రీకరణ తప్పుతుంది ఇక్కడ కూడా (157)కి చెప్పినట్టుగా *లోనుంచి* అనే వివరిస్తే సూత్రీకరణ నిలుస్తుంది

ఒక తెలుగు సినిమాలో దిగి వచ్చిన దేవలోకానికే తిరిగి వెళ్ళింది అనే వాక్యం ఉంది ఈ వాక్యంలో నామబంధానికి దేవలోకం నుంచి దిగివచ్చింది అని అర్థం ఇక్కడ కూడా *లోనుంచి* అనే అర్థం చెప్పవచ్చేమో ఏదేమైనా ప్రస్తుతానికి వివరణ అసమగ్రంగానే చెయ్యక తప్పటం లేదు ఇకముందు పరిశోధనలో ఈ సమస్యలకు సంతృప్తికరమైన పరిష్కారమార్గం దొరకవచ్చు

లో మీద అనే విభక్తులు తెలుగులో అధికరణ కారకాన్ని వ్యక్తం చేస్తయి ఔపశ్లేషికార్థంలో ఈ విభక్తు లుపయోగించినప్పుడు నామ్నీకరణం సాధ్యం అవుతుంది

(159) డబ్బు పెట్టెలో పెట్టాను
→నేను డబ్బు పెట్టిన పెట్టె

(160) చెట్టు మీద చిలక ఉంది
→చిలక ఉన్న చెట్టు

లో కాలార్థంలో కూడా ఉపయోగిస్తాం అప్పుడు విశేష నామాని (specific noun)కి సామాన్య నామం (general noun) ఆదేశం చేస్తే నామ్నీకరణం సాధ్యమవుతుంది

(161) 1956 లో విశాలాంధ్ర ఏర్పడింది
→*విశాలాంధ్ర ఏర్పడ్డ 1956
→విశాలాంధ్ర ఏర్పడ్డ సంవత్సరం

లో మీద అనే విభక్తులు వైషయికార్థంలోనూ ప్రయుక్తమవుతాయి ఆ అర్థంలోనూ నామ్నీకరణం సాధ్యమే

(162) మంత్రిగారికి సాహిత్యంలో ప్రవేశం వుంది
→మంత్రిగారికి ప్రవేశం ఉన్న సాహిత్యం

(163) నేను పని మీద వెళ్తున్నాను
→నేను వెళ్తున్న పని

పక్క కింద వైపు మొదలైన విభక్తులు కూడా స్థల సూచకాలయినా వీటితో నామ్నీకరణం సాధ్యం కాదు లో మీద అనేవి సామాన్య ఔపశ్లేషి కార్థాన్ని సూచిస్తయ్ పక్క కింద వంటివి ప్రత్యేకమైన position ని సూచిస్తున్నాయి

ఈ లుప్తవిభక్తిక నామ్నీకరణంలో గమనించాల్సిన ఒక ముఖ్య విశేష ముంది

(164) నేను తిన్న అన్నం

అనే నామ బంధంలో కర్తను లోపింపజేసి తిన్న అన్నం అని అన్నా అన్నం అనే నామానికి తిను అనే క్రియతో ఉన్న సంబంధం మారదు కాని అన్ని చోట్లా మారకుండా ఉండటం సాధ్యం కాదు. కొన్ని నామాలకు కొన్ని క్రియలతో భిన్న వ్యాకరణ సంబంధా లుండవచ్చు ఉదాహరణకు ఈ కింది నామబంధాల్ని పోల్చి చూడండి

( 65) నేను చంపిన పులి

(166) చంపిన పులి

(165) లో పులి కర్మ నేను కర్త (166) లో పులి కర్తగా కనిపిస్తుంది దీన్నిబట్టి ఒక సూత్రీకరణ చెయ్యవచ్చు ఒక నామం ఒక క్రియకు కర్తగానూ కర్మగానూ వ్యవహరించగలిగిన సామర్థ్యం ఉన్నప్పుడు ఆ నామం లుప్తవిభక్తిక నామ్నీకరణ పద్ధతిలో ఉద్దేశ్యమయితే కర్తృపద సమర్థ పదేతరా భావంతో ఉద్దేశ్య నామమే కర్త అవుతుంది అట్లాగే ఈ కింది నామ బంధాల్ని పోల్చి చూడండి

(167) నేను డబ్బు పెట్టిన పెట్టె

(168) నేను పెట్టిన పెట్టె

(167) లో పెట్టె అధికరణార్థంలోనూ (168) లో కర్మార్థంలోనూ ప్రయుక్తమయినాయి ఈ భేదమూ పైన చెప్పిన దానిలాంటిదే దీనికి కూడా పైలాగే సూత్రం చెప్పవచ్చు ఒక నామబంధంలో ఉద్దేశ్య నామానికి క్రియతో కర్మార్థంలోనూ అధికరణార్థంలోనూ ప్రవర్తించగల సామర్థ్యం ఉన్నప్పుడు కర్మ పద సమర్థ పదేతరాభావంలో కర్మపదంగానే వ్యవహరిస్తుంది

దీన్నిబట్టి కారక సంబంధాల్లో అంతరువులు (hierarchy) ఉన్నయ్యని తెలుస్తుంది ఈ అంతరువుల నిర్ణయానికి పై సూత్రాలు ఉదాహరణ ప్రాయాలు. ఈ మార్గంలో ఇంతకన్నా సమగ్రమైన వివరణ—అందుకు ఈ వ్యాసంలో ప్రయత్నించకపోయినా—ఇయ్యటం సాధ్యమే

తెలుగులో లుప్త విభక్తిక నామ్నీకరణానికి తుల్యమైనది ఇంగ్లీషులో relative clause నిర్మాణం. ఇంగ్లీషులో ఉద్దేశ్యం తరవాత విధేయం వస్తుంది. తెలుగులో ఉద్దేశ్యం విధేయం తరవాత వస్తుంది. ఈ లుప్త విభక్తిక నామ్నీకరణం కొన్ని వివరాల్లో తేడా ఉన్నా, తమిళాది ఇతర ద్రావిడ భాషల్లో కూడా ఇదే పద్ధతి ఉంది. విధేయోద్దేశ్యాల వరస జాపనీస్‌లో కూడా ద్రావిడ భాషల్లో లాగే ఉందని తెలుస్తున్నది. (చూ. Ronald W. Langacker, Mirror image rules, Language Vol 45, No 3, 1969, 575–598) ద్రావిడ భాషల్లో లాగే జాపనీస్‌లో కూడా క్రియ వాక్యాంతంలో వస్తుంది. వాక్యంలో కర్త–కర్మ–క్రియలు వచ్చే వరసకి ఈ రకపు నామ్నీకరణానికి ఏమైనా సంబంధం ఉందేమో తెలీదు. నామ్నీకరణ పద్ధతికీ భాషల్లో కర్త–కర్మ–క్రియల వరసకీ ఉన్న సంబంధం ప్రత్యేకంగా పరిశోధించవలసిన విషయం.

కారక సంబంధాల్లో అంతరువుల నిర్ణయాన్ని గురించి పైన ఇచ్చిన వివరణ ఇతర ద్రావిడ భాషలకు కూడా వర్తిస్తుందని ఈ వ్యాసకర్త విశ్వాసం. ఆచార్య అగస్త్య లింగంగారు రచించిన వ్యాకరణంలో ఇందుకు వ్యతిరేకమైన సాక్ష్యం కనిపిస్తుంది. (చూ. S. Agesthialingom, A Generative Grammar of Tamil, Annamalainagar, 1967)

ఆయన ఉదాహరించిన తమిళ నామబంధాలు, వాటికి సమానమైన తెలుగు నామబంధాలు కింద ఇయ్యబడుతున్నై.

1. అడిచ్చె పయ్యన్ — కొట్టిన పిల్లాడు
2. వెట్టునె కత్తి — కోసిన కత్తి
3. వందె కాటు — వచ్చిన అడవి
4. విఱందె కూరె — కూలిన కప్పు
5. పొరందె నాటు — పుట్టిన దేశం

ఈ పై నామబంధాలన్నిటికీ రెండర్థాలున్నయంటూ రాయన. కాని తెలుగులో అట్లా భిన్నార్థాలు కనిపించటంలేదు. కొట్టిన పిల్లాడు అనే దానికి తెలుగులో దెబ్బలు కొట్టిన పిల్లాడు అనే అర్థమే కాని దెబ్బలు తిన్న పిల్లాడు

అనే అర్థం రాదు తమిళంలో ఆ రెండర్థాలూ వస్తయ్యట కోసిన కత్తి అనే బంధంలో కత్తి కర్త్రర్థకమూ కర్మార్థకమూ అని ఆయన వివరణ ఆ భేదం ఆభాసమాత్రమే కత్తి కోసింది అన్నా కత్తితో కోశాం అన్నా కారకాలు ఒకటే వచ్చిన అడవి అనే బంధంలో అడవి ఎప్పుడూ రాదు దాని అర్థం మనమే అడవి దగ్గరికి వచ్చామని ఈ రకంగాచూస్తే అగస్త్యలింగంగారు ఉదాహరించిన వాటిల్లో నిజంగా రెండర్థాలున్నట్టు కనిపించేది తమిళంలో అయినా మొదటి పదబంధంలోనే

అగస్త్యలింగంగారు చెప్పినట్టు తమిళంలో లుప్తవిభక్తిక నామాలకు ఈ రకమైన భిన్నకారక బోధకతే ఉన్నట్టయితే తమిళం ఈ విషయంలో తెలుగుకు భిన్నమన్నమాట అతి ప్రధానమైన నామ్నీకరణ విధానంలో రెండు సజాతీయమైన భాషలు భేదించటం అసాధ్యం కాకపోయినా ఆశ్చర్యకరమే ఇంకా ఈ భాషల్ని లోతుగా పరిశోధిస్తే ఈ భేదం అయథార్థం అని తేలినా తేలవచ్చు

భారతి 1970 ఏప్రిల్

# తెలుగులో అసమాపక క్రియ : క్త్వార్థకం

ఒకటికన్నా ఎక్కువ క్రియలున్న తెలుగు వాక్యంలో—చివరి క్రియ సమాపక రూపంలోనూ మిగతా క్రియలు అసమాపక రూపంలోనూ ఉంటై తెలుగులో సమాపక అసమాపక క్రియలను గుర్తుపట్టటం తేలిక ఏవో కొన్ని క్రియలకు తప్ప (తెలుసు వచ్చు వంటివి) సమాపక క్రియలన్నిటికీ చివర కర్తృపదాన్ని సూచించే క్రియా విభక్తులు (ను ము వు డు దు రు) చేరతై భూతకాలిక వ్యతిరేక క్రియా రూపాల వంటి వాటిల్లో (రాలేదు పోలేదు కాలేదు వంటివి) కర్తృబోధకమైన క్రియా విభక్తులు లేకపోయినా కొన్ని ఇతరాధారాల వల్ల సమాపక క్రియల్ని గుర్తుపట్టవచ్చు అసమాపక క్రియలకు క్రియా విభక్తులు చేరవు కాలబోధక ప్రత్యయాలకు సరూపమైన ప్రత్యయాలు చేరతై

అసమాపక క్రియల్ని రెండు రకాలుగా విభజించవచ్చు సమాపక క్రియా వ్యాపారానికన్నా ముందు జరగటానికి ఉద్దేశించిన వ్యాపారాన్ని సూచించే వాటిని క్త్వార్థకాలని సమాపక క్రియావ్యాపారంతో పాటే జరిగే వ్యాపారాల్ని సూచించే వాటిని శత్రర్థకాలనీ వ్యవహరించటం సాంప్రదాయికం తెలుగులో వీటికన్నా తేలికయిన మాటలు రచనా వ్యవహారంలో కనిపించటం లేదు గనుక ప్రస్తుతానికి వాటి ప్రయోగౌచిత్యాన్ని గురించిన విచికిత్స మానేసి వాటిని యథాతథంగా వాడుతున్నాను

క్త్వార్థిక క్రియారూపం ధాతువుకు-ఇ అనే ప్రత్యయం చేర్చటం వల్ల ఏర్పడుతుంది దీనికి వ్యతిరేక రూపాలు రెండున్నై ఒకటి—అకుండా రెండోది-అక, అనే ప్రత్యయాలు చేర్చటంవల్ల ఏర్పడతై శత్రర్థకరూపం—తూ—టూ అనే ప్రత్యయరూపాలు చేర్చటం వల్ల (అన్వాదులకు—టూ మిగతా ధాతువులకు —తూ చేరుతుంది ) ఏర్పడుతుంది తిను ధాతువును ఉదాహరణగా గ్రహిస్తే రూపాలు ఇట్లా ఉంటై

క్త్వార్థక తిని తినకుండా తినక
శత్రర్థక తింటూ
ఈ క్రియలతో వాక్యాలిట్లా ఉంటై

1 సుజాత అన్నం తిని నిద్రపోయింది
2 సుజాత అన్నం తినకుండా నిద్రపోయింది
3 సుజాత అన్నం తినక నిద్రపోయింది
4 సుజాత అన్నం తినక చిక్కిపోయింది
5 సుజాత అన్నం తింటూ నిద్రపోయింది

వీటిలో వాక్యం (3) ఆధునిక భాషలో వ్యాకరణ సమ్మతంకాదు ప్రాచీన భాషలో ఇట్లాంటి ప్రయోగాలు వ్యాకరణ సమ్మతాలు ప్రాచీన భాషలో తిన కుండా తినక వంటి రెండు క్రియా రూపాలూ ఒకే అర్థంలో వాడబడినట్లు కని పిస్తున్నది ఆధునిక భాషలో ఈ రెండు రూపాలు వేరుబడి భిన్న ప్రయోజనాన్ని హిస్తున్నై

ఈ వ్యాసం క్త్వార్థక క్రియా ప్రయోగాలకే పరిమితం క్త్వార్థక క్రియ చాలా అర్థాల్లో ప్రయుక్తమవుతుంది వాటిల్లో కొన్ని మాత్రమే ప్రస్తుతానికి పరి శీలిస్తాను అన్నిటినీ పరిశీలించక పోవటానికి వ్యాస విస్తరభీతి ఒక్కటే కారణం కాదు వాటిల్లో సూత్రీకరణకు సరిగ్గా లొంగనివి చాలా ఉన్నై ఇంకా కొంత పరిశోధన జరిగితేనే గాని కాస్తో కూస్తో సంతృప్తికరంగా వాటిని గురించి చెప్పడం సాధ్యం పడదు

క్త్వార్థక ప్రయోగ రహస్యాల్ని ప్రాచీన వ్యాకర్తలు కూడా కొంతవరకు గ్రహించారు ఉదాహరణకు బాల వ్యాకర్త సమానాశ్రయంబులం బూర్వ కాలంబులం దివర్ణకంబగు (క్రియ—38) అనే సూత్రంలో ఏకాశ్రితమైన భిన్న వ్యాపారాలున్నప్పుడు క్త్వార్థక క్రియలు పూర్వవ్యాపారాల్ని బోధిస్తయ్యని సూచించాడు ఉదాహరణకు ఈ క్రింది వాక్యాల్ని గమనించండి

1 సుజాత అన్నం తిని నిద్రపోయింది
6 సుజాత అన్నం తిని సుజాత నిద్రపోయింది

* 7 సుజాత అన్నంతిని ఆ అమ్మాయి నిద్రపోయింది
* 8 సుజాత అన్నంతిని సుశీల నిద్రపోయింది

ఈ పై వాక్యాల్లో మొదటి వాక్యంలో అన్నంతిను నిద్రపోవు అనే రెండు వాక్యాలకూ ఆశ్రయమైన కర్త సుజాతే వాక్యం (6) లో కూడ రెండు వాక్యాలకూ సుజాతే కర్త అయినా కర్తృపద పునరావృతి వల్ల అర్థబోధ కలుగుతున్నా వాక్యం సరి అయిందికాదు వాక్యం (7) లో సుజాత ఆ అమ్మాయి అనే పదాలతో ఒకే కర్తని వ్యవహర్త సూచించదల్చుకున్నా తెలుగు వాక్యం అందుకు అనుమతించదు వాక్యం (8) లో రెండు వ్యాపారాలకూ కర్తలు వేరు వేరు అందువల్ల ఈ వాక్యంకూడా వ్యాకరణ విరుద్ధమే అవుతున్నది. పై వాక్యాల్ని బట్టి క్త్వార్థక ప్రవర్తనను గురించి ఈ కింది విధి నిషేధాల్ని గ్రహించవచ్చు

భిన్న వ్యాపార బోధకమైన వాక్యంలో క్త్వార్థక క్రియాశ్రయమైన కర్త సమాపక క్రియాశ్రయమైన కర్త ఒకటే అయిఉండాలి అందులో పునరుక్తమైన కర్తృపదాలు లోపించాలి కర్తృపదాలు సమరూపకమూ సమబోధకమూ అయినప్పుడు ఇట్లాంటి లోపం జరుగుతుంది (దీన్నే సనాబంధలోప సూత్రమని పరివర్తన వ్యాకర్తలు వ్యవరిస్తారు)

పైన చెప్పిన నియమాలు క్త్వార్థకం బదులు శత్రర్థకం ఉన్నా వర్తిస్తై అందువల్ల పై సూత్రీకరణలో శత్రర్థక క్రియను కూడా చేర్చుకోవాలి అందుకు ఈ క్రింది వ్యాకరణ విరుద్ధ వాక్యం ఉదాహరణగా గ్రహించవచ్చు

* 9 సుజాత అన్నం తింటూ సుశీల నిద్రపోయింది

క్త్వార్థక శత్రర్థక వాక్యాలకు సమానార్థకాలుగా కనిపి చే వాక్యాలు కొన్ని ఉన్నాయి -

10 సుజాత అన్నం తిన్న తరువాత నిద్రపోయింది

1 సుజాత అన్నం తింటూ ఉండగా నిద్రపోయింది

వాక్యం (10) వాక్యం (1) కీ వాక్యం ( ) వాక్యం (5) కూ క్రమంగా సమానార్థకాలు అయితే 10 11 వాక్యాలు వాటి సమానార్థక వాక్యాల కన్నా

ప్రవర్తనలో భిన్నాలు ఈ వాక్యాలు భిన్న కర్తలను సహిస్తే పూర్వోదాహృత వాక్యాలు భిన్నకర్తలను సహించవు అంటే 12 13 వాక్యాలు వ్యాకరణ సమ్మతాలు

12 సుజాత అన్నం తిన్న తరవాత సుశీల నిద్రపోయింది

13 సుజాత అన్నం తింటూ ఉండగా సుశీల నిద్రపోయింది

వ్యాకరణ సమ్మతమయితే 8 9 వాక్యాలు క్రమంగా 12 13 వాక్యాలకు సమానార్థకాలయి ఉండేవి సమానార్థకమైన వాక్యద్వయంలో భిన్న వ్యాకరణ నియమాలుండటం విశేషం నిజానికి ఇవి సమానార్థకాలు కాకుండా అయినా ఉండాలి విశేషమైన కారణమేదైనా ఉండి ఉండాలి అందుకు నేనూహించిన కారణం పరివర్తిన సిద్ధాంతాన్ననుసరించి ఈ క్రింది బొమ్మల ద్వారా సూచించబడుతుంది (చూ బొమ్మలు 1 2 3)

వాక్యం

వాక్యం | | వాక్యం |
--- | --- | --- | ---
నామబంధం | క్రియాబంధం | నామబంధం | క్రియాబంధం
(10) సుజాత | అన్నం తిన్నది | సుజాత | నిద్రపోయింది
(12) సుజాత | అన్నం తిన్నది | సుశీల | నిద్రపోయింది

(బొమ్మ 1)

( 0) (12) రెండూ కూడా గుప్త నిర్మాణంలో రెండేసి వాక్యాలు కలపటం వల్ల ఏర్పడ్డయ్ కర్తృపదాలు వేరైనప్పుడు తరవాత అనే శబ్దాన్ని రెండు వాక్యాల మధ్య చేర్చినప్పుడు వాక్యం (12) నిష్పన్నం అవుతుంది కర్తృపదాలు ఒకటే అయినప్పుడు ననామబంధలోప సూత్రం వల్ల రెండో వాక్యంలో సుజాత అనే నామబంధం లోపిస్తుంది అప్పుడు చెట్టుబొమ్మ-ఇట్లా ఉంటుంది (చూ బొమ్మ 2)

వా క్యం

వాక్యం

వాక్యం

నామబంధం
సుజాత

క్రియాబంధం
అన్నం తిన్నది

క్రియాబంధం
నిద్రపోయింది

( సనామబంధలోప సూత్రం తరవాత )
(బొమ్మ 2)

క్రియాబంధసంహార సూత్రప్రకారం రెండు క్రియా బంధాలు ఒకచోట చేర్చబడతాయి ఈ సూత్ర ప్రవర్తన తరవాత నిర్మాణ సూచికా వృక్షం ఇట్లా ఉంటుంది (చూ బొమ్మ 3)

వా క్యం

నామ బంధం
సుజాత

క్రియాబంధం

క్రియాబంధం
అన్నం తిన్నది

క్రియాబంధం
నిద్రపోయింది

( క్రియాబంధ సంహార సూత్రం తరువాత )
(బొమ్మ 3)

ఇంకో నియమం ప్రకారం ఒక మూలం మంచి సరూపమైన పిలక మొలిస్తే తన కొమ్మల్ని మూలానికి చేర్చి తను తొలగిపోతుంది పై బొమ్మలో ఉన్న ఒక వాక్యం గుర్తు అట్లాంటి పిలక గనక అది తొలగించబడుతుంది

ఆ తరువాత రెండు క్రియాబంధాల మధ్య తరువాత చేర్చటం కాని లేక పూర్వ క్రియను క్త్వార్థకంగా మార్చటంగాని పరివర్తన సూత్రం ద్వారా జరగాలి పైన పేర్కొన్న బాల వ్యాకరణ సూత్రం సరిగ్గా ఈ సమయంలో ప్రవర్తించే పరివర్తన సూత్రమన్న మాట తరువాత అనే శబ్దం చేరిస్తే వాక్యం 10 నిష్పన్నమవుతుంది (తిన్నది తరవాత>తిన్న తరవాత) బాలవ్యాకర్త చెప్పిన సూత్రం ప్రవర్తిస్తే వాక్యం (1) నిష్పన్నమవుతుంది

పైన పేర్కొన్న బాల వ్యాకరణ సూత్రంలో ఈ క్రింది వివరణ కనిపిస్తున్నది సమాన కర్తృకంబులనగ సమానాశ్రయంబులనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె ఈ వివరణను బట్టి ధాత్వర్థ వ్యాపారాశ్రయత్వానికి కర్తకూ భేదాన్ని సూచించదల్చుకున్నట్టు తెలుస్తున్నది అయితే కారక పరిచ్ఛేదంలో మూడో సూత్ర వివరణలో ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాబడు అని నిర్వచించబడింది అంటే ఒకచోట (కారక పరిచ్ఛేదంలో) కర్తను గుప్త నిర్మాణపు కర్తగానూ ఇంకోచోట (క్రియాపరిచ్ఛేదంలో) వ్యక్తనిర్మాణపు కర్తగానూ భావించినట్టు కనిపిస్తున్నది చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె అనే వాక్యంలో చేత ప్రత్యయం కర్తకు చేత వర్ణకంబగు అనే సూత్రంవల్లనే రావాలి (ఇక్కడ కర్త గుప్త నిర్మాణపు కర్త) కొట్టు అనే క్రియకు చైత్రుడే ఆశ్రయం అట్లా కాదంటే చేత వర్ణకం రావటానికి వేరే సూత్రం లేదు కాని మొదటి క్రియ క్త్వార్థక క్రియగా మారాలంటే మైత్రుడు ఆశ్రయం కావాలి అందువల్ల బాలవ్యాకర్త చేసిన ఈ రెండు వివరణల మధ్య వ్యత్యాసం కనిపిస్తున్నది ఇదే నిజమయితే బాలవ్యాకర్త గుప్త వ్యక్త నిర్మాణాల మధ్య భేదం గుర్తించినా దాన్ని సర్వత్రా పాటించలేదని చెప్పాల్సి ఉంటుంది

బాలవ్యాకర్త గుప్త వ్యక్త నిర్మాణాల మధ్య పడ్డ పొరపాటు ఒక ముఖ్య విషయాన్ని తెలియపరుస్తున్నది ఒక వాక్యంలో క్త్వార్థక క్రియ ఉన్న వాక్య భాగానికి ప్రధాన క్రియ ఉన్న వాక్యభాగానికి గుప్త నిర్మాణపు కర్తలు వేరైనా వ్యక్త నిర్మాణపు కర్తలు ఒకటే కావాలి ఈ నియమాన్ని వ్యక్త నిర్మాణపు నియమంగా (Surface structure constraint) గా గుర్తించాలి పై విషయానికి ఉదాహరణలుగా ఈ క్రింది వాక్యాలను గ్రహించవచ్చు.

14 సుజాత (సుబ్బారావుని) తిరస్కరించి బాధ పడింది
15 సుజాత (సుబ్బారావుచేత) తిరస్కరించబడి బాధపడింది
* 16 సుబ్బారావు సుజాతను తిరస్కరించి సుజాత బాధపడింది

వాక్యం (14) గుప్త నిర్మాణంలో కర్త వ్యక్త నిర్మాణంలో కర్త ఒకటే వాక్యం ( 5) లో రెండు భాగాలకు గుప్త నిర్మాణపు కర్తలు వేరు కాని వ్యక్త నిర్మాణపు కర్తలు ఒకటే కావటంవల్ల వ్యాకరణ సమ్మత మయింది వాక్యం (16) ( 5) కన్నా గుప్త నిర్మాణానికి ఎక్కువ సన్నిహితం అయినా వ్యక్త నిర్మాణపు కర్తలు వేరుకావటం వల్ల వ్యాకరణ విరుద్ధమయింది వాక్యం (15)కు ఈ విధంగా గుప్త నిర్మాణాన్ని సూచించవచ్చు (చూ బొమ్మ 4)



(బొమ్మ 4)

కర్తృపదాలు వేరుకావటంవల్ల ఇంతకు పూర్వం పేర్కొన్న సనామబంధ లోప సూత్రం కాని క్రియాబంధ సంహార సూత్రం కాని ప్రవర్తించవు రెండు

వాక్యాల మధ్య తర్వాత అనే శబ్దాన్ని అనుసంధిస్తే వ్యాకరణ సమ్మతమైన వాక్యం నిష్పన్న మవుతుంది ఇక్కడ మొదటి వాక్యంలో కర్మణి సూత్రం ప్రవర్తించటానికి వీలుంది కర్మణి సూత్ర ప్రవర్తనకు కర్తృకర్మ పదాలు భిన్నం కావాలి ఈ సూత్రం కర్తృకర్మ పదాల స్థానాన్ని వ్యత్యయ పరుస్తుంది ఈ సూత్రం ప్రవర్తించింతరవాత చెట్టు ఇట్లా ఉంటుంది (చూ బొమ్మ 5)

వాక్యం

వాక్యం వాక్యం

నామబంధం క్రియాబంధం నామబంధం క్రియాబంధం

నామబంధం క్రియ క్రియ

సుజాత సుబ్బారావుచే తిరస్కరించబడింది సుజాత బాధపడింది

(కర్మణి సూత్రం తరువాత)

(బొమ్మ 5)

ఇప్పుడు సనామబంధ లోపసూత్రం క్రియాబంధ సంహార సూత్రం ప్రవర్తిస్తై అప్పుడు బాల వ్యాకరణం ప్రతిపాదించిన పరివర్తన సూత్రం ప్రవర్తించి వాక్యం (15) నిష్పన్నమవుతుంది బాలవ్యాకర్త సూత్రాన్ని క్త్వార్థక సూత్రం అనవచ్చు దీన్నిబట్టి పరివర్తన సూత్రాలు ఒక నిర్దిష్ట క్రమంలో ప్రవర్తిస్తయ్యని కూడా గ్రహించవచ్చు ఇంతవరకూ చర్చించిన పరివర్తన సూత్రాలను అవి వర్తించే క్రమంలో ఈ విధంగా ఏర్పాటు చేయవచ్చు వ్యాకరణ నిర్మాణంలో మార్పులు తెచ్చే సూత్రాలు గనుక వీటిని పరివర్తన సూత్రాలంటారు

పరివర్తన సూత్రాలు

1 కర్మణి సూత్రం (వికల్పం)
2 సనామ బంధలోప సూత్రం (నిత్యం)
3 క్రియాబంధ సంహార సూత్రం (నిత్యం)
4 క్త్వార్థక సూత్రం (వికల్పం)
5 తరవాత–బంధసూత్రం (నిత్యం)
6 –పడు లోప సూత్రం (వికల్పం)

వీటిల్లో మొదటి మూడు సూత్రాలకు విస్తృతమైన ప్రవర్తన ఉంది ఈ సూత్రాలు ఈ వరసలోనే వర్తించాలి ఇందుకు వాక్యం (15) ను ఉదాహరణగా గ్రహించవచ్చు వికల్పమైన కర్మణి సూత్రం ప్రవర్తించినప్పుడు వాక్యం (14) నిష్పన్నమవుతుంది వాక్యం (12) లో 2 3 సూత్రాలు ప్రవర్తించవు కర్తలు వేరు కావటం వల్ల క్త్వార్థక సూత్రం కూడా ప్రవర్తించదు అప్పుడు తరవాత-బంధ సూత్రం నిత్యంగా ప్రవర్తిస్తుంది వాక్యం (10) ని నిష్పన్నం చెయ్యటానికి 2 3 సూత్రాలు ఆ క్రమంలో వర్తించి వికల్పమైన క్త్వార్థక సూత్రం ప్రవర్తించకపోతే తరవాత బంధ సూత్రం నిత్యంగా ప్రవర్తిస్తుంది కాని ఈ వాక్యాన్ని గమనించండి

17 సుజాత అన్నం తిని తరవాత నిద్రపోయింది

వాక్యం (10)ని (17 తో పోల్చిచూస్తే కొన్ని భేదాలు కనిపిస్తున్నై (10)ని అవ్యవహితంగా ఉచ్చరించాలి (17) ని అవ్యవహితంగా ఉచ్చరించకూడదు అందువల్ల ఈ రెండు వాక్యాల నిష్పాదనలో భేదం ఉండి ఉండాలి దీన్నిబట్టి చూస్తే క్రియాబంధ సంహారసూత్రం (17) కు వర్తించినట్టు లేదు ఇది వర్తించలేదంటే దీన్ని అడ్డుకున్నది ఏదో ఉండి ఉండాలి అంటే వాక్యం (17) లో కనిపించే తరవాత ఐదో సూత్రమైన తరవాత– బంధ సూత్రంవల్ల చేర్చింది కాదని అంతకుముందే ఉన్నదని తేల్తుంది సనామబంధలోప సూత్రం వర్తించిన తరువాత వాక్యం 17 కు నిర్మాణం ఇట్లా ఉంటుంది (చూ బొమ్మ 6)

వాక్యం

వాక్యం — వాక్యం

| నామబంధం | క్రియాబంధం | కాలవిశేషణం | క్రియా |
|---|---|---|---|
| సుజాత | అన్నంతిను | తరవాత | నిద్రపోయింది |

( సనామ బంధలోప సూత్రం తరవాత )

(బొమ్మ 6 )

నాలుగో సూత్రం వర్తించి వాక్యం ( 7) నిష్పన్నమైంది సౌలభ్యం కోసం మళ్ళీ ఉదాహరిస్తున్న (10, (17) వాక్యాలను ఇప్పుడు పోల్చిచూడండి

0 సుజాత అన్నం తిన్న తరవాత నిద్రపోయింది

17 సుజాత అన్నంతిని తరవాత నిద్రపోయింది

పై వాక్యాల్లో (10) ని ఎందుకు అవ్యవహితంగా ఉచ్చరిస్తున్నామో (17) ని ఎందుకు వ్యవహితంగానే ఉచ్చరిస్తున్నామో ఇప్పుడు కారణం తెలుసుకోవచ్చు వాక్యం(10)లో క్రియాబంధ సంహారసూత్రం వర్తించింది క్రియాబంధ సంహార సూత్రం వర్తించింది వాక్యం (17)లో క్రియాబంధ సంహారం సూత్రం వర్తించలేదు క్రియాబంధ సంహార సూత్రాం వర్తించ లేదు అందువల్ల (17) వాక్య సంహారమే అవుతున్నదన్నమాట అంటే (17) ని వ్యక్తనిర్మాణంలో కూడా రెండు వాక్యాల సమ్మేళనంగానే అర్థం చేసుకుంటున్నామని ఈ వివరణ తాత్పర్యం

పైన పట్టికగా ఇచ్చిన సూత్రాల్లో ఆరో సూత్రాన్ని గురించి ఇంతవరకు చర్చించలేదు అందుకు ముందుగా ఈ వాక్యాల్ని పరిశీలించండి

18 సుబ్బారావు తిరస్కరించి అవమానించ బడ్డాడు

19 సుబ్బారావు తిరస్కరించబడి అవమానించబడ్డాడు

వాక్యం (19) లో అర్థం స్పష్టం తిరస్కరించబడ్డది సుబ్బారావే అవమానించబడ్డది సుబ్బారావే గుప్త నిర్మాణంలో మూడు వాక్యాలు రెండింట్లోనూ సుబ్బారావు కర్మపదం ఆ రెండింటికి కర్మణి సూత్రం వర్తించి సుబ్బారావు కర్తృపదస్థానం ఆక్రమించి సనామబంధ లోప సూత్రం క్రియాబంధ సంహార సూత్రం క్త్వార్థక సూత్రం క్రమంగా వర్తించి వాక్యం (19) నిష్పన్నమైంది క్రియా పదాల్లో ఉన్న పడు శబ్దం కర్మణి సూత్రం అదనంగా చేర్చింది ఈ సూత్రం గుప్త కర్తకు చేత వర్ణకాన్ని క్రియకు పడు ధాతువునూ చేరుస్తుంది

వాక్యం (18) కి రెండర్థాలున్నై ఒక అర్థంలో ఇది (19) కి సమానం ఇంకో అర్థంలో గుప్త నిర్మాణంలో సుబ్బారావు తిరస్కరించు క్రియకు కర్తగానూ అవమానించు క్రియకు కర్మగానూ ఊహిస్తున్నాం అంటే సుబ్బారావు ఎవర్నో తిరస్కరించాడు ఆ ఎవరో సుబ్బారావును అవమానించారు అన్న అర్థం రావచ్చు అప్పుడు రెండో వాక్యానికి మాత్రమే కర్మణి సూత్రం వర్తించింది అప్పటి నిర్మాణం మీద సనామబంధలోప సూత్రం క్రియాబంధ సంహార సూత్రం క్త్వార్థక సూత్రం (19) లాగే క్రమంగా వర్తించి (18) నిష్పన్నమైంది అయితే ఈ వాక్యానికి (19) తో సమానమైన అర్థం ఎట్లా వచ్చిందో ఆలోచించాలి అందుకోసమే వికల్పమైన పడులోప సూత్రం 19)ని నిష్పన్నం చెయ్యటానికి పై సూత్రాలు వర్తించిన తరువాత ఆఖరి సూత్రాన్ని వర్తింపజేస్తే పడు లోపం జరిగి (8) నిష్పన్నమైంది అందువల్లనే (18) (19) తో సమానార్థకం కాగలిగింది క్రియాబంధ సంహార సూత్రం వల్ల రెండు క్రియా పదాలు అవ్యవహిత స్థితికి వస్తే పడులోప సూత్రం వికల్పంగా వర్తించి పూర్వపదాల్లో పడు శబ్దాల్ని లోపింప జేస్తుంది ఇక్కడ అవ్యవహితంగా అనే నియమం సార్థకం రెండు కర్మణి క్రియల మధ్య ఇంకో పదం వస్తే పడులోప సూత్రాన్ని వర్తించ నియ్యకుండా అడ్డుకుంటుంది అంటే వాక్యం (18) లో రెండు క్రియలకూ మధ్యన ఇంకేదైనా చేరిస్తే (19) తో సమానార్థకం కాలేదన్న మాట ఉదాహరణకు వాక్యం (20) (19) తో సమానార్థకం కాజాలదు

20 సుబ్బారావు తిరస్కరించి ఘోరంగా అవమానించబడ్డాడు

ఈ పడులోప సూత్రానికి విషయాలైన ఈ వాక్యాన్ని పరిశీలించండి

*3 ఇచ్చట కాఫీగింజలను పొడరుచేసి ఇవ్వబడును

ఈ వాక్యం హైదరబాదు సుల్తాన్ బజారులో 1970 వరకూ కనిపించేది కర్మణిసూత్రం అసంపూర్ణంగా ప్రవర్తించటం వల్ల ఈ వాక్యం తప్పు అయింది ధాతువుకు పడు శబ్దాన్ని చేర్చిన కర్మణిసూత్రం గుప్తకర్మను వ్యక్తకర్తగా కూడా మార్చాలి కాని ను శబ్దం వల్ల కాఫీగింజలను అనే శబ్దం వ్యక్త నిర్మాణంలోనూ కర్మగానే మిగిలిపోయింది ను శబ్దాన్ని తొలగిస్తే వాక్యం సరి అయింది అవుతుంది పడు లోప సూత్రం వర్తించటం వల్ల పొడరు చేసి అనే రూపం సిద్ధించింది పడు లోప సూత్రం వర్తించిన తర్వాత వాక్యం (18) లాగా ఇది భిన్నార్థ బోధకం కాకపోవటానికి కారణం *పొడరుచేయు* అనే క్రియకు కాఫీ *గింజలు* గుప్త నిర్మాణంలో కర్తగా ప్రవర్తించలేదు ఇంతేకాక పై వాక్యంలో *తరువాత*–బంధ సూత్రం వర్తించటానికి వీల్లేదు ఉదాహరణకు–

*22 ఎ కాఫీగింజలు పొడరు చేసి తరువాత ఇవ్వబడును

బి కాఫీగింజలు పొడరు చేసిన తరువాత ఇవ్వబడును

ఉద్దేశించిన అర్థంలో పైరెండు వాక్యాలూ వ్యాకరణ విరుద్ధాలు కాఫీ గింజలు పై వాక్యాల్లో వ్యక్తకర్త కాలేదు ఈ క్రియకూ మిగతా క్రియలకూ ఉన్న భేదం గుర్తించదగింది వ్యాపార పూర్వం ఉన్న కాఫీ గింజలు వ్యాపారానంతరం ఉండవు వ్యాపారానంతరం ఉండేది కాఫీపొడి మాత్రమే పూర్వభౌతిక రూపాన్ని మార్చే వ్యాపారాలను సూచించే క్రియలున్నప్పుడు తరవాత బంధ సూత్రం వర్తించదన్న నియమం ఏర్పర్చుకోవాలి

1970 ఎండాకాలంలో తిరుపతి కొండ మీద గుడి ఆవరణలో ఈ క్రింది వాక్యం కనిపించింది

*23 ఇచ్చట యాత్రికుల ఉచితముగా చెప్పులు ఉంచుకొని వాపసు ఇవ్వబడును

ఇవ్వబడును అనే క్రియకు చెప్పులు వ్యక్త నిర్మాణపు కర్త యాత్రికులు గుప్త వ్యక్త నిర్మాణాలు రెండిట్లోనూ ఉంచుకొను అనే క్రియకు కర్త వ్యక్త

నిర్మాణపు కర్తలు వేరైనందున పైవాక్యం వ్యాకరణ విరుద్ధమైంది పై వాక్యంలో యాత్రికులు అన్న శబ్దం తొలగిస్తే వ్యాకరణ సమ్మత మవుతుంది అప్పుడు చెప్పులు రెండు క్రియలకూ కర్త కాగలుగుతుంది పదు లోప సూత్రం వర్తించి ఉద్దేశించిన అర్థాన్ని భంగం కలగకుండా సరి అయిన వాక్యం నిష్పన్నం అవుతుంది ఇంతవరకూ జరిగిన చర్చలో క్త్వార్థక క్రియా ప్రవర్తనలో గమనించిన నియమాలను సౌలభ్యం కోసం కింద ఇస్తున్నాను

1 భిన్న వ్యాపారాలను ఒక వాక్యంలో చెప్పినప్పుడు ప్రధాన వ్యాపారం కన్నా పూర్వం జరగటానికి ఉద్దేశించిన వ్యాపారాల్ని బోధించే క్రియలు క్త్వార్థక రూపంలో ఉంటై

2 ఈ రకపు వాక్యాల్లో వ్యక్త నిర్మాణపు కర్త ఒకటే అయిఉండాలి గుప్త నిర్మాణపు కర్తలు వేరు కావచ్చు

3 ఈ వాక్యాల్లో క్రియ లన్నిటికీ గుప్త నిర్మాణపు కర్త ఒకటే అయి సమాపక క్రియ కర్మణి రూపంలో ఉండే క్త్వార్థక క్రియ ఏ రూపంలో ఉన్నా కర్మణి తుల్యంగానే భావించాలి

ఈ పైచర్చ అంతా మనుష్య వాచక శబ్దాలు కర్తృపదాలుగా ఉన్న వాక్యాలను దృష్టిలో పెట్టుకొని జరిగింది ఈ నియమాలు ప్రాణి వాచక శబ్దాలు ఏవి కర్తృపదాలుగా ఉన్నా వర్తిస్తై అప్రాణివాచక శబ్దాలు కర్తృపదాలుగా ఉన్నప్పుడు ఏం జరుగుతుందో ఇంకా పరిశీలించాల్సి ఉంది అంతేకాక క్త్వార్థక క్రియకున్న పెక్కు ప్రయోజనాల్లో పూర్వ వ్యాపార బోధకత ఒకటి మాత్రమే ఇదిగాక ఇంకా చాలా ప్రయోజనాలున్నై ఉదాహరణకు ఈ కింది వాక్యాలను పరిశీలించండి

24 పావనములైన శిరోజములం దెమల్చి పాపావహుడీడ్చి తెచ్చె
(భార సభా 2—216)

25 ఏనెన్నడు దొల్లి చూచి యెఱుగను నిన్నున్
(భార ఆది 4—100)

26 జగత్కర్త పూర్ణాలోల ద్గుణుంజూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్ (భార—ఆది—6—31)

*ఇటువంటి పరిశీలనకు చూ రామారావు (1975)

27 ఉత్సవ సందర్శనోత్సుకు లై పోయి కడుఁబెద్ద ప్రొద్దియ్యె
(భార — ఆది — 7 — 209)

ప్రాచీన భాషలోనుంచి ఇచ్చిన పై ప్రయోగాల్లో క్త్వార్థక క్రియ భిన్న పద్ధతుల్లో ప్రయోగించబడింది అవి అన్నీ ఆధునిక భాషలో కూడా ఉన్నై అంతేకాక నేటి భాషలో ఈ వాక్యాలను గమనించండి

29 అతను పొద్దుపోయి ఇంటికి వచ్చాడు

*30 అతను వానకురిసి ఇంటికి వచ్చాడు

పై రెంటిలో రెండోది వ్యాకరణ విరుద్ధం మొదటిది వ్యాకరణ సమ్మతం

క్త్వార్థక క్రియకున్న ప్రయోగా లన్నిటిని పరిశీలించి సూత్రీకరించాల్సిన ఆవసరం ఉంది ఆ పని ఇంకోసారి

ఈ వ్యాసంలో ప్రతిపాదించిన విషయాలు ప్రధానంగా ఆధునిక భాష నుంచి సేకరించినవి ప్రాచీన భాషకూ ఆధునిక భాషకూ వాక్య నిర్మాణానికి సంబంధించిన ముఖ్య విషయాల్లో తేడా ఉండదు నిజానికి ఈ వ్యాసంలో పరిశీలించి గమనించిన విశేషాలు చాలా వరకు ఇతర ద్రావిడ భాషలకు కూడా వర్తిస్తై ఈ వ్యాసంలో ప్రతిపాదించిన సూత్రాలు కొద్ది మార్పులతో భారతీయ భాషలన్నిటికి వర్తించటానికి కూడా వీలుంది భారతీయ భాష లన్నిటిలోను క్త్వార్థక క్రియా ప్రవర్తనలో కొన్ని సామ్యాలున్నై అట్లాంటి వాటిని కొన్ని ఈ వ్యాసకర్త హిందీ బెంగాలీ భాషల్లో గమనించాడు వ్యాస విస్తరణ భీతివల్ల ఇతర భాషలనుంచి ఉదాహరణలు ఈ వ్యాసంలో ఇయ్యలేదు

ఆంధ్ర పత్రిక ఉగాది ప్రత్యేక సంచిక 1973

# తెలుగులో 'అని' చేసే పని

తెలుగులో అని శబ్దానికున్న బహుళ ప్రయోజనాల్లో కొన్నింటిని పూర్వం భారతిలో రాసిన వ్యాసాల్లో కొంతవరకు పరిశీలించాను నామ్నీకరణ విధానమే ప్రధానంగా ఉద్దేశించటం వల్ల అని కున్న అన్ని ప్రయోజనాలను అక్కడ చర్చించటం సాధ్యం కాలేదు అదీగాక అప్పటికి అని కున్న ప్రయోజనా లన్నీ పరిశోధనకు పూర్తిగా లొంగలేదు ఇప్పటికి అవగాహన అయినంతమట్టుకు వాటిల్లో కొన్నింటిని ఈ వ్యాసంలో పరిశీలిస్తాను

వచ్యర్థధాతువైన అను కు క్త్వార్థకరూపం అని రెండు వాక్యాలను కొన్ని విశేషార్థాల్లో అనుసంధించటానికి కూడా ఈ అని శబ్దం ప్రయుక్తమవు తుంది ఇట్లాంటి ప్రయోగాల్లో అని ని అవయవి సూచకం (construction marker) అని వ్యవహరిస్తున్నాను క్రియారూపమైన అని కీ అవయవి సూచకమైన అని కీ తెలుగు వాక్యనిర్మాణంలో ఉన్న భేదాన్ని ఈ క్రింది వాక్యాలవల్ల గ్రహించవచ్చు

1 పొద్దున్న పాలవాడు నానామాటలూ అని పోయాడండీ

2 భారతదేశంలో ప్రజాస్వామ్యం ఉందని అమాయకులు అనుకుంటారు

పై రెండు వాక్యాల్లోనూ అని ప్రయోగముంది మొదటి వాక్యంలో అని వచ్యర్థంలో అనుధాతువుకు క్త్వార్థక రూపంగా ప్రయోగించబడింది రెండో వాక్యంలో అని కి వచ్యర్థం లేదు అస లిక్కడ ఇది క్రియ కూడా కాదు క్రియ అయితే సాధారణంగా కర్త ఉంటుంది మొదటి వాక్యంలో అని కి పాలవాడు కర్త రెండోవాక్యంలో అని కి అట్లాంటి కర్తను ఆ వాక్యంలో చూపించలేం అందువల్లనే ఈ రెండో అని ని అవయవి సూచకమని వ్యవహరి స్తున్నాను ప్రముఖమైన సొంత అర్థమేమీ లేకుండా వ్యాకరణ నిర్మాణబోధనే ప్రధాన ప్రయోజనంగా గల శబ్దాలు అవయవిసూచకాలు అని అనే అంటే

అంటూ అనే శబ్దాలిట్లాంటివి తెలుగుభాషలో (మిగతా ద్రావిడభాషల్లో కూడా) ఇట్లాంటిశబ్దాలు చాలావరకు ధాతునిష్పన్నాలు కావటం విశేషం అను ధాతువు నుంచి పై శబ్దాలు నిష్పన్నమయినట్టుగానే అగు ధాతువు నుంచి 'కాక కాని, కాబట్టి' వంటి రూపాలు నిష్పన్నమయినై ఈ శబ్దార్థాలకీ వీటిమూలమైన ధాతువు అర్థానికీ ఉన్న భేదం స్పష్టమే భాషలో శబ్దజాలాన్ని విశ్వజ్ఞాన బోధకాలని (నామ క్రియాదులు) భాషాజ్ఞాన బోధకాలని (అవయవిసూచకాలు) విభజించ-వచ్చు (కృష్ణమూర్తి 1970) అవయవి సూచకాల అర్థం భాషాంతర్గతమైనది.

పైన ఉదాహరించిన వాక్యం (2)లో వ్యాకరణ నిర్మాణాన్ని ఈ విధంగా చూపించవచ్చు



| | గర్భి వాక్యం | | |
|---|---|---|---|
| | కర్త | కర్మ | క్రియ |
| (3) | అమాయకులు | నామం | అనుకుంటారు |

↑

△

(3 1) గర్భ వాక్యం

భారతదేశంలో ప్రజాస్వామ్యం ఉంది ← అని

(3) లో అనుకుంటారు అనే క్రియకు కర్మ (ఇక్కడ కర్మ అనే మాట చాలా సాధారణమైన అర్థంలో ఉపయోగిస్తున్నాను) స్థానంలో ఒక నామ పదం (పదబంధం కూడా గ్రాహ్యం) ఉండాలి ఆ స్థానాన్ని 3 1 ) లో సూచించిన వాక్యం ఆక్రమించింది విషయార్థంలో ఒక నామపదస్థానంలో ఒక వాక్యం చేరినప్పుడు అని శబ్దాన్ని అనుసంధించుకోవాలి ఇట్లా ప్రయోగించటానికి కొన్ని విధినిషేధాలున్నై వీటిలో (3 ) ని గర్భి వాక్యమనీ (3 1 ) ని గర్భ వాక్య మనీ వ్యవహరిస్తున్నాను గర్భి వాక్యంలో నామపదానికి బదులుగా ఒక వాక్యాన్ని ప్రయోగించే తీరును నామ్నీకరణ మంటారు పై వాక్యంలో విషయార్థాన్ని బోధించే నామ్నీకారకం అని

ఈ అని కొన్ని వాక్యాల్లో హేతు లక్ష్యార్థక సూచక మవుతుంది ఈ రెంటిమధ్య భేదం ముందు ముందు తెలుస్తుంది అని తో ఉన్న వాక్యాలన్నీ సంశ్లిష్ట (complex) వాక్యాలు ఈ వాక్యాల్లో అని కి పూర్వభాగం గర్భ వాక్యమూ పరభాగం గర్భి వాక్యమూ అవుతై హేతు లక్ష్యార్థసూచకా లయిన సంశ్లిష్ట వాక్యాలలో గర్భ వాక్యం గర్భివాక్యంలో ఆక్రమించే స్థానం నామానిదా అవ్యయానిదా అనే సమస్యను ఈ వ్యాసంలో ప్రస్తావించను వాక్యాల గుప్తనిర్మాణంలో అవ్యయాలూ నామాలూ వేరువేరా ఒకటేనా అనే సమస్య భాషాశాస్త్ర చర్చలో ఇంకా నలుగుతూనే ఉంది ఈ రకపు వాక్యాలతీరులో కొన్ని విశేషాలను పరిశీలించటమే ఈ వ్యాసంలో ప్రధానమైన లక్ష్యం హేత్వర్థకా లయిన ఈ క్రింది వాక్యాలను గమనించండి

4 జీతాలు చాలలేదని ఎన్జీవోలు సమ్మె చేశారు

5 పండక్కి స్కూటరు ఇయ్యలేదని అల్లుడు అలిగి వెళ్ళిపోయాడు

పై వాక్యాల్లో ఎన్జీవోలు సమ్మె చెయ్యటానికి అల్లుడు అలిగి వెళ్లటానికి హేతువుల్ని అని కి పూర్వమున్న వాక్యాలు సూచిస్తున్నై అందువల్ల అని కి పూర్వమున్న వాక్యాన్ని కారణవాక్య మనీ పరంలో ఉన్న వాక్యాన్ని కార్య వాక్యమనీ వ్యవహరించుకుందాం ఈ పై వాక్యాల నిర్మాణాల్ని పరిశీలిస్తే ఈ కింది విశేషాలను గ్రహించవచ్చు ఈ రెండు వాక్యాల్లోనూ కార్య వాక్యాల్లో కర్తృపదాలు మనుష్యవాచక శబ్దాలు కారణ వాక్యాల్లో కర్తృపదాలు మనుష్య వాచక శబ్దాలు కావచ్చు కాకపోవచ్చు (5) లో ఉన్న కారణవాక్యంలో కర్త మనుష్యవాచకశబ్దమే కాని (4) లో కాదు అని కి పూర్వపరభాగాలు రెండి ట్లోనూ మనుష్యవాచకశబ్దం కర్త కానప్పుడు అని ప్రయోగిస్తే ఏమవుతుందో ఈ క్రిందివాక్యాల్లో చూడవచ్చు

* 6 అద్దం కింద పడిందని పగిలింది

7 అద్దం కింద పడి పగిలింది

వాక్యం (6) వ్యాకరణ విరుద్ధం అని ని తొలగించి దానికి పూర్వమున్న సమాపకక్రియను క్త్వార్థక క్రియగామారిస్తే అది హేత్వర్థకం* కూడా అవుతుంది అని తో హేత్వర్థం రావాలంటే కారణవాక్యం సంగతి ఎట్లా ఉన్నా కార్య వాక్యంలో మాత్రం మనుష్యవాచకశబ్దం కర్తగా ఉండాలని తెలుతున్నది మొదటి క్రియను క్త్వార్థకరూపంగా మార్చి అని ని తొలగిస్తే ఈ నియమం వర్తించదు ఏకకర్తృకమై (ఇక్కడ కర్త అంటే (surface sub ect) అని మాత్రమే) అది అప్రాణివాచకమైతే క్త్వార్థకక్రియ సాధారణంగా హేత్వర్థకమే అవుతుంది (4) (5) వాక్యాల్లోకూడా అని ని తొలగించి క్త్వార్థకక్రియను ప్రవేశపెడితే ఏంజరుగుతుందో ఈ క్రిందివాక్యాల్లో చూడవచ్చు

8 జీతాలు చాలక ఎన్జీవోలు సమ్మె చేశారు

9 పండక్కి స్కూటర్ ఇయ్యక అల్లుడు అలిగి వెళ్లాడు

భిన్నకర్తృకమైన సంశ్లిష్టవాక్యంలో కర్తృ పదాలు ప్రాణివాచకాలయితే హేత్వర్థం మాట అట్లా ఉంచి అస లావాక్యాలే వ్యాకరణవిరుద్ధా లవుతై అదే ఏకకర్తృకమై అది మనుష్యవాచకశబ్దమైతే హేత్వర్థం రావచ్చు రాకపోవచ్చు

10 కిష్టప్ప అన్నం తిని బడికి వెళ్ళాడు

1 కిష్టప్ప అన్నం తినక చిక్కిపోయాడు

---

* దీన్ని హేత్వర్థకం అనటం సమజసం కాదేమో అన్న సందేహాన్ని లేవ దీశారు భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఆయన అభ్యంతరం సరి అయిందే ఇక్కడున్నది నిజానికి హేత్వర్థం కాదు ఒక అచేతనపదార్థం కాలంలో పొందిన భిన్నపరిణామ దశల్ని (పరిణామం సహజమే కాన క్కరలేదు) వాక్యం (7) సూచిస్తున్నది ఉత్తరోత్తర పరిణామాలు పూర్వపూర్వ పరిణామాల మీద ఆధారపడి ఉంటై అయితే ఈ భేద నిరూపణ ప్రస్తుతం నాకు అంత ప్రధానం కాదు గనక స్థూల దృష్టితో దీన్ని హేత్వర్థం అనే వ్యవహరిస్తున్నాను

(10 (11) సంఖ్యగల వాక్యాలు రెండూ ఏక కర్తృకాలే అయినా వాక్యం (10) హేత్వర్థ బోధకం కాదు వాక్యం (11) మాత్రం హేత్వర్థాన్ని బోధిస్తున్నది దీనికి కారణం ఈ వాక్యాల్లో సమాపక క్రియల్లో ఉన్న భేదమే వాక్యం (10) లో సమాపక క్రియ కర్త చేసిన వ్యాపారాన్ని బోధిస్తున్నది (11) లో సమాపక క్రియ కర్తృ దేహ స్థితిలో మార్పులు తెలియ పరుస్తున్నది క్త్వార్థక క్రియా ప్రయోగాల్ని పరిశీలించటం ఈ వ్యాసానికి ప్రధానలక్ష్యం కాదు

అసమగ్రమైనా ఆ పని ఇంకోచోట జరిగింది ప్రాస్తావికంగా హేత్వర్థ బోధతో క్త్వార్థకక్రియా ప్రయోగానికీ అని ప్రయోగానికీ ఉన్న భేదాన్ని పేర్కొన్నాను అని ప్రయోగాల్లో హేత్వర్థబోధకు కార్యవాక్యంలో మనుష్యవాచక శబ్దం కర్తగా ఉండాలని ప్రతిపాదించాం అట్లా లేని ఈ కింది వాక్యాలను చూడండి

12 నువ్వు ముందు వచ్చావని రైలు లేటుగా వచ్చింది

13 నువ్వు త్వరగా వచ్చావని ఇవాళ వానవాన కురిసింది

ఈ పైవాక్యాలు కార్యవాక్యాల్లో మనుష్యవాచక శబ్దాలు కర్తృపదాలు కాకపోయినప్పటికీ ఆమోద యోగ్యంగానే కనిపిస్తున్నై అయితే ఈ వాక్యాలు ఇంతకుముం దుదాహరించిన (4)(5 వాక్యాలకన్నా భిన్నమని మనం గుర్తించ వచ్చు ( 2) (13) వాక్యాల్లో మనకు తెలిసిన ప్రపంచజ్ఞానాన్నిబట్టి కార్యకారణ సంబంధం ఉంటటానికి వీల్లేని సంఘటనలకు అట్లాంటి సంబంధం ఉన్నట్టు కల్పించబడింది అని ద్వారా హేత్వర్థబోధ జరగటానికి కేవల కార్య కారణ సంబంధం ఉండటం మాత్రమే చాలదు కార్యవాక్యంలో కర్తకూడా అది కారణ మని భావించాలి ఈ భేదం తెలియాలంటే (4) 8) వాక్యాలను పరిశీలించాలి స్పష్టతకోసం వాటిని మళ్ళీ ఇక్కడ ఇస్తున్నాను

4 జీతాలు చాలక ఎన్జీవోలు సమ్మె చేశారు

5 జీతాలు చాలలేదని ఎన్జీవోలు సమ్మె చేశారు

వాక్యం (4) లో జీతాలు చాల లేదు అనేది కారణంగా ఎన్జీవోలు కూడా భావిస్తున్నట్టు మనకావాక్యంలో ఆధారం లేదు కాని వాక్యం (8) లో అని ప్రయోగంవల్ల మన కట్లాంటి సాక్ష్యం కనిపిస్తున్నది కాని (2)(13) సంఖ్యలు గల వాక్యాల్లో కార్యవాక్యాల్లో కర్తృపదాలు అప్రాణివాచకాలు కావటంవల్ల ఆలోచించగల సామర్థ్యం గలవి కావు కాని వాటికి అట్లాంటి శక్తిని ఆరోపిస్తున్నాం. అందువల్ల వీటిని వ్యాకరణాతిరక్తమైన వాక్యాలుగా గుర్తించాలి వ్యాకరణ విరుద్ధమైన వాక్యాలను వక్తలు కావాలని అర్థవంతంగా ప్రయోగించరు పొరపాటున గాని అజాగ్రత్త వల్లగాని అట్లాంటి వాక్యాలు ప్రయోగించినా తమకు తాము తప్పని తెలుసుకున్నా ఎవరైనా ఎత్తిచూపినా వాటిని సవరించుకోటానికి ప్రయత్నిస్తారు వ్యాకరణాతిరిక్తమైన వాక్యాలను వక్త కావాలని ప్రయోగిస్తాడు మానవునిలో సహజంగా ఉండే సృజనాభిలాషే ఇందుకు కారణం ఈ అభిలాష సాహిత్యకారుల్లో ఎక్కువగా ఉంటుంది అందుకే సాహిత్యంలో ఇట్లాంటి వాక్యాలు ఎక్కువగా కనిపిస్తై

(12) (3) ల్లో కార్యవాక్యాల్లో అప్రాణివాచకాలు కర్తలుగా ఉన్నై మనుష్యేతరమైన ప్రాణివాచకాలు కర్తృపదాలుగా వున్నప్పుడు ఏమవుతుందో ఈ వాక్యాలు చూడండి

14 పిల్లి వంటింట్లో దూరిందని కుక్క మొరుగుతున్నది

15 యజమాని వస్తున్నాడని కుక్క తోక ఆడిస్తున్నది

ఈ వాక్యాలు వ్యాకరణ సమ్మతాలుగానే కనిపిస్తున్నై ఈ ప్రయోగాల్లో (12) (3 వాక్యాల్లోలాగా కల్పన కూడా ఏమీ లేదు వీటిని వ్యాకరణ సమ్మతాలుగా మనం అంగీకరిస్తే కార్యవాక్యాల్లో మనుష్యవాచకశబ్దం కర్తగా ఉండాలని పైన చేసిన సూత్రీకరణ తప్పుతుంది మనుష్యవాచకశబ్దం అనటానికిబదులు ప్రాణివాచకశబ్దం అంటే ఈ సూత్రీకరణ నిలుస్తుంది అవికూడా జంగమ ప్రాణివాచకాలే అయివుండాలి స్థావరాలైన వృక్షజాతులు కర్తృ పదాలుగా వున్నప్పుడు అని ప్రయోగించటానికి వీలులేదు

కార్యవాక్యాల్లో జంగమప్రాణి వాచకాలు కర్తృ పదాలుగా ఉండాలని ప్రతిపాదించినా ఈ వ్యాసంలో మిగతాభాగంలో మనుష్య వాచక శబ్దాలను దృష్టిలో ఉంచుకొనే పరిశీలిస్తాను మనుష్య వాచక శబ్దం కర్తగాలేని కార్యవాక్యం ఉన్న ఈ వాక్యాన్ని గమనించండి

16 మంత్రిగారు రాలే దని సభ వాయిదా పడింది

ఈ వాక్యంలో అని కి పరభాగంలో మనుష్యవాచక శబ్దం కర్తగా లేక పోయినప్పటికీ ఇది వ్యాకరణ సమ్మతమే అయితే ఇక్కడ సభ అనేది మనుష్య వాచకం కాదని తోసివెయ్యలేం సభ లో మనుష్యబోధ (human reference) ఉంది కర్తగా మనుష్య వాచక శబ్దం లేకపోయినా మనుష్య స్ఫూర్తిని కలిగించే శబ్దం ఉంటే చాలునని సూత్రంలో చేర్చుకోవచ్చు

కార్యవాక్యంలో మనుష్యవాచక శబ్దాలు ఉన్నా వ్యాకరణ సమ్మతం గాని ఈ కింది వాక్యాలు చూడండి

*(17) వానలో తడిశా దని మావాడికి జలుబు చేసింది

*(18) ఆధునికమైన ఆయుధా ల్లేవని మన సైనికులు ఓడిపోయారు

*( 9) చదవకుండా గాలికి తిరిగా దని మావాడు పరీక్ష తప్పాడు

(17) కార్యవాక్యంలో జలుబు కర్త పదంగా కనిపిస్తుంది అది ప్రాణి వాచకం కాదు గనక (17) వ్యాకరణ విరుద్ధం అనుకోవచ్చు (18) (19) లలో మనుష్య వాచక శబ్దాలు కర్తలుగానే ఉన్నాయి అయినా అవి వ్యాకరణ సమ్మతాలు కావు

జలుబు చేయు ఓడిపోవు పరీక్ష తప్పు అనే క్రియలు వ్యాపార బోధకం కావు అవి తమకు ఆశ్రయమైన ప్రాణుల అనుభవాల్ని మాత్రమే తెలియజేస్తాయి పై వాక్యాల వ్యాకరణ విరుద్ధతకి ఇది కారణమేమో ననిపించ వచ్చు కాని ఈ కింది వాక్యం అందుకు వీలు కల్పించటం లేదు

(20) నేను రోజూ ఆలస్యంగా ఇంటికి వస్తానని మా ఆవిడకి కోపం

వాక్యం (20) లో కోపం నామమైనా ఆఖ్యాత స్థానంలో ప్రయుక్త మైంది. ఇది క్రియి చేసే పనే చేస్తుంది ఇక్కడ కోపం వ్యాపారం కాదు అనుభవం (experience) అయినా పై వాక్యం వ్యాకరణ సమ్మతమే అవు తుంది అందువల్ల అనుభవాల్ని వ్యక్తం చేసే క్రియ లుండటం వల్ల (17) (18) ( 9) వాక్యాలు వ్యాకరణ విరుద్ధాలు అయినయ్యన్న సూచన నిలవదు

ఊటబు చెయ్యాలని ఓడిపోవాలని పరీక్ష తప్పాలని ఎవరూ కోరుకోరు. అందువల్ల ఇవి ఇచ్ఛాపూర్వకం కావు ఇచ్ఛాపూర్వకంగాని క్రియా పదాలు కార్య వాక్యాల్లో ప్రయోగించటం వల్ల ( 7) - (19) వాక్యాలు వ్యాకరణ విరుద్ధా లయినయ్యని తోచవచ్చు కాని కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఓడి పోవాలని పరీక్ష తప్పాలని కొందరు కోరుకోటం అసంభవమేమీ కాదు అప్పుడీ వాక్యాలు వ్యాకరణ సమ్మత మవుతాయి

(21) వియత్కాంగ్ గెరిల్లాలు గెలవాలని అమెరికన్ సైనికులు ఓడి పోయారు

(22) మళ్ళీ కాలేజీలో చేరాలని మా వాడు పరీక్ష తప్పాడు

అమెరికాలో ప్రబలంగా ఉన్న యుద్ధ వ్యతిరేకోద్యమ ప్రభావం వియ త్నాంలో పోరాడుతున్న అమెరికన్ సైనికుల మీద కూడా ఉంది ఈ సంద ర్భాన్ని దృష్టిలో పెట్టుకుంటే (21) వ్యాకరణ సమ్మతమే ఆటల మీద దృష్టి ఉన్న విద్యార్థి మళ్ళీ కాలేజీలో చేరా లనుకోటం సహజమే ఆ దృష్టితో చూస్తే (22) కూడా వ్యాకరణ సమ్మతమే ఇచ్ఛాపూర్వకత ఉన్న కారణంగా (21) (22) వాక్యాలు వ్యాకరణ సమ్మతమైనయ్యని అది లేని కారణంగా (19) (20) వ్యాకరణ విరుద్ధమైనట్టు సూత్రించుకోవచ్చు అయితే ఈ కింది వాక్యం అందుకు లొంగటం లేదు

(23) రోజూ ఆలస్యంగా ఇంటికి వెళతానని మా ఆవిడ బాధ పడుతుంది

ఈ పై వాక్యం వాకరణ సమ్మతమే కాని క్రియ ఇచ్ఛాపూర్వకం కాదు మా ఆవిడ బాధ పడాలని కోరుకోటం లేదు తప్పనిసరై బాధ పడుతున్నది

కాబట్టి ఇచ్ఛాపూర్వకత్వాన్ని ఈ వాక్యాల వ్యాకరణ సమ్మతికి కారణంగా నిరూపించలేము

వ్యాకరణ సమ్మతమైన (4) 5) (8 (16) (20) (23) వాక్యాల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక సామాన్య లక్షణం కనిపిస్తున్నది ఆ వాక్యాల కార్య వాక్యాల్లో ఆఖ్యాతాలు వ్యక్తం చేసే ప్రవృత్తులు (actions events, experiences processes and states) వీటికి ఆశ్రయమైన మనుషులకు స్వాధీనంలో ఉన్నట్లుగా కనిపిస్తున్నాయి సభ వాయిదా పడింది (16) అనే చోట కొంత భిన్నంగా కనిపిస్తుంది ఇక్కడైనా వాయిదా పడు అనే క్రియ బోధించే వ్యాపారం మనుష్య కర్తృకం కాక తప్పదు అంటే వాన కురవటం ఎండ కాయటం పిడుగులు పడటం వంటి వ్యాపారాల్లాగా కర్తృ విరహితంగా జరిగే వ్యాపారం కాదు వాయిదా పడటం అట్లాగే వాక్యం (17) లో జలుబు చేయు అనే క్రియ వ్యక్తం చేసే వ్యాపారం కూడా వాన కురవటం లాగే మనుష్య కర్తృకం కాదు అందువల్ల దాన్ని వ్యాకరణ సమ్మతంగా మార్చటం సాధ్యం కాదు కాని ( 8) .9) వాక్యాల్లో ఓడిపోవు పరీక్ష తప్పు అనే క్రియలు వ్యక్తం చేసే వ్యాపారాలు (21) (22) వాక్యాల్లో కర్త్రధీనంగా ఉన్నట్లు మార్చటం వల్ల ఇవి (21 22) వ్యాకరణ సమ్మతం కాగలిగినై

ఇంగ్లీషు భాషలో కొన్ని సంశ్లిష్ట వాక్యాలను వివరించే సందర్భంలో Susumo Kuno అనే పరిశోధకుడు (Kuno)* = control అనే అంశాన్ని కొన్ని క్రియలకు ప్రతిపాదించినట్టు Arlene Berman పేర్కొన్నది (Berman 970) ఈ అంశం కొన్ని క్రియలకు స్వతస్సిద్ధమైనా మరి కొన్ని క్రియలకు సందర్భాన్నిబట్టి (+ −లు) మారవచ్చునని కూడా సూచించింది అంతేకాక క్రియల్ని పూర్తి స్వాధీనంలో ఉన్నవిగానూ (వెళ్ళు పోవు తిను వంటివి) మరికొన్ని అసలు స్వాధీనంలో లేనివిగానూ (జలుబు చేయు జ్వరం వచ్చు పిచ్చెక్కు అలసిపోవు వంటివి) మరికొన్నిటిని కొంత స్వాధీనంలో ఉన్నట్టుగానూ (బహుశా కోపం వచ్చు బాధపడు వంటివి) ఆమె విభజించ

---

* Susumo Kuno రాసిన ఈ వ్యాసం నాకు దొరకలేదు Arlene Berman చెప్పిందే నా కాధారం

చింది తెలుగులోనూ అట్లాంటి విభజన చెయ్యవచ్చునని పైచర్చనుబట్టి స్పష్టమే +control అనే అంశం ఉన్న క్రియలలో +colition అనే అంశం కూడా కలసి ఉంటుం దని ఆమె భావించినట్టు తోస్తున్నది అంటే స్వాధీన క్రియల్లో ఇచ్ఛాపూర్వకత కూడా ఇమిడి ఉంటుందని ఆమె సూచన కాని తెలుగులో వాటిని వేరు చెయ్యటానికి వీలున్నట్టు కనిపిస్తున్నది కోపం అనే ఆఖ్యాతానికి +control (స్వాధీనత) +volition (ఇచ్ఛాపూర్వకత) ఉంటే 'బాధపడు ఆఖ్యాతానికి + control −vo ition (అనిచ్ఛా పూర్వకత) ఉన్నయ్యని చెప్పాల్సి ఉంటుంది పైన చర్చించిన వాక్యాలను గురించి నా అవగాహన సరైనదయితే control volition అనే అంశాలను వేరు చెయ్యక తప్పదు

హేత్వర్థమూ లక్ష్యార్థమూ వేరువేరని ఈ వ్యాసం పూర్వభాగంలో చెప్పబడింది ఈ రెండూ ఎందుకు వేరో ఇప్పుడు పరిశీలిద్దాం ఇందుకోసం పూర్వోదాహృతమైన వాక్యాల్ని ఇక్కడ ఉద్ధరిస్తున్నాను

*19 చదవకుండా గాలికి తిరిగా దని మావాడు పరీక్ష తప్పాడు

22 మళ్ళీ కాలేజీలో చేరా లని మావాడు పరీక్ష తప్పాడు

వీటిలో (19) వ్యాకరణ విరుద్ధం (22) వ్యాకరణ సమ్మతం మొదటి వాక్యంలో హేత్వర్థ మున్నా పరీక్ష తప్పు అనే క్రియా వ్యాపారం కర్త్రధీనంలో లేనట్టు ఊహించటం వల్ల వ్యాకరణ సమ్మతమైంది ఉన్నట్టు ఊహించటం వల్ల రెండో వాక్యం (22) వ్యాకరణ సమ్మత మైంది ఈ రెండు వాక్యాల్ని కొద్ది మార్పులు చేస్తే వచ్చే ఈ వాక్యాలను గమనించండి

| | తిరిగాడు కాబట్టి | |
|---|---|---|
| (24) చదవకుండా గాలికి | తిరగటంవల్ల | మావాడు పరీక్ష తప్పాడు |
| | తిరిగి | |

| | చేరాడు కాబట్టి | |
|---|---|---|
| *(25) మళ్ళీ కాలేజీలో | చేరటం వల్ల | మావాడు పరీక్ష తప్పాడు |
| | చేరి | |

పూర్వంలో వ్యాకరణ విరుద్ధమైన వాక్యం (9) (24) గా మారి వ్యాకరణ సమ్మతమైంది వాక్యం (25) ఇతరసందర్భాల్లో వ్యాకరణ సమ్మతమైనా (22) లో ఉద్దేశించిన అర్థానికి ఇది విరుద్ధం (24) (25) వాక్యాల్లో చేసిన మార్పులు వాక్యంలో ఉన్న రెండు క్రియల వ్యాపారాలూ కాలంలో కూడా అదే క్రమంలో జరిగినట్టు భావిస్తేనే వ్యాకరణ సమ్మతమవుతై (24)లో గాలికి తిరగటం మొదట జరిగిన వ్యాపారం పరీక్ష తప్పటం తరువాత జరిగిన ఫలితం కాని (25) లో అట్లా కావటానికి వీల్లేకపోవటం వల్ల ఉద్దేశించిన అర్థంలో వ్యాకరణ సమ్మతం కాలేకపోయింది (22) లో *పరీక్షతప్పటం* మొదట జరిగితేనే *'మళ్ళీ కాలేజీలో చేరటం'* సాధ్యమవుతుంది అందువల్ల *'మళ్ళీ కాలేజీలో చేరటం'* అనేది లక్ష్యం ఆ లక్ష్యసాధనకు పరీక్ష తప్పటం మార్గం (22) *'చేరాలి'* అనే క్రియ భవిష్యదర్థకం అందువల్ల హేత్వర్థం కాలేక పోయింది కాలక్రమంలో పూర్వవ్యాపారం జరగబోయే పరవ్యాపారానికి హేతువవుతుంది పరవ్యాపారం పూర్వవ్యాపారానికి లక్ష్యమవుతుంది వాక్యం (22) ని అర్థభేదం లేకుండా ఈ కిందివిధంగా మార్చవచ్చు

26 మళ్ళీ కాలేజీలో చేరటంకోసం మావాడు పరీక్ష తప్పాడు

ఇక్కడ *'కోసం'* అనే విభక్తి ప్రత్యయాన్ని చేర్చటంవల్ల (22) లో ఉద్దేశించిన అర్థానికి భంగం కలగకుండా వాక్యం నిష్పన్నమయింది (22) (26) వాక్యాలు సమానార్థకాలు తెలుగులో *'కోసం'* లక్ష్యార్థబోధకమైన విభక్తి ప్రత్యయం

హేత్వర్థక మైనప్పుడు సంశ్లిష్ట వాక్యంలో క్రియలు వ్యాపారాలు కాలంలో జరిగిన క్రమంలోనే ఉంటై అప్పుడు కారణవాక్యంలో క్త్వార్థకక్రియ గాని వల్ల పరకమైన భావార్థక క్రియారూపంగాని *'కాబట్టి'* పరకమైన సమాపకక్రియగా *'అని'* పరకమైన *'అలి'* ప్రత్యయయుక్త రూప మున్నప్పుడు మొదటి వాక్యభాగం (clause) లక్ష్యార్థక మవుతుంది అలి ప్రత్యయ యుక్తరూపాలు భవిష్యదర్థబోధకాలు అలి ప్రత్యయ యుక్తరూప మున్న వాక్యం అని పరమై ఇంకోవ్యాపారాన్ని సూచించే గర్భివాక్యంతో గర్భితమైనప్పుడు ఎప్పుడూ లక్ష్యార్థకమే కావటం ఇక్కడ గమనించదగింది గర్భివాక్యంలో అస్త్యర్థక క్రియ ఉన్నప్పుడు కాంక్షార్థక మవుతుందని వేరేచోట సూచించాను

ఈ లక్ష్యార్థక వాక్యాల్లో గర్భి గర్భవాక్యాలు ఏక కర్తృకమైనప్పుడు 'అలి' కి బదులు 'దాం'అనే ప్రత్యయాన్ని ఆదేశం చెయ్యవచ్చు

27 మళ్ళీ కాలేజీలో $\frac{\text{చేరా లని}}{\text{చేరదా మని}}$ మావాడు పరీక్ష తప్పాడు

అలి ప్రత్యయంగా ఉన్న రూపాలలో పురుషబోధకత లేదు కాని దాం ఉభయప్రార్థనార్థక రూపం 'అని' పరకమైనప్పుడు ఆ అర్థంలేదు ఈ రెంటికీ ఉన్న సంబంధం ప్రస్తుతానికింకా కొరుకుడు పడనిదే

తెలుగులో రెండువాక్యాలమధ్య కారణకార్య సంబంధం వ్యక్తం చెయ్యటానికి ఆ రెండిటినీ అని శబ్దంతో అనుసంధించటం ఒక పద్ధతి అని పై చర్చ వల్ల తెలుస్తున్నది అట్లాంటిదే ఇంకోపద్ధతి అని కి బదులు కాబట్టి అనే శబ్దాన్ని ప్రయోగించటం

28 వాళ్లన్నయ్య వచ్చాడని మా ఆవిడ గారెలు వండింది

19 వాళ్లన్నయ్య వచ్చాడు కాబట్టి మా ఆవిడ గారెలు వండింది

స్థూలదృష్టికి (28) (29) వాక్యాలు సమానార్థకంగా కనిపిస్తై కాని వాటి మధ్య భేదం ఉంది అది ఈ కింది వాక్యాలవల్ల వ్యక్తం అవుతుంది

30 వాళ్లన్నయ్య వచ్చాడని మా ఆవిడ గారెలు వండింది కాని నిజానికి ఆయన రాలేదు

* 31 వాళ్లన్నయ్య వచ్చాడు కాబట్టి మా ఆవిడ గారెలు వండింది కాని నిజానికి ఆయన రాలేదు

వాక్యం (30) లో వాళ్లన్నయ్య వచ్చాడు అనే భాగం యథార్థ కావచ్చు కాకపోవచ్చు అది మా ఆవిడ భావన మాత్రమే కావచ్చు వాక్యం (30)ని ప్రయోగించిన వక్త దృష్టిలో అది నిజం కాకపోవచ్చు వాక్యం (31)ని ప్రయోగించిన వక్త వాళ్లన్నయ్య వచ్చాడు అనే భాగం యథార్థమని నమ్మితేనే అది ప్రయోగించగలుగుతాడు తరువాత భాగంలో దానికి విరుద్ధమైన అంశం ఉండకూడదు అంటే స్వయం వైరుద్ధ్యం (self contradiction)

తవుతుంది అందువల్ల (31) వ్యాకరణ విరుద్ధమయింది దీన్నిబట్టి కార్య వాక్యంలో కర్తృభావసని అని తో ఉన్న కారణవాక్యం సూచిస్తున్నదని అనుకోవచ్చు ఈ సందర్భాల్లో అని కి బదులు అనుకొని అని ప్రయో గించినా అర్థభేదం రాదు పైవాక్యాల్లో 'వచ్చాడు' అనే భూతకాలిక క్రియకు బదులు భవిష్యదర్థకక్రియ వాడినా సరిగ్గా ఇంతే జరుగుతుంది

32 వాళ్లన్నయ్య వస్తాడని మా ఆవిడ గారెలు వండింది కాని ఆయన రాలేదు

* 33 వాళ్లన్నయ్య వస్తాడు కాబట్టి మా ఆవిడ గారెలు వండింది కాని ఆయన రాలేదు

'కాబట్టి' తో అనుసరించిన వాక్యంలో వైరుధ్యం ఉంది గనుక (33) వ్యాకరణ విరుద్ధమయింది

ఈ వ్యాసంలో ఇంతవరకూ చర్చించిన హేత్వర్థక అని వాక్యాలు అనేక కర్తృకాలు ఏక కర్తృక మైనప్పుడు ఏం జరుగుతుందో ఇప్పుడు చూద్దాం ముందుగా ఈ వాక్యాలను పరిశీలించండి

? 34 మా అబ్బాయి ఇడ్డెన్లు తిన్నాడని భోజనం మానేశాడు

35 మా అబ్బాయి ఇడ్డెన్లు తిన్నానని భోజనం మానేశాడు

? 36 ఇడ్డెన్లు తిన్నావని భోజనం మానేశావు

37 ఇడ్డెన్లు తిన్నానని భోజనం మానేశావు

ఈ పై వాక్యాల్లో ప్రశ్నార్థక ముంచిన వాక్యాల వ్యాకరణ ప్రతిపత్తిని గురించి ఈ వ్యాసకర్త చాలా మంది వ్యవహర్తల్ని పరిశీలించి చూశాడు కొందరు వీటిని బాగానే ఉన్నయ్యన్నారు కొందరు వీటికన్నా (35) (37)మే లన్నారు మరికొందరు వీటిమధ్య భేదాన్ని వెంటనే గుర్తించలేక పోయారు * నా మట్టుకు

---

* నాతరఫున డాక్టరు తిమ్మారెడ్డి నిర్మల ఈ వాక్యాల్ని గురించి కొందరు వ్యవహర్తలను బెజవాడలోనూ తిరుపతిలోనూ ప్రశ్నించినట్టు తెలియ వచ్చింది కాని ఫలితం ఇదే

నాకు (34) కన్నా (35) (36) కన్నా (37) ఎక్కువ వ్యాకరణ సమ్మతంగా కనిపిస్తున్నై. అంతేకాదు నా వ్యవహారంలోనూ మా ఆవిడ వ్యవహారంలోనూ (34) (36) వాక్యాలు సాధ్యంకూడా కావని చెప్పవచ్చు ప్రస్తుతానికి ఈ రెండు రకాల వాక్యాలు (34) (36) — (35) (37) వ్యాకరణ సమ్మతాలుగా అంగీకరించినా (35) (37) వాక్యాల్లో ప్రథమ మధ్యమపురుషబోధకక్రియలు ఉత్తమపురుషపరివర్తనను ఎట్లా సహించినయ్యో చెప్పవలసినబాధ్యతవ్యాకర్తమీద ఉంది ఇట్లాంటి పురుష వ్యత్యయం పరోక్షానుకృతిలో ఉంది ఉదాహరణకు ఈ కింది వాక్యాలు గమనించండి

38 సుశీల రేపు కాలేజీలో కలుస్తా నని చెప్పింది

39 నువ్వు నిన్న ఢిల్లీ వెళ్తున్నా నని చెప్పావు

(38) లో ప్రథమపురుష కర్త, (39) లో మధ్యమ పురుష కర్త కాని గర్భవాక్యా (అనికి పూర్వమున్న వాక్యభాగా)ల్లో క్రియలు ఉత్తమపురుషలో ఉన్నై ఈ వాక్యాలకు గుప్తనిర్మాణంలో ఉత్తమ పురుషసర్వనామాన్ని కర్తగా ప్రతిపాదించి క్రియా విభక్తిని కర్త్రనుకూలంగా చేర్చేసూత్రం (Agreement Rule) తరువాత సర్వనామపరివర్తనసూత్రాన్ని (Pronominal Change) అనువర్తించటంద్వారా ఈ వ్యత్యయాభాసాన్ని తొలగించవచ్చు నని ఇంకోచోట సూచించబడింది (35) (37) వాక్యాలకు పరోక్షానుకృతితో సంబంధమున్నట్టు కనిపిస్తున్నది బహుశా ఆ సూత్రాలనే ఈ వాక్యాల విషయంలో కూడా అనువర్తించటానికి వీలుపడవచ్చు అయితే ఈ వాక్యాలకు ప్రతిపాదించే గుప్త నిర్మాణ మెట్లా ఉండాలనే ప్రశ్న ఒకటున్నది ప్రస్తుతం దీనికి స్పష్టమైన సమాధానం ఇచ్చే పరిస్థితిలో ఈ వ్యాసకర్త లేడు ఇందుకు తెలుగులో అని ప్రయోగాల సమగ్రపరిశీలన ప్రపంచభాషలలో అను కరణవాక్యాల తత్వ పరిశీలనా అవసరం వ్యవహర్త తానుగాని ఇతరులుగాని అన్న లేక అనుకొన్న వాక్యాలను గాని భావాలనుగాని ఇతరులకు (తనకు తానైనా) చెప్పే పద్ధతిని

అనుకరణ అంటాం ఈ ఉదాహరించిన వాక్యాలను కూడా అనుకృతిలో భాగంగా గ్రహిస్తే—గ్రహించటం తప్పనిసరి కావచ్చు—మనమిప్పు డనుకునే దానికన్నా అనుకృతి పరిధి ఇంకా విస్తృత మని తేలుతుంది బహుశా అని ఉన్న వాక్యాలన్నీ అనుకృతిలో భాగంగానే భావించాల్సి రావచ్చు అప్పుడు శబ్దం భావం హేతువు కాంక్ష లక్ష్యం—ఇవన్నీ అనుకరణయోగ్యా లవుతై అయితే ఈ నిర్ణయం తీసుకోటానికి ప్రస్తుత మున్న అధారాలు చాలవు ఈ సమస్య భావి పరిశోధనలో తేలవలసిందే

ఇది ఇట్లా ఉండగా ఉత్తమ పురుషైక కర్తృకమైన ఈ వాక్యాన్ని పరిశీలించండి

* 40 నేను ఇడ్డెన్లు తిన్నా నని భోజనం మానేశాను

ఈ వాక్యం కూడా నాకు వ్యాకరణ సమ్మతంగా తోచటం లేదు నా నిర్ణయం సరి అయిందే అయితే అనుత్తమపురుషకర్తృక వాక్యాలలో క్రియ ఉత్తమపురుష పరివర్తనాన్ని సహించగా ఉత్తమపురుష కర్తృకమైన ఈ వాక్యం అనుకరుణాన్ని సహించక పోవటానికి కారణం బోధపడటం లేదు బహుశా ఈవాక్యంలో కొందరికి సమ్మతం కావచ్చు (34-35) వాక్యాల్లో ప్రయోగించిన తిను అనే కియకు కర్మ అప్రాణివాచకం ప్రాణివాచకం కర్మగా ఉన్నప్పుడు అని హేత్వర్థ సమర్థమౌతుందా అనికూడా చూడాలి అందుకీ వాక్యాలు చూడాలి

(41) పెద రామయ్యగారు పిల్లిని చంపానని / చంపాడని గుడి కట్టించాడు

(42) పెదరామయ్యగారు పిల్లిని చంపి గుడి కట్టించాడు

(43) మా పక్కావిడ మమ్మల్ని తిట్టానని / తిట్టిందని మాయింటికిరావటంలేదు

(44) మా పక్కావిడ మమ్మల్ని తిట్టి మా ఇంటికి రావటం లేదు

ఈ పైవాక్యాల్లో (41) (43) కన్నా (42) (44) వాక్యాల్నే వ్యవహర్తలు సమ్మతిస్తారు అందుకు (41) (43) వాక్యాలు వ్యాకరణ విరుద్ధం కావటం కారణమా ? ఒకవేళ ఇవి వ్యాకరణ విరుద్ధాలయితే దీనికి కారణం తేలిగ్గానే చెప్పవచ్చు ప్రాణివాచక నామం కర్మగా ఉంటే క్రియతో అని శబ్దం హేత్వర్థ బోధక సమర్థం కాదు అయితే ప్రాణివాచక కర్మకీ హేత్వర్థకమైన అనికీ ఉన్న వైరుధ్య మేమిటో చెప్పకపోతే ఈ సూచన సమయానికి అడ్డం పెట్టుకున్న సూత్రం (ad hoc rule) అవుతుంది గాని సారవంతమైన (well motivated) సూత్రం కాదు

ఇంతవరకూ తెలుగులో అని ప్రయోగాన్ని గురించి చేసిన చర్చ తెలుగుకి మాత్రమే పరిమితం కాదు ఇవి మిగతా ద్రావిడ భాషల్లో కూడా ఇట్లాగే ఉంటై ప్రపంచభాషల్లో అనుకరణ తత్వపరిశీలన చేస్తే ఇప్పుడు సమస్యలుగా మిగిలిపోయినవి అప్పుడు పరిష్కారం కావచ్చు.

# పత్రికా రచనలో భాషా ప్రయోగం

నిన్న మొన్నటి వరకూ భాషా ప్రయోగానికి మూలమయిన (భాషా) లక్ష ణాలను పరిశీలించి సూత్రబద్ధం చెయ్యటమే భాషా పరిశోధన లక్ష్యంగా ఉండేది ఈ రకమైన పరిశోధనలో భాషా ప్రయోక్త ఉన్న స్థితిగతులు సామాజిక వ్యవ స్థలో అతని ఉనికి పాత్ర వ్యవహరించే విషయ వైవిధ్యం మొదలైన వాటికి ప్రాముఖ్యం ఉండేది కాదు మరీ ముఖ్యంగా ఛామ్స్కీ (Chomsky) మొద లైన వారు ప్రతిపాదించి వ్యాప్తికి తెచ్చిన పరివర్తన సిద్ధాంతం (Transformational theory) లో వ్యవహర్త ఉంటున్న సమాజంతో సంబంధం లేకుండా అతనిలో అంతర్గతంగా ఉన్న అమూర్త వ్యాకరణ సూత్రాలను కనుక్కోటమే ప్రధాన లక్ష్యంగా ఉండేది భాషను గురించి వ్యవహర్తకు పరిజ్ఞానం ఉంటుందనీ దీని ఆధారంతో వ్యవహర్త భాషా వ్యవహారాన్ని సాగిస్తాడనీ చామ్స్కీ ప్రతి పాదించాడు ఈ పరిజ్ఞానాన్ని పరిశోధించటమే భాషా శాస్త్ర లక్ష్యంగా భావిం చాడు భాషా ప్రయోగంలో వ్యవహర్తకున్న భౌతిక పరిమితుల ననుసరించి కొన్ని లోపాలుంటయ్యనీ ఈ పరిమితుల కతీతమైన భాషా యంత్రాంగాన్ని పట్టు కోటమే పరిశోధకుల కర్తవ్యమనీ ఆయన భావం సర్వ భాషా సామాన్య లక్ష ణాల పరిశోధనకూడా పైలక్ష్యంతో ముడిబడే ఉంది ఈ లక్ష్యాల ప్రాధాన్యాన్ని ఎవరూ కాదనలేదు

అయితే ఛామ్స్కీ రచనలుగాని ఆ మార్గంలో కృషి చేస్తున్న ఇతర పరిశోధకుల రచనలుగాని చదివితే భాషా మూల సూత్రాలు మాత్రమే పరిశోధ నార్హమైనవనీ భాషా ప్రయోగరీతులు పరిశీలనార్హమైనవి కావనీ ఒక అపోహ కలిగే వీలుంది భాషా ప్రయోగ రీతులు పరిశీలించక్కర్లేదని ఛామ్స్కీగాని అతని సహ పరిశోధకులుగాని ఎక్కడా చెప్పలేదు అయితే ఆ మార్గంలో కృషి చేసిన పరిశోధకులు మూల సూత్రాన్వేషణలోనే మునిగి పోయి ప్రయోగ రీతులను పట్టించుకోలేదు

కాని ఇటీవలి పరిశోధకుల దృష్టి భాషా ప్రయోగ రీతి వైపు మళ్లింది భాషా ప్రయోగాన్ని మూల సూత్రాలు నడుపుతున్న మాట నిజమే అయినా ప్రయోక్త ఉన్న సమాజస్థితి అతను ఉద్దేశించిన శ్రోతలు (పాఠకులు) వాళ్లతో ప్రయోక్తకున్న సంబంధం ప్రస్తావించే విషయం ప్రయోగ వాహకం(పత్రిక రేడియో మొ )—వీటన్నిటికీ తగిన ప్రమేయం ఉందనీ గుర్తించిన ఇటీవలి పరిశోధకులు ఈ దృష్టితో పరిశీలన సాగిస్తున్నారు ఇంకా విశేషమేమిటంటే ఈపై చెప్పిన బహిః పరిస్థితులు మూల సూత్రాలను కూడా ప్రభావితం చేస్తున్నట్టు శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు

ఇంతమాత్రాన ఏక భాషా లక్షణ పరిశోధనగానీ సర్వభాషా లక్షణ పరిశోధనగానీ ఆగిపోయినయ్యని అర్థం కాదు వాటి ప్రాధాన్యం తగ్గిందనీ భావం కాదు నిజానికి అది ఎప్పుడూ ఆగిపోదు ఆ మార్గంలో పరివర్తన సిద్ధాంతాన్ని దాటి కొత్త కొత్త సిద్ధాంతాలు(Generative Semant cs Relat onal Grammar మొ ) ప్రతిపాదితమవుతూనే ఉన్నై ఆ సిద్ధాంతాల ననుసరించి జరుగుతున్న పరిశోధనలవల్ల – భాషలను గురించి సరికొత్త రహస్యాలు వెల్లడి అవుతూనే ఉన్నై జరిగిందల్లా ఒకటే భాషా పరిశోధన బహుముఖాలుగా వివిధ రంగాలకు విస్తరించింది అట్లాంటి రంగాల్లో పత్రికల భాషా ప్రయోగం ఒకటి ఆధునిక జీవన సరళిలో పత్రికల ప్రాముఖ్యాన్ని గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది సామాజికుల ఆలోచనా విధానం మీద వారి భాష మీద వారు చదివే పత్రికల ప్రభావం అమితంగా ఉంటుంది హైదరాబాదు వంటి పెద్ద నగరాల్లో తప్ప చిన్న పట్టణాల్లో ఆంగ్ల విద్యాధికుల సంఖ్య తక్కువ అక్కడ ఉన్న హైస్కూళ్ళలోగాని కాలేజీల్లోగాని చదువుకున్నవారు ఎక్కువగా తెలుగు మీడియంలో చదువుకున్నవారే ప్రస్తుతమున్న ఆంగ్ల విద్యా బోధన స్థితివల్ల ఆ ప్రాంతాల్లో (చిన్న పట్టణాల్లోనూ పల్లెటూళ్ళలోనూ) జాతీయ అంతర్జాతీయ ప్రాంతీయ వార్తలకోసం తెలుగువారు ఎక్కువగా తెలుగు పత్రికలమీదనే ఆధార పడుతున్నారు ఆ యా విషయాలను గురించి ముచ్చటించు కొనేటప్పుడు వారు చదువుతున్న పత్రికల భాషా ప్రభావం తప్పకుండా ఉంటుంది ఉదాహరణకు ఒక రాజకీయ పక్షంలో తాలూకా స్థాయిలోగాని జిల్లా స్థాయిలోగాని పని చేసే చురుకైన కార్యకర్త దేశ విదేశ విధానాలను గురించి మాట్లాడినప్పుడు పత్రికల భాషలోనే మాట్లాడటం గమనించవచ్చు ఏ రకమైన భాషద్వారా ఒక విషయం

సామాజికుడికి పరిచయమవుతుందో ఆ విషయ ప్రస్తావన వచ్చినపుడు అదే రకపు భాషను ప్రయోగించటం సహజంగా జరిగే పని అందువల్ల పత్రికల రచనా భాష కొన్ని వర్గాల ప్రజల వ్యవహార భాషను ప్రభావితం చెయ్యటమేగాక తీర్చి దిద్దుతుంది అందువల్ల పత్రికల రచనా భాషను పరిశీలించటమంటే కొంతమంది వ్యవహర్తల మౌఖిక భాషా వ్యవహారంలో ఒక భాగాన్ని పరిశీలించటమే అయితే భాష మౌఖిక భాషగా పరివర్తన చెందినప్పుడు కొన్ని మార్పులు జరుగుతై ఆ మార్పులు వేరుగా పరిశోధించాల్సిన అవసరం ఉందని గుర్తిస్తూనే ఈవ్యాసం కేవలం రచనా భాషకే పరిమితమవుంది మౌఖిక లిఖిత భాషల మధ్య చక్రనేమి క్రమ సంబంధం ఉంది అంటే ఒకదాన్ని ఒకటి పరస్పరం నిరంతరం ప్రభావితం చేస్తయ్యని అర్థం

పత్రికల భాషను పరిశోధించటంలో కొన్ని చిక్కులున్నై మొట్టమొదటగా పత్రికల భాష అంటే ఏమిటి అనే దానికి నిర్దిష్టమైన సమాధానం దొరకదు పత్రికల్లో మళ్ళీ దిన వార పక్ష మాస ద్వైమాసిక త్రైమాసికాది భేదాలున్నై వీటిని బట్టి విషయభేదమూ భాషాభేదాలూ ఉండొచ్చు రాజకీయ పత్రికల భాషకూ సాహిత్య పత్రికల భాషకూ భేదాలుంటై ఒక్క దిన పత్రిక తీసుకున్నా అందులో జాతీయ అంతర్జాతీయ సంబంధమైన వార్తల్లోనూ స్థానిక వార్తల్లోనూ ప్రకటనల్లోనూ సంపాదకీయాల్లోనూ ఇతర వ్యాసాల్లోనూ వాడే భాషంతా ఒకేరకంగా ఉండదు ఇంతేకాక పత్రికలలో కొలువుచేసే రచయితల దృక్పధాన్నిబట్టి వారి రచనా సామర్థ్యాన్నిబట్టి వారికి పైనుంచి వచ్చే పాలసీ నిర్ణయాల్నిబట్టి ఇతర ఆదేశాల్నిబట్టి భాషా ప్రయోగంలో భేదాలుండొచ్చు పైన చెప్పిన అన్ని రకాల భేదాలు విడివిడిగా పరిశీలనార్హాలే అయితే అది ఒకరిద్దరు మాత్రమే చేయదగిందికాదు ఒక విద్యాసంస్థ కొందరు పరిశోధకుల సాయంతో కొంతకాలం నియత ప్రణాళిక ననుసరించి పరిశోధిస్తే ఒకపాటి భాషాపరిశీలన సాధ్యం కావచ్చు ఈ వ్యాసం అట్లాంటి పరిశీలనకు పూర్వరంగం మాత్రమే

తెలుగు పత్రికలు తమ వార్తలకోసం ఇంగ్లీషుద్వారా వార్తలందించే వార్తాసంస్థలమీద ఆధారపడటంవల్ల—గుర్తించదగినంత ఇంగ్లీషు భాషా ప్రభావం కూడా తెలుగు పత్రికా రచనమీద కనబడుతుంది ఒకోసారి ఈ ప్రభావానికి

మూలం వెంటనే దొరక్కపోవచ్చు అయినా ప్రభావాన్ని గుర్తుపట్టటం కష్టం కాదు ఒక్కోసారి తెలుగు పత్రికలు తమ రచనలో సౌందర్యదృష్టి కూడా మిళితం చెయ్యటం మనం గమనించవచ్చు ఉదాహరణకు అమెరికా ప్రెసిడెంటు కార్టరు భార్య ఇండియా వచ్చినప్పుడు ఆమె నడకను వర్ణిస్తూ 2-1-78 నాటి ఆంధ్రప్రభ ఇట్లా రాసింది

కార్టరు సతి రోజలిన్ *సుతారంగా అడుగులు* వేస్తూ విమానాశ్రయంలో చేసిన స్వాగత సన్నాహాలనుచూసి *మురిసిపోతున్నట్టు* కనిపించారు

పై వాక్యంలో సుతారంగా అడుగులు వేస్తూ అన్నదానికి ఇంగ్లీషు రిపోర్టులో Walking gracefully అనీ మురిసిపోతున్నట్టు అన్నదానికి to be Enjoying అనీ (Indian Express) ఉంది ఇంగ్లీషు మాటల్లో లేని అర్థచ్ఛాయలు తెలుగు మాటల్లో కనిపిస్తున్నై తెలుగు పదాల్లో ఇంగ్లీషుని మించిన సౌందర్యదృష్టి కనిపిస్తున్నది

ఇంగ్లీషు ప్రభావం ఉన్నా లేకపోయినా కొత్త కొత్త రంగాలలో ప్రయుక్తమవుతున్న భాషలో కొన్ని మార్పులు జరగటం సహజం సాధారణంగా ఈ మార్పులు భాషను సంపూర్ణంగా మార్చివేసేవిగా ఉండవు భాషలోనే దాగి ఉన్న వనరులను అధికంగా ఉపయోగించటం కూడా ఈ మార్పులో భాగమే అటువంటి పద్ధతులు కొన్ని ఈ వ్యాసంలో పరిశీలించబడతై వీటిలో కొన్ని వాక్య నిర్మాణానికి సంబంధించినవయితే మరికొన్ని శబ్దార్థ కల్పనకు సంబంధించినవి కావచ్చు మరికొన్ని పత్రికా భాషా సామాన్య లక్షణాలను నిర్వచించేవి కావచ్చు వీటిమధ్య భేదాన్ని నిరూపించటం అంత తేలిక కాదు కనుక ఆ పని ఇక్కడ చెయ్యటం లేదు

పత్రికల భాషలో ఎక్కువ భాగం వార్తలకు రిపోర్టులను సంపాదకీయాలనూ ప్రధానంగా పరిశీలించాను ఇంగ్లీషు మూలాలు దొరుకుతయ్యన్న ఆశతో ఒకే సంస్థవారు ప్రచురిస్తున్న ఆంధ్రప్రభ Ind an Express లను ప్రధానాధారాలుగా ఎంచుకొన్నాను అప్పుడప్పుడు ఇతర పత్రికలను కూడా పరిశీలించాను

ఇక్కడే ఇంకొకమాట చెప్పటం కూడా అవసరం ఈ వ్యాసం పత్రికల భాషమీద తీర్పు ఇయ్యటానికిగాని తప్పులెన్నటానికి గాని ఉద్దేశించింది ఎంత మాత్రమూ కాదు నిర్మమతత్వంతో పత్రికల భాషను నాకు తోచినంతమట్టుకు పరిశీలన చెయ్యటమే ఈ వ్యాసానికి ప్రధాన లక్ష్యం ఈ పరిశీలనలో నేను గుర్తించిన ప్రధాన లక్షణాలను ఆయా శీర్షికల క్రింద చర్చిస్తాను

## 1. ప్రాచీన భాషా పునరుద్ధరణ :

ఇక్కడ ప్రాచీన భాషంటే సంస్కృతం కూడా ఉద్దేశించబడింది ఆధునికంగా కొత్త కొత్త భావాలను వ్యక్తీకరించేటప్పుడు నిత్యజీవితావసర పరిమితమైన పదజాలం చాలదు అటువంటప్పుడు నూతన భావ వ్యక్తీకరణకు – ఇతర భాషలనుంచి గాని ప్రాచీన భాషనుంచిగాని గ్రహించవలసి వస్తుంది ఇటీవల భద్రిరాజు కృష్ణమూర్తిగారు గుర్తించినట్టుగా మౌఖిక భాషలో ఉపయోగించినంత ఆంగ్ల పదజాలం లిఖిత భాషలో కనిపించదు అందువల్ల పత్రికలవారు ఎక్కువగా సంస్కృత పదజాలాన్ని కొంతవరకు ప్రాచీన పదజాలాన్ని అరుదుగా ప్రాచీన వ్యాకరణాన్ని కూడా గ్రహిస్తున్నారు ఉదాహరణకు – 0-2-1978 ఆంధ్రప్రభలో- పార్లమెంటులో సహితం పేర్కొన్నారు చర్య గైకొనలేదు అంశ ఆరోపించారు నెలకొల్పాలని అంగవికలుర సంఘం పాలుపంచుకునేటట్టు వంటి పదజాలం కనిపించింది మౌఖిక వ్యవహారంలో ఈ పదాలేవీ వినిపించవు గైకొను నెలకొల్పు పాల్గొను పేర్కొను వంటివి ప్రాచీనాంధ్రక్రియలు ఆధునిక అవసరాలకోసం పునరుద్ధృతమైనవి అదేరోజు ఆంధ్రప్రభలో చేయనారంభించారు అని ఆ మర్నాటి పత్రికలో కోరనున్నారు అని ప్రయోగాలున్నై అన్నంతక్రియ తరువాత తెలుగులో కొన్నిరకాల క్రియలు మాత్రమే రాగలవు ప్రాచీన భాషలో ఇప్పటికన్నా అన్నంత క్రియకు విస్తృత ప్రయోజనం ఉంది దాని పునరుద్ధరణే పైన కనిపిస్తున్నది 10-2-78 నాటి ఆంధ్రప్రభలోనే ఈ స్టేషన్ నెల్లూరు సెక్షన్‌లో కలదు అనే వాక్యం ఉంది సమాపక క్రియగా కలదు ప్రయోగం ప్రాచీన భాషలోది కొన్ని పత్రికలలో చేయించుతున్నారు కనిపించుతున్నది వంటి క్రియలు కనిపిస్తయ్ ఇవి ప్రాచీన కావ్యభాషలో కనిపించకపోయినా-ఇవి ప్రాచీన రూపాలే

## 2. కథనాత్మక వాక్య, శబ్దకర్మక్రియాధిక్యం

వార్తల్లో చిన్న పెద్ద నాయకులిచ్చిన ఉపన్యాసాలు ప్రధాన భాగాలుగా ఉంటై అందువల్ల అని తో మూతబద్ధ కథనాత్మక వాక్యబాహుళ్యం పత్రికల్లో కనబడుతుంది అని ప్రయోగంతో ఉన్న వాక్యాల దీర్ఘతకు పరిమితి లేనందువల్ల ఈ వాక్యాలు సాధారణంగా చాలా పెద్దవిగా ఉంటై వీటి తరువాత ఒక శబ్దకర్మక క్రియ అని చెప్పారు అనేవిధంగా అవసరమవుతుంది ప్రతిసారీ అన్నారు చెప్పారు అని వాడితే పాఠకులకు విసుగు పుట్టవచ్చు కాబట్టి కొన్ని రకాల శబ్ద కర్మక క్రియలను శైలీవైవిధ్యం కోసం పత్రికలవారు ప్రయోగిస్తారు ఉద్ఘాటించారు తెలియజేశారు ప్రకటించారు వివరించారు వెల్లడించారు పేర్కొన్నారు వంటి క్రియలు బహుళంగా కనిపిస్తై ఇవి చాల వరకు ప్రాచీన భాషనుంచి ఉద్ధృతమైనవిగా గ్రహించవచ్చు

ఇంగ్లీషు పత్రికలలో ప్రత్యక్షానుకృతిలో ఉన్న వాక్యాలు తెలుగులో పరోక్షానుకృతులుగా అగుపిస్తుంటై ప్రత్యక్షానుకృతి శబ్ద ప్రధానం పరోక్షానుకృతి అర్థప్రధానం భాషాంతరీకరణ జరిగినప్పుడు శబ్ద ప్రాధాన్యానికి ఎట్లాగూ భంగం కలుగుతుంది గనక తెలుగు పత్రికల్లో పరోక్షానుకృతులే ఎక్కువగా కనిపిస్తుంటై

## 3 శబ్ద పల్లవీ కరణం

ఇంగ్లీషులో ఒక క్రియద్వారా వ్యక్తమయ్యే భావానికి తెలుగులో నామం + క్రియ గా - అంటే శబ్ద పల్లవంగా కనిపిస్తుంది Express=వ్యక్తం చేయు Convey = తెలియజేయు Welcome = స్వాగతం చెప్పు Assure=హామీ ఇచ్చు D sburse=పంపిణీచేయు Support=మద్దతు ఇచ్చు - ఇట్లాంటివి తెలుగు పత్రికల్లో తరచు కనిపిస్తై ఇది తెలుగు భాషలో మొదటినుంచి ఉన్న యంత్రాంగంగా కనిపిస్తుంది ఇది పత్రికల వారి ప్రయోగంలో ప్రాచుర్యాన్ని పొందింది కొన్నిచోట్ల తెలుగులో ఒక్క క్రియతో వ్యక్తం చెయ్యటానికి వీలున్నా శబ్ద పల్లవాన్నే ఎన్నుకోటం ఈ ప్రక్రియ ప్రాచుర్యాన్ని సూచిస్తున్నది 5-2-78 ప్రజాశక్తి దిన పత్రికలో హెచ్చు

రించారు అనటానికి బదులుగా హెచ్చరిక చేశారు అనీ మరణించారు అన టానికి బదులు మృతిచెందారు అనీ ఉన్నై. ఇదే పత్రికలో మార్క్సిస్టు పార్టీ *ఫ్రంటు కట్టడం* ఏ మాత్రం సాధ్యంకాదు అని ఒక భాగం ఉంది. ఫ్రంటు కట్టడం అనేది కొత్త శబ్ద పల్లవం. జత కట్టడం అనే దాన్ని ఆధారం చేసు కొని ఇది ఏర్పడి ఉంటుంది. భాషలో వివిధ భావ వ్యక్తీకరణకు కొత్త కొత్త క్రియలు అవసరం. తెలుగులో అటువంటి అవసరం శబ్ద పల్లవీ కరణం ద్వారా తీరుతున్నది. పత్రికలవారు ఈ ప్రక్రియను అధికంగా ఉపయోగించి కొత్త కొత్త క్రియలను సృష్టిస్తున్నారు. ఇవి స్థిరపడటానికి భాషలో ఎటువంటి ఆటంకమూ లేదు. ఇంకా విశేషమేమంటే ఇంగ్లీషులోని శబ్ద పల్లవ సమాసైన క్రియా నామ సంయోజనకు అనువాద ప్రాయాలయిన శబ్ద పల్లవ క్రియలు తెలుగు పత్రికల్లో వ్యాపించి భాషలో నిలదొక్కుకుంటున్నట్లు కనిపిస్తున్నై. చర్య గైకొను, చర్య తీసుకొను, నిర్ణయం గైకొను, రూలింగు ఇచ్చు, సంతాపం ప్రకటించు, సానుభూతి తెలపు వంటి క్రియలు అట్లాంటివి. సంతాపం ప్రకటించటం, సానుభూతి తెలపటం, చనిపోయిన వారి ఆత్మశాంతికి ప్రార్థిం చటం మనకు సాంప్రదాయికంగా వచ్చిన అలవాట్లు కావు. పాశ్చాత్యుల అలవాట్లు ఇంగ్లీషు భాష ద్వారా దిగుమతి అయినవి. అయితే అవి భాషలో కలిసిపోయి వేరుగా కనిపించటం మానేసినై.

## 4 వాక్య గర్భీకరణ సంయోజన

వాక్యంలో కర్త, కర్మ, క్రియ ఉంటై. ఈ మూడిట్లో ఏ ఒక్కదాని కయినా అనుబంధంగా యింకో వాక్యం గర్భితమై ఉండొచ్చు. వాక్యాల్లో మళ్లీ వాక్యాలు గర్భితమై ఉండొచ్చు. ఇట్లాంటి సంశ్లిష్ట వాక్యాలు కొన్ని కలిపి ఒక సంయుక్త వాక్యంగా తయారుకావచ్చు. వాక్య దీర్ఘతకు వ్యాకరణం పరిమితి విధించదు. అందువల్ల రచనా భాషలో (అంటే లిఖిత భాషలో) పెద్ద పెద్ద వాక్యాలుంటై. ఇంగ్లీషులో ఒక వాక్యంలో ఉన్నదాన్ని తెలుగులో కూడా ఒకే వాక్యంగా ఉంచాలన్న రచయిత ఆకాంక్ష యిందుకు కారణం కావచ్చు. అయితే అట్లాంటి దీర్ఘ వాక్యాలన్నిటికీ ఇంగ్లీషు వాక్యాలే మూలం కానక్కర్లేదు. లిఖిత స్థితిలో ఉన్న భాషలో ఇట్లాంటి పెద్ద వాక్యాలు సాధారణంగా ఉండటానికి

వీలుంది గుంటూరు నుంచి 20-1-1978 న వెలువబడిన జనశక్తి అనే పేరుతో సభ్యులకు మాత్రమే అని నిర్దేశించిన విప్లవ కమ్యూనిస్టుల రెండో బులెటిన్ మొదటి పేజీలో మూడవ పేరా ఈవిధంగా ఉంది

"విప్లవానికి ముందు పార్టీలో తలెత్తిన వివిధ రకాల పెడ ధోరణులకు వ్యతిరేకంగా కామ్రేడ్ మావో మార్గదర్శకంలో చైనా కమ్యూనిస్టుపార్టీ సాగించిన రాజీలేని సిద్ధాంత పోరాటంలోనూ విప్లవం తరువాతి కాలంలో దేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించి చరిత్ర రథ చక్రాలను వెనక్కు తిప్పటానికి పెట్టుబడిదారీ పునరుద్ధరణ వాదులు చేసిన ప్రయత్నాలను భగ్నం చెయ్యడానికి సాగిన మహత్తర సాంస్కృతిక విప్లవంలోనూ సోవియట్ రివిజనిస్టుల నాయకత్వాన ప్రపంచ కమ్యూనిస్టుల ఉద్యమంలో తలెత్తిన ఆధునిక రివిజనిజానికి వ్యతిరేకంగా సాగిన ప్రపంచ వ్యాపిత సిద్ధాంత పోరాటంలోనూ కామ్రేడ్ చౌ అత్యంత ప్రాముఖ్యత కల్గిన పాత్ర నిర్వహించాడు

పత్రికల్లో ఇటీవల నేను చూసిన పెద్ద వాక్యాల్లో ఇది ఒకటి ఇది ఇంగ్లీషుకు అనువాదమయినా కావచ్చు (ఇట్లా అని ఆ పత్రిక చెప్పలేదు) ఈ వాక్యంలో ప్రధాన వాక్యంలోని క్రియకు అనుబంధంగా సుమారు 12 వాక్యాలు గర్భితమై ఉన్నై అయినా అర్థావబోధ కలుగుతూనే ఉన్నది ఇందుకు కారణం గర్భితమైన 12 వాక్యాలూ మూడు ఉప వాక్యాల్లో భాగాలుగా ఇమిడిపోయినై ఈ మూడు ఉపవాక్యాలూ కలిసి ప్రధాన వాక్యంలో క్రియకు అనుబంధంగా ఒక సంయుక్త వాక్యంగా ఏర్పడ్డయ్ దీన్నిబట్టి ఇంకో సంగతి చెప్పొచ్చు గర్భీకృత వాక్యాలు ఎక్కువైనకొద్దీ వాటిని సంయుక్త వాక్యాలుగా ఏర్పరించకపోతే అర్థబోధకు భంగం కలుగుతుంది అందువల్ల ఇట్లాంటి క్లిష్ట వాక్యాలలో సంయుక్త వాక్యాల ఏర్పాటు ఉంటుందని ఊహించటం సమంజసమే

వాక్య విస్తరణకు రెండు పద్ధతులున్నై ఒకటి ఒక వాక్యంలో మరో వాక్యాన్ని ఇమడ్చటం దీన్నే గర్భీకరణ (embedding) అంటారు రెండు ఒక వాక్యం సరసన ఇంకో వాక్యాన్ని చేర్చటం ఇదే సంయోజన (conjoining) అర్థబోధకు గర్భీకరణ అవరోధం అవుతుంది సంయోజనలో అర్థబోధకు క్లేశం ఉండదు అందువల్ల అర్థబోధలో క్లేశనివారణ కోసం గర్భీకరణ

ఎక్కువైన కొద్దీ ఆ భారాన్ని తగ్గించటానికి వెనువెంటనే సంయోజన కూడా ఉంటుంది గర్భీకరణ (embedd ng) సంయోజన (con o ning) ల పరస్పర సంబంధం ఇంతకన్నా విపులంగా పరిశోధించదగింది వీటి మధ్యన ఒక రకమైన దయొలెక్టికల్ (diolectical) సంబంధం ఉంది ఈ సంబంధమే దీర్ఘ వాక్యాలను అనుమతిస్తూ అర్థావబోధను సానుకూల పరుస్తుంది

## 5. గర్భవాక్య పురస్కారణం, కర్తృ క్రియా సన్నికర్ష వ్యూహం :

సాధారణంగా కర్త వాక్యాదినే వస్తుంది (తెలుగు భాష-చాలా భారతీయ భాషల్లాగా కర్త్రాది క్రియాంత భాష) ఉదాహరణకు పైన పేర్కొన్న జన శక్తి పత్రికలో మొదటి వాక్యాన్ని చూడండి కామ్రేడ్ చౌ-ఎన్-లై అతి ప్రమాదకరమైన జబ్బుతో దీర్ఘకాలం బాధపడి 8 జనవరి 1976 నాడు కన్ను మూశాడు ఈ వాక్యంలో 'కామ్రేడ్ చౌ ఎన్ లై' కర్త వాక్యానికి మొదట ఉంది 'కన్నుమూశాడు' క్రియ వాక్యానికి చివర ఉంది ఈ రెంటి మధ్య కొంత వాక్య భాగం ఉంది ఈ వాక్యంలో కర్త మొదట ఉన్నా క్రియకు దగ్గరగా ఉన్నా పెద్ద భేదం లేదు క్త్వార్థక క్రియ ఉన్న వాక్యాల్లో సమాన కర్తృపద లోప సూత్రం కుడివైపుగా వర్తించటంవల పై వాక్యం తయారయింది ఎడమ వైపుగా వర్తిస్తే క్రియకు ప్రక్కనే ఉన్న కర్తృపదం మిగులుతుంది ఇక్కడ అర్థక్లేశం లేదు కాని గర్భ వాక్యాలు ఎక్కువైనప్పుడు ఇట్లాంటి ప్రమాదం ఉంది 4 వ ప్రక్రియలో ఉదహరించిన పెద్ద వాక్యం చూస్తే గర్భ వాక్య ఎంత పెద్దదిగా ఉండటానికి వీలుందో తెలుస్తుంది ఆ వాక్యంలో సాధారణంగా వాక్యాదిన ఉండే కర్త క్రియకు దగ్గరగా జరిగింది మధ్యలో ఉన్న గర్భవాక్యం ముందుకు జరిగింది ఇదే గర్భవాక్య పురస్కారణం కర్తృ క్రియా సన్నికర్ష వ్యూహం గర్భీకరణం ఉన్నచోట క్లేశ నివారణ కోసం కర్త క్రియకు దగ్గరగా జరగటానికి అనుమతించి గర్భీకృత వాక్యం లేక వాక్య సముదాయం ముందుకు జరుగుతుంది అదే ఇంతకు ముందటి ప్రక్రియలో ఉదాహరించిన పెద్ద వాక్యం ఋజువు చేస్తుంది ఈ రకమైన ప్రక్రియ ప్రధాన క్రియ శబ్ద కర్మకమయినప్పుడు ఎక్కువగా జరుగుతుంది అయితే ఇది కేవలం

అట్లాంటి క్రియలకు మాత్రమే పరిమితం కాదని ఇంతకు పూర్వం ఉదహరించిన పెద్ద వాక్యమే నిరూపిస్తున్నది

తెలుగులో క్రియ కర్తృపద లింగ వచన పురుషలను సూచిస్తుంది ఈ పని కర్తృపదం దూరమయితే కష్టమవుతుంది అందుకు కూడా ఈ కర్తృ క్రియా సన్నికర్ష వ్యూహం అవసరమవుతుంది 24 జనవరి 1978 తేదీన మూడు తెలుగు పత్రికల్లో ఒకే విషయాన్ని గురించి అచ్చయిన వార్తాంశంలో ఈ రకంగా గర్భవాక్యం ముందుకు జరిగిన వాక్యాల శాతం కడితే అవి ఇట్లా ఉన్నై ఆంధ్రప్రభ 90% ఆంధ్రభూమి 87 5% ఈనాడు 86 6% దీన్నిబట్టి ఈ ప్రక్రియకు ఎంత విస్తృతి ఉందో తెలుస్తుంది అయితే కొన్నిరకాల వాక్యాలు ఇందుకు భిన్నంగా కన్పిస్తున్నై ఉదాహరణకు 9-2-1978 నాటి ఆంధ్రప్రభ ప్రధాన వార్తాంశంలో ఈ వాక్యం ఉంది

పాకిస్తాన్‌లో మూడురోజుల సుహృద్భావ పర్యటన అనంతరం స్వదేశానికి వచ్చిన శ్రీ వాజపేయి విమానాశ్రయంలో విలేఖరులతో మాట్లాడుతూ - ఈ పర్యటనవల్ల పాకిస్తాన్ ఇండియా మధ్య పరస్పర అవగాహన మరింత మెరుగు కావడానికి అనుకూలమైన వాతావరణం ఏర్పడిందని చెప్పారు ”

ఈ పై వాక్యంలో కర్తృ క్రియా సన్నికర్ష వ్యూహం ఫలించలేదు. క్రియకు అనుబంధంగా గర్భవాక్యం ఇక్కడ ఉన్నమాట నిజమే అయితే కర్త క్రియకు అనుబంధంగా గర్భవాక్యం ఇక్కడ ఉన్నమాట నిజమే అయితే కర్త కనుబంధంగా కూడా ఇంకో గర్భవాక్యం ఉంది ఈ రెండు అనుబంధ వాక్యాల ఘర్షణ వాక్యార్థ బోధకు నిరోధం కలిగించవచ్చు అందువల్ల ఇక్కడ సన్నికర్ష వ్యూహం కుదరలేదు

## 6. గౌరవ వ్యక్తీకరణ :

తెలుగు మొదలైన భాషల్లో ఒక విశేషముంది కర్త మనుష్యవాచి అయినప్పుడు అతనికి సంఘంలో ఉన్న గౌరవాన్నిబట్టి క్రియ ఏకవచనంలో ఉండాలా బహువచనంలో ఉండాలా అన్నది నిర్ణయమవుతుంది ఇంగ్లీషులో ఈ అవసరం లేదు కానీ తెలుగులో రాసేటప్పుడు కర్తను రచయిత గౌరవిస్తున్నాడా లేదా

అనేది తేల్చుకోవలసి ఉంటుంది తెలుగు పత్రికలవారు ఈ సమస్యను సులువుగా పరిష్కరించారు అందరికీ గౌరవ సూచకమైన బహువచన క్రియా ప్రయోగమే ఈ పరిష్కారమార్గం

సర్వనామ ప్రయోగంలో కూడా ఈ గౌరవ సూచన అవసరమవుతుంది సర్వత్రా కనిపించే ఈ విధానానికి ఉదాహరణలు అవసరం ఉండదని ఇయ్యటం లేదు వీటి వ్యతికరణమే ఉదాహరణీయం ఈ రకమైన వ్యతికరణం కొందరు వ్యక్తుల విషయంలో కనిపిస్తున్నది ఉదాహరణకు 14-1-1978 ఆంధ్రప్రభలో— శ్రీ సంజయ్‌గాంధి మొరటుగా ప్రవర్తిస్తూ హేతుబద్ధంగా (హేతు విరుద్ధంగా అని ఉండాల్సింది అచ్చు పొరపాటు కావచ్చు-చేరా) మాట్లాడాడు అట్లాగే 1-2-1978 ఆంధ్రప్రభ సంపాదకీయంలో సంజయ్‌గాంధిని సూచిస్తూ ఈ క్రింది వాక్యాలున్నై)

అనుకున్నది ఏదో విధంగా సాధించటమే *అతనికి* ముఖ్యం రోజుల్లో కుటుంబ నియంత్రణం పేరు ఎత్తేసరికి బాలగాంధి పూనకం వచ్చినట్లు ప్రవర్తించే *వాడని* వీరావేశంతో చిందులు తొక్కే *వాడనీ* వినికిడి

చాలా భారతీయ భాషల్లో సర్వనామాల్లోనూ వాటిని అనుసరించి వచ్చే క్రియల్లోనూ గౌరవాన్ని సూచించవలసి ఉంటుంది అందుకు విరుద్ధంగా ఈ వాక్యాలు కనిపిస్తున్నై ప్రజా వ్యతిరేకులైన వారికి గౌరవం చూపించక్కర్లేదని పత్రికా రచయితల భావం కావచ్చు కొన్నిచోట్ల ఏకవచన ప్రయోగం గౌరవ రాహిత్యాన్ని సూచిస్తుంది అయితే దినపత్రికల్లో సాధారణంగా ఇట్లాంటి ప్రయోగం కనిపించదు ఒక పక్షానికి లేక సిద్ధాంతానికి కట్టుబడ్డ పత్రికల్లో ముఖ్యంగా విదేశస్థుల గురించి వచ్చినప్పుడు ఏకవచన ప్రయోగం కనిపిస్తుంది ఇంతకు ముందుదాహరించిన జనశక్తి పత్రికలో చౌ-ఎన్-లై గురించి ఏకవచన ప్రయోగమే కనిపిస్తున్నది

## 7. ఆత్మీయతా వ్యక్తీకరణ

సాధారణంగా వ్యాపార సంస్థలు నడుపుతున్న దినపత్రికలు పాఠకులను తమలో భాగంగా పరిగణించవు కాని కొన్ని పార్టీల తరపున వెలువడే పత్రి

కల్లో — ముఖ్యంగా వివిధ కమ్యూనిస్టు గ్రూపుల పత్రికల్లో — పాఠకులను తమలో భాగంగా కలుపుకునే ధోరణి కనిపిస్తుంది వక్తనూ శ్రోతను కలిపి చెప్పే (I person inclusive) సర్వనామాలు క్రియలూ వీరి భాషలో ఎక్కువగా కనిపిస్తై

1978 జనవరి ప్రారంభ సంచికగా వచ్చిన నక్సల్‌బరీ అనే బులెటిన్ మధ్య పేజీలో శీర్షికల్లో . ఓడిద్దాం' .. నిలుపుదాం అనే ఉభయ కర్తృక క్రియా ప్రయోగం ఉంది

20-1- 978 జనశక్తి సంచికలో తరిమెల నాగిరెడ్డి 1969 మార్చిలో అసెంబ్లీలో ఇచ్చిన ఉపన్యాసాన్ని మళ్ళీ అచ్చువేస్తూ కొన్ని శీర్షిక లుంచారు వాటిల్లో కొన్ని ప్రజల్ని విప్లవ కార్యాచరణకు కదిలించడమే మన కర్తవ్యం సామ్రాజ్య వాద భూస్వామ్య విధానాన్ని అంతం చేద్దాం అట్లాగే అదే సంచిక ఇంకో వ్యాసంలో ఎన్నికల తరువాత పరిస్థితి-మన కర్తవ్యాలు అని ఉంది

5-2-1978 ప్రజాశక్తిలో పీర వనిత స్వరాజ్యంను మనం గెలిపించుకోవాలి అనే శీర్షిక ఉంది

ఈ రకమైన ప్రయోగం పాఠకులను సన్నిహితంగా భావించటంలో భాగంగానే పరిగణించాల్సి ఉంటుంది లోపలి వాక్యాల్లో కూడా ఇట్లాంటివి చాలా ఉంటై విస్తరణ భీతివల్ల వాటి నన్నిటినీ ఉదాహరించటం లేదు

## 8. అవాంతర వాక్య సంధానం :

గర్భీకరణలో ఒక వాక్యం ఇంకో వాక్యంలో భాగంగా కలిసిపోతుంది గర్భవాక్యాన్ని తీసేస్తే గర్భివాక్యం (ప్రధాన వాక్యం) అసంపూర్ణంగా ఉంటుంది అట్లాకాక ప్రధాన వాక్యంలో భావరీత్యా కలిసిపోతూ వ్యాకరణరీత్యా కలవని వాక్యాలు కొన్ని ఉండవచ్చు ఈ రకమైన వాక్యాలను అవాంతర వాక్యాలంటున్నాను ఇట్లాంటి అవాంతర వాక్యాలు సాధారణంగా వివరణాత్మకంగా ఉంటై 1-2-1978 నాటి ఆంధ్ర ప్రభ ఎన్నికల ప్రచార సమాచారంలో ఈ విధమైన వాక్యముంది

1972 ఎన్నికలలో 17 నియోజక వర్గాలలో అభ్యర్థులు - అందరూ కాంగ్రెసు వాదులే - పోటీ లేకుండా ఎన్నిక కాగా ఈసారి ఒక్కరిని కూడా ఈ అదృష్టం వరించలేదు

ఇందులో రెండు అడ్డగీతల మధ్య కింది గీత ఉన్న వాక్యం ప్రధాన వాక్యంలో వ్యాకరణ రీత్యా ఇమడని (కలిసిపోని) అవాంతర వాక్యం

ఇట్లాగే ఒకోక్కసారి అవాంతరంగా వాక్యం బదులు పదబంధం ఉండొచ్చు 24-1-1978 నాటి ఆంధ్రప్రభలో ఒక రాజకీయ వ్యాసంలో ఈ కింది వాక్యం ఉంది

అసలు వ్యవస్థ – మేధావులూ అధికారులు జర్నలిస్టులు – అందరూ తమ జీవనసరళిని మార్చుకొనలేదు

దీనికి మూలమైన ఇంగ్లీషు వాక్యం 19-1-1978 నాటి Indian Express లో (మధ్య పేజీ వ్యాసం) ఇట్లా ఉంది

The entire establishment - intellectuals beaucracrats journalists and the like - has not changed either its style of living or function

వ్యాకరణరీత్యా ప్రధాన వాక్యంలో ఇమడని అవాంతర వాక్య పదబంధ సంధానం ఇంగ్లీషు రచనా భాషలో ప్రచురంగా కనిపిస్తుంది తెలుగు రచనా భాషకు బహుశా తెలుగు పత్రికా రచయితలు కట్టిన కొత్త అంటు ఉదాహరించిన రెండో వాక్యంలో ఒక విశేషం ఉంది అవాంతర పదబంధం ప్రధాన వాక్యంలోని ఒక సమాహారంలో భాగాలను పేర్కొంటుంది గణిత పరిభాష ఉపయోగిస్తే set and elements construction అనొచ్చు

## 9. వ్యాపార పురస్కరణం, క్రియా సృష్టి గారడీ :

తెలుగులో - ఇతర ద్రావిడ భాషల్లో ఉందో లెదో తెలీదు - ఒక విచిత్రమైన వాక్య పద్ధతి ఉంది వ్యాపార బోధకమై కాలబోధ ఉన్న ఏ సమాపక క్రియాసహిత వాక్యమైనా - నామ్నీకృతమై సంఘటనార్థకమైన జరుగు

సంభవించు వంటి క్రియలను సృష్టి చుకొని - వాటికి కర్తగా వ్యవహరిస్తు ది ఇట్లాంటి వాక్యాలు తెలుగు పత్రికల్లో చాలా తరచుగా కనిపిస్తై ఉదాహరణకు 12-2- 978 నాటి ఆంధ్రప్రభ సంపాదకీయంలోని ఈ వాక్యం చూడండి

శ్రీ వాజపేయి పాకిస్తాన్ నాయకులకు ఎలాంటి అమరికలు లేకుండా హామీ ఇవ్వడం జరిగింది

క్రియాసృష్టి గారడీ జరక్కపోతే పై వాక్యంలో *'హామీ ఇవ్వడం జరిగింది* అనే దానికి బదులు *'హామీ ఇచ్చారు'* అని ఉండేది ఈ పై వాక్యంలో జరిగింది ఏమిటంటే-హామీ ఇచ్చారు అనే క్రియలో కాలంలోనుంచి వ్యాపారాన్ని వేరుచేసి దానికి ప్రధాన విషయ ప్రతిపత్తి కల్పించబడింది ఈ ప్రక్రియనే వ్యాపార పురస్కరణం అన్నాను

ప్రాధాన్య వివక్షకోసం ఆ వాక్యం నామ్నీకృతమై కాలబోధకోసం వేరే క్రియను సృష్టించుకొన్నది అట్లాంటి క్రియ వ్యాపారార్థ బోధకం దీన్నే క్రియా సృష్టిగారడీ అంటున్నాను

ఇట్లా వచ్చిన జరుగు సంభవించు అనే క్రియలను అంతకు పూర్వం ఉన్న క్రియాలక్షణాలను బట్టి కనుక్కోవచ్చు (ప్రెడిక్టు చెయ్యొచ్చు) కాబట్టి ఈ వ్యాపారార్థబోధక క్రియను వాక్యమూల వ్యాకరణ నిర్మాణం (గుప్త నిర్మాణం) లో ప్రతిపాదించాల్సిన అవసరం లేదు అట్లా మూల నిర్మాణంతో లేనిదాన్ని సృష్టించటం గనుక దీన్ని గారడీ అంటున్నాను స్థితిబోధక క్రియల నుంచి ఇట్లాంటి సృష్టి జరగదు ఉదాహరణకు

* అతను ఆరడుగుల పొడుగు ఉండటం జరిగింది
* ఆమె చాలా అందంగా ఉండటం జరిగింది
* ఆ అబ్బాయి తెలివిగలవాడు కావటం జరిగింది

అనే వాక్యాలు వ్యాకరణ విరుద్ధాలు స్థితిబోధక ఆఖ్యాతాలు (Predicates) కావటంవల్ల పై వాక్యాల్లో క్రియాసృష్టిని సహించలేదు

క్రియా సృష్టి జరిగిన వాక్యాలకు వ్యవహారంలో రకరకాల ప్రయోజనాలున్నై. మనుష్య వాచక కర్త ఉన్నప్పుడు గౌరవ సూచకమైన ప్రత్యయం క్రియలో చేర్చాలా లేదా అనే సందేహం వచ్చినప్పుడు దాన్నుంచి తప్పించుకోటానికి ఇదొక మార్గం కర్తృ ప్రాధాన్యాన్ని తగ్గించటానికి తెలుగులో కర్తృపదలోపం చెయ్యొచ్చు అట్లా చేసినా క్రియలో దాన్ని జ్ఞాపకంచేసే అవశేషాలుంటై వాటిని వదిలించుకోటానికి ఈ గారడీ ఒక మార్గం కర్మణి వాక్యాలకీ వీటికీ-ఒక సామ్యమూ ఒక భేదమూ ఉన్నై కర్తృ ప్రాధాన్యాన్ని తగ్గించటం సామ్యం కర్మణి వాక్యాల్లో కర్మపదం ప్రాధాన్యం వహిస్తే అధిక క్రియను సృష్టించుకున్న ఈ గారడీ వాక్యాల్లో—కాలాన్నుంచి విడివడిన వ్యాపారం ప్రాధాన్యం వహిస్తుంది కర్తృ ప్రాధాన్య న్యూనీకరణ సామ్యంవల్ల ఒక్కోసారి ఈ గారడీ వాక్యాలు కర్మణి వాక్యాలకు బదులుగా కూడా ప్రయుక్తమవుతై అయితే కర్మణి వాక్యాలు సకర్మక క్రియలున్నప్పుడే సాధ్యమవుతై గారడీ వాక్యాలకు అకర్మక సకర్మక క్రియాభేదం లేదు రెండింట్లోనూ వ్యాపార ప్రాధాన్య వివక్ష చెయ్యొచ్చు గనుక-కర్మణి వాక్యాలకన్న వీటికి అధిక ప్రయోజనం ఉంది ఈ రకం వాక్యాల నిర్మాణాన్ని గురించి వాటి ప్రయోజనాల్ని గురించి ఇంకా పరిశోధించి తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నై

వ్యాపారార్థ బోధకక్రియ గారడీ ప్రక్రియ వల్లనే వచ్చిందా? లేక దాన్ని మూల నిర్మాణం (Underlying structure) లోనే ప్రతిపాదించాలా అనే సమస్య కూడా అంత త్వరగా తేలిగ్గా తేల్చదగింది కాదు ఉదాహరణకు క్రియా సృష్టి గారడీ ప్రక్రియను అంగీకరిస్తే పోలీసులు ప్రజల్ని భయపెట్టటం మళ్ళీ మొదలయింది వంటి వాక్యాల్లో మొదలయింది కొనసాగుతున్నది పూర్తి అయింది వంటి వ్యాపార ఆది మధ్యాంతాలను సూచించే క్రియల్లో ఏది వస్తుందో ఊహించటం (ప్రెడిక్టు చెయ్యటం) కష్టం జరుగు సంభవించు వంటి క్రియలున్న వాక్యాలను మొదలగు పూర్తిఅగు అనే క్రియలున్న వాక్యాలను వేరు వేరు వ్యాకరణ ప్రక్రియలతో సాధించటానికి అంత సరిఅయిన సాక్ష్యం కనిపించటం లేదు ఈ పై వాక్యాన్ని పోలీసులు ప్రజల్ని భయపెట్టటం మళ్ళీ మొదలు పెట్టారు వంటి వాక్యంతో పోల్చి ఈ రెంటి సమానార్థకతకు వ్యాకరణ ప్రక్రియ సాధించాలంటే ఈ చిక్కు అధికమవుతుంది ఇంకా పరిశోధన జరిగితేకాని ఈ చిక్కు ముళ్లు విప్పటం సాధ్యంకాదు

# 10. వార్త వ్యాఖ్య

పత్రికల్లో మరీ ముఖ్యంగా దిన పత్రికల్లో ఒక వార్త ఇచ్చినప్పుడు ఆ వార్త మీద ఎట్లాంటి వ్యాఖ్యలేకుండా ఇవ్వటం సంప్రదాయం అయితే సంపాదకీయంలో పత్రికా సంపాదకులు వార్తలకు తమ వ్యాఖ్యలను జోడిస్తారు అందువల్ల ఈ రకపు నిర్మాణం సంపాదకీయాల్లో ఎక్కువగా కనిపిస్తుంది ఒక్కోసారి ఈ వ్యాఖ్యలు నిష్కర్షగానూ ఉండొచ్చు అస్పష్టంగానూ ఉండొచ్చు (ఈ రెండో రకపు పద్ధతి నుద్దేశించే ఆరుద్ర ఎక్కడో రాశారు సమర్థిస్తున్నదెవరో తెలీకుండా సంపాదకీయాలు రాయండి ) ఈ వ్యాఖ్యలు ఒక సంబంధం నుంచి ఒక వాక్యం వరకూ ఉండొచ్చు ఉదాహరణకు 10-2-1978 ఆంధ్రప్రభ నుంచి తీసుకున్న ఈ మూడుదాహరణలను గమనించండి (ఈ ఉదాహృత వాక్యాల్లో వ్యాఖ్య భాగాలకింద గీత పెడుతున్నాను )

(a) అని శ్రీమతి గాంధీ విమర్శించటంలో <u>అర్థం లేదు</u>

(b) అపవాదుకు జనతా పార్టీ లోనుకాకపోవటం <u>అభినందించదగిన విషయమే</u>

(c) ఈ ఎన్నికల్లో ఎక్కడో కొన్నిచోట్ల తప్ప ధన ప్రభావం అంతగా కనిపించకపోవటం అనేది కూడా <u>*జనతా ఆదర్శప్రాయంగా వ్యవహరిస్తున్నందువల్ల చేకూరిన శుభ పరిణామమే*</u>

ఈ రకపు వాక్య నిర్మాణంలో కొన్ని వ్యాకరణ విశేషాలుకూడా ఉన్నై రెండు దళాలుగా విభక్తమైన ఈ వాక్యాల్లో ఎక్కువభాగం రెండు నామబంధాలు కలుస్తే వార్త భాగం సాధారణంగా నామ్నీకృత వాక్యమై ఉంటుంది అటం అని అనే శబ్దాలతో కొన్ని నామ్నీ కృతమైతే మరికొన్ని చోట్ల వ్యాపారాన్ని సూచించే సహజ నామమే ఉండొచ్చు ఈ కింద ఉదాహరణలు చూడండి

(ఆంధ్రప్రభ 10-2-1978)

(d) జనతాపార్టీ ప్రణాళికలోనే ఎక్కువ నిజాయితీ కనిపిస్తున్నదని *అంగీకరించక తప్పదు*

(e) జనతాపై జరుగుతున్న ఒక విమర్శమాత్రం *నిర్హేతుకం కాదు*

ఈ వ్యాఖ్యల్లో తీరునుబట్టి కూడా కొన్ని విభాగాలు చెయ్యొచ్చు వ్యాఖ్యల అర్థాల్నిబట్టి చేసిన ఈ విభాగాలు నిర్దుష్టమూ కావు సంపూర్ణం అసలే కావు సూచనప్రాయాలు మాత్రమే

(f) ముక్కోణపు పోటీలు తథ్యమనే సంగతి *స్పష్టమై పోయింది* (వర్ణనాత్మకం)
ఆంధ్రప్రభ 8-2-1978

(g) కాంగ్రెసు అభ్యర్థులను నిలబెట్టకపోవటం *గమనార్హం* (వర్ణనాత్మకం)
ఆంధ్రప్రభ 8-2-1978

(h) సమయా సమయాలు చూసుకోకుండా బలప్రదర్శనకు పూనుకోవటం *అవివేకం* (Judgement)

ఆంధ్రప్రభ 9-2-1978

(i) ఈ నిర్మాణాత్మక వైఖరి పాకిస్తాన్ నాయకులను సంతుష్టి పరచగలదన డంలో *సందేహం లేదు* (Approval)

ఆంధ్రప్రభ 12-2-1978

ఈ వార్త శాఖ్య నిర్మాణంలో విషయాన్నిబట్టి వ్యాకరణాన్నిబట్టి చాలా రకాలయిన విభాగాలు చెయ్యొచ్చు పత్రికా సంపాదకీయాలమీద ప్రత్యేక మైన పరిశోధన జరిపితే ఇంకా ఎన్నో విశేషాలు బయట పడొచ్చు

ఈ పైన చెప్పిన విశేషాలేకాక ఇంక్గా లోతుగా పరిశీలిస్తే మరికొన్ని కొత్త విశేషాలు బయట పడొచ్చు ఉదాహరణకు నుడికారాల దిగవతి అనే శీర్షికలో చేరదగిన ఈ ఉదాహరణలను గమనించండి

పత్రికా రచనలో భాషా ప్రయోగం

జనతా పార్టీని మనం అభ్యుదయ పార్టీగా ఒక్క నిముషం సేపుగా పరిగణించలేదు

—ప్రజాశక్తి 5-2-1978

ఇంగ్లీషులో Even for a minute అని ఉండిఉంటుంది న్యాయం జరగటం చర్య తీసుకోవటం వంటివి పత్రికల్లో కొల్లలు కనిపిస్తున్నై సానుభూతి ప్రకటించడం విచారాన్ని వ్యక్తం చెయ్యటం ఇట్లాంటివే

అట్లాగే పత్రికలలో శీర్షికలను పరిశీలిస్తేకూడా కొన్ని విశేషాలు బయటా పడతై శీర్షికల్లో ఎక్కువ నామ్నీకరణాలు ఉంటై ఇవి శబ్ద నిష్పన్నమూ కావచ్చు వాక్యనిష్పన్నమూ కావచ్చు ఈ నామ్నీకరణాల్లో క్రియను లోపింప చేయగా కొన్ని సాధ్యమయితే క్రియను నామంగా చెయ్యటంవల్ల కొన్ని సాధ్యమవుతై

ఈవిధంగా పత్రికల్లో వాడుతున్న భాషను వివిధ రకాలుగా అనేక కోణాలనుంచి పరిశీలిస్తే ఇంకా ఎన్నో విశేషాలు గ్రహించొచ్చు ఇంతకుముందే చెప్పినట్టుగా అట్లాంటి సమగ్ర పరిశోధనకు ఇది పూర్వరంగం మాత్రమే

ఈ పద్ధతిలో రేడియో భాషమీద వ్యాపార ప్రకటనలమీద ప్రభుత్వం వారి తాఖీదులమీద రైల్వే టైం టేబిల్ మీదా ఎన్నో రంగాలలో ప్రయోగించే భాషమీద విడివిడిగా పరిశోధన సాగించొచ్చు అట్లాంటి అవసరాన్ని గుర్తు చెయ్యటమే ఈ వ్యాసానికి పరమ ప్రయోజనం

భారతి 1978 సెప్టెంబరు

# '-కోలెన్' శబ్ద విచారం

ప్రాచీన భాషలో నన్నయాదులు ప్రయోగించిన కోలెన్ శబ్దాన్ని పంచమీ విభక్తి ప్రత్యయంగా ప్రాచీన వ్యాకరణాలూ కోశాలూ గుర్తించినై అయితే ఈ శబ్దాన్ని ప్రయోగించటంలో గమనించాల్సిన వ్యాకరణ నియమాలు కొన్ని ఉన్నై ఈ నియమాలు, ఈ శబ్దాన్ని ప్రయోగించిన కవుల రచనలన్నిట్లోనూ ఒకటిగా లేవు ఆ నియమ వైవిధ్యాన్ని ప్రదర్శించటమే ఈ వ్యాస లక్ష్యం ఇందువల్ల ప్రాచీన కావ్యభాషలో కూడా ఒక కాలపు నియమాలు ఇంకో కాలానికి మార్పుచెందటాన్ని మనం గమనించవచ్చు ఈ శబ్దవ్యుత్పత్తి గురించి కూడా వ్యాసం చివర్లో కొంతవరకు పరిశీలించబడింది

శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు సంపాదక బాధ్యత నిర్వహించిన నన్నయపదప్రయోగకోశం ప్రకారం కోలెన్ శబ్దాన్ని నన్నయ 16 సార్లు ప్రయోగించినట్టు గ్రహించగలం వాటి వివరాలివి

| | | |
|---|---|---|
| నాడు శబ్దంమీద (నాటన్) | — | 10 |
| అప్పుడు శబ్దంమీద (అప్పటన్) | — | 1 |
| నిన్న శబ్దంమీద | — | 1 |
| ఆది శబ్దంమీద | — | 1 |
| మొదలింట శబ్దంమీద | — | 1 |
| నూఱెండ్లు శబ్దంమీద | — | 1 |
| యోజనంబు శబ్దంమీద | — | 1 |
| మొత్తం | — | 16 |

ఈ పట్టికనుబట్టి కోలెన్ శబ్దం నన్నయ ఎక్కువగా కాలబోధకశబ్దాల మీద ప్రయోగించినట్టు తెలుస్తున్నది అందులోనూ మూడింట రెండు వంతులు నాడు శబ్దం మీదనే ఆది మొదలింట (? మొదలిల్లు) శబ్దాల్ని కూడా కాల

బోధకశబ్దాలగానే ఇక్కడ గ్రహిస్తున్నారు ప్రాచీన వ్యాకరణ పరిభాష ననుస రించి ఈ శబ్దం ( కోలెన్ ) సప్తమ్యంతాలైన కాలాధ్వ పదాల మీదనే నన్నయ ప్రయోగించాడని సూత్రీకరించవచ్చు.

నన్నయ భాషలో కూడా ఈ కోలెన్ శబ్దానికి అర్థ నిర్ణయంలో కొన్ని చిక్కులున్నై. అధ్వబోధక శబ్దం మీద ప్రయోగించిన కోలెన్ కు కాలాబోధక శబ్దాలమీద ప్రయోగించిన కోలెన్ కూ కనీసం ఆభాసమాత్రంగానైనా భేదం ఉంది అధ్వబోధక శబ్దం మీద కోలెన్ శబ్దానికి నన్నయ ప్రయోగం ఇది

దాని శరీర సౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడు నట్లుగాఁ బ్రసాదించిన ఆది-8 41

పై ప్రయోగంలో నిఘంటువులిచ్చిన మొదలుకొని ఆధునిక భాషలో ప్రయోగించే నుంచి కాని అర్థాలుగా సరిపడటంలేదు వరకు అనే అర్థం చెప్తే సరిపోతుంది కాని 6 చోట్ల ఒక అర్థంలోను ఒక్కచోట తద్భిన్నమైన అర్థం లోనూ నన్నయ ప్రయోగించాడనటం అంత సమంజసంగా తోచదు కాలబోధక శబ్దాల మీద 'కోలెన్' శబ్దానికి 'మొదలుకొని' సరిపోతుంది కాని ఇక్కడ యోజనము మొదలుకొని అని అర్థం చెప్పటం అతి క్లిష్టమైన మార్గంలో ఆలోచిస్తే తప్ప కుదరదు

మాటే-ద్లంగోలె ప్రయోగాన్నిగమనిస్తే దీనికి మార్గం కపించవచ్చు ఈ పై ప్రయోగం మొదలుకొని మాత్రమేకాక నూరేండ్ల పర్యంతం అనే అర్థం ఇమిడి ఉంది ఆధునిక భాషలో నుంచి కి అట్లాటి అర్థమే ఉంది విశేషమల్లా నన్నయ్య భాషలో ఈ అర్థంలో కాలాధ్వ శబ్దాలు రెండిటిమీదా ఒకే శబ్దాన్ని ప్రయోగించటం ఇప్పుడు కోలెన్ శబ్దానికి From the point of origin in time or space and to the extent expressed in preceding noun అని అర్థం చెప్పవచ్చు ఇది నన్నయ భాషకు సరిపోతుంది

నన్నయ్య తరవాతకవుల్లో కోలెన్ శబ్దానికి అధ్వవాచకాలమీద ప్రయో గాలు కనిపించలేదు కాల బోధకనామాల తరవాత విరివిగా కనిపిస్తున్నై కాని తరవాతి కవులు నన్నయ నియమాన్ని సడలించినట్లు కనిపిస్తున్నది

ఈ కింది తిక్కన ప్రయోగాల్ని గమనించండి

1 పుట్టిన కోలెను- (విరాట- 74)

2 గో గ్రహణంబునఁగోలె (ఉద్యోగ-8-92)

తిక్కన ప్రయోగాల్లో మొదటిదాంటో కోలెన్ శబ్దం క్రియాజన్యవిశేణం మీద ఉంది పుట్టినఁ గోలెను అని అనంత పద్మనాభరావుగారు *ఇయ్యటం ప్రమాదం లేకపోతే క్రియాజన్య విశేషణానికి సప్తమి ఎక్కడి నుంచి వస్తుంది? నన్నయేతర కవుల భాషలో కూడా ఈ శబ్దం సప్తమ్యంతాల మీదనే రావాలను కోవటం వల్ల ఈ ప్రమాదం ఆపతిత మైందనుకుంటాను ఇకపోతే పుట్టిన కోలెను అనే ప్రయోగాన్ని సమర్థించటం ఎట్లా ? కోలెన్‌కు ముందున్న క్రియాజన్య విశేషణం భూతకాలార్థకం కావటం ఇక్కడ గమనించాల్సిన విశేషం నన్నెచోడుని కుమారసంభవంలో కూడా క్రియాజన్య విశేషణంమీద కోలెన్ వేసిన రెండు చోట్లా కూడా అవి భూతకాలికాలే

ఎఱిఁగినకోలె నిన్‌జూచినకోలె (కుమార-3 109) అని నన్నెచోడుడి ప్రయోగాలు ఈపై భూతకాల రూపాల్లో ఇన అనేది భూతకాల బోధకం ఇక్కడ కూడ నన్నయగారి కోలెన్‌కు చెప్పిన అర్థమే సరిపోతుందిగాని నామాలమీదనే కాక క్రియాజన్య విశేషణాల మీద కూడా కోలెన్ శబ్దం రావచ్చునని చెప్పుకోవాలి నన్నయ భాషలో ఈ రకంగా రాపటానికి వీల్లేదని చెప్పటానికి ప్రయోగం ఆధారం నిను జూచినయప్పటఁగోలెను (ఆది-6 93)

తిక్కనగారు పయోగించిన గోగ్రహణంబునఁ గోలె అనేచోట గ్రహణం కాలబోధకనామం కాదు కాలబోధకనామం తర్వాతే కోలెన్ శబ్దాన్ని ప్రయోగించాలనే నన్నయ్యగారి నియమాన్ని తరవాత కవులు సడలించారన్నమాట నామాలు వాక్యంలో ప్రవర్తించే పద్ధతి బట్టి బహుధా విభక్తాలనీ అందులో వ్యాపారార్థక నామాలనేవి ఒకతెగ అనీ నా నామ్నీకరణాల వ్యాసాల్లో ఆధునిక భాషలో వాక్య నిర్మాణాన్ని పరిశీలిస్తూ సూచించాను గ్రహణంబు అనే

* రేవూరు అనంత పద్మనాభరావు గారు 1963 డిసెంబరు భారతిలో కొన్ని ప్రయోగ విశేషాలను చర్చిస్తూ కోలెన్ శబ్దాన్ని గురించి కూడా ప్రస్తావించారు

నామాన్నిక్కడ వ్యాపారార్థకనామంగా గ్రహించాలి వ్యాపారం కాలంలో జరుగు తుంది కాబట్టి వ్యాపారార్థక నామాల్లో కాలబోధకత ఇమిడిఉందని తిక్కనగారి వ్యాకరణం అయిఉండాలి పై తిక్కన ప్రయోగానికి నియమాన్నంగీకరించిన తరవాత గోగ్రహణం జరిగినప్పట్నుంచి అని ఆధునిక భాషలో అర్థం చెప్పుకో టానికడ్డు ఏమీ లేదు తిక్కన పదప్రయోగ సూచిక అచ్చు పూర్తి అయితే తిక్కనగారి వ్యాకరణంలో కొత్త విశేషాలు బయటపడవచ్చు అందాక పై సూత్రీకరణ వర్తిస్తుంది ఇక నన్నెచోడుని కుమారసంభవంలో మన్ని ఇబ్బంది పెట్టే ప్రయోగం ఒకటి ఉంది అది ఇది

కను *చూడ్కింగో*లెను దం
డ నమస్కారములు సేసి డాయంజని స
న్మునితతి గరముకుళితులై
వినుతించుచు నిలిచి రఖిలవేదస్తుతులన్
(కుమార-7 80)

ఇక్కడ చూడ్కి అనే నామం కాలబోధకం కాదు దీనికి అర్థం చెప్పాలంటే చూడటం జరిగినప్పట్నుంచీ అంటే చూసినప్పట్నుంచీ అని అర్థం చెప్పాలి అయితే చూడ్కి అనే నామం ఎట్లాంటిది? నన్నెచోడుడు దీన్ని వ్యాపారార్థకనామంగా ప్రయోగించాడనటంకంటె ప్రస్తుతానికి గత్యంతరంలేదు చూడ్కికి సమానార్థకమైన చూపు ఆధునిక భాషలో వ్యాపారార్థకనామంకాదు చూడ్కిని వ్యాపారార్థకనామంగా భావించిన ప్రయోగం ఇంకోటి కనిపిస్తున్నది
కనుచూడ్కి దనియఁగాగానేయు విలుకాని గవిదలఁ బడవైచు సవడికాని(న్)
(కు సం 7-40)

ఈ కోలెన్ శబ్దం కోలె అనే రూపంతో వసుచరిత్రలోనూ కోల్ అనే రూపంతో యయాతి చరిత్రలోనూ వాడినట్టు సూర్యరాయాంధ్ర నిఘంటు విచ్చిన ప్రయోగాల్నిబట్టి తెలుస్తున్నదిగాని రూపభేదంతప్ప అక్కడ గమనించదగిన వ్యాకరణ విశేషాలేం లేవు కాని బ్రౌణ్యంలో Through by reason of అనే అర్థాన్నొకటిచ్చి అతని గోలె అనే ప్రయోగం తారాశశాంక విజయము (5 22) లోదిగా పేర్కొనబడింది దానికి by

reason of h m అనే అర్థంకూడా సూచి చబడింది శేషము వెంకటపతి రాసిన (తారా)శశాంక విజయము లో ఆ ప్రయోగం నాకు కనపడలేదు ఇంకెవరిదైనా వేరే తారాశశాంక విజయం ఉందేమో నాకు తెలియదు పై ప్రయోగమే గనక సరైనదైతే అక్కడ ఏం జరిగిందో తెలుసుకోటం కష్టం కాదు ఈ ప్రయోక్త ఆధునిక భాషలో అంటే తనకాలపు భాషలో కూడా ఉండి ఉండాలి) ప్రయోగించే నుంచి శబ్దానికున్న వల్ల అనే అర్థాన్ని కోలెన్ శబ్దానికి కూడా తగిలించాడన్నమాట

ఈ కోలెన్ శబ్దాన్ని గురించి పూర్వం కొందరు విద్వాంసులు చర్చించారు అందులో వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు (1952 802 1015) సూచించిన ప్రక్రియ గమనించతగింది పుట్టిన కోలెను అనే తిక్కన ప్రయోగాన్ని పుట్టిన+అది+కోలెన్ (802) అని ఒకచోట పుట్టిన దానం గోలెన్ (10 5) అని వేరొకచోట ప్రక్రియాగతి సూచించారు అంటే పుట్టిన+అది+కోలెన్ అనేది ఆధునికభాషాశాస్త్ర పద్ధతిలో చెప్తే వ్యాకరణ మూలరూపం (underlying fo m) – గ్రహించి తచ్ఛబ్దానికి లోపం చెప్పటంవల్ల పుట్టినకోలెను అనే రూపాన్ని సాధించవచ్చునని శాస్త్రిగారి ఊహ అంటే మూలనిర్మాణం (underlyi g structure) లో కోలెన్ నామంమీదనే ప్రయుక్తమని చూపించటం శాస్త్రిగారి ఉద్దేశం మూలరూపాలు కూడా ప్రయోగార్హాలేనని శాస్త్రిగారు ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది అట్లా కాకపోతే అది శబ్దాన్ని దానన్ గా మార్చాల్సిన అవసరంలేదు సప్తమిని చేర్చకుండానే లోపం చెప్పొచ్చు శాస్త్రిగారు చూపి చిన మూలరూపాలు ప్రాచీనభాషలో ప్రయోగార్హాలు అనటానికి ఆధారాల్లేవు ఈ పద్ధతిలో ప్రక్రియాసౌలభ్యం కూడా కనిపించదు క్రియాజన్య విశేషణంమీద తచ్ఛబ్దానికి మరే విభక్తి ప్రత్యయంముందు లోపం వచ్చినట్టు కనపడదు అందువల్ల తచ్ఛబ్దలోపసూత్రం పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సాధిస్తుంది

దివాకర్ల వేంకటావధానిగారు ( 960 {85) తమ నన్నయభారతము అనే గ్రంథంలో ఈ కోలెన్ శబ్దాన్ని గురించి చర్చించారు ఇది కొల్ కోల్ అను ద్రావిడ ధాతువునుండి పుట్టినది కొలచు (to measure) అను తెలుగు ధాతు విందుండి పుట్టినదే దీనినుండి కొల అను విశేష్య రూపము కలిగినది

కన్నడమున నిది కొళె అను రూపముతో నుండును ఇదే క్రమముగా కోళె అను విభక్తి ప్రత్యయముగా మాఱి ద్రుతాంతమైనది ఇది సప్తమ్యంతములగు కాలాధ్వ వాచక పదములపై జేరుచుండును అని కోలెన్ శబ్ద వ్యుత్పత్తిని సూచించారు దాదాపు ఇదే అభిప్రాయాన్ని నన్నెచోడుని గురించి రాస్తూ (1965 70) వెలిబుచ్చారు

Kole derived from the Dravidian roots Kōl Kol has gradually become a case termination Nannaya uses this after words denoting time and ending in locative case suffix Nannechoda uses this not only after denoting time but also after verbal adjectives and nouns in the accusative case

నన్నెచోడుడు కోలెన్ శబ్దాన్ని క్రియాజన్య విశేషణాలమీద ప్రయోగించిన పద్ధతిని ఇంతకుముందు గమనించాం ద్వితీయావిభక్త్యంతంగా (Ending the accusative case) వారు గ్రహించింది కను చూడ్కిన్ అనే పదాన్నే అని తరవాత వారిచ్చిన ఉదాహరణవల్ల స్పష్టం కనుచూడ్కిన్ అనే పదాన్ని సప్తమ్యంతంగా కాక ద్వితీయాంతంగా ఎందుకు గ్రహించాలో వారు కారణాలు చెప్పలేదు ఇక కోలెన్ శబ్ద వ్యుత్పత్తిని గురించి ఆలోచిద్దాం కన్నడంలో మానార్థంలో కొలె అనే రూపం నాకు కనిపించలేదు ఇక కొలచు కొలత అనే పదాలకు మూలరూపమైన ప్రాచీన ధాతువు భద్రిరాజు కృష్ణమూర్తి ( 96 338 ప్రకారం *కొళ్ సోదర భాషల్లో దీనికి సంబంధించిన పదాలివి

కన్నడం కుళ a certain measure కొళగ a measure of four balas కొళకె a hird crop of rice తుళు కొళగ a measure of grain తమిళ-కళక్కుమ్ a standard grain measure మలయాళ-కొళకమ్ గోండి కోల్స్ to measur కొలామి కుల్ to count

కొలచు కొలత కొల-వంటి పదాలకు మూలరూపమైన *కాళ్ కూ కోలె కూ సంబంధం ఉన్నట్టు పై పదాల్నిబట్టి చెప్పలేం

కోలెన్ శబ్దానికి అర్థంలో సరూపమైన శబ్దం నాకు కన్నడంలో కని పించలేదు తమిళంలో నేను చూసిన Tam ex con 827 లో కోలు అనే ధాతువు o commence అనే అర్థంలో ఉంది దానినుంచి నిష్పన్నమైన కోలుమై అనే నామం Commencemen అనే అర్థంలో ఉంది T Burrow & M B Emeneau 960 దీనికి మలయాళంలో కోలుక అనే రూపం DED 858 ఇచ్చారు కాని అర్థంలో మార్పు కనిపిస్తున్నది బహుశా తమిళంలో ఈ కోలు ధాతువు తెలుగు కోలెన్ శబ్దానికి cognate కావచ్చు తమిళంలో కోలు క కోలి- అనే భూతకాలిక రూప మున్నట్టు Burrow & Emeneau 960 సూచించారు ఇంకా ఇతర ద్రావిడ భాషల్లో సరూప పదాల్ని పరిశీలిస్తేగాని శాస్త్రీయ పద్ధతుల్లో మూల రూపాన్ని నిర్ణయించలేం ఉన్న ఆధారాన్నిబట్టి *కోల్ o ccr mence అనే మూలద్రావిడరూపాన్ని ప్రతిపాదించవచ్చుగాని ఇతర ద్రావిడ భాషల్లో సరూప శబ్దాల్ని పరిశీలిస్తేనేగాని స్థాపించలేం అప్పటికీ ఈ *కోల్ రూపమే మూల ధాతువుగా నిలిస్తే *కోల్ నుంచి కోలెన్ రూపం ఎట్లా నిష్పన్నమైందో ధ్వని సూత్ర ద్వారా శాస్త్రీయ పద్ధతుల్లో నిరూపించాలి అందాకా కోలెన్ శబ్ద వ్యుత్పత్తిని గురించి చేసే ఊహలు వట్టి ఊహలే

భారతి 969 మే

# బహువచన రూపనిష్పత్తి

తెలుగులో ఏకవచన బోధక నామాలకు– లు అనే ప్రత్యయం చేర్చుట వల్ల బహువచన బోధకాలవుతై కొన్ని భాషల్లో ఏక వచనంతోటు ద్వివచన త్రివచనాలు కూడా ఉంటై సంస్కృతంలో ఏకవచన ద్వివచన బహు వచన విభాగాలు మనకు తెలిసిందే చాలా నామాలకు ఏకవచన బహువచన విభాగం వర్తించినా కొన్ని నామాలు నిత్యైక వచనాలో నిత్యబహువచనాలో అయివుంటై ప్రౌఢ వ్యాకర్త ఉదహరించిన ఆముదం ఇంగువ ఉప్పు చింతపండు చమురు పసుపువంటి సంభార వాచకాలు ఇత్తడి, ఇనుము కంచు బంగారు వెండివంటి లోహ వాచకాలు నిత్యైక వచనాంతాలు నిత్య బహు వచనాంతాలకు ప్రౌఢ వ్యాకర్తే ధాన్య వాచకాలయిన అళ్లు చోళ్లు వడ్లు కందులు పెసలు మినుములు మొదలయిన శబ్దా లుదాహరించాడు బియ్యము శబ్దాన్ని నిత్యైకవచనాంతంగా పేర్కొన్నాడు కాని లు ప్రత్యయం లేకపోయినా అది బహువచన రూపమే బియ్యం ఉన్నై బియ్యం లేవు అని క్రియలో బహు వచనానికి బియ్యం శబ్దాన్ని బహు వచనంగా గుర్తిస్తే గాని కారణం చూపించలేము అట్లాగే పాలు నీళ్లు పేలాలు ఉసిళ్లువంటి పదాలు నిత్యబహువచనాలే ఆధునిక భాషలో ద్రవవాచక పదాలైన కాఫీ టీలు కొందరి భాషలో బహు వచనమైతే మరికొందరి భాషలో ఏకవచనాలు

ఒక పదం ఏకవచనమా ? బహువచనమా ? అని నిర్ణయించాలంటే ఒక వాక్యంలో ఆ పదంతో వచ్చే క్రియ ఏక వచన ప్రత్యయాన్ని గ్రహిస్తుందా ? బహువచన ప్రత్యయాన్ని గ్రహిస్తుందా అనేదాన్ని బట్టే చెప్పాలి తెలుగులో క్రియావిభక్తులు లింగ వచన పురుష బోధకాలు

పైన పేర్కొన్న నామాలను ఇంగ్లీషులో mass nouns అంటారు అవి నిత్యంగా ఏకవచనమూ కావచ్చు బహువచనమూ కావచ్చు నిత్యబహు వచనా లనుకున్నవాటికి కొన్నిటికి మళ్ళీ బహువచన రూపాలుండవచ్చు అప్పుడవి

కొన్నిరకాలు (K nd అనే అర్థంలో ప్రయు క్తాలవుతై బియ్యం అనే శబ్దానికున్న బహువచన రూపానికర్థం అట్లాంటిదే ఇంగ్లీషులో f h-f h. కి అట్లాంటి అర్థమే ఉంది

ఇవిపోగా భాషలో ఉన్న అధిక సంఖ్యాకాలయిన నామాలకు ఏకవచన బహువచన విభాగం వర్తిస్తు ది ఏకవచన నామాలకు బహువచన ప్రత్యయమైన లు చేర్చటంవల్ల బహు వచన నామం సిద్ధిస్తుందని వా సాదిని చెప్పబడింది ఇట్లా చేర్చినప్పుడు నామం ప్రాతిపదికలోని వర్ణసంయోజనంలో కొన్నిమార్పులు జరుగుతై ప్రత్యయంలో కూడా కొన్నిమార్పులు జరుగతై బహువచన ప్రత్యయానికి రెండు సపదాంశాలు a omo ph ఉన్నై -లు ళు అని — లు ని మూల రూపంగా గ్రహించి — ళు ని మారిన రూపంగా చెప్పటం వ్యాకరణంలో సులభ పద్ధతి

ఒక పదాంశానికి సందర్భాన్ననుసరించి భిన్న రూపాలున్నప్పుడు వాటిని వ్యాకరించటంలో రెండు పద్ధతులున్నై వాటి రూపాంతరా లన్నిటిని ఒక పట్టికగా ఇచ్చి వాటి పరిసరాలని నిర్దేశించటం ఉదాహరణకు —

చేయి — వ్యస్తంగా ఉన్నప్పుడు
చేతు — బహువచన ప్రత్యయం ముందు
చేతి — విభక్తి ప్రత్యయాల ముందు సమాసంలో

పై మూడు రూపాలూ చేయి అని శబ్దానికున్న రూపాంతరాలు ఆ మూడూ కలిపి ఒక పదాంశం n ^ pheme అందులో ఒక్కొక్క రూపం ఆ పదాంశానికి సపదాంశం* అవుతుంది ఈ సపదాంశానికి మధ్య సంబంధాన్ని వ్యాకరణం నిరూపించాలి పైన నిరూపించిన పద్ధతి సూత్రాలను స్థితి సూత్రాలు em and a range nen అంటారు 2 ఇక రెండో పద్ధతిలో సపదాంశాల్లో ఒకదాన్ని మూలరూపంగా గ్రహించి మిగతా సపదాం

---

* పదాంశం సపదాంశం అనే మాటలను క్రమంగా morpheme a omo ph అనే అర్థాల్లో భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాడుతున్నారు చూ భద్రిరాజు కృష్ణమూర్తి పదం—పదాంశం భారతి 970 ఫిబ్రవరి

శాల్ని వాటి వికారాలుగా చెప్పటం ఒక్కోసారి భాషలో కనిపించే సపదాంశాల్లో ఒకదాన్ని గ్రహించకుండా ఒక మూలరూపాన్ని సృష్టించుకొని సపదాంశాలన్నిటినీ సూత్రాల ద్వారా సాధించవచ్చు సంస్కృత వ్యాకర్తల ధాతువులు అట్లాంటివి చాలా ధాతువులు వాటి స్వత్వరూపంలో భాషలో కనిపించవు వాటికి కొన్ని సూత్రాలను అనువర్తిస్తే తప్ప ఇష్టరూపాలు సిద్ధించవు ఈ పద్ధతి సూత్రాలను గతిసూత్రా లంటారు tem nd proces ఉదాహరణకు పై సపదాంశాల్లో చేయి శబ్దాన్ని మూలరూపంగా గ్రహించి చేతి చేతు అనే రూపాల్ని సూత్రాల ద్వారా సాధించవచ్చు ఈ వ్యాసంలో ఈ పద్ధతే అనుసరించిబడింది స్థితిసూత్రాలకన్నా గతి సూత్రాలే బహుకారణాలవల్ల ప్రశస్తాలు ఆ కారణాలు ప్రత్యేక వ్యాసవిషయాలు గనుక ఇక్కడ వివరించటంలేదు మన వ్యాకర్తల పద్ధతి గతిసూత్ర పద్ధతే

పై సపదాంశాల్లో చేయి ని మూలరూపంగా గ్రహించకుండా చే అని మూలరూపాన్ని సృష్టించుకొని వ్యస్తంగా ఉన్నప్పుడు ఇ అని ఏకవచనరూపనిష్పాదక ప్రత్యయంగా ప్రతిపాదించి ఏ—ఇ అనే స్వరాలమధ్య య కారాగమాన్ని విధించి చేయి అనే రూపాన్ని సాధించవచ్చు తి ని ఉప విభక్తి ప్రత్యయంగా విధించవచ్చు తి బహు వచనం ముందు తు గా మారినదనవచ్చు పై దానికన్నా ఈ పద్ధతి కొంత క్లిష్టంగా పైకి కనిపిస్తున్నా చాలా ప్రయోజనాలున్నై ఒక్కోసారి ఇది భాషాచరిత్రను ఎక్కువగా ప్రతిబింబిస్తుంది అంతేగాక భాషా లక్షణాన్ని లెస్సగా నిరూపిస్తుంది అయినా ఈ వ్యాసంలో ఆ పద్ధతిని అనుసరించటం లేదు ఈ వ్యాసాన్ని అత్యాధునిక పద్ధతిలో తెలుగులో రాయాలంటే కొన్ని ఇబ్బందులున్నై తగిన పదజాలం లేదు సూత్రాలర్థమయ్యేట్టుగా రాయటానికి చాలా శ్రమించాలి ఆ సిద్ధాంతాల్ని గురించి ముందుగా చెప్పకుండా సూత్రాలు రాసుకుపోతే ఆ సూత్రపద్ధతి అలవాటు లేకపోవటంవల్ల అర్థం చేసుకోవటానికి పాఠకులు విపరీతంగా శ్రమపడాల్సి ఉంటుంది ఈ కారణాలవల్ల సిద్ధాంతం పంచబడ్డా బహుపాఠక సౌలభ్యం కోసం కొంత రాజీమార్గం అయిష్టంగానైనా అవలంబించాల్సి వచ్చింది

గతి సూత్ర పద్ధతిలో సూత్రాలు అల్పాక్షరం మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం అనే లక్షణాల్ననుసరించి ఉంటై సాధ్యమైనంతవరకు సూత్రాలు

ఎన్నో రూపాల్లో జరిగిన మార్పుల్ని కొద్దిసూత్రాల్లో చెప్పటానికి అనువుగా రచించాల్సి ఉంటుంది అంటే చేయు అనే ఒక్క శబ్దానికేకాక ఆ రకపు ప్రవర్తన గలిగిన శబ్దాలన్నిటికీ అన్వయించేట్టుగా గతిసూత్రాలుంటై

ప్రాచీనాంధ్ర వ్యాకరణాలు గతిసూత్ర పద్ధతిలోనే రచింపబడినై చిన్నయసూరి బాలవ్యాకరణంలో అవలంబించిం పద్ధతి ఇదే

ఆధునిక భాషాశాస్త్రంలో గతిసూత్ర రచనా పద్ధతి ఈ క్రింది విధంగా ఉంటుంది

XAY⟶XBY

ఈ సూత్రాలకర్థం X—Y ల పరిసరంలో A అనే అంశం B అనే అంశంగా మారుతుంది X Y ల రెంటి విలువలూ శూన్యమైతే దీన్ని పరిసర నిరపేక్షక సూత్రం (cortext free ule) అంటారు X Y లలో ఏ ఒక్కటైనా సార్థకమైతే పరిసరాపేక్షక సూత్రం (contεx ens t ve rule) అంటారు ఈ వ్యాసంలో సూత్రాలన్నీ పరిసరాపేక్షక సూత్రతే

పై సూ తాన్నే కుదించి

A—B/X—Y

అని కూడా రాయవచ్చు ఈ కుదింపువల్ల ప్రయోజనం X Y లను ఒకస్సారి మాత్రమే రాయటం ఈ కుదింపులో క్రొత్తగా చేర్చిన నిలువు గీత కర్థం ఈ చెప్పబోయే పరిసరాల్లో అని X—Y ల మధ్యనున్న అడ్డగీత మారిన అంశం స్థానాన్ని సూచిస్తుంది

ఈ సూత్రాలు వర్తించాల్సిన క్రమం నియతం అంటే ఈ సూత్రాలు ఈ రాసిన క్రమంలో వర్తిస్తేనే సాధురూపాలు సిద్ధిస్తయ్యన్నమాట ఇట్లాంటి సూత్రాల్ని సంపూర్ణ నియతక్రమ సూత్రాలు complete y ordered rule) అంటారు వీటిల్లో కొన్ని సూత్రాలక్రమం నియతం కాకపోతే వీటిని పాక్షిక నియతక్రమ సూత్రాలు (par a y ordered ru es అంటారు

సాధారణంగా సూత్రాల క్రమం పాక్షికంగానే ఉంటుంది ఈ వ్యాసం లోని సూత్రాలిట్లాంటివే

సపదాంశాల్లో రూపభేదానికి ఒక్కోసారి పదాంశాలను కారణంగా చెప్పాల్సి ఉంటుంది అట్లాంటి సూత్రాలని పదాంశ విధేయ సూత్రాలు mo pho og ca y cond t oned ru e అంటారు బహువచన ప్రత్యయం ముందు అని ఒక సూత్రానికి పరిసర నిర్దేశం చేశామనుకోండి బహువచన ప్రత్యయం అనేది పదాంశ సంబంధి morpho og ca e ment గనుక ఆ సూత్రం పదాంశ విధేయ మవుతుంది

ఒక్కోసారి ఈ రూపభేదానికి పదాంశాలతో సంబంధం లేదు అంటే అర్థంవంతమైన శబ్దాల ప్రసక్తి అనవసరమన్నమాట కేవలం వర్ణాలు (ఒకటి కాని ఎక్కువకాని మాత్రమే రూపభేదానిక్కారణంగా నిర్దేశిస్తే సరిపోతుంది అట్లాంటి సూత్రాలు phono og ca y cond t oned ru es) అంటారు

వర్ణ విధేయ సూత్రాల ప్రవృత్తి పదాంశ విధేయ సూత్రాల ప్రవృత్తి కన్నా విస్తృతం ఈ విషయం ముందు ముందు విశదమవుతుంది

ఈ వ్యాసంలో రెండురకాల సూత్రాలూ ఉన్నై సూత్రక్రమంలో పదాంశ విధేయ సూత్రాలను ముందు అనువర్తించుకోవాలి ఈ సూత్రాలు నిష్పన్నం చేసిన రూపాలమీద వర్ణవిధేయ సూత్రాలు వర్తిస్తై ఏ సమూహాని కాసమూహంలో మళ్లీ క్రమం పాక్షికంగా నియతం

భాషలో సర్వత్రా వర్తించే వర్ణ విధేయ సూత్రాల్లో బహువచనాని కవసర మైనంత మట్టుకే ఈ వ్యాసంలో కూర్చబడినై ఈ రెండోవర్గం సూత్రాలు ప్రస్తు తానికి అసమగ్రాలు ఆధునికాంధ్రంలో స్వరసంధివర్ణన చాలా కష్టమైన భాగం అంతేగాక ఈ అనుసరించిన సూత్ర రచనా పద్ధతితో స్వరసంధివర్ణన చెయ్య టానికి ఇప్పుడున్న తెలుగు లిపి చాలదు

సమగ్రమైన తెలుగు వ్యాకరణంలో ఈ సూత్రాల క్రమమూ రూపమూ మార్చాల్సి రావచ్చు ప్రస్తుత సూత్రాల ప్రయోజనం ఆధునికాంధ్రంలో బహు వచన రూపనిష్పత్తికి శాస్త్రపద్ధతిలో ఒక స్వల్ప మార్గాన్ని సూచించటమే

ఈ వ్యాసంలో పర్తులుగా ఉపయోగించిన అక్షరాలు మాట్లాడే ధ్వనులను సూచించే వర్ణాలకు సంకేతాలుగా గ్రహించాలి సున్నా తత్పరిసరానికి సంబంధించిన అనునాసికవ్యంజనానికి గుర్తు పదాంతంలో ఇది మ వర్ణానికి సంకేతం ట డ శ ల క్రింద రాసిన ॢ అనే గుర్తు మూర్ధన్య పార్శ్వక వర్ణాన్ని సూచిస్తుంది వ్యంజనం మీది అకారం ఉచ్చారణార్థం రాసిందిగానే గుర్తించాలి సూత్రంలో డ అని రాస్తే వ్యంజనమైన డ కార మాత్రం గానే గ్రహించాలి

సూత్రాల్లో ఉపయోగించిన గుర్తులకు వివరణ

→ ఈ గుర్తుకు ఎడం పక్కనున్న గుర్తు కుడిపక్కనున్న గుర్తుగా మారుతుంది

2 — ఉ అని రాస్తే పదాంతమైన ఉ అని చదువుకోవాలి

3 ఇ అంటే ఇకారమనీ క అంటే కకారమనీ చదువుకోవాలి

4 φ లోపం

5 * ఈ గుర్తున్న సూత్రం వికల్పసూత్రం ప్రవర్తించినప్పుడొక రూపం ప్రవర్తించనప్పుడింకొక రూపం ఉంటై

6 + ఈ గుర్తున్నచోట పదాంశ విభాగానికి ప్రాముఖ్యముండవచ్చు

7 ఈ కుండలీకరణాల్లో ఉన్న గుర్తు ఉండవచ్చు ఉండక పోవచ్చు

8 — ఈ కుండలీకరణాల్లో ఉన్న గుర్తుల్లో ఏదో ఒకటైనా విధిగా ఉండాలి

9 / ఈ చెప్పబోయే పరిసరాల్లో అని చదువుకోవాలి

0 [ ] ఈ కుండలీకరణంలో ఉన్న గుర్తులన్నీ సూత్రప్రవర్తన కవసరం

## మొదటి వర్గం పదాంశ విధేయ సూత్రాలు

ఈ వర్గంలో సూత్రాలన్నిటికి బహువచన ప్రత్యయం సామాన్య ప సరం అందువల్ల సూత్రాలన్నిటికీ దీన్ని చేర్చలేదు ప్రాచీనవ్యాకరణాల్లో అధికార సూత్రంలాగా ప్రతి సూత్రానికి బహువచనంతో అని అన్వయించుకోవాలి

రాయి → రాలు

తరవాత వచ్చే ఒక సూత్రంవల్ల ల వర్ణానికి మూర్ధన్యత్వం సిద్ధిస్తుంది

2 [—యి —ను —వు] → Φ

వేయి చేను పేను పూవు శబ్దాల్లో తుది యి ను వు లు లోపిస్తై ఈ పదాలకు మాత్రమే ఈ సూత్రం వర్తిస్తుంది

పై రెండు సూత్రాలు పరిమిత వర్తనం కలిగిన సూత్రాలు సామాన్య సూత్రాలను ధిక్కరించేవి గనుక మార్గాన్ని నిష్కంటకం చెయ్యటంకోసం వీటినే ముందు చెప్పాల్సివచ్చింది

3 యి → తి Φ [అకారేతర దీర్ఘాచ్చు]—

త్రిమాత్రాపరిమాణంగల శబ్దాల్లో అకారేతర దీర్ఘస్వరపూర్వకమైన యి కి తి ఆదేశ మవుతుంది

గోయి చేయి నూయి నేయి పీయి అనే శబ్దాలు ఈ సూత్రానికి విషయాలు

నిజాని కిట్లాంటి శబ్దాలు ఇవి మాత్రమే కనిపిస్తున్నై అయినా ఈ సూత్రం ప్రకారం ఇట్లాంటి శబ్దాలింకేమైనా దొరికినా లేక ఇట్లాంటి శబ్దాలు తెలుగువాడు సృష్టించుకున్నా వాటిల్లో యి తి గా మారుతుందని సూత్రం నిర్దేశిస్తున్నది ఈ పద్ధతి తెలుగుభాషాలక్షణంలోనే ఉన్నదని వ్యాసకర్త ఉద్దేశం

అకారేతర మనటంవల్ల వాయి రక్షితం దీర్ఘాచ్చు అనటం పొయ్యి రక్షితం వేయి లోని యి రెండో సూత్రంవల్లనే లోపించింది కాబట్టి ఈ సూత్రానికి బాధకంకాదు

చేయి నేయి వంటి శబ్దాలకు చెయ్యి నెయ్యి వంటి రూపాలే బహుళంగా వాడుకలో ఉన్నై అయినా వ్యాకరణమూల రూపాలుగా దీర్ఘ స్వర రూపాలే గ్రహించబడ్డై అది శాస్త్ర సమ్మతమే వాడుకలోని ఏకవచన రూపాలని అకారేతర దీర్ఘస్వరానికి హ్రస్వస్వరమూ తరువాత య వ లకు ద్విత్వమూ వికల్పంగా వస్తుంది అనే సూత్రం ద్వారా సాధించవచ్చు

4 పెండ్లి ⟶ పెండ్లిల్లు

పెళ్లి అనే రూపం వ్యవహరించే వారికి అది కూడా ఈ సూత్రంలో చేర్చుకోవచ్చు పెండ్లి అనే శబ్దానికి బహువచనంలో ఇల్లు అనే అనుబంధం చేరుతుందని ఈ సూత్రార్థం తరువాత సూత్రాలవల్ల పెండ్లిండ్లు పెళ్లిళ్లు అనే రూపాల్ని సాధించుకోవచ్చు అనుబంధరూపాన్నే మూలరూపంగా గ్రహించి ఏకవచనంలో ఇల్లు అనే అనుబంధానికి లోపం జరుగుతుందన్నా అదే ఫలితాన్ని సాధించవచ్చు

*5 రాత్రి ⟶ రాత్రిల్లు

పై సూత్రంలాంటిదే ఇదీ అయితే ఇది వికల్పం కావటంవల్ల రాత్రులు అనే రూపమూ సాధ్యమే

6 { ఏడు, కాడి, తూడు } ⟶ { ఏండు, కాండి, తూండు }

ఏండ్లు కాండ్లు తూండ్లు అనే బహువచన రూపాలు ఈ సూత్రంవల్ల సిద్ధిస్తై చరిత్ర ననుసరించి రాస్తే ఈ సూత్రాన్ని తిరగేసి ఏకవచన రూప నిష్పత్తిలో చేర్చుకోవాలి దీర్ఘస్వరపూర్వకమైన వ్యంజన పరమైన అను నాసికవర్ణానికి లోపమవుతుంద ని చారిత్రకంగా పూర్వరూపాలైన అనునాసిక వర్ణయుక్త రూపాలనుంచి ఆధునికమైన నిరను నాసికరూపాల్ని సాధించుకోవచ్చు నిజానికి అదే సరైన పద్ధతి ఏకవచన రూపసాధన ఈ వ్యాసంలో గ్రహించలేదు గనుక ఈ సూత్రం ఇక్కడ రాయబడ్డది ఇక్కడఏడు వర్షార్థకం

7 { —న్ను, —ల్లు } ⟶ ండు

ఇల్లు కన్ను శిరార్థకమైన కిల్లు చన్ను దంతార్థకమైన పల్లు లేక పన్ను) ముల్లు విల్లు అనే పదాలు ఈ సూత్ర విషయాలు ఇవన్నీ ఔప విభక్తి నామాలు కావటం విశేషం తెలుగు నామాల్లో ఏ నామాలు ఔప విభక్తికాలో ఏవి కావో శబ్దరూపాల్నిబట్టి నిర్ణయించలేము

కాబట్టి నామాల్ని ఔపానౌపవిభక్తికాలుగా వ్యాకరణంలోనో కోశంలోనో సూచించక తప్పదు ఔపవిభక్తికత్వాన్ని సూచించినప్పుడు పై సూత్రం సామాన్యమాత్రమే అవుతుంది బహువచన రూప నిష్పత్తిలో ఔపానౌపవిభక్తికత్వ ప్రాధాన్యాన్ని బాలవ్యాకర్త కూడా గుర్తించాడు ఔప విభక్తికంబుల లి వర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణ బిందు పూర్వక డు వర్ణంబు బహుళంబుగానగు బాల వ్యా ఆచ్ఛిక సూ 6 ప్రాచీన భాషలో ఇల్లులు ఇండులు వంటి రూపాలు కూడా సాధువులే ఆధునిక భాషలో ఇల్లులు అసాధువు ఇండులు లో ఉల్లోపం నిత్యం ఈ లోపానికి వర్ణ విధేయ సూత్రాల్లో ఒక సూత్రం ఉంది )

4 5 సూత్రాల్లో అనుబంధంగా చేర్చిన ఇల్లు నకు కూడా ఈ సూత్రం వర్తిస్తుంది అట్లా అనుబంధించట నికి ప్రయోజనమే ఇది

*8 ం ⟶/—[డి డు]

ఇక్కడ సున్న ఐ వర్ణానికి చిహ్నం ఇ ఉ h gh vowe s) వర్ణాంతమైన శబ్దాలో డ వర్ణానికి పూర్వాన ఉన్న అనునాసిక వ్యంజనానికి వికల్పంగా లోపమవుతుందని ఈ సూత్రార్థం ఈ సూత్ర వికల్పత్వం నగర గ్రామ భాషా భేదాల్ని సూచిస్తుంది ఉల్లోపమూ డ కారానికి ళ కారాదేశము వర్ణ విధేయ సూత్రాలద్వారా సిద్ధిస్తుంది అన్ని సూత్రాల ప్రవర్తన తర్వాత రూపాలిట్లా ఉంటై ఈ సూత్రం ఏకవచన రూపసాధనకు కూడా అవసరం దీనివల్లనే పెండ్లి– పెళ్ళి అవుతుంది

| | | |
|---|---|---|
| కన్ను | — | కండ్లు కళ్లు |
| పల్లు | — | పండ్లు పళ్లు |
| ఏడు | — | ఏండ్లు ఏళ్లు |
| బండి | — | బండ్లు బళ్లు |
| పండు | — | పండ్లు పళ్లు |

ఎండి అనే దానికి ఎండ్లు అనే బహువచనం ఉన్నట్టుంది గాని ఎళ్లు అనే రూపం వినలేదు

*9 ఎద్దు ⟶ ఎడ్డు

ఎద్దు అనే శబ్దానికి ఎద్దులు ఎడ్లు అనే రెండు రూపాలున్నై కాబట్టి ఈ సూత్రంవల్ల వికల్పంగా ఎడ్లు అనే రూపం సాధించబడింది ఇట్లాంటిది ఒకే శబ్దం కనిపిస్తున్నది చారిత్రకంగా ఈ శబ్దంలో బహువచనంలో మాత్రమే డ కారం ఎట్లా వచ్చిందో చెప్పలేం మధ్యోత్తరద్రావిడ భాషల్లో డ ఘటిత రూపాలుండటం గమనించదగిన విశేషం డ కార ఘటిత రూపాలే ప్రాచీనాలు కావచ్చు

కొలామీ — ఎడ్ (బహు-ఎడ్ల్

నాయకి — హెడ్ (బహు — హెడ్ల్ )

కురుఖ్ — అడ్డో (DED 698 )

10 {—అం, —ఎం} ⟶ {—ఆ, —ఏ}

మ కారాంత పదాల్లో చివరి మ కారం అ కార పూర్వకంగాని ఎ కార పూర్వకంగాని అయితే మ వర్ణానికి లోపం తత్పూర్వ స్వరానికి దీర్ఘమూ అవుతుంది ఈ మార్పు ప్రాచీన భాషలోనూ ఉన్నట్లు బాలవ్యాకరణంలోని లు ల న లు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోప బును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు (బాల వ్యా తత్సమ సూ 43 అనే సూత్రంవల్ల తెలుస్తున్నది అకార ఎకార పూర్వకమై మకారాంతమైన పదాల్లోనే ఇది జరుగుతుందని బాలవ్యాకర్త చెప్పలేదు ఉదాహరణకు కుడుము ఉడుము వంటి పదాల్లో ఈ కార్యం జరగదు అందువల ఈ సూత్రంలో నిర్దేశించిన స్వరపరిసరం సార్థకం

సూత్రంలో అం ఎం బదులు అము ఎము అని క్రమంగా ఉంచినా వ్యాకరణ కార్యంలో వచ్చేభేదం ఏమీలేదు పదాంతంలో ము ఉచ్చారణలో మ్ అని మాత్రమే అని వ్యాకరణంలో ఇంకోచోట నిర్దేశించుకోవచ్చు సమగ్ర వ్యాకరణంలో ఈ సూత్రానికి పరిసరాఌగా ని అనే పరిసరం కూడా చేర్చుకోవాలి

ఈ సూత్రం తత్సమాచ్ఛిక శబ్దాలకు రెండింటికి వర్తిస్తుంది

—డు→ Φ / —+

మహదేకవచనాలయిన తత్సమ శబ్దాలు ఈ సూత్రానికి విషయాలు దేశ్యాలయిన తమ్ముడు వంటి శబ్దాలకీ కార్యం అరుదుగా కన్పిస్తుంది

తత్సమ దేశ్యవిభాగం ఆధునిక వ్యాకరణానికైనా తప్పనిసరి వ్యాకరణ కార్యాలు ఈ విభాగాన్ననుసరించి కూడా ఉంటై

తత్సమ తద్భవ విభాగం ఆధునిక భాషలో వ్యవహర్తల్ని బట్టి ఉంటుంది ఒక వ్యవహర్తకి తత్సమమైన శబ్దం మరో వ్యవహర్తకి తద్భవం కావచ్చు

ఒకమాట సంస్కృత సమమా కాదా అనేది వ్యవహర్తకున్న సంస్కృత పరిజ్ఞానాన్ని బట్టి ఉంటుంది గ్రామీణులు తత్సమ శబ్దాల్ని కూడా తద్భవ దేశ్యాల్లాగే భిన్న వ్యాకరణ కార్యాల్లో వ్యవహరించవచ్చు

స్నేహితుడు అనే మాటకు స్నేహితులు అని బహువచనరూపం వాడితే అతనికిది తత్సమ మన్నమాట స్నేహితుళ్ళు అని వాడితే తత్సమం కాదన్న మాట

* 2 —ర → — ల / — [ఇ ఉ]

ఇ ఉ కారాలు అంత లో ఉండి పూర్వంలో ఉన్న ర కారం ఈ సూత్రంవల్ల ల కారం అవుతుంది వక్ష్యమాణ సూత్రంవల్ల ఇది మూర్ధన్య మవుతుంది ఈ సూత్రం కొన్ని పదాలకు మాత్రమే వర్తిస్తుంది శబ్ద స్వరూపాన్ని బట్టి ఏ పదంలో అవుతుందో ఏ పదంలో కాదో చెప్పలేం ఇంకా పరిశోధిస్తే వీటిల్లోఉన్న అంతస్తత్త్వం కనుక్కోవచ్చేమో ఈ కింది పదాలు ఉదాహరణప్రాయాలే

ఉదా – ఊరు గోరు మూలార్థంలో వేరు వెదురు కుదురు కదురు కూతురు పందిరి మొ

ఈ సూత్రాన్ని వికల్పమని చెప్పటానికి కారణ ఊర్లు గోర్లు అని వ్యవహరించే వాళ్ళుండటమే

18 ల → ళ / [అచ్చు]—ఉ
2 [అచ్చు]—ఇ

స్వరపూర్వకమై ఉదంతమైన చివరి ల కారం ళ కార మవుతుంది ఇ దంతమైన ద్విమాత్రాధిక సంఖ్యాకశబ్దాల్లో స్వర పూర్వకమై ఉపధవర్ణంగా వచ్చిన ల కారం కూడా ళ కారమవుతుంది పై సూత్రం రెండో పరిసరాన్ని నిర్దేశించినప్పుడీ మాత్రాసంఖ్యను గుర్తులతో సూచించటం కష్టం గనుక వివరణలో సూచించబడింది పద సిద్ధంగాఉన్న ల కారం మీద మాత్రమేకాక పూర్వసూత్ర సాధ్యమైన ల కారం మీదకూడా ఈ సూత్రం వర్తిస్తుంది

స్వరపూర్వకమని అనటంవల్ల రెల్లు విల్లి వంటి పదాల్లోనూ ద్విమాత్రాధిక సంఖ్యాకమనటం వల్ల ఉలి పులి వంటి శబ్దాల్లోనూ ఈ కార్యం జరగకుండా నివారించబడింది

స్వరలోపానికి వర్ణవిధేయసూత్రం వర్తిస్తుంది

ఉదా —

| | | |
|---|---|---|
| నెమలి | — | నెమళ్లు |
| మొసలి | — | మొసళ్లు |
| తిరగలి | — | తిరగళ్లు |
| నాగలి | — | నాగళ్లు |
| చాకలి | — | చాకళ్లు |
| పందిలి | — | పందిళ్లు |
| కౌగిలి | — | కౌగిళ్లు |
| కుందేలు | — | కుందేళ్లు |
| తాబేలు | — | తాబేళ్లు |
| నాగేలు | — | నాగేళ్లు |
| కాలు | — | కాళ్లు |
| కీళ్లు | — | కీళ్లు |
| వేరు | — | వేళ్లు |
| ఊరు | — | ఊళ్లు |

ఏడో సూత్రంకి ద ఉదహరించిన బాలవ్యాకరణ సూత్రాన్ని అనుసరించి ఔపవిభక్తికత్వాన్ని ఈసూత్రంలో ఉపయోగించటానికి వీల్లేకపోయింది అందుకు కారణాలివి అసలెప్పుడూ ఔపవిభక్తికాలుకాని నెమలి మొసలివంటి పదాల్లో ఈ కార్యం జరుగుతున్నది 2 మిగతా శబ్దాలకైనా ఔపవిభక్తికత్వం నేటిభాషలో వికల్పం 3 ఔపవిభక్తికత్వాన్ని చెప్పకుండానే పటిష్ఠమైన పరిసర నిర్దేశం చెయ్యటానికి వీలయింది

4 -ఇ ⟶ -ఉ / { యకారేతర వ్యంజనం } — +

2 — { ట డ న ర ల లు కాని వ్యంజనం } ఉ

ఈ సూత్రం నిజానికి రెండు సూత్రాలు కుదించటంవల్ల ఏర్పడింది

పదాంతంలోని ఇ వర్ణం బహువచన ప్రత్యయం ముందు ఉవర్ణంగా మారుతుంది ఈ మార్పు ఆ ఇ యికారేతర వ్యంజన పూర్వకమైనప్పుడు మాత్రమే జరు తుంది ఇట్లా అనటంవల్ల అబ్బాయి అమ్మాయి వాయి పొయ్యి వంటి పదాల్లో పదాంత ఇకారాని కీమార్పు జరగదు ప్రాచీన భాషలోనూ ఇట్లా జరుగుతుందని చెప్పలేం పొయ్యికి పొయ్యులు అనే బహువచనం ప్రాచీన భాషలో ఉన్నట్టు కనిపించదు ఇత్తునకు బహువచనంబగు నపు దుత్వంబగు బాలవ్యా తత్సమ 45 అనే సూత్రంలో చిన్నయసూరి యకారేతర వ్యంజన మనే పరిసరం చేర్చలేదు

ప్రాతిపదికలో చివరి ఇ ఈ సూత్రంవల్ల ఉ గా మారిన తర్వాత ఈ ఉ బలంవల్ల ఉపోత్తమ ఇత ం కూడా ఉత్త్వంగా మారుతుంది ఉపోత్తమ ఇత్వం అనటంవల్ల ఈ మార్పు మూడు అచ్చులున్న మాటల్లోనే జరుగుతుంది దీన్ని తెలుగు గుర్తుంతో సూచించటం కష్టమని సూత్రంలో చెప్పలేదు) అంతే కాక ఈ పదమధ్య ఇ కి పరంలో సూత్రంలో సూచించినట్టుగా ట డ న ర ల లు

కాని వ్యంజన ముందాలి అంటే ఈ వ్యంజనాల ముందు ఈ మార్పు నిరోధిత మవుతుంది ఇట్లా నిరోధితం కావటానికి కారణం వెతక దగినది ట డ న ర ల వ్యంజనాలు నాలుక కొసతో apex ఉచ్చరితమవుతై వీటికి బహువచన ప్రత్యయమైన లు కి మధ్యనున్న అచ్చు సంధిలో లోపిస్తుంది ఆ లోపంవల్ల ఏర్పడ్డ సంయుక్త వ్యంజనం ఈ మార్పుని నిరోధిస్తున్నదేమో కాని ఇట్లా అనుకోటానికి ఒక ప్రతి బంధకం వుంది ప్రాచీన భాషలో ఎడికిళులు రాఐడులు పందిరులు వంటి రూపాల్లో సంయుక్త వ్యంజన విరహితంగానే మార్పు నిరోధితమైంది సంయుక్త వ్యంజనం లేకుండానే ఈ మార్పు నిరోధితం కావటానికి ఈ వ్యంజనాల ఉచ్చారణ ఎందుకు కారణం కావాలో చెప్పలేం అటువంటప్పుడు ట డ న ల అనే వ్యంజనాలు ఈ మార్పు నిరోధితం కావటానికి నిమిత్తాలు కావేమో అట్లా కానిపక్షంలో పై సూత్రాన్ని సవరించాల్సి ఉంటుంది

బహుశా ఈ మార్పుని నిరోధించేది నామ పదంలోని మాత్రాసంఖ్యేమో ఈ మార్పు జరగని నామపదాలన్నీ చతుర్మాత్రాకంగా కనుపిస్తున్నై ఉపోత్తమ ఇ కారానికి పూర్వాక్షర Pr ced ng y ah e పరిమితి రెండు మాత్రలైతే ఈ మార్పు జరగదని చెప్పవచ్చు ఇది కూడా నిష్కళంకమైన మార్గమని చెప్పటానికి వీల్లేదు నిత బహువచనంగా నేటి భాషలో కనిపిస్తున్న ఉసిళ్లు అనే రూపంలో పదాంశవిభాగం చేస్తే లు అనే బహువచన ప్రత్యయాన్ని విడదీయవచ్చు అప్పుడేవచన రూపం ఉసలి లేక ఉసడి అని కావాలి లేకపోతే ఈ పదంలో మూర్ధన్యమైన ళ కారానికి వేరే మూలం లేదు అప్పుడీ నామం త్రిమాత్రాకమే అవుతుంది అయినా మధ్య ఇ ఉ కాలేదు అంటే త్రిమాత్రాక శబ్దాల్లోనూ ఈ మార్పు నిరోధిత మయిందన్నమాట అంటే మాత్రాసంఖ్య కి విషయంలో ప్రమేయం లేదనే తేలుతున్నది

ఈ రెండు మార్గాల్లోనూ క్లేశం ఉంది ఇంకా పరిశోధిస్తేనేగాని దీని తత్వం పూర్తిగా గ్రహించలేం ఈ మార్పు తత్సమ శబ్దాల్లో జరగదు ఉదా - సమితులు అతిథులు

బాలవ్యాకరణంలో ర ల డోఽధ నవార్థాదుల యుసోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు తత్సమ సూ 47 అనే సూత్రంలో ఉత్వనిరోధానికి ర ల డ లను మాత్రమే చిన్నయసూరి పరిసరంగా నిర్దేశించాడు నిజానికి ఉదాహరణలు ఈ మూడు వ్యంజనాలతో మాత్రమే దొరుకుతున్నై ట న అనే వ్యంజనాలు అధికంగా ఈ వ్యాసంలోని సూత్రాలలో చేర్చబడ్డై అవి ఉన్నా ఈ మార్పు నిరోధితమవుతుందన్న ఊహే ఇవి చేర్చటానికి కారణం ఉదాహరణకు ముసిటి అనే ఒక పదం ఒక మండలంలో దొరికిందనుకోండి దాని బహు వచన రూపం ముసట్లు అని ఉంటుందని ఈ సూత్రం చెప్తుంది

పై సూత్రంలో ఇ కారం ఉ కారంగా మారడానికి రెండు పరిసరాలు నిర్దేశించబడినై మొదటి పరిసరంలో మార్పు జరిగిన తర్వాతి రెండో పరిస రంలో మార్పు జరుగుతుంది అంటే ఈ పరిసరాల క్రమం కూడా నియత మన్నమాట

ఈ సూత్రాలు పాక్షిక నియత క్రమాలని ఇంతకుముందు చెప్పబడింది అంటే కొన్ని సూత్రాల వరసని తిరగెయ్యటానికి వీల్లేదు అన్నమాట 3 4 సూత్రాలు ఆ వరసలోనే వర్తించాలి 3 లో లకారానికి మూర్ధన్యత్వం విధించిన తరువాతే దానికి పరంలో ఉన్న ఇ ని ఉ గా మార్చాలి 2 తరవాతనె 3 వర్తించాలి ఎందుకంటే 2 వల్ల నిష్పన్నమైన ల కారం మీద కూడా 3 వర్తిస్తుంది 4 5 సూత్రాల తరువాతనే 7 ప్రవర్తిస్తుంది లేకపోతే పెళ్ళిళ్ళు రాత్రిళ్లు అనే రూపాలు సాధ్యం కావు 6 7 సూత్రాల తరువాతనే 8 వర్తిస్తుంది లేకపోతే ఏండ్లు—ఏళ్లు ఇ డ్లు—ఇళ్లు అనే వికల్పరూపాలు సాధ్యంకావు వేయి వేతి కాకుండా ఉండాలంటే 2 తరువాతనే 3 ప్రవర్తించాలి ఇట్లా ఎక్కడెక్కడ సూత్రక్రమం అర్థవంతమో పాఠకులు జాగ్రత్తగా పరిశీలిస్తే గ్రహించగలరు

## రెండోవర్గం వర్ణ విధేయ సూత్రాలు

మొదటి వర్గం సూత్రాలు ప్రవర్తించిన తరువాత అవి ఉత్పత్తి చేసిన రూపాలమీద ఈ రెండోవర్గం సూత్రాలు ప్రవర్తిస్తై భాషకంతటికి వర్తించే ఈ

వర్గంలోనుంచి బహువచనరూప వ్యుత్పత్తి కవసరమైనంతమట్టుకే ఇక్కడ కూర్చబడినై. పీటివరసకూడా నియమితమే

ఉ → Φ / ం [ ట ట్ట డ డ్డ ళ ]— + ల

ఇది స్వరలోపసూత్రం. పరిసరంలో కుండలీకరణాల్లో ఉన్న సున్న అనునాసికవ్యంజనాన్ని సూచిస్తుంది. అనునాసిక వర్ణపూర్వకమైనా కాకపోయినా మూర్ధన్యవర్ణాలు ద్విరుక్తమయినా కాకపోయినా ఈ వర్ణాల మీద ఉన్న ఉ కారం ల కారం పరమైనప్పుడు నిత్యంగా లోపిస్తుంది. పై వ్యంజనాల్లో అనునాసికవర్ణయుక్తం కాగలిగినవి ట డ లు మాత్రమే. అనునాసికవర్ణాల తరవాత ద్విరుక్తవర్ణాలు, ళ వర్ణమూ ఎట్లాగూ ఉండవు కాబట్టి ంట్ట ండ్డ ంళ అనే సంయోజనం ఈ సూత్రాన్ని ఆటంకపరచదు. ఈ సూత్రం ప్రకారం ఆధునిక భాషలో—

అంటు + లు — అట్లు
కాటు + లు — కాట్లు
చెట్టు + లు — చెట్లు
కోడు + లు — కోళ్లు
గుడ్డు + లు — గుడ్లు
పండు + లు — పండ్లు

కన్ను > కండు + లు — కండ్లు
ఇల్లు > ఇండు + లు — ఇండ్లు
ముల్లు > ముండు + లు — ముండ్లు
రాయి > రాళు + లు — రాళ్లు
కాలు > కాళు + లు — కాళ్లు
నెమలి > నెమళు + లు — నెమళ్లు
మొసలి > మొసళు + లు — మొసళ్ళు

అనే విధంగా సంధి నిత్యంగా జరుగుతుంది. ప్రాచీనభాషలో ఈ స్వరలోపం కొన్నిచోట్ల జరగదు. కొన్నిచోట్ల జరిగినా నిత్యంకాదు. ఆధునిక

భాషలో చెట్టులు గుడ్డులు ఇండులు కండులు (<కల్లు) పాండులు అనే రూపాలు వ్యాకరణ విరుద్ధాలు మాటలు నేర్చుకొనే దశలో ఉన్న పసివాళ్ళ ఉచ్చారణలో ఇట్లాంటి రూపాలు కొన్ని వినిపిస్తై*

*2 అచ్చు → Φ   ట ట్ట డ డ్డ ణ / న న్న ర ర్ర ల ల్ల —( + ల

బిందుపూర్వమయినా కాకపోయినా ద్విరుక్తమయినా కాకపోయినా మూర్ధన్య దంతమూలీయవర్ణాల తరువాత (మీద) ఉన్న అచ్చు ల కారం పరమైనప్పుడు వికల్పంగా లోపిస్తుంది ఈ సూత్రప్రవర్తన వ్యవహర్త ఉచ్చరించే వేగంమీద ఆధారపడి ఉంది

సూత్రంలో బహువచనానికి అవసరం లేనందువల్ల సూచించలేదుగాని మూర్ధన్య దంతమూలీయ వర్ణాలు పరంలో ఉన్నప్పుడుకూడా ఈ లోపం వికల్పంగా జరుగుతుంది

పై సూత్రంలోలాగే బిందు పూర్వకం కాగలిగిన వర్ణాలు ట డ లు మాత్రమే

ఉదా మాను + లు -- మాన్లు
పని + లు — పన్లు
పులి + లు — పుల్లు
పేరు + లు — పేర్లు

---

* పిల్లలు వ్యాకరణం నిర్మించుకునే దశను శ్రద్ధగా పరిశీలిస్తే కొన్ని భాషా విషయాలు గ్రహించవచ్చు ఈ వ్యాసకర్త ఇటీవలే బహువచన రూపనిష్పత్తిని సాధిస్తున్న తన ఐదేళ్ళ కుమారుడు కిట్టు భాషలో చెట్టులు గుడ్డులు అనే రూపాల్ని విన్నాడు అంటే వీడింకా ఈ స్వరలోపసూత్రాన్ని పరవర్ణంముందు ద్విరుక్తం అద్విరుక్తమయ్యే సూత్రాన్ని తన వ్యాకరణంలో నిర్మించుకో లేదన్నమాట

మిగతా అచ్చులతో ఉదాహరణ లియ్యకపోవటానికి కారణం అచ్చు లోపంవల్ల జరిగే ఇతర వికారాలని ధ్వనివిధేయంగా తెలుగులో సూచించటానికి వీలులేకపోవటమే

మొదట సూత్రంలో సూచించిన పరిసరాల్లో లోపించగా ఇతర పరిసరాల్లో మిగిలిన ఉకారమూ మిగతా అచ్చులు ఈ సూత్రానికి విషయాలు ఈ స్వరం పదంలో మొదటిదైతే లోపించదు

3 డ —> [ళ ణ] / అచ్చు—(+) [ల న]

స్వరపూర్వకమైన డ కారం ల న లు పరమైనప్పుడు క్రమంగా ళ ణ లుగా మారుతుంది ఇది సమీకరణ A m at సూత్రం పరిసరంలో ఉన్న ల న లు కూడా వక్ష్యమాణ సూత్రం వల్ల ళ ణ లుగా మారలై అంటే డ + న > ణ్ణ గానూ డ + ల > ళ్ళ గానూ మారతయ్యన్న మాట ఈ కార్యం ఏకపదంలోను జరగటానికి వీలుగా పదాంశ విభాగపు గుర్తు కుండలీకరణాల్లో ఉంచబడింది కోడలు అనే శబ్దాన్ని అవ్యవహితంగా ఉచ్చరించినప్పుడు కూడా ఈ మార్పు జరుగుతుంది రెండో సూత్రం వర్తించనప్పుడు మూడో సూత్రం కూడా వర్తించదు గనుక కోడలు అనే వ్యవహితోచ్చారణ కూడా రక్షితమే

ఉదా కోడులు > కోడ్లు > కోళ్లు
వాడిని > వాడ్ని > వాణ్ని

ఈ సూత్రంలో స్వరపూర్వక మనటం వల్ల గుడ్డు + లు అనే చోట డ కారం ఈ మార్పుకు గురికాదు

4 ద్విరుక్తవ్యంజనం -→ అద్విరుక్తవ్యంజనం / — + వ్యంజనం

స్వరలోపానంతరం పరవర్ణమైన వ్యంజనం ముందు ద్విరుక్త వ్యంజనం అద్విరుక్త వ్యంజన మవుతుంది

గుడ్డులు అనే రూపం మొదటి సూత్రంవల్ల గుడ్డ్లు కాగా ఈ సూత్రం వల్ల గుడ్లు అవుతుంది అవ్యవహితోచ్చారణవల్ల ఏకపదంలో కూడా స్వరలోపం జరిగిన చోట కూడా ఈ సూత్రం వర్తిస్తుందని చెప్పటానికి పదాంశ విభాగపు గుర్తుకుండలీ కరణాల్లో ఉంచబడింది ఇందుకు గొడ్డలి అనే శబ్దం అవ్యవ హితోచ్చారణలో ఉదాహరణ యోగ్యమవుతుంది

5 [ల న] ⟶ [ళ ణ] / మూర్ధన్యం

అమూర్ధన్యాలైన ల న లు మూర్ధన్య వర్ణాలకు పరంలో వచ్చినా పూర్వంలో వచ్చినా మూర్ధన్య వర్ణాలు ళ ణ) గా మారతై మూడో సూత్రం లాగే ఇదీ సమీకరణ సూత్రమే మొదటి సూత్రాని కిచ్చిన ఉదాహరణాల్లో మూర్ధన్యాలకింద రాసిన ల కారానికి ఈ సూత్రం వల్లనే మూర్ధన్యోచ్చారణ విహితమౌతుంది

ఈ పై సూత్రల్లో మొదటి నాలుగు సూత్రాలు రాసిన క్రమంలోనే వర్తిం చాలనే విషయం సూత్రాలను జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుసుకోవచ్చు ఐదో సూత్రం నాలుగో సూత్రం కన్నా ముందు వర్తించినా ప్రమాదం లేదు మూడో సూత్రం కంటే ముందైనా వర్తించవచ్చు గాని అప్పుడు మూడో సూత్రంలో ళ ణ లు అదనంగా చేర్చుకోవాల్సివస్తుంది అందువల్ల సంక్షిప్తత (economy) దెబ్బ తింటుంది

ఇంతటితో బహువచన రూపసాధన కవసరమైన రెండువర్గాల సూత్రాలూ పూర్తి అయినై

ఈ వ్యాసంలో ఇచ్చిన వర్ణ విధేయ సూత్రాలు అసమగ్రాలని తెలుగు స్వరసంధిని సూత్రించటం కష్టమైన పని అనీ సూత్ర రచనకు తెలుగు లిపి చాలటం లేదని వ్యాసంలో అక్కడక్కడ పేర్కొనబడింది తెలుగు లిపినే కొన్ని మార్పుల్నిచేసి వాడవచ్చునేమో ఈ వ్యాసకర్త ఇంకా ప్రయత్నించలేదు సూత్ర పద్ధతితోపాటు లిపి చిహ్నాలు కూడా కొత్తవైతే విషయం దుర్బోధం కావచ్చు శాస్త్ర విషయాల కోసం తెలుగు లిపిని మలచుకొని ఒక ధ్వని లిపి ని తయారు చేసుకుంటే గాని ఈ సమస్య పరిష్కారం కాదు అట్లాంటి పద్ధతి

యూరపియన్ భాషలకుంది. మనం కూడా అట్లాంటి సంప్రదాయా న్నేర్పర్చు కుంటే శాస్త్ర రచన, బోధన సుకర మవుతుంది. అందాకా ఈ క్లేశం తప్పదు. ఈ పరిమితులకు లోబడి ఈ మిగిలిన వ్యాస భాగంలో తెలుగు స్వర సంధి స్వరూపం కొంతవరకు పరిశీలించబడుతుంది.

తెలుగు భాషలో అచ్చుల్ని ఉచ్చారణ స్థాన ప్రయత్నాల్ని బట్టి ఈ కింది విధంగా బొమ్మలో సూచించవచ్చు. హ్రస్వాచ్చులు, దీర్ఘాచ్చులకు కూడా గ్రాహ్యాలు.




ఈ అచ్చులకి చుట్టూ ఉన్న గీతలు వాటి ఉచ్చారణకు హద్దులు. ఈ గీత లలో ఉచ్చరితమైన అచ్చులు స్వల్పమైన మార్పులకు గురి అయినప్పటికీ అర్థ భేదక సమర్థాలు కాకపోతే ఆ మార్పుల్ని గుర్తించక్కర్లేదు. కాని తెలుగులో అతి విస్తృతమైన సంధి కార్యం వల్ల ఈ మార్పులు అర్థభేదక సమర్థాలవుతై.

ఒక పదంలో పరంలో ఉన్న వ్యంజనం మీద 'అ' కారం ఉన్నప్పుడు పూర్వంలో అచ్చు బొమ్మలో చూపిన తన స్థానం నుంచి కొద్దిగా కిందికి జరుగు తుంది.

ఉదాహరణకు ఈ కింద పదాలను ఉచ్చరించి భేదాన్ని గమనించవచ్చు:

పిల్లి—పిల్ల గూడు—గూడ

మేడు—మేడ గోడు—గోడ

కంపు—కంప

ఈ భేదం ఈ పదాలతో 'ఉంది' అనే క్రియను చేర్చి ఉచ్చరిస్తే ఇంకా స్పష్టమవుతుంది. వ్యస్తంగా ఉచ్చరించినప్పుడు ఈ మార్పుకు కారణమైన 'అ' కారం ఉంటుంది కాబట్టి ఈ భేదానికి వర్ణత్వం గ్రహించక్కర్లేదు. కాని సంధిలో ఈ 'అ' కారం లోపిస్తుంది కాబట్టి ఈ మార్పు అర్థ భేదక సమర్థమవుతుంది. బహువచన ప్రత్యయం పరమైనప్పుడు కూడా పైపదాల్లో కొన్నిటికి నామపదాంత స్వరలోపం జరుగుతుంది. అప్పుడూ ఇదే పరిస్థితి

పరంలో అకారం బదులు ఎ కార మున్నప్పుడు కూడా ముందటి అచ్చు తన స్థానంకన్నా కొంత కిందకి జరుగుతుంది అయితే అ కారం పరమైనప్పుడు జరిగినంత కిందకి జరుగదు స్వర లోపానంతరం ఈ మార్పు కూడా అర్థభేదక సమర్థమవుతుంది ఉదాహరణకి కోడు+లు కోడె+లు 'కోడలు' అన్న పదాలని సంధితో వరసగా ఉచ్చరించి చూస్తే ఉచ్చారణలో భేదాన్ని గమనించవచ్చు. ద కారం మీద ఉన్న అచ్చు లోపించటంవల్ల ఈ మార్పు ముందటి అచ్చునేగాక తరువాత అచ్చునుగూడ ప్రభావితం చేస్తుంది ఈ విధంగా సంధిలో పైబొమ్మలో ఇచ్చిన అచ్చు లన్నిటికి ఈ మార్పు కలిగి అది అర్థభేదక సమర్థమవుతుంది అంటే బొమ్మలో ఇచ్చిన సంఖ్య మూడు రెట్లు అవుతుంది పీటికి దీర్ఘ స్వరాల సంఖ్య కలిపితే అది రెట్టింపు అవుతుంది అంటే $5 \times 3 \times 2 = 30$ ఇంతేగాక ఉ ఒ' ల ఉచ్చారణలో ఇంకో మార్పు కనిపిస్తుంది ఉదాహరణకి 'కోడు+ఉంది కోడి+ఉంది కోడె+ఉంది అన్న పదాలను అవ్యవహితంగా ఉచ్చరించి చూస్తే ఈ భేదం తెలుస్తుంది అట్లాగే ఒ ఉచ్చారణలో కూడా 'అది+ఒకటి అది+ఓడ' అన్న పదాలను ఉచ్చరించి చూస్తే భేదం తెలుస్తుంది. ఈ ఉ ఒ ల ఉచ్చారణలో పూర్వపదాంతమైన ఇ ఎ లు తాలవ్యత్వాన్ని కలిగిస్తై. ఈ విధమైన మార్పులు ఇంతకు ముందటి మార్పుకి గురైన ఉ ఒ ల ఉచ్చారణ భేదాలన్నిటికీ తాలవ్యత్వాన్ని కలిగిస్తై ఇంతకు ముందటి మార్పులో ఉ ఒ ల వంతు $2 \times 3 \times 2 = 12$ పీటి తాలవ్యభేదాలు $12 \times 2 = 24$ మొదటివీ ఇవీ కలిపితే మొత్తం $= 30 + 24 = 54$ అవుతై పీటితోపాటు అకార భేదాలకు కలిగిన తాలవ్యత్వాన్ని పరిగణిస్తే మరొక ఆరు (3 అకారాలు మొదట పేర్కొన్న స్థానం భేదం వల్ల మరో 3 వాటి తాలవ్య వికారాలు) అదనంగా కలపాలి

అప్పుడు మొత్తం అచ్చుల సంఖ్య 60 అవుతుంది. ఒకవేళ ఈ సంఖ్యా పరిగణనం సరి కాక పోవచ్చు. ఇంకో విధంగా లెక్కిస్తే 60 కి కాసిని ఎక్కువైనా కావచ్చు తక్కువైనా కావచ్చు అది ప్రధానం కాదిక్కడ. అకార లోపంవల్ల, ఇ, ఎ, ల లోపం వల్ల పదాల్లో పూర్వపరాచ్చులలో భేదం అర్థ భేదక సమర్థమైనప్పుడు దాన్ని గుర్తించాలా, గుర్తిస్తే వర్ణాలన్నిటికి గుర్తులు కావాలన్నప్పుడు తెలుగు అచ్చులికి 60 రకాల భేదాల్ని సూచించే గుర్తుల్ని స్వీకరించాలా అన్నదే ప్రధాన సమస్య. ఈ భేదాల్ని వ్యాకరణం సూచించాలంటే వ్యాకర్త అవలంబించాల్సిన పద్ధతి ఏమిటి ? ఈ మార్పులు కేవలం సంధి లోనే జరగటంవల్ల, సంధిని సమగ్రంగా వర్ణిస్తే ఈ సమస్యను పరిష్కరించ వచ్చు. తెలుగుని వర్ణవిధేయంగా రాయాలంటే, బొమ్మలో సూచించిన ఐదు ఇచ్చులనూ, వాటి దీర్ఘాలనూ మాత్రమే వర్ణాలుగా గుర్తించి, మిగిలిన వికారాలను సంధిలో మాత్రమే జరుగుతయ్యని ''ధ్వని సూత్రాల'' (phonetic rules) ద్వారా నిరూపించవచ్చు. అంటే సంధివల్ల జరిగే వికారాలు వర్ణత్వాని కనర్హా లన్నమాట ఈ సంధిని సమగ్రంగా వర్ణించాలంటే తెలుగు లిపిలో ప్రస్తుతం కష్టసాధ్యం. ఈ వ్యాసంలో ఇచ్చిన వర్ణవిధేయ సూత్రాలు అసమగ్రా లనటంలో ఉద్దేశ్యం ఇది.

ఈ వ్యాసంలో పాటించిన సూత్ర క్రమం ఒక్కోచోట చారిత్రక క్రమాన్ని సూచించవచ్చు. వర్ణవిధేయ సూత్రాల క్రమం కొంతవరకు చరిత్రలో మారిన క్రమాన్ని సూచిస్తుంది. చరిత్ర దృష్టితో రాస్తే ఈ సూత్రాల్ని మార్చాల్సి రావచ్చు. ఒక కాలపు భాషను వర్ణించే సూత్రాల వరస చారిత్రక క్రమాన్ని సూచించటంలో ఆశ్చర్యంలేదు. సంక్షిప్తత (economy) ను దృష్టిలో పెట్టు కొని నేటి కాలపు భాషకు రచించిన సూత్రాల ద్వారా చరిత్రను సూచించగలిగితే అది స్వాగతించదగిందే. వర్ణనాత్మక వ్యాకరణంలో చారిత్రకాంశాలను జోడించ కూడదన్న మూఢ విశ్వాసం ఇప్పటి భాషాశాస్త్రజ్ఞుల కెవరికీలేదు

తెలుగు సంధిని గురించిన మరో విశేషం. మాటలు అన్న పదాన్ని అవ్య వహితంగా ఉచ్చరిస్తే టకారం మీది అచ్చు లోపించి 'మాట్-లు' అవుతుంది కాని 'మాట+లు+నాకు రావు' అన్న శబ్ద సమూహాన్ని కలిపి ఉచ్చరిస్తే

'మాటల్నాకు రావు' అని అవుతుంది. అట్లాగే 'కోడలు' అన్న శబ్దాన్ని అవ్యవహితంగా ఉచ్చరిస్తే 'కోళ్-లు' అవుతుంది కాని బహువచన ప్రత్యయం పరమైతే 'కోడళ్లు' అని అవుతుంది. అంటే రెండో సంధి జరిగినప్పుడు మొదటి సంధి జరగదు. ఇది మొదటి ఉదాహరణలోలాగ ఏకపదంలోనూ జరగవచ్చు. ఏకపదంలో జరిగిన సంధిని అంతస్సంధి (internal sandhi) అనీ, భిన్నపదాల మధ్య జరిగిన సంధిని బహిస్సంధి (external sandhi) అనీ అంటారు. కాని ఇక్కడ అంతర్బహిస్సంధి విభాగాలతో నిమిత్తం లేకుండానే ఈ కార్యాలు జరిగినై. వరుసగా రెండుచోట్ల సంధికవకాశం ఉన్నప్పుడు, మొదటి సంధి తన అవకాశాన్ని వదులుకొని రెండో సంధికి వీలు కల్పిస్తున్నది. సంధిని సూత్రించేటప్పుడు ఈ విషయాన్ని కూడా సూత్రకారుడు సూచించాలి.

పైన పేర్కొన్నటువంటిది అన్నిచోట్లా జరుగదు. అంటే అన్నిచోట్లా పూర్వసంధి పరసంధికి లొంగిపోదు. కొన్నిచోట్ల మొదట జరిగిన పూర్వ సంధే బలీయమై పరసంధిని జరక్కుండా నిరోధిస్తుంది. ఉదాహరణకు "గుడ్డు+లు" అన్న వర్ణ సంయోజనం స్వరలోపాది సంధికార్యాలు జరిగి "గుడ్లు" అవుతుంది. "గుడ్డు+లు+లేవు" అన్నప్పుడు కూడా పరసంధిని నిరవకాశం చేసి, పూర్వ సంధి జరిగి "గుడ్లు లేవు" అనే అవుతుంది గాని "గుడ్డుల్లేవు" అని కాదు. దీనికి "గుడ్డు" శబ్దంలో ద్విరుక్త వ్యంజనమున్నా అంతే. "కోటు+లు+లేవు" అన్నప్పుడు కూడా "కోటులేవు' అని అవుతుంది గాని "కోటుల్లేవు" అనికాదు.

( ) కోటు+లు+లేవు = కోట్లు లేవు
(2) కోట+లు+లేవు = కోటల్లేవు.
(3) గుడ్డు+లు+లేవు = గుడ్లులేవు.
(4) గుడ్డ+లు+లేవు = గుడ్డల్లేవు.

ఈ పై ఉదాహరణల్లో బేసి ఉదాహరణల్లో పూర్వ సంధి బలీయం. సరి ఉదాహరణల్లో పరసంధి బలీయం.

ఈ వ్యాసంలో ఇచ్చిన వర్ణవిధేయ సూత్రాల్లో మొదటి సూత్రపు పరిసరాల్లో పూర్వసంధి బలీయమనీ రెండో సూత్రపు పరిసరాల్లో పరసంధి బలీయమనీ సూత్రాల్నీ ఈ ఉదాహరణల్నీ పరిశీలిస్తే గ్రహించగలరు. మొదటి సూత్రం నిత్యం రెండో సూత్రం వికల్పం. ఈ వికల్పత్వమే పరసంధి కవకాశమిస్తున్నదని ప్రతిపాదించవచ్చు.

ఈ విషయాల్ని న్యాయానికి పై సూత్రాల్లోనే చెప్పి ఉండాల్సింది. ఈ నియమాల్ని ఈ రకపు సూత్ర పద్ధతిలో ఎట్లా చేర్చాలో తెలీకపోవటం వల్ల అది కుదరలేదు.

తెలుగు బహువచన రూపాల్ని ప్రాచీన వ్యాకర్తలు సాధించారు. కాని వారు వ్యాకరించింది కావ్యభాష. ఈ వ్యాసంలో వ్యాకరించింది ఆధునిక వ్యవహార భాష. ఆధునిక భాషలో బహువచన రూపాల్ని వ్యాకరించే ప్రయత్నాలు పూర్వం Arden వంటి వారు చేశారు. ఆధునిక భాషాశాస్త్ర పద్ధతిలో సాధ్యమైనంతవరకు సమగ్రతని, సంపూర్ణతని దృష్టిలో పెట్టుకొని చేసిన మొదటి ప్రయత్నమిది. అయితే ఇందులో అయినా వివిధ మాండలికాల్ని పరిశీలనలోకి తీసుకోలేదు. కొంతవరకు బహు వచన రూప నిష్పత్తిలోనూ, ఇంకా ఎక్కువగా సంధిలోనూ పరిశోధకులు పరిశీలించవలసిన మాండలిక భేదాలెన్నో ఉన్నై.

కారు+లు=కార్లు అని కొన్ని మండలాల్లో అయితే, కొన్ని తెలంగాణపు మాండలికాల్లో "కాల్రు" అవుతుంది. పై వర్ణ విధేయ సూత్రాల్లో అదనంగా "ర+ల—> ల+ర' అనే వర్ణవ్యత్యయ (metathesis) సూత్రాన్ని చేర్చుకొని దీన్ని సాధించవచ్చు. ఇట్లాంటి సంధి విశేషాలు ఎన్నో వ్యాకరించవలసి ఉంటుంది. అటువంటి ప్రయత్నాలకైనా ఈ వ్యాసంలో చూపిన మార్గం ఉపకరిస్తుంది.

[ఈ వ్యాస విషయాన్ని గురించి పరిశోధించమని మొదట (1963)లో నాకు సూచించిన వారు ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డిగారు]

భారతి 1970 జూన్

# మరోసారి బహువచనం

1970 జూన్ నెల భారతిలో "తెలుగులో బహువచన రూప నిష్పత్తి" అనే నా వ్యాసం ప్రకటించబడింది. దాదాపు అయిదేళ్ల తరువాత సి. రామచంద్ర రావు "తెలుగు బహువచనం" అనే పేరుతో తెలుగు అకాడమీ (హైదరాబాదు) వారి వైజ్ఞానిక త్రైమాసిక పత్రికలో 1975 మార్చిలో ఒక వ్యాసంలో ప్రకటించారు నా వ్యాసంలో ప్రతిపాదించిన కొన్ని ముఖ్య విషయాలతో ఆయన భేదించారు. విశిష్టమైన ఆలోచనా ప్రేరకాలైన కొత్త ప్రతిపాదనలు చేశారు. ఆ తరవాత అదే పత్రికలో 1975 జులై - సెప్టెంబరు సంచికలో ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "తెలుగులో బహువచన ప్రత్యయములు" అనే వ్యాసం ప్రకటించారు. మళ్లీ రామచంద్రరావు 1976 జనవరి-మార్చి "తెలుగు" సంచికలో "తెలుగు బహువచనం X తెలుగు బహుచన ప్రత్యయములు" అనే వ్యాసం ప్రకటించారు. ఇది లక్ష్మీరంజనంగారి వ్యాసానికి సమాధానం. అక్కడక్కడా కారణాలు వేరైనా నా అభిప్రాయాలు కొన్ని లక్ష్మీరంజనం గారి అభిప్రాయాలతో కలుస్తున్నై. అయినా వారి అభిప్రాయాలను ప్రస్తుతానికిక్కడ పరామర్శించను రామచంద్రరావు సూచనలు మాత్రమే ఈ వ్యాసంలో పరిశీలిస్తాను.

తెలుగు నామాల బహువచన రూప సాధనలో చిక్కుపెట్టే సమస్య ఒకటుంది. ఏకవచన నామాల్లోనూ, బహువచన ప్రత్యయంలోనూ లేని మూర్ధన్య ళకారం బహువచన నామాల్లో ఎక్కడినుంచి వచ్చింది? అనేదే ఆ సమస్య స్పష్టతకోసం ఈ ఉదాహరణలను గమనించండి

(1) కాలు-కాళ్ళు కీలు-కీళ్ళు; కుందేలు-కుందేళ్ళు

(2) నెమలి-నెమళ్ళు; మొసలి-మొసళ్ళు; నాగలి-నాగళ్ళు; తిరగలి-తిరగళ్ళు

(3) వేరు-వేళ్ళు; ఊరు-ఊళ్ళు, కదురు-కదుళ్ళు; పందిరి-పందిళ్ళు

(4) ఉలి-ఉలులు పులి-పులుల పిల్లి-పిల్లులు; నల్లి-నల్లులు బల్లి-బల్లులు.

ఈ పై శబ్దాల రూపసాధనకు 'లు' అనే ప్రత్యయాన్ని మూలరూపంగా ప్రతిపాదించి బహువచన ప్రత్యయం ముందు "ఉదంత నామాల్లో చివరి వ్యంజన మైన స్వరపూర్వక ళ కారం, ద్విమాత్రాధిక ఇదంత శబ్దాల్లో స్వరపూర్వక ల కారం, మూర్ధన్య ళ వర్ణంగా మారుతుంద"నే సూత్రంద్వారా మూర్ధన్యతను సాధించాను. ళ్-లు సంయోగం సమీకరణద్వారా ళ్ళు గా మారుతుంది.

ఈ సూత్రం అసహజమైనదని రామచంద్రరావు నిరాకరించారు. మూర్ధన్యతను మాత్రా సంఖ్యతో ముడిపెట్టటంలో సహజత్వం లేదని ఆయన భావించారు. అందువల్ల బహువచన రూపభేదాల్లో ళు శబ్దాన్ని వ్యాకరణ మూల రూపం (underlying form)గా గ్రహించి మాత్రానియమంతో సంబంధం లేకుండా ల్ + ళు అనే సంయోగాన్ని సమీకరణ సూత్రంద్వారా 'ళ్ళు' గా మార్చాలని ఆయన ప్రతిపాదన. ల, న లు మూర్ధన్య వర్ణ పూర్వకమైనా పరకమైనా మూర్ధన్యతను పొందుతయ్యనే సూత్రం తెలుగులో ఉంది అందువల్ల సమీకరణ విషయంలో ఎవరి ప్రతిపాదనలో అయినా చిక్కులేదు రామచంద్ర రావు పద్ధతిలో ఉదంత శబ్దాలను హలంత శబ్దాలుగా గ్రహించాలి ఇక్కడా చిక్కేమీలేదు. ఇదంత శబ్దాల్లో మాత్రం రెండు మూర్ధన్య వర్ణాలమధ్య ఉన్న అగ్రాచ్చు (high vowel) లోపిస్తుందనే సూత్రం ద్వారా అచ్చును లోపింప జెయ్యాలి. ఈ సూత్రంలో "రెండు మూర్ధన్య వర్ణాలమధ్య" అనే నియమం ముఖ్యమైనది. ఈ సూత్రం కోసం ద్విమాత్రాధిక సంఖ్యాకమైన ఇదంత శబ్దాల్లో ల కారాన్ని మూలరూపంలోనే మూర్ధన్యమైన ళ కారంగా మొసళి, నెమళి, నాగళి అని ప్రతిపాదించాలి. ఉలి, పులి వంటి శబ్దాలలో 'ల' కారం గానే ఉండాలి.

ఆయన పద్ధతిలో రూప సాధన ఇటా ఉంటుంది :

కాల్ + ళు > సమీకరణద్వారా కాళ్ళు నెమళి + ళు అగ్రస్వర లోపం ద్వారా నెమళ్ళు. అచ్చులమధ్య 'ళ' వర్ణం ఐ వర్ణం అవుతుందనే సూత్రమూ పదాంతమైన ఇ > ఉ అవుతుందనే సూత్రాలద్వారా గది + ళు > గదులు

అవుతుంది. చారిత్రకంగా బహువచన ప్రత్యయం శ వర్ణయుక్తమైనదనేమాట నిజమే. తెలుగులో ఒక కాలంలో అసంయుక్తమైన శ, ఙ లు ల, న లుగా మారినమాట నిజమే. ఈ రకంగా రామచంద్రరావు ప్రతిపాదనకు బలం ఉంది. ఇంతేకాక బహువచనంలో కొన్నిచోట్ల శ కార మూర్ధన్య సాధన సులభమూ, 'సహజమూ' అవుతుంది.

ఈ ప్రతిపాదనలను వివరంగా పరిశీలించేముందు సహజత్వం అంటే ఏమిటో కొంత కొంత విచారణ చెయ్యటం అవసరం. రామచంద్రరావు ప్రతి పాదనల బలం అంతా ఇక్కడే ఉంది.

శబ్ద రూప సాధనకు రచించే సూత్రాలు సహజంగా ఉండాలనే నియమం భాషా శాస్త్రంలో ఉంది. అయితే ఈ సహజత్వం అంటే ఏమిటి? అనే దానిమీద ఇంకా స్పష్టమైన అవగాహన లేదు. సూత్రంవల్ల జరిగే మార్పు, సాధారణంగా భాషలో జరిగేది అయి ఉండాలి, ఆ మార్పు కలిగించే పరిసరాలు అందుకు సమర్థమయి ఉండాలి. మార్పు సహజమంటే సాధారణంగా భాషల్లో కనిపించే మార్పు అని అర్థం చెప్పుకోవచ్చు అంతేకాక చారిత్రకంగా జరిగే ధ్వనుల మార్పులు వ్యాకరణంలో సూత్రాలుగా రూపొందినా అవి సహజమైన మార్పులే అవుతై. ధ్వనుల ఉత్పత్తిలో ఎక్కువ శక్తి అవసరమైన ధ్వనులు తక్కువ శక్తి అవసరమైనవిగా మారవచ్చు. దీన్నే స్థూలంగా 'ఉచ్చారణ సౌలభ్యం' అనొచ్చు మూర్ధన్యవర్ణాలు అమూర్ధన్యాలుగా మారటం, లేక మూర్ధన్యవర్ణాల పరిసరాలు తగ్గటం ఇట్లాంటిదే అసంయుక్తమైన ఙ, శ లు తెలుగులో ఒక కాలంలో 'న, ల' లుగా మారినై ఆట్లాగే కొన్ని భాషల్లో కొన్ని రకాల వర్ణ సంయోజనను నిరోధించటానికి కొన్ని పద్ధతులు కనిపిస్తై. అచ్చుల మధ్య య, వ లు; హల్సంయోగం మధ్య అచ్చులు; చేరటం ఒక పద్ధతి. అంతేకాక ఇ కరకాల సమీకరణలు,-మూర్ధన్యీకరణం, తాలవ్యీకరణం, స్వర సమీకరణం, ఇవన్నీ సులభీకరణ దృష్ట్యా ఏర్పడినవిగా గ్రహించవచ్చు. అందువల్ల సమీ కరణ సూత్రాలు సహజమైనవి. ఇట్లాగే పదాంత వ్యంజన సంయోగంలో వర్ణలోపం పూర్వ, పర రూప సంధులను సౌలభ్య దృష్టితో ఏర్పడినవిగా గుర్తించవచ్చు.

కొన్నిరకాల మార్పుల్లో సౌలభ్యాన్ని గుర్తించటం కష్టం అవుతుంది. ఒక్కోసారి ధ్వనుల గ్రహణంలో పోలికను (perception) బట్టి మార్పులు జరగేవచ్చు: ప > క. స > హ, జ (Z) > ర వంటి మార్పులు భాషల్లో కనిపిస్తున్నా వీటికి ఉచ్చారణ సౌలభ్య దృష్టితో కారణం చెప్పటం కష్టం. చారిత్రకంగా జరిగేవి భిన్నభాషల వ్యాకరణాల్లో కనిపించేవి సాధారణంగా సహజమైన సూత్రాలుగా గ్రహించవచ్చు. సహజ సూత్రాలకు పరిసరాలతో దగ్గరి సంబంధం ఉంటుంది. జరిగినమార్పుకు పరిసరాలకు ధ్వనిరూపమైన సంబంధాన్ని గుర్తించటం సాధ్యమయితే ఆసూత్రాన్ని సహజసూత్రంగా గ్రహించవచ్చు. అయితే సహజసూత్రాలు అంటే ఏవిటో స్పష్టంగా నిర్వచించి సహజ సూత్రాల పట్టికను తయారు చేయగల స్థితికి భాషా శాస్త్రం ఇంకా ఎదగలేదు. వీటికోసం వివిధ భాషల వ్యాకరణాలు, చరిత్రలు పరిశీలించాల్సిన అవసరం ఉంది. ఉదాహరణకు-"మకార నకారాలు ఇకారంముందు క్రమంగా బకార దకారాలు మారతై" అనే సూత్రం వింటే ఇది చాలా అసహజమైన మార్పుగా కనిపిస్తుంది. కాని ప్రాచీన ద్రావిడంనుంచి బ్రాహు - ఈ భాషలో సరిగ్గా ఈ మార్పు జరిగినట్టు భద్రిరాజు కృష్ణమూర్తిగారు కనుక్కున్నారు భాషలో మార్పులు జరగటానికి ఎన్నో కారణాలుంటై వాటి సహజత్వాన్ని అంత తేలికగా అంచనా వెయ్యటం కష్టం.

అంతేకాక భాషలో అన్నీ సహజ సూత్రాలే ఉంటయ్యనుకోటం కూడా పొరపాటే అసహజ సూత్రాలు కూడా భాషా పరిణామంలో వచ్చి చేరుతుంటై. ఇవి ఎట్లావస్తై అనే దానిమీద కూడా కొంత పరిశోధన జరిగింది సూత్రం పుట్టినపుడు సహజంగానే ఉండి తరవాత వ్యాప్తిలో తలతిక్క (crazy) గా మారుతుందని కొందరు భావించారు ఒక సహజ సూత్రంమీద ఆధారపడి అసహజ సూత్రం మనుగడ సాగిస్తుందని మరికొందరు అభిప్రాయపడ్డారు. తరువాతి సహజ సూత్రానికి మార్గం నిష్కంటకం చెయ్యటంకోసం ఒక అసహజ సూత్రం బయలుదేరవచ్చు ననటానికి పెంగో భాషలో సాక్ష్యం ఉంది. వీటినిబట్టి అసహజ సూత్రాలు కూడా భాషలో ఉంటయ్యని వాటికి కూడా ప్రయోజనం ఉండొచ్చునని మనం తెలుసుకోవచ్చు.

ఈ విపులమైన చర్చవల్ల సూత్రాల సహజత్వం ఇంకా పూర్తిగా అంతు పట్టని విషయమని, ఈనాడు అసహజంగా కనిపించే సూత్రం తరువాతి పరిశోధనలో సహజమయిందిగా అంగీకరించాల్సి రావచ్చునని తెలుస్తుంది. అంతే కాక అసహజమైన సూత్రాలు కూడా భాషలో ఉండవచ్చునని, వాటికీ ప్రయోజనం ఉండవచ్చునని కూడా తెలుస్తుంది.

భాష భిన్న చారిత్రక పరిణామాల ఫలం. ఈ పరిణామాలు వ్యాకరణంలో ఎన్నో మార్పులను కలిగిస్తై. ఈ పరిణామాలన్నీ ఇముడ్చుకొని, రకరకాల ఆటుపోట్లకు తట్టుకొని భాష ఒక వ్యవస్థ (system)గా నిలుస్తుంది. ప్రక్క కాలపు వ్యవస్థలో మార్పులు జరిగి తరువాత కాలానికి నాతిభిన్నమైన ఇంకో వ్యవస్థగా రూపొందుతుంది. ఈ వ్యవస్థాభేదంలో చరిత్రదారులు కనిపించనూవచ్చు, మాసిపోనూవచ్చు. దీని అర్థం చారిత్రకంగా జరిగిన ప్రతి మార్పూ అదే పద్ధతిలో సూత్రంగా రూపొందాలని లేదని. చారిత్రకమైన మార్పు కొత్త నియమాలతో వేరే సూత్రంగా రూపొందవచ్చు. అది సహజమూ కావచ్చు, అసహజమూ కావచ్చు.

ఇక తెలుగు నామాల బహువచన రూపాల విషయం. మాత్రాపరిమాణ నియమంతో ల కార మూర్ధన్యతను సాధించటం అసహజం అని రామచంద్రరావు వాదం. అయితే మాత్రా పరిమాణ నియమాన్ని తప్పించుకోటానికి ఆయన తొక్కిన మార్గం ఇంతకన్నా అసహజమైనది ద్విమాత్రాకమైన ఇదంత నామాల బహువచనాల్లో, (ఉలులు, పులులు మొ ) మూర్ధన్యత లేదు. అంతకన్న ఎక్కువ మాత్రలున్న నామాల బహువచనాల్లో (నెమలి నెమళ్ళు మొసలి మొసళ్ళు, నాగలి నాగళ్ళు) మూర్ధన్యత ఉంది. వీటిల్లో మాత్రా సంఖ్యా నియమం స్పష్టంగా కనిపిస్తున్నది రామచంద్రరావు ప్రతిపాదించిన స్వరసూత్రానికి రెండు మూర్ధన్యవర్ణాల మధ్య అనగా ల కార ళకారాల మధ్య అనొచ్చు కాని ఇట్లా అంటే ఉలి, పులి వంటి చోటకూడా స్వరలోపంచేసి *ఉళ్ళు, *పుళ్ళు అనే అనిష్టరూపాలు అంగీకరించాల్సివస్తుంది. వీటిని నిరోధించాలంటే మాత్రా సంఖ్యా నియమం చెప్పాల్సొంటుంది. ఇది తప్పించుకోటానికి రామచంద్రరావు ద్విమాత్రాధిక ఇదంత శబ్దాల్లో ల కారాన్ని మూలరూపం (underlying representation)లో ళ కారంగా ప్రతిపాదించి రెండు మూర్ధన్య వర్ణాలమధ్య స్వర

లోపం జరుగుతుందని సూత్రించారు ఇట్లా చెయ్యటంవల్ల మాత్రా సంఖ్యా నియమాన్ని తప్పించుకుంటున్నట్టు కనిపించినా, అందుకోసం అసహజమైన మూలరూపాల్ని ప్రతిపాదించాల్సి వచ్చింది *నాగలి, మొసలి* వంటి శబ్దాలను *ఉలి, పులి* వంటి శబ్దాలనుంచి వేరు చెయ్యటమే ఈ ప్రతిపాదన లక్ష్యం. మాత్రా సంఖ్యతో గుర్తించదగిన, ఉన్నభేదాన్ని కృత్రిమంగా మూలరూపాల్లో మూర్ధన్య ళ కారాన్ని ప్రతిపాదించి చూపించారు. తెలుగుభాషా వ్యవహర్త ఈ శబ్దాలమధ్య భేదాన్ని శబ్దపరిమాణ భేదంగా గుర్తిస్తారని నా ప్రతిపాదనకర్థం. అట్లాకాదు ళ కార భేదంగానే గుర్తిస్తాడని రామచంద్రరావు సూచనకర్థం. మూలరూపాల ప్రతిపాదన భాషా లక్షణాన్ని బట్టి చూపేదిగా ఉండాలి కాని కేవల సూత్రరచనా సౌకర్యంకోసం చెయ్యగూడదు. సూత్రం సహజంగా ఉండాలనే లక్ష్యం అత్యంతరం చెప్పదగిందికాదు. అయితే సూత్ర సహజత్వం కోసం మూలరూప సహజత్వాన్ని బలిపెట్టటం వాంఛనీయం కాదు శబ్దాల రూప భేదాలను మామూలుగా కనిపించే రూపాల (surface forms) నుంచే సాధించే వీలున్నప్పుడు భిన్నమైన మూలరూపాలను (abstract underlying forms) ప్రతిపాదించటంలో వ్యాకరణ సౌలభ్యంలేదు. మూలరూప ప్రతిపాదన 'సర్వరోగనివారిణి' కాదు.

తెలుగు బహువచనానికున్న 'లు-ళు' అనే రూపభేదాలలో ళు శబ్దమే ప్రాచీనమైనది కాని చారిత్రక మూలరూపమే ఆధునిక భాషకు మూలరూపంగా ఉండాలనిలేదు. భాషావ్యవస్థలో చరిత్ర కలిగించే మార్పుల్లో మూలరూపభేదం ఒకటి. ఆధునిక భాషలో (కావ్యభాషలోకూడా) ళు పరిసర ప్రభావ నియత మైనది. ( conditioned by the environments ) లు స్వతంత్ర పరిసరాల (unconditioned environments) లో వచ్చేది దీనికి వ్యాప్తి అధికం అధిక వ్యాప్తిగలిగి పరిసర ప్రభావ స్వతంత్రమైన రూప భేదాన్నే మూలరూపంగా గ్రహించటం శాస్త్ర సంప్రదాయం. అందుకు విపరీత మైనది 'ళు ప్రతిపాదన.

అయితే నేను చూపించిన శబ్దపరిమాణ నియతి (syllab c structure conditioning మాత్రాసంఖ్య, అచ్చుల, హ్రస్వ దీర్ఘ భేదం

అక్షర క్రమం మొ ) అసహజమైనదని రామచంద్రరావు ఆరోపించారు. ఈ రకమైన నియతి ఇంకెక్కన్నా ఉందేమో పరిశీలిద్దాం.

తెలుగు క్రియల్లోనే చాల సూత్రాలకు శబ్ద పరిణామాన్ని నియమంగా గుర్తించాల్సి ఉంటుంది.

1. తెలుగు క్రియల్లో త కారాది ప్రత్యయాలు అన్వాది ధాతువుల తర్వాత ట కారాదిగా మారతై. *అను, ఉను* (<*ఉండు*) *కను, కొను, తిను, విను* ధాతువులు అన్వాదులు చివరి అచ్చును వదిలేసి వీటిని న కారాంత ధాతువులుగా గ్రహించవచ్చు. మిగతా అన్ని ధాతువుల తరవాత త కారాది ప్రత్యయాలు అట్లాగే ఉంటై. దీన్ని సాధించటానికి మూడు మార్గాలున్నై. (1) ట కారాది ప్రత్యయరూపాల్నే మూలరూపంగా గ్రహించి ధాత్వంత న కారాన్ని సమీకరణ సూత్రంద్వారా ణ కారంగా (రాతలో 'సున్న') మార్చటం. ఈ పద్ధతిలో ట కారాన్ని త కారంగా మార్చటానికి సరైన పరిసర సంబంధం కనిపించదు. ఆ సూత్రం అసహజ సూత్రమే అవుతుంది. పైగా ఆరు ధాతువుల తరవాత మాత్రమే కనిపించే ట కారాది రూపాల్ని మూలరూపంగా గ్రహించటంలో సామంజస్యం లేదు. (2) ధాత్వంత న కారాన్ని మూలరూపాల్లో (*అణ్, కణ్* అనే విధంగా) ణ కారాన్ని ప్రతిపాదించి "మూర్ధన్యానునాసికపూర్వమైన త వర్ణం ట వర్ణంగా మారుతుంది" అనే సూత్రం రచించవచ్చు. ఇది రామచంద్రరావు పద్ధతికి దగ్గరగా ఉంటుందనుకుంటాను. ఈ రకమైన సూత్రం కొండ, పెంగో, కూఈ, నాయకి వంటి ద్రావిడ భాషల్లో ఉంది. (రామారావు 1975) తెలుగులో ట కారాది ప్రత్యయాలకు మూలం ఇదే కావచ్చు ఈ సూత్రంవల్ల *అంటాడు, అంటే* అనే రూపాలు సులభసాధ్యాలు

కాని దీనికి ఉషా పన్నాల (1976) తన M. Phil వ్యాసంలో ఒక అభ్యంతరం చూపించింది. '*అణ్, దాం* < **అండాం కొణ్* + *దాం*> **కొండాం* అనేవిధంగా కావటం లేదని ఆ వ్యాసంలో పేర్కొన్నది. అప్పుడు పై సూత్రాన్ని కేవలం త కారానికి వర్తింపజెయ్యాలి. అయితే మూర్ధన్యతకు శ్వాసవర్ణం లొంగి నాదవర్ణం ఎదురు తిరగటానికి కారణమేమిటి ? అదీకాక మళ్ళీ 'ణ' కారాన్ని కొన్ని పరిసరాల్లో 'న' కారంగా మార్చే సూత్రం ఎట్లాగూ

తప్పదు. (3) శబ్దపరిమాణాన్నిబట్టి చెప్పటం చివరిపద్ధతి ఏక హ్రస్వాచ్పూర్వమైన కారాంతాలైన ధాతువుల తరవాత త కారం ట కారంగా మారుతుంది'' అనే సూత్రంద్వారా దీన్ని సాధించవచ్చు హ్రస్వాచ్పూర్వమనటంవల్ల 'నాస్తుంది' వంటి రూపాలు రక్షితాలు. ఇక్కడ శబ్ద పరిమాణ నియతి అసహజంగా కనిపించవచ్చు. కాని శబ్ద పరిమాణం భాషలో కలిగించే మార్పుల్ని, పూర్తిగా గ్రహిస్తే గాని ఏ సంగతీ చెప్పలేం. ఒకవేళ ఇది అసహజ సూత్రమైనా, భాషా పరిణామంలో ఇట్లాంటివి ప్రవేశిస్తయ్యని ఒప్పుకోవాలి.

2. తెలుగు ధాతువుల్లో అడు, పాడు వంటి ధాతువులనుంచి *అడితే*, *అడుతూ*, *అడతాడు* అనే రూపాలు నిష్పన్నమవుతై. ధాతువుకూ, ప్రత్యయానికీ మధ్యనున్న (లేక సూత్రంవల్ల వచ్చిన) అచ్చు ప్రత్యయంలో అచ్చుతో సరూపమవుతుంది కాని వాగు వంటి ధాతువులో **వాగతాడు* అని కాదు '*త, ద, ట, డ, న, ల, ర*' అనే వ్యంజనాలు చివర ఉన్నప్పుడే అకార సమీకరణం జరుగుతుంది. మూడక్షరాల ధాతువుల్లో కొన్ని మండలాల్లో జరుగుతుంది గాని మరికొన్ని మండలాల్లో జరగదు. *పొగడతాడు* అనే రూపం రాయలసీమ నెల్లూరు మండలాల్లో ఉంటుంది. కోస్తాజిల్లాల్లో *పొగుడుతాడు* అనే రూపమే సాధువు ఇట్లా మారని మండలాల్లో అ-కార సమీకరణాన్ని శబ్ద పరిమాణాన్ని బట్టే చెప్పాలి. ఆ సూత్రం ఇట్లా ఉంటుంది: "ఏక స్వరయుక్తమై 'త, ద, ట, డ న, ల, ర' లు అంతంలో ఉన్న ధాతువుల తరవాత అచ్చు ప్రత్యయంలోని అ కారంతో సమీకృతమవుతుంది. మిగతా అచ్చులతో సమీకరణ ఈ విషయాలేవీ లేకుండానే జరుగుతుంది రాయలసీమ నెల్లూరివారి భాషలో ఈ నియమాలేవీ లేకుండా అన్ని రకాల ధాతువులతోకూడా కనిపిస్తుంది *వాగతాడు*, *అడగతాడు*, *పొగడ తాడు* అనే రూపాలు వారి భాషలో సాధువులు. స్వర సమీకరణసూత్రం వారి భాషలో అన్ని ధాతువులకు వ్యాపించింది. కాని కోస్తా భాషలో మాత్రం అకార సమీకరణను పైన పేర్కొన్న ధాతువులకే శబ్ద పరిమాణాన్నిబట్టి పరిమితం చెయ్యాలి

3 తెలుగు క్రియలో విలుచు, నిలుచు ధాతువులకు విలువ-నిలువ - అనే విధంగా అన్నంత రూపాలున్నై. ఇక్కడ ధాత్వంతమైన (ధాతువు ను హలంతా

లుగా గ్రహిస్తే) చ కారం బాలవ్యాకర్త పేర్కొన్న 'ముత్తు' పరిసరంలో 'వ' కారంగా మారుతుంది కాని దాచు తూచు వంటి ధాతువుల్లో ఈ మార్పు జరగదు. దీన్ని నిరోధించాలంటే ''రెండుహ్రస్వాచ్చులున్న ధాతువుల్లో ధాత్వంతమైన చ వర్ణం ముత్తు పరమైనపుడు 'వ' వర్ణంగా మారుతుంది" అనే సూత్రం అవసరమవుతుంది. రెండు హ్రస్వాచ్చులు అనటం అంటే శబ్ద పరిమాణాన్నిబట్టి లక్షణం చెప్పటమే.

ఇవికాక ఇతర ద్రావిడ భాషల్లోకూడా శబ్ద పరిమాణాన్నిబట్టి కొన్ని సూత్రాలున్నట్టు ఆయా భాషా వ్యాకరణాలను పరిశీలిస్తే తెలుస్తుంది.

4 కొండ భాషలో 'దు' అనేది విధి (imperative) బహువచన ప్రత్యయం

నిల్ + దు> నిన్దు ''ఆగండి''

ఇన్ + దు> ఇన్దు ''చెప్పండి''

ఇక్కడ ధాత్వంత ల కారం న కారంగా మారింది. న కారం తరవాత ఈ ప్రత్యయంలోని ద కారం 'ఱ' కారం (శకటరేఫ) గా మారింది. ఈ మార్పు అన్ని ధాతువుల్లోనూ జరగదు.

దేల్ + దు> దేల్దు ''తేలండి''

ఈ రూపాలను సాధించాలంటే 1. a) 'ద' కారాది ప్రత్యయాలముందు ఏకహ్రస్వస్వరయుక్త ధాత్వంత ల కారం న కారంగా మారుతుందని, b) ప్రత్యయ ద కారం ఱ కారంగా మారుతుందని సూత్రించుకోవాలి. (కృష్ణమూర్తి : 1969)

5. కూ-ఈ-భాషలో *ఉగ్* ''ధీకొను '' *నొగ్* ''కడుగు'' *పెగ్* ''పోగు చేయు'' వంటి ధాతువుల తరవాత భూత కాల ప్రత్యయమైన *త* కారం దకారం అవుతుంది. (చూ. విన్ ఫీల్డు 1928) కాని ఆగ్ ''పండు'' *డీగ్* ''స్పృశించు'' *ఏగ్* 'తెరచుకొను' వంటి ధాతువుల తరవాత 'ఇ'కారం చేరి *అగితె* 'పండింది' *డీగితె* ''స్పృశించింది '' *ఏగితె* 'తెరచుకొన్నది'' అని అవుతై. ఈ రూపాల సాధనకు ''గకారాంతమైన ఏక హ్రస్వ స్వర ధాతువుల తరవాత *త* కారం ద

కారం అవుతుంది'' అని శబ్దపరిమాణాన్ని బట్టి సూత్రం రచించుకోవాల్సి ఉంటుంది

అక్షర పరిమాణానికీ (a) తెలుగులో మూర్ధన్యాలకు వకారానికి; (b) కొండలో ల కారానునాసిక్యానికీ ఱ శకట రేఫాదేశానికి; (c) కూ-ఈ లో నాదతకూ ఏ సంబంధముందో చెప్పటం కష్టం ఇంకా ఇతర ద్రావిడ భాషలనూ, ప్రపంచంలోని ఇతర భాషావ్యాకరణాలను నిశితంగా పరిశీలిస్తే దీని తత్వం కొంత గ్రహించటానికి వీలవుతుంది బహుశా భాషలో ఒక మార్పు ప్రవేశించేటప్పుడు గాని, నిష్క్రమించేటప్పుడు గాని శబ్ద పరిమాణాన్ని బట్టి ప్రవేశ నిష్క్రమణ లుండవచ్చు. ఒకమార్పు ప్రవేశించినప్పుడు మొదట కొన్ని శబ్దాలకే పరిమితమై ఉండవచ్చు. ఒక మార్పు నిష్క్రమిచేంటప్పుడు కూడా కొన్ని శబ్దాలకే పరిమితమైన స్థితి ఏర్పడవచ్చు. ఈ ప్రవేశ నిష్క్రమణలు అంచెలవారీగా శబ్దపరిమాణాన్నిబటి, జరగవచ్చు ఇట్లా జరిగినప్పుడు సూత్ర వ్యాప్తిలోని హెచ్చుతగ్గుల ననుసరించి శబ్ద పరిమాణ నియతి (Syllabic structure conditioning) భాషలో ఏర్పడుతుందని ఊహించటం అసమంజసం కాదు. అయితే ఈ విషయం నిర్ధారణగా చెప్పటానికి ఇప్పటి పరిశీలన చాలదు.

ఇక రామచంద్రరావు చేసిన ఇతర ప్రతిపాదనలను కొంత పరిశీలించాల్సి ఉంది.

తెలుగులో *ఇళ్లు-ఇండ్లు, పల్లు; పళ్లు, పన్ను-పండ్లు, పళ్ళు, కన్ను-కండ్లు, కళ్ళు; ముల్లు-ముండ్లు, ముళ్ళు* వంటి రూపాలను సాధించటానికి ఏకస్వర పూర్వకమైన ''న్ను, ల్లు'' సంయోగానికి 'ండు'' ఆదేశమవుతుందన్నాను. ఇది ప్రాచీన సంప్రదాయానుసారి. ఇండులు ముండులు కండులు (రాళ్లు అనే అర్థంలో) అనే రూపాలు కావ్యభాషలో కనిపిస్తున్నై. ఆధునికుల వ్యవహారంలో పైన పేర్కొన్న రెండురకాల రూపాలూ ఉన్నై. ఇదంత, ఉదంత శబ్దాల్లో 'ద' కారం ముందు అనునాసికం బహువచన ప్రత్యయంముందు లోపిస్తుందనే సూత్రం వల్లనూ స్వరలోప సమీకరణ సూత్రాలవల్లనూ ఇళ్లు పళ్లు వంటి రూపాలను సాధించాను. ప్రక్రియ ఇట్లాఉంటుంది. *ఇల్లు+లు > ఇందులు > ఇంద్ + లు >*

ఇఁడ్ + లు > ఇళ్ళు అంటే ఇండ్లు నుంచి ఇళ్ళు సాధించబడింది. రామచంద్ర రావు ఈ రూపాలను వేరు వేరుగా సరాసరి సాధించ దల్చుకున్నారు. అందు కోసం ఈ ధాతువులకు, కన్, కన్ను, కండ్; ముల్, ముల్ల్, మున్ల్ అని ఒక్కొదానికి మూడేసి మూలరూపాల్ని ప్రతిపాదించారు. వీటివల్ల ఆయన సాధించదల్చుకున్నదేమిటో బోధపడటంలేదు. ఒకే మూలరూపంనుంచి భిన్న రూపాలను సాధించటానికి వీలున్నప్పుడు ఈ బహురూప మూలప్రదర్శన ప్రయోజనమేమిటి ? ఇట్లా కాక ఇల్, ముల్, కన్ అనే విధంగా మూల రూపాల్ని ప్రతిపాదించి-

1 బహువచన ప్రత్యయం ముందు ల కారం న కారం అవుతుంది. 2. దంత మూలీయ అనునాసికానికి మూర్ధన్య ళ కారానికి మధ్య 'డ' కారాగమం జరుగుతుంది. 3 అనునాసిక వర్ణం అగ్రాచ్పరకమైన డ వర్ణం ముందు వికల్పంగా లోపిస్తుంది అనే సూత్రాలద్వారా బహువచన రూపాలను సాధించి, 4. హలంతమైన ఏక హ్రస్వాచ్క శబ్దాలకు ఉకారాగమ, వ్యంజన ద్విత్వాలు వస్తయ్యనే సూత్రం ద్వారా ఏకవచనాన్ని సాధిస్తే ఆయన పద్ధతికి అనుగుణంగా ఉండేది.

ఈ నామాలకు అనేక మూలరూప ప్రతిపాదన అనవసరమనే సంగతి ఆయనే ఈపాటికి గుర్తించి ఉంటారని నా నమ్మకం.

నా ప్రతిపాదనలో అనునాసిక వర్ణలోప సూత్రానికి ఒక ప్రయోజనం ఉంది. పండు + లు > పండ్లు, పళ్ళు; బండి + లు > బండ్లు, బళ్ల అనే రూపాలు ఈ సూత్రంవల్ల సాధ్యమవుతై. రామచంద్రరావు వీటిని పరిగణించినట్టు లేదు. ఏ విధంగా చూసినా అనేక మూలరూపాలకు ఆధారం కనిపించదు.

చేను-చేలు, పేను-పేలు అనే శబ్దాల్ని సాధించిన తీరులో మా ఇద్దరికీ ఏమంత భేదం ఉన్నట్టు కనపట్టం లేదు. న్ మ్ లకు ఒకే గుర్తు రాతలో సూచించేదే. దానికి శాస్త్ర ప్రతిపత్తి లేదు.

కోటు + లు + లేవు > కోట్లు ల్లేవు
కోట + లు + లేవు > కోటల్లేవు

గుడ్డు + ు + లేవు > గుడ్లు లేవు
గుడ్డ + లు + లేవు > గుడ్డ్లేవు

అనేచోట పూర్వ పర సంధుల్లో వ్యత్యయానికి ఉల్లోప సూత్రం నిత్యమనీ, అల్లోప సూత్రం వికల్పమనీ నేను కారణాలు చూపించాను. వికల్పసంధి వచ్చేచోట పరసంధి బలీయమని నేను చేసిన ప్రతిపాదన రామచంద్రరావు చేసిన ప్రతిపాదనతో నిమిత్త లేకుండానే పై సంధి కార్యాలను వ్యాకరించటం సాధ్యమయింది. అయితే కోట్లు గుడ్లు, అనేచోట ఉన్నది సంధి కాదని, అది సంధికన్నా భిన్నమైన రూపసాధన ప్రక్రియగా గుర్తించటం అవసరమని తోస్తున్నది ఉచ్చారణ వేగాన్నిబట్టి సంధి ప్రవర్తన ఉంటుంది.

రామచంద్రరావు రచించిన అగ్రస్వర లోప సూత్రం సరైనదే. పరిసర నిర్దేశంలో కొంత మార్పు అవసరం. ఇత్తును ఉత్తుగా మార్చి లోపింపచేయటం కన్నా ముందే ఇ, ఉ లను లోపింపచేయవచ్చు. కాని 'ఉ' ప్రతిపాదన నెమళి, [illegible]ళి అన్న విధంగా మూల రూపాల ప్రతిపాదన అంగీకార యోగ్యాలు కావు.

చివరగా ఒక విషయం అంగీకరించాలి. తెలుగు బహువచనాల మీద రామచంద్రరావు చేసిన పరిశీలన విలువైనది. అక్షర పరిమాణ నియతి గురించి ఈ వ్యాసంలో నేను చేసిన పరిశీలనకు అదే ప్రేరకం. పరిశోధకులను పునః పునరాలోచింపజేసే సద్విమర్శలెప్పుడూ విలువైనవే.

భారతి, 1976 డిసెంబరు.

# స్వరసమీకరణ

ఒక వర్ణంగాని, వర్ణసమూహంగాని పొరుగున ఉన్న వర్ణంతోగాని వర్ణ సమూహంతో కనీసం ఒక అంశంతో అయినా సమమైతే (సమతమ పొందితే) దాన్ని సమీకరణం అంటారు. ఈ సమీకరణానికి పక్కనే ఉన్న వర్ణం కారణం కావచ్చు. కొంచెం దూరంతో వర్ణం కారణంకావచ్చు. ఈ సమీకరణం రెండు వ్యంజనాల మధ్యగాని, రెండు స్వరాల మధ్య గాని, స్వర వ్యంజనాల మధ్యగాని జరగవచ్చు. గది + లు > గదులు అనేచోట సమీకరణ రెండు స్వరాల మధ్య జరిగింది. తెలుగు + కథ > తెలుక్కథ అనే చోట రెండు వ్యంజనాల మధ్య స్వరలోపానంతరం సమీకరణ జరిగింది. ప్రాచీన ద్రావిడంలోని కెవి తెలుగులో చెవి అయింది. తన తరవాత ఉన్న తాలవ్య స్వర ప్రాబల్యంవల్ల 'క' వర్ణం తాలవ్య వ్యంజనంగా మారింది. ఇది వ్యంజనం స్వర ప్రాబల్యంవల్ల మారటానికి ఉదాహరణ. అట్లాగే స్వరంవ్యంజనంతో సమత్వం పొందవచ్చు. ప్రసిద్ధమైన ఉదాహరణలు లేవుగాని, మూర్ధన్య వ్యంజనాల ముందు అచ్చులు మూర్ధన్యత్వాన్ని పొందటం కంఠ్యాచ్చులు తాలవ్య హల్లుల తరువాత తాలవ్యతను పొందటం ఇట్లాంటివి.

స్వర సమీకరణలో విశేషమేమంటే, రెండు స్వరాలు మధ్యలో ఉన్న హల్లుల్ని కూడా దాటవేసుకొని సమమవుతై. హల్లులు కూడా మధ్యలో ఉన్న అచ్చుల్ని అతిక్రమించి సమం కావటానికి వీలున్నా ఇట్లాంటివి అరుదు. దూరంగా ఉన్న అచ్చుల మధ్య జరిగే సమీకరణ ఇప్పుడు వ్యవహృతమవుతున్న భాషల్లో కనిపిస్తుంది. దూరంగా ఉన్న హల్లుల సమీకరణ సాధారణంగా చారిత్రక పరిణామాల్లో కనిపిస్తుంది.

స్వర సమీకరణ కాస్తో కూస్తో చాలా ద్రావిడ భాషల్లో ఉంది. కాని ఆ భాషా వ్యాకరణాలను పరిశీలిస్తే తెలుగులో ఉన్నంత విస్తృతంగా ఉన్నట్లు

కనపడదు. స్వరసమీకరణ భారతీయ భాషలకే పరిమితం కాదు. భిన్న ఖండాల్లో భిన్న కుటుంబాలకు చెందిన భాషల్లో ఈ స్వర సమీకరణ పద్ధతి ఉంది. టర్కిష్ హంగేరియన్, నెజ్‌పర్స్ (Nez Perce) భాషల్లో స్వరసమీకరణ భాషాపరిశోధకులకు సుపరిచితమే. స్వరసమీకరణను ఆధారం చేసుకొని ఇటీవలి కాలంలో కొన్ని ముఖ్యమైన సిద్ధాంత చర్చలు జరిగినై ఈ దృష్ట్యా తెలుగులో స్వరసమీకరణను గురించిచేసే పరిశీలనకు ప్రాధాన్యం ఉంది

తెలుగు స్వర సమీకరణ ప్రాచీనాధునిక వ్యాకర్తల దృష్టిని ఆకర్షించినట్టు వారి రచనలనుబట్టి గ్రహించవచ్చు. ప్రాచీనుల్లో దీన్ని విశేషంగా గుర్తించినవాడు పరవస్తు చిన్నయసూరి(1006-1862) ఆకంధ్రశబ్ద చింతామణిలో (కర్త కాలాదుల్ని గురించి పండితుల్లో ఏకాభిప్రాయం లేదు. 17వ శతాబ్దానికి ఇటీవలిది కాదని చెప్పటానికి మాత్రమే ఆధారాలున్నై) కూడా స్వర సమీకరణను సూచించే సూత్రాలున్నై. ఆధునికుల్లో వడ్లమూడి గోపాలకృష్ణయ్య, భద్రిరాజు కృష్ణమూర్తి, జెరల్డ్ కెలీ, చేకూరి రామారావు కరుమూరి వేంకట సుబ్బారావు వెన్నెలకంటి ప్రకాశం చిరుమామిళ్ల రామచంద్రరావులు తమ తమ గ్రంధాల్లోగాని ప్రత్యేకమైన వ్యాసాల్లోగాని స్వర సమీకరణను పరామర్శించారు ఈ వ్యాసంలో వీరి ప్రతిపాదనలు అవసరమైనచోట ప్రస్తావించబడతై

ఈ వ్యాసంలో ప్రధానంగా నామ ప్రాతిపదికల్లోను క్రియల్లోను జరిగే స్వరసమీకరణ చర్చించబడుతుంది ఈ రెంటి మధ్యలో సంఖ్యావాచకాల్ని గురించికూడా కొద్దిపాటి పరిశీలన జరుగుతుంది ప్రత్యయాల్లో జరిగే సమీకరణ కూడా ప్రస్తావించబడుతుంది అయినా ప్రస్తుత పరిశీలనను సమగ్రమనటానికి వీల్లేదు. కృదృత్తులను, శబ్ద పల్లవాలను గురించి అంత లోతుగా పరిశీలించకపోవటం ఈ వ్యాసంలో ప్రధాన లోపం తెలుగులో సమీకరణను సంపూర్ణంగా అర్థం చేసుకోటానికి అట్లాంటి పరిశీలన అవసరమన్న గుర్తింపు ఈ వ్యాసకర్తకుంది చారిత్రక పరిణామాల పొరలను విప్పటంలోగల ఇబ్బందులే పైన పేర్కొన్న లోపానికి కారణం

తెలుగు నామాల్లో రెండక్షరాలనుంచి నాలుగక్షరాలవరకు (అక్షరం = (syllable) పరిమితిగల పదాలున్నై వీటిల్లో కొన్ని ఇదంతాలు వీటికి

లు, కు, ను వంటి నామ విభక్తులు చేరతై. లు-బహువచన ప్రత్యయం. ఇది చేరినప్పుడు నామం తుది ఇత్వానికి ఉత్వమవుతుంది. మూడచ్చులున్న మాటల్లో అనాద్యమైన అచ్చు ఇత్తు అయితే అది కూడా ఉత్తు అవుతుంది. కాని తత్సమ శబ్దాల్లో నడిమి అచ్చు ఇట్లా మారదు. కు, ను విభక్తులు చేరినప్పుడు ఈ మార్పు జరగదు. ఈ ప్రత్యయాల్లో ఉత్వమే నామం చివరి ఇకార ప్రభావంవల్ల (ఈ మార్పుకు తత్సమ తత్సమేతర విభేదం లేదు) ఇత్వమవుతుంది.

ఉదా : గది>గదులు, గదికి, గదిని
కొలిమి>కొలుములు, కొలిమికి, కొలిమిని
సమితి>సమితులు, సమితికి, సమితిని
అతిథి>అతిథులు, అతిథికి, అతిథిని
స్త్రీ>స్త్రీలు, స్త్రీకి, స్త్రీని

ఈ మార్పులు ప్రాచీనాధునిక భాషలకు సమానం. పైన పేర్కొన్న నామంలో సమీకరణ కొన్ని తెలంగాణా మాండలికాల్లో లేనట్టు తెలుస్తున్నది. అప్పుడు వారి భాషకు సమీకరణను సూచించే సూత్రం అవసరం లేదు. సమితి + లు> సముతులు అని వాడే వారున్నారు. వారి భాషలో 'సమితి' ని తద్భవంగా గ్రహించాల్సి ఉంటుంది. కెలీ (1965) గుర్తించినట్టు తత్సమ, తద్భవ విభాగం వ్యవహర్తలను బట్టి, ఉంటుంది. పైన పేర్కొన్న ప్రత్యయాల్లో మార్పు సర్వమాండలికాల్లోనూ సమానం.

పై ఉదాహరణల్లోని మార్పుల్ని చింతామణికారుడు "ఉద్బహూత్వే" "ఇదుపోత్త మానాంబహువచన ఉపోత్తమేత ఉద్భవతి" "అస్మద్యుద్వాచ్యా దేవత్వ ఇతోని, వి " అని సూత్రీకరించాడు. వీటిని ఇంకా విపులీకరించి బాల వ్యాకరణకారుడు "ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడుత్వంబగు (తత్సమ-45)" "వికృతియం దికారాంతముల యుపోత్త మేత్వంబున కుత్వంబగు (తత్సమ-46)" "ఇకారంబుమీద కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు (తత్సమ-26)" అని సూత్రించాడు (చిన్నయసూరి, 1858).

ఈ విషయంలో ప్రాచీనాధునిక భాషలకు భేదం లేనందున వ్యావహారిక భాషా వ్యాకరణంలోనూ ఇట్లాంటి సూత్రాలే ఉన్నై (గోపాలకృష్ణయ్య 1958)

నడిమి అచ్చు మారని రూపాలు కూడా ప్రాచీన భాషలో ఉన్నై. పందిరులు పిడికిళులు, రాపిడులు తొమ్మిదులువంటి శబ్దాల్లో ఈ మార్పు జరగటం లేదని గమనించిన చిన్నయసూరి "ర, ల, డో పధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు (తత్సమ-47)' అని సూత్రీకరించాడు 'వ్యావహారిక భాషావ్యాకరణం' లోనూ ఇట్లాంటి సూత్రమే ఉంది. కాని వీరెవ్వరూ యకార పూర్వకమైన ఇత్తు మారదని చెప్పలేదు ప్రాచీన భాషలోనైనా పొయ్యి స్థాయి వంటి నామాలకు పొయ్యులు స్థాయులు అని బహువచన రూపాలున్నట్టు కనిపించదు. (రామారావు, 1970)

నడిమి ఇత్తు ఉత్తుగాని ఎనిమిది పగిది చెయిది' రూపాల్ని చూసి రామమూర్తి (1950) ఉదాహరిస్తూ బాలవ్యాకరణ సూత్రం (తత్సమ-47) లో 'నవార్థాదుల' అనే దళంలో అది శబ్దముచేత గ్రాహ్యాలన్నారు ఇందులో 'పగిది' శబ్దానికి 'విధం, రీతి'అనే అర్థంలో బహువచనరూపం ఉండదు 'కప్పం' అనే అర్థంలో బహువచన రూపం ఈ వ్యాసకర్తకు కనబడలేదు. చెయిది అనే రూపంలో నడిమి ఇత్తు ఉత్తు కాకపోవటానికి యకార పూర్వకతే కారణంగా భావించవచ్చు. రెండక్షరాలకన్న ఎక్కువున్న పదాల్లో అనాద్యమైన అచ్చులు ఉ-ఇ క్రమంలో ఉండవచ్చుగాని ఇ-ఉ క్రమంలో ఉండవు. ఉకారం యకార పూర్వకమైనప్పుడే ఈ క్రమం సాధ్యం. ఇదా. అయిదు పయిరు. ప్రాచీన భాషలో యకారపూర్వకంగాని నడిమి ఇత్తుతో ప్రిదిలు' అనే ధాతువున్నప్పటికీ దానికి ప్రిదులు అనే రూపాంతరం ఉంది స్వరక్రమానికి సంబంధించిన పై నియమమే తెలుగు బహువచన రూపాల్లో స్వరసమీకరణను కలిగిస్తున్నట్టు చెప్పవచ్చు. యకార పూర్వకమై ఇత్తున్న పదాల్లో ఈ నియమం వర్తించపోవటానికి యకారమూ ఇత్తూ రెండూ తాలవ్యవర్ణాలు కావటం కారణం. యకారాన్ని అక్షర నిర్మాణ శక్తిలేని స్వరంగా కూడా భావించవచ్చు (అక్షర నిర్మాణశక్తి స్వరాల ప్రధాన ధర్మం. యకారం ప్రాణంలేని స్వరం).

ఆధునిక భాషలో పందిరులు> పందిళ్ళు; రాపిడులు> రాపిళ్ళు; పిడికిలులు> పిడికిళ్ళుగా మారినై. దీన్ని ఆధారం చేసుకొని ప్రకాశం (1972) రామచంద్రరావు (1974) లు నడిమి ఇత్తు ఉత్తు కాకపోవటానికి సంయుక్త వ్యంజన పరతను కారణంగా భావించారు. కాని అవిరి+లు> ఆవిరులు, ఆవిర్లు అని సంయుక్తా సంయుక్త రూపాలు రెండూ సాధువులే. బాలవ్యాకరణ కర్త సూచించిన రలడోపధ పరిసరమే ఎక్కువ సమంజసమైనది. దీన్ని ఇంకాస్త విస్తృతపరచి ఈ వ్యాసకర్త (రామారావు, 1969, ) ట, న, లను కూడా పరిసరంలో చేర్చాడు. అంటే దంతమూల మూర్ధన్య తాలవ్య వ్యంజన పరకమైన నడిమి ఇత్తు ఉత్తు కాదన్నమాట. పై శబ్దాలన్నీ చతుర్మాత్రాక శబ్దాలు కావటం కూడా గమనించదగింది. చతుర్మాత్రాక శబ్దాల్లో ఉపోత్తమైన ఇత్తు ఉత్తు కాదని కూడా సూత్రించుకోవచ్చు కాని 'ఉసిళ్లు' అనే నిత్యబహువచనరూపం ఇందుకు ప్రతిబంధకంగా ఉంది. 'ఉసిళ్లు' కు 'ఉసుళ్లు' అనేరూపం కొందరి వ్యవహారంలో ఉంది. కాని పై చతుర్మాత్రాక శబ్దాలకిట్లాంటి రూపవైవిధ్యం లేదు. మాత్రానియమాన్ని పరిసరంగా నిర్దేశిస్తే సంఖ్యావాచకాలను పరిహరించాలి. ఎనుముదులు, తొమ్మిదులు అనే రూపాలు ఆధునిక భాషలో ఉన్నై. నలడరట్లో పధ శబ్దాల్లో మాత్రం అపవాదాలు లేవు. నోపధానికి ఉదాహరణ లభించలేదు. గావిట్లో పధానికి 'పెనిమిటి' శబ్దాన్ని ప్రకాశం (1972) ఉదాహరించాడు.

నామాల స్వర సమీకరణలో ఇంకో విశేషం ఉంది. ఉత్వ పరిసరంలో ఇ> ఉ అవుతున్నది గాని ఇత్వపరిసరంలో ఉ> ఇ కావటం లేదు. 'టి, తి వర్ణంబులు పరంబులగు నపు డుత్వంబున కిత్వంబగు (అచ్చిక-36)' అనే బాలవ్యాకరణసూత్రం ఇందుకు ప్రతిబంధకం కాదు. సూత్రోదాహరణల్లో ఉన్న "రెండిటికి మూడిటికి నాలుగిటికి, పగలిటికి, మొదలిటికి'' అనే రూపాలు సంఖ్యావాచకాలు, క్రియా విశేషణాలు. పగలు మొదలు శబ్దాలను నామాలుగా భావిస్తే ప్రాచీన భాషలో ఇవి అపవాదాలవుతై కాని ఆధునిక భాషలో ఇవి పగటి, మొదటి రూపాలతోనే ఉంటై. బాలవ్యాకరణ కారుడు పై సూత్రం కింద ''క్వాచిత్కంబుగా నొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టును'' అని వృత్తి రాసి ''నెత్తుటికి'' అని ఉదాహరించాడు. ఇక్కడ *క్వాచిత్కంబుగా నొకచో* బదులు నామపదాల్లో అంటే సరిపోతుంది ఆధునిక భాషలో అయితే అపవాదాలుకూడా ఉండవు. *క్వాచిత్కంబుగా నొకచో* అనే

దానికి ఆదేశ టి వర్ణమని రామమూర్తి (1950) వివరణ. మార్పు వచ్చే చోట టి, తి వర్ణాలు ఆగమ వర్ణాలు

నెత్తుటికి అనేచోట ఉత్వం ఇత్వం కాకపోవటానికి వ్యావహారిక భాషా వ్యాకరణకారులు (గోపాలకృష్ణయ్య 1958) భిన్న మార్గాలను అవలంబించారు. 'రలడోపధ'ల అనే సూత్రం (శబ్ద- 285) కింద వృత్తిలో 'నెత్తుటికి సుదుటికి, నడకుదుటి వీర్రాజు - ఇత్యాదుల్లో మూలపదం రోపధం కావటంవల్లనే ఉత్వం లేదని గుర్తించాలి' అని రాశారు. ఈ వాక్యం దురవగాహంగా ఉంది. మూల పదం రోపధం కావటంవల్ల ఉత్వం లేనిది ఏవర్ణానికి? బహుశా టి శబ్దంలో ఇత్వానికి అయితే ఈ సూత్రం అనవసరం. ఇకారంబుమీద కునువు''సూత్రంవల్ల 'కునువు> కిని' లవుతై. ఇట్లా అనుకోటానికి నడకుదుటి వీర్రాజు శబ్దంలో ఇత్వం ఉత్వం అయ్యే పరిసరమే కనిపించటంలేదు బహుశా ఇక్కడ ముద్రణ దోషం ఉండవచ్చు 'ఉత్వాని కిత్వం లేదని గ్రహించాలి అనేది అసలు వాక్యం కావచ్చు. ఇట్లా అయితేనే ఈ వాక్యానికిక్కడ సందర్భశుద్ధి ఉంటుంది. ఈ అర్థం సరిఅయిందయితే రలడోపధ పరిసరమే ఇత్వం ఉత్వం కావటాన్ని ఉత్వం ఇత్వం కావటాన్ని నిరోధిస్తున్నదని వ్యాకర్త ఉద్దేశం. ఔపవిభక్తిక ప్రత్యయాలు ప్రాయికంగా రలడోపధ పరిసర శబ్దాలకే రావటంవల్ల ఇట్లా సూత్రించి ఉంటారు. ఇంకోచోట రు వర్ణాదేశ టి వర్ణం పరమైతే ఉత్వాని కిత్వం రాదు. (శబ్ద- 471) అనే వేరే సూత్రం రచించి పై ఉదాహరణలే ఇచ్చారు రలడోపధ సూత్రమే ఈ శబ్దాల్ని సాధిస్తే 'రు వర్ణాదేశ టి వర్ణ'' సూత్రం అనవసరం. ప్రక్రియా వైవిధ్యం చూపించటం వ్యాకర్త ఉద్దేశం కావచ్చు కాని రు వర్ణాదేశ టి వర్ణ' పరిసరాల్లోనే కాక ఇంకా మరికొన్ని పరిసరాల్లో కూడా ఈ మార్పు జరగదు. అట్లాంటి వాటిల్లో ఒకటి 'పొద్దుటి' అనే రూపాన్ని గోపాలకృష్ణయ్య గుర్తించి "టి వర్ణం పరమైతే ద్విత్వోపధల ఉత్వానికి ఇత్వంరాదు (శబ్ద- 472) అని సూత్రించారు కాని ''అల్లుడికి, కూతురికి దేముడికి' వంటి రూపాల్లో కూడా ఉత్వం ఇత్వం కావటం లేదు. దీన్ని బట్టి చూస్తే నామ పదాల్లో పదమధ్యమైన ఉ> ఇ గా మారదని సూత్రించు కోవటమే ఆధునిక భాషా లక్షణానికి సన్నిహితమైనదని తెలుస్తుంది. 'అతనికి

కోడలికి, చెల్లెలికి'' అనే పదాల్లో ఉన్న నడిమిఅచ్చులు అయిన అ, ఎ లు ఎట్లాగూ మారవు.

పై ఉదాహరణలవల్ల ఇంకో విషయం తెలుస్తున్నది. నామపదాల్లో అచ్చుల్లో మార్పులు కలిగించగలిగిన ప్రత్యయం 'లు' మాత్రమే. కు, ను, తో, నుంచి, గురించి, తో వంటి ప్రత్యయాలు మార్పును కలిగించలేవు. కు,ను, ప్రత్యయాల్లో ఉకారమే సమీకరణకుగురి అవుతుంది. ఇకారాంతాల(ఔపవిభక్తికప్రత్యయ ఇ కారం గూడా గ్రహించాలి) తర్వాత వచ్చిన కు, ను లు కి, ని లు అవుతై. బాల వ్యాకరణంలో ''ఇకారంబుమీది కునువు'' సూత్రం ఇదే చెపుతుంది. కాని ఈ మార్పు ఇకారాంతాలయినా *నీ, మీ* అనే సర్వనామరూపాల తరవాత రాదు. దీన్నే ''ఈ ధాతు యుష్మదర్థంబుల మీది వానియుత్వంబున కిత్వంబు రాదు. (తత్సమ- 27)'' అని చిన్నయసూరి సూత్రించాడు. అయితే 'లు' ప్రత్యయం ముందు ప్రాతిపదికలో జరిగే మార్పు కు, ను ప్రత్యయాలముందు ఎందుకు జరగటంలేదు? ఇందుకు సరిఅయిన కారణం చెప్పటం కష్టం. 'లు' ప్రత్యయం చేరిన రూపాలకు కు, ను లు చేర్చవచ్చు. (అప్పుడు లు> ల అవుతుంది). కాని కు,ను ల మీద 'లు' చేర్చలేము. 'లు' ప్రత్యయం చేరిన తరువాతకూడా పదానికి విస్తరణావకాశం ఉంది. కాని కు ను లు చేరి ఏర్పడ్డ రూపాల కట్లాంటి అవకాశం లేదు. ఈ ప్రత్యయాలు పదాన్ని మూసివేస్తై అయితే ''దీన్నిబట్టి'' ''నిన్ను గురించి'' అనే చోట్ల ను ప్రత్యయానికి విస్తరణావకాశం ఉన్నట్లు కనిపిస్తున్నది కాని పై రూపాల్లో ఉన్న ''పట్టి, గురించి'' శబ్దాలు ప్రత్యయార్థంలో ఉపయోగించిన పదాల్లాగా కనిపిస్తున్నై. అంటే *దీన్నిబట్టి, నిన్నుగురించి* అనే శబ్ద సంయోజనను ఏకపదంగా కాక సమాసతుల్యంగా గ్రహించాల్సి ఉంటుంది. అందుకు తగినంత సాక్ష్యం కనిపించటంలేదు. ఒకవేళ అదే సాధ్యమైతే విస్తరణ సామర్థ్యానికి సమీకరణ సామర్థ్యానికి సంబంధమున్నట్లు ప్రతిపాదించవచ్చు. ఇది ఎట్లాంటి సంబంధమనేది ఇంకా అంతుచిక్కటం లేదు. క్రియల్లోకూడా ఇట్లా విస్తరణ సామర్థ్యమున్న ప్రత్యయాలకే సమీకరణ సామర్థ్యం ఉన్నట్లు ఈ వ్యాసం తరువాత భాగంలో తెలుస్తుంది.

నేటి భాషలో దీర్ఘాంత సర్వనామరూపాల తరవాత తప్ప అన్ని చోట్లా కి, ని ప్రత్యయరూపాలను వాడేవాళ్లున్నారు. దీన్ని సూచించటంకోసం గోపాల

కృష్ణయ్య "వు లు వర్ణాలమీది కు ను ల ఉత్వానికి ఇత్వం బహుళం (శబ్ద- 61)'' అని సూత్రించారు కాని ఇది ఒక్క 'వులు' వర్ణాలమీదేకాక 'నా మా నీ మీ'' అనే సర్వనామరూపాలమీద వచ్చినప్పుడు తప్ప మిగతా అన్నిచోట్లా వస్తుంది. '*అవుకి, మక్కికి, గేదెకి*' అనే విధంగా రూపాలున్నై. ఇకారాంతం మీది కి, ని అనే రూపాలు సాధారణీకరింపబడి సర్వత్రావ్యవహృతమవుతున్నై. దీన్ని ఆధారంచేసుకొని రామచంద్రరావు (1974) కి ని రూపాలను మూలంగా గ్రహించి కు ను లను స్వరసమీకరణ ద్వారా సాధించాలని ప్రయత్నించారు. ఉదంత నామాల తరవాత కి, ని అనే రూపాలు కునులు అవుతయ్యని ఆయన ఉద్దేశం. కి ని రూపాలనుంచి కు ను రూపాలను స్వరసమీకరణ సాధించ గలిగితే ప్రకృతి ప్రత్యయాలలో జరిగే సమీకరణం ఒక లాంటిదేనని చెప్ప గలుగుతాం. కాని భాషాప్రయోగాలు అందుకు విరుద్ధంగా ఉన్నప్పుడు ఎట్లా చెప్పగలుగుతాం?

అధిక పరిసరాల్లో *కి,ని* లను ప్రయోగించేవారి భాషలో వీటినే మూల రూపాలుగా గ్రహించి సర్వనామాల తరవాత వచ్చే కు,ను లను మారిన రూపా లుగా సాధించగూడదా? అని ప్రశ్నించవచ్చు. ప్రత్యయాలను స్వరసమీకరణ పరిధినుంచి తొలగించటం ఈ ప్రతిపాదన ప్రయోజనం. ఈ ప్రతిపాదన చరిత్రకూ, తెలుగువారి భావనకూ విరుద్ధం. ఇవి అంత ప్రధానమైన ఆటంకాలు కావు. ఇంతకన్నా ముఖ్యమైన చిక్కులున్నై. ఇకారాంత శబ్దాల తరవాత కి,ని లు, దీర్ఘాంతసర్వనామాల తరవాత ''కు, ను'' నిత్యంగా వచ్చినా ఇతర శబ్దాల తరవాత కి ను ని, ను ల వికల్పత్వంవల్ల సిద్ధించే రూపాల జంటలు వ్యాకరణ సమ్మతం అనే విషయం మరుగున పడుతుంది. సర్వనామాల తరవాత ఇత్తు ఉత్తు కావటానికి సరైన కారణం కనిపించదు వీటితో సమంగా వర్తించే వి, వు లు మి ము లకు ఈ ప్రక్రియ ప్రవర్తింపజేస్తే చిక్కులు అధికమవుతై.

ఇంతవరకూ పరిశీలించిన దాన్నిబట్టి ప్రత్యయాల్లో ఉన్న '*ఉ*' ఇకార పూర్వకమైనప్పుడు '*ఇ*'గా మారుతుందనీ నామాల్లో 'లు' పరమైన పదాంత మైన ఇత్తు కొన్నిచోట్ల నడిమి ఇత్తు ఉత్తుగా మారుతున్నదని తెలుస్తున్నది. హ్రస్వ ఇకార ఉకారాలే సమీకరణకు గురి అవుతయ్యని రామచంద్రరావు (1974) గుర్తించినా నామాల్లో ఉ > ఇ కాదని గుర్తించలేదు, నామాల్లోనైతు ప్రత్యయాల్లోను ధాతువుల్లోనూ ఉత్తు స్వరసమీకరణకు

గురి అవుతయ్యని వేరుపరచలేదు. సంఖ్యావాచకాల్లో ఇత్తు ఉత్తులు రెండూ పరస్పర సమీకృతులవుతై. పది> పదులు, తొమ్మిది> తొమ్మదులు, ఎనిమిది> ఎనుముదులు అన్న రూపాల్లో నామాల్లోలాగా అనాద్యమైన ఇత్తు ఉత్తుగా మారింది 'రలడోపధ' సూత్రంతో 'నవార్థాదుల' అనే దశం ఆధునిక భాషకు వర్తించదు. *గురు* అనే ప్రత్యయం ముందు కూడా ఈ సమీకరణ జరిగింది. పది + గురు> పదుగురు. ఔప విభక్తిక టి శబ్దంముందు అనాద్యమైన ఇత్తులు ఉత్తులుగా మారినై. ఉదా: రెండు-రెండిటికి, మూడు-మూడిటికి, నాలుగు-నాలిగిటికి, కాలాన్ని బోధించే *ఇంటికి* ఈ సామర్థ్యం ఉన్నట్టు కనిపించదు. నాలుగు + ఇంటికి > నాలుగింటికి (నాలుగు గంటల సమయానికి అనే అర్థంలో). *నాలిగింటికి* అని వ్యవహరించేవారికి ఈ నిషేధం వర్తించదు. ఈ వ్యాసకర్త వ్యవహారంలో నాలిగిటికి అంటే నాలుగు వస్తువులకు అని, నాలుగింటికి అంటే నాలుగు గంటల సమయానికి అని అర్థాలు. అయితే ఈ అర్థభేదాన్ననుసరించి రూపభేదం అందరి వ్యవహారంలో ఉండకపోవచ్చు. ఒకే రూపానికి రెండర్థాలను బోధించగల సామర్థ్యం ఉండే అవకాశం ఉంది. అర్థభేదం ఉన్నా లేకపోయినా నాలిగిటికి అనే వ్యవహారం ఉన్నవారి భాషకు ఉ > ఇ గా మారే పద్ధతిని గుర్తించాలి నలుగురు అనే రూపంలో *గురు* అనేది ఒకే ప్రత్యయంగా భావిస్తే ఇది సమీకరణకు గురికాదని *నలుగురికి* అనే రూపంవల్ల తెలుస్తున్నది. *గురు* ప్రత్యయానికున్న విస్తరణ సామర్థ్యాన్ని కూడా పై పదం సూచిస్తుంది. అందువల్ల దీనికి సమీకరణ సామర్థ్యం ఉంది కాని తనకు తాను అందుకు గురికాదు.

పొద్దుటి, మారుటి అనే రూపాలు నామాలు కావటంవల్ల ఉ > ఇ గా మారటంలేదు.

ప్రత్యయాల్లో నామవిభక్తులు కావటంవల్ల కు, ను లు మాత్రమే చర్చించబడినై ఇవికాక అఖ్యాత పదానికి కర్తృబోధకంగా వచ్చే 'ను, ము, వు, రు' అనే ప్రత్యయాల్లో అచ్చుకూడా ప్రకృతిలోని అచ్చుతో సమీకృతమవుతుంది. ను, వు లకు ఇకారాంతాల తరవాత 'ని, వి' అనే రూపాలున్నై. ఇకారేతర

స్వరాంత శబ్దాల తరవాత కూడా 'ని, వి' అనే రూపాలను వాడేవారున్నారు. ఈ విషయంలో పీటికి నామ విభక్తులైన కు,ను లతో పూర్తిగా సామ్యం ఉంది. ఉదా - మనిషిని, మనిషివి స్త్రీని, స్త్రీవి రైతును-రైతుని, రైతువు-రైతువి, ము, రు,లు బహువచన బోధకాలు బహువచన. నామాల్లో చివరి 'ఉ' ప్రత్యయాల ముందు 'అ' గా మారుతుంది ము> మి, రు> రి అయ్యే ఘట్టాలు దొరకటం కష్టం. బహువచన ప్రత్యయం లేకుండానే బహుత్వ బోధకాలయిన శబ్దాల తరవాత మార్పును గమనించవచ్చు. ఉదా:- మనుషులము, నలుగురము-నలుగురిమి పదిమందిమి. ఆధునిక భాషలో కొన్ని మాండలికాల వ్యవహారాల్లో ప్రచురంగాను, అరుదుగా అర్థవిశేషంలో మిగతా ప్రాంతాల్లో వస్తిని, వస్తిమి వస్తివి వస్తిరి, అనే రూపాలు వాడుకలో ఉన్నై. "ఇకారంబుమీది కునువు క్రియావిభక్తి" ఆధునిక భాషలో కూడా ప్రవర్తితమని పై రూపాలు సాక్ష్యం ఇస్తున్నై. ను,ము, రు, లకు విస్తరణ సామర్థ్యం లేకపోవటం ఇక్కడ కూడా గమనించదగింది.

చిన్నయసూరి ప్రత్యయాల్లో మార్పును ముందు వివరించారు. ఆ తరవాత ప్రకృతుల్లో మార్పు వివరించబడింది. ప్రకృతి ప్రత్యయాల్లో జరిగే మార్పులు భిన్నమైనవని చిన్నయసూరి చేసిన నిర్ణయం సరి అయినదేనని పై చర్చలవల్ల స్పష్టం నామాల్లో లు సంఖ్యల్లో గు(రు) మాత్రమే ప్రకృతుల్లో సమీకరణను గలిగించగలవని తేలింది. 'కు,ను,ము,వు,రు' ప్రత్యయాలు సమీకరణను పొందుతై ప్రకృతి ప్రత్యయాల్లో జరిగే మార్పుల్ని ఒకే గాట కట్టి వెయ్యటానికి చేసే ప్రయత్నం (రామచంద్రరావు 1974) భాషాలక్షణానికి విరుద్ధమని స్పష్టం.

క్రియల్లో సమీకరణను గురించి కూడా సాంప్రదాయిక వ్యాకర్తలు గుర్తించారు. ప్రాచీన భాషలో ఉ> ఇ అనే మార్పు మాత్రమే కనిపిస్తున్నది. దాన్నే చిన్నయసూరి "ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు (క్రియ - 85)" అని సూత్రించాడు. ప్రాచీన ధాతువుల్లో ఉన్మధ్య, అన్మధ్య, ఇన్మధ్య– అని మూడు రకాల ధాతువులున్నై స్వరసమీకరణం ఉన్మధ్య ధాతువుల్లోనే జరుగుతుంది. అది కూడా తాలవ్యాచ్పరకమైనప్పుడు మాత్రమే ప్రాచీన భాషలో నామాల్లో ఇ> ఉ అనే విధంగానూ క్రియల్లో ఉ> ఇ అనే విధంగానూ బింబ ప్రతిబింబ న్యాయంగా ఉండేది అకార పరమై

నప్పుడు ఈ మార్పు జరగలేదు. అడుగు> అడుగ అనే ఉండేది. అన్మధ్య ధాతువులో ఇకారం పరమైనప్పుడు సమీకరణం జరగలేదు. కదలు> కదలి అనీ ఉండేది ఇన్మధ్య ధాతువులకూ ఇట్లాగే మార్పులు లేకుండా తెలియు> తెలియ అనే రూపాలుండేవి ఈ క్రియలు ఆధునిక భాషలోకి వచ్చేటప్పటికి కొన్ని మార్పులు జరిగినై. ఆధునిక భాషలో వ్యవహార భ్రష్టాలయిపోగా మిగిలిన అన్మధ్య ధాతువులన్నీ ఉన్మధ్య ధాతువులుగా మారినై. *కదలు, మెదలు* మొ వి కదులు, మెదులు అని మారినై. ఇన్మధ్య ధాతువుల్లో *కదియు, ప్రిదిలు* వంటి ధాతువులు వ్యవహార భ్రష్టాలయినై. వ్యవహారంలో మిగిలిన *కలియు, బలియు* వంటి ధాతువులు కలున్/కలువు. బలున్/బలువు అని మారినై. ఉపధ 'య' కారం స కార వ కారాలుగా మారగానే నడిమి ఇ> ఉ గా మారింది ఇన్మధ్యతను రక్షించే యకారపరత తొలగగానే ఇత్తుకున్న స్థైర్యం పోయి ఉత్తుగా మారింది. 'తెలియు' మాత్రం ఇంకా ఇన్మధ్యంగానే మిగిలి తెలీదు, తెలేదువంటి రూపాలు వ్యవహృతం కావటమే కాక ప్రామాణికంగా పరిగణించబడుతున్నై. ఇదైనా చాలామంది భాషలో తెలున్/తెలువ్‌గా మారింది. మారనివారి భాషలో దీన్ని అపవాదంగా గుర్తించటమే సులువైన మార్గం.

ఆధునిక భాషలో కూడా ఇన్మధ్య అన్మధ్య ధాతువుల్ని గుర్తించాలని సుబ్బారావు (197 ) సూచించారు ఇన్మధ్యధాతువుకు వర్ధిల్లు అనే ఉదాహరణ చూపించారు. ఘటిల్లు రంజిల్లు వర్ధిల్లు వంటి తత్సమ ధాతువులలో దేశ్య ధాతువులలో సమానమైన మార్పులు జరగవు పైగా ఇక్కడ ఇల్లు అనేది ధాతు నిష్పాదక ప్రత్యయం ధాతు నిష్పాదక ప్రత్యయాది ఇకారాన్ని ధాతు మధ్య స్వరంగా పరిగణించకూడదు. ఆ స్వరం తెలుగు ధాతువుల్లా స్వర సమీకరణం కలిగించగలదేకాని, తనకు తాను మార్పుకు గురికాదు ఉదాహరణకు కరిగించ- పిలిపించ- ఊగించ- వంటి అన్నంత రూపాలను గమనిస్తే ఇంచు ప్రత్యయాది స్వరం మార్పుకు గురికాదని తెలుసుకోవచ్చు. ఇది ధాతు విస్తరణ ప్రత్యయం (stem extending suffix) అనీ, స్వర సమీకరణ సమర్థక మని కూడా తెలుసుకోవచ్చు పదనిర్మాణ సమాపక ప్రత్యయాలు (word closing suffixes) మాత్రమే సమీకృతమవుతయ్యని కూడా ఇంతకుముందే సూచించబడింది ఇన్మధ్య ధాతువులను గుర్తించాల్సివస్తే అది తెలియు కలియు, వంటి ధాతువుల విషయంలోనే అని స్పష్టమవుతున్నది.

అన్మధ్య ధాతువులకు సుబ్బారావు చెమర్చు అనే ధాతువును ఉదాహరించారు. ఇవేకాక కలగు కలచు, పెనగు వంటి ధాతువులను చాలా ఉదాహరించవచ్చు. ప్రాచీన భాషలో ఇవి నిస్సంశయంగా అన్మధ్య ధాతువులే. కాని సాహిత్య పరిచయంవల్ల, ఇతర సాంస్కృతిక ప్రచార సాధనాలద్వారా విద్యావంతులు, ఉన్నత, మధ్యమ తరగతుల "సంస్కార వంతులు" ప్రాచీన భాషా పదాలను వాడుతుంటారు. వీటికి కారణాలనేకం. వీరినే "శిష్టులు" అని కొందరు వ్యవహరిస్తుంటారు. వీరి భాషలో ఇతర భాషాపదాలుకూడా బహుళంగా ఉంటై. సూత్ర నిర్మాణంలో ప్రాచీన భాషాపదాలనుకూడా, ఇతర భాషా పదాలతోపాటు వేరు చెయ్యాలి.

అన్మధ్య ధాతువులను గుర్తించాల్సిన ఘట్టాలు ఆధునిక భాషలో కొన్ని కనిపిస్తున్నై. నేటి తెలుగులో కొందరి వ్యవహారంలో ఉన్న కదచిన, తొలగిన, వంటి రూపాల్లో ధాతువులను ప్రాచీన భాషనుంచి ఎరవు తెచ్చుకున్నట్టు భావించినా అణకువ, మెలకువ, కదలిక, మెదలిక, బదలిక వంటి కృదంత రూపాలను సాధించాలంటే ఈ రూపాల్లో ధాతువుల్ని అన్మధ్య ధాతువులుగా గుర్తించాలి. కదలు ధాతువుకు ఇక ప్రత్యయం చేర్చినప్పుడు మారని మధ్యస్వరం ఇంచు ప్రత్యయం చేర్చినప్పుడు (కదలిక - కదిలించు) మారిందనాలి. ధాతువునుంచి నామం నిష్పన్నమైనప్పుడు మారదని ధాతువునుంచి ధాతువే నిష్పన్నమైనపుడు సమీకరణ జరుగుతుందని సూత్రించుకోవాలి కాని ఈ ప్రతిపాదన చాల వ్యయంతో కూడుకున్నది. అంటే ఈ ప్రతిపాదనకోసం అన్మధ్యధాతువుల్ని గుర్తించాలి ఆ అత్తు సమీకరణాన్ని పొందుతుందని చెప్పాలి దీనివల్ల వచ్చే లాభం కృదంత రూపాల సాధన ఇబ్బందిలో పోగొట్టుకుంటే లాభం బహుస్వల్పం ఎందుకంటే కృద్వ్యుత్పత్తులు అధిక నిష్పాదన శక్తి (productivity) గలవి కావు వీటి కోసం అన్మధ్య ధాతువుల్ని గుర్తించటంలో పొదుపు (economy) లేదు సాంప్రదాయిక వ్యాకరణాల్లో కృదంత పరిచ్ఛేదాల్ని ఒకసారి చూస్తే ఈ కృత్ప్రత్యయాలు ధాతువుల్లో కలిగించే మార్పులు ఒక క్రమంలో ఉన్నట్టు కనపడవు దానికి కారణం భిన్న కాలాల్లో ధాతువులున్న రూపాల్ని బట్టి భిన్న విధాలయిన కృద్రూపాలేర్పడినై వాటిని ఇప్పుడున్న ధాతు రూపాల్నుంచి నిష్పన్నం చెయ్యటం చాలా కష్టమైన పని అందుకే ఈ వ్యాసం మొదటిభాగంలో 'చారిత్రక పరిణామాల పొరలను విప్పటం' లో ఇబ్బందులున్నయ్యన్నది.

కృదవ్యాత్తుల కోసం అన్మధ్య ధాతువుల్ని గుర్తించినా వాటిని క్రియాపద నిర్మాణం కోసం ఉన్మధ్య ధాతువులుగా మార్చుకోవాలి. "కుదురు - కుదిరిక; కదలు-కదలిక'' అనే రూపాల్ని చూస్తే ఇదాది ప్రత్యయాల ముందు ధాతు గత మైన ఉత్తు మారుతుంది గాని అత్తు మారటం లేదని గమనించవచ్చు. అటువంటి అత్తును పద నిర్మాణంలో ('కదిలింది' అనే పదంలో లాగా) ఇదాది ప్రత్యయం ముందు మారిందని చెప్పటం ఎట్లా? ఇదాది ప్రత్యయాల ముందు ఉత్తు సర్వత్రా మారుతుంది, అత్తు క్రియాపద నిర్మాణ ప్రత్యయాల ముందే మారుతుందని ఒక విచిత్ర సూత్రాన్ని రచించుకోవాలి. దీనికన్నా కృదవ్యాత్తుల కోసం అన్మధ్య, ఇన్మధ్య ధాతువుల్ని గుర్తించి క్రియాపద నిర్మాణ విభాగ ప్రారంభంలో "ధాతు మధ్యాచ్చులు ఉత్తులుగా మారతై'' అని సూత్రించు కోటం మంచిది ఒక రకంగా చారిత్రకంగా జరిగింది కూడా ఇదే.

ప్రాచీన భాషలో నడిమి ఉత్తు తాలవ్యాచ్చుల ముందు ఇత్తుగా మారింది. అదాది ప్రత్యయాల ముందు మారలేదు ఆధునిక భాషలో అదాది ప్రత్యయాల ముందు అత్తుగా మారింది ప్రాచీన భాషలో అడుగ కడుగ వంటి రూపాలే ఉంటై ఆధునిక భాషలో ఇవి అడగ, కడగ అని మారినై. ప్రాచీన భాషలో ఇత్సమీకరణమే ఉంది. ఆధునిక భాషలో అత్సమీకరణం అదనం. అయితే ప్రాచీన భాషలో వండక, వండకు, వండని, వండమి వంటి రూపాల్ని సాధించ టానికి చిన్నయ సూరి ఒక విశేషమైన మార్గాన్ని అనుసరించారు ఆ ధాతువు చివరి అచ్చును మాత్రమే మార్చటానికి ఇత్సం జ్ఞలను విధించి, కజి, కుజి, నిజి, మిజి అనేవిధంగా ప్రత్యయాలను గ్రహించి ''జిత్తు పరంబగునపు డుత్వం బున కత్వంబగు (క్రియ-20)''అని సూత్రించారు ఇక్కడ స్వరంలో మార్పుకు సమీకరణంతో సంబంధంలేదని స్పష్టమే.

ఉ<ఇ మార్పునే ప్రాచీన భాషలో (క్రియల్లో) వర్ణసమీకరణంగా గుర్తిం చిన చిన్నయసూరి "ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబైన యుత్వంబున కిత్వంబగు (క్రియ 85)' అని సూత్రించారు. ఆధునిక భాషలో ఈ స్వరసమీకరణం విస్తృత మయింది దీన్ని గుర్తించే గోపాలకృష్ణయ్య (1959) "ఇత్వంగాని ఎత్వంగాని (భూతకాలిక సమాపక క్రియల్లో వచ్చే వివృత

మైన ఏ) కూడితే అనాద్యమైన ఉత్వానికి ఇత్వం బహుళంగా వస్తుంది. "(క్రియ 138)" "వ్యతిరేకార్థక అకారం పరమైతే అనాద్యమైన ఉత్వానికత్వం వైకల్పికం (క్రియ-154)" అని సూత్రాలు రచించారు. ఆధునిక పద్ధతిలో రచించిన వ్యాకర్తలలో కొన్ని మత భేదాలున్నై.

కృష్ణమూర్తి (1961), కెలీ (1965) రామారావు (1969)లు మధ్యాచ్చును ఉత్తుగా గుర్తించారు ప్రకాశం (1972) మధ్యాచ్చును ఫలాని అచ్చుగా గుర్తించనక్కర్లేదన్నారు. ఆధునిక భాషా ధాతువులో అనాద్యమైన అచ్చులు ఉదిభిన్నాలులేవు 'కాబట్టి వాటిని అచ్చులని గుర్తిస్తే చాలు'నని ప్రకాశం మతం. నడిమి అచ్చు యకారపరమైనప్పుడే ఇత్తుగా ఉంటుంది కాబట్టి ఇన్మధ్య ధాతువులో కూడా ఫలాని అచ్చు అని ప్రత్యేకంగా చెప్పక్కరలేదు. స్వరసమీకరణకు సంబంధించినంతవరకు ఈ మతభేదాలు ప్రధానంకాదు కాని ఉ> ఇ గా మారే పరిసరాల్లో మాత్రం కొన్ని మతభేదాలున్నై. పై వారందరూ దీర్ఘాచ్చులు, హ్రస్వాచ్చులు కూడా సమీకారాలు అవుతయ్యని అంగీకరించారు. సుబ్బారావు (1971) కి కూడా ఇది అంగీకార్యమే కాని రామచంద్రరావు (1974) దీన్ని నిరాకరించారు. ఆయన మతంలో సమీకరణాన్ని పొందేవి, కలిగించేవి హ్రస్వాచ్చులు మాత్రమే. ఇ ఉ, లు మాత్రమే సమీకరణను పొందుతయ్యని, ఇ, ఉ అ లు సమీకరణని కలిగిస్తయ్యని ఆయన వాదం. అడుగు + తె> అడిగితే అనే చేదర్థక రూపాన్ని అడుగు + ఏ> అడిగే అనే క్రియాజన్య విశేషణాన్ని సాధించటానికి దీర్ఘాచ్చుల్ని కూడా సమీకారకాలుగా గుర్తించాల్సి ఉంటుంది, సుబ్బారావు (1971) కూడా చదువ్ + ఏ> చదివే అనే రూపాన్ని ఉదహరించారు. (అయితే దీన్ని imperative emphatic అనటం ప్రామాదికం కావచ్చు. స్త్రీ వాచక సంబుద్ధి ప్రత్యయంముందు ఇత్సమీకరణం జరగటం ఈ వ్యాసకర్తక పరిచితం). అడుగు + తే> అడిగితే అనే రూపం 'తే' ప్రత్యయంలోని ఏ కారం కలిగించిందంటే అడుగు + తాడు> అడగతాడు ఎందుకాలేదని రామచంద్రరావు ప్రశ్న అందువల్ల దీర్ఘాచ్చుల్ని సమీకారకాలుగా గుర్తించకూడదని రామచంద్రరావు నిర్ణయం. అందువల్ల అడిగితే అనే రూపాన్ని అడుగు + ఇతే అని విశ్లేషించాలని ఆయన సూచన కాని 'అడిగే' అనే క్రియాజన్య విశేషణాన్ని సాధించటానికి ఆయన ఏ మార్గమూ సూచించలేదు సుబ్బా

రావు కి చిక్కలేదు ఆయన వ్యాకరించిన భాషలో తే ప్రత్యయంముందు సమీకరణ జరక్కుండా *అడుగుతే* అనే ఉంటుంది ఆయన వ్యవహరించేది కాకి నాడ ప్రాంతపు భాష వ్యంజన పూర్వకమైన ప్రత్యయస్వరం సమీకరణను కలిగించలేదని సుబ్బారావు మతం కాబట్టి రామచంద్రరావు అభ్యంతరం ఆయనకు వర్తించదు

అడుగుతాడు అనే క్రియారూపంలో ధాతువులో సమీకరణ జరక్క పోవటానికి రామచంద్రరావు ప్రకారం ప్రత్యయంలో ఉన్నది దీర్ఘస్వరం కావటం. సుబ్బారావు ప్రకారం ప్రత్యయస్వరం వ్యంజన పూర్వకం కావటం కారణాలు. వీరిద్దరి ప్రతిపాదనలకు విరుద్ధమైన ప్రయోగాలు తెలుగులో ఉన్నై

కొట్టు> కొడతాడు చెడు> చెడతాడు చేరు> చేరతాడు వెళ్ళు> వెళతాడు అనే రూపాల్లో ధాతువులో చివరి అచ్చు అత్తు కావటానికి తా ప్రత్య యంలోని దీర్ఘాచ్చునే కారణంగా చెప్పాలి చెడు> చెడతాడు అయినట్టుగా పొగుడు+తాడు> పొగడతాడు అని కావటంలేదు (కొన్ని మండలాల్లో కావచ్చు ఈ వ్యాసకర్త వ్యవహారంలో కాలేదు ) ఈ మార్పు రెండక్షరాల ధాతువుల్లోనే జరిగింది వెళ్లు> వెళతాడు అయినట్టుగా మళ్ళు> *మళ్ళతాడు అని గాని *మళతాడు అసిగాని కాలేదు దీన్నిబట్టి రెండక్షరాల ధాతువులో ఆద్విరుక్త వ్యంజనం ఉన్నప్పుడే జరుగుతుందని గ్రహించవచ్చు సమీకరణకంటే ముందు వెళ్ళు కొట్టు వంటి ధాతువుల్లో ద్విరుక్త వ్యంజనం అద్విరుక్త మవుతుంది. మళ్ళు మెట్టు వంటి ధాతువుల్లో ఈ మార్పు జరగదు (రామారావు 1969) రెండక్షరాల ధాతువులైనా ఉపథ వ్యంజనాల అద్విరుక్తాలయినా అగు> *అగ తాడు పాకు> *పాకతాడు అనే రూపాలు కావటంలేదు దీన్ని నిరోధించటానికి 'రెండక్షరాల ధాతువులో ఓష్ఠ్య కంఠ్యేతరాద్విరుక్త వ్యంజన పూర్వకమైన చివరి అచ్చుతా ప్రత్యయం ముందు అత్తు అవుతుందని ని సూత్రించుకోవచ్చు. ఈ సూత్రం పదాల్లో కనిపించని చోటకూడా అత్తును విధిస్తుంది ఉదా చేస్తాడు పేన్తాడు అనే రూపాల్లో అత్తు కనిపించదు అయినా స న ల తరవాత ఈ సూత్రంవల్ల అత్తు వస్తుంది ధాత్వాద్యక్షర స్వర వివృతీకరణకు ఈ అత్తు అవ సరం లేకపోతే సంయుక్త వ్యంజనాన్నతిక్రమించి స్వర నివృతీకరణ జరుగు తుందనాల్సి ఉంటుంది అందుకు ఆధారం కనిపించదు పదంలో పరాచ్చు

అత్తు అయితే పూర్వాచ్చు విపృతమవుతుంది మేకు-మేక అనే పదాన్ని ఉచ్చరించి చూస్తే మొదటి అచ్చులో ఉచ్చారణ భేదాన్ని గమనించవచ్చు పరంలో ఉన్న అత్తు ప్రభావంవల్ల మేక అనే శబ్దంలో ఏ అనే అచ్చు విపృతమయింది. ఇట్లా అన్ని అచ్చులూ విపృతమవుతై ఇట్లా వివృతి కలిగించే సూత్రాన్ని స్వర విపృతీకరణ సూత్ర (vowel lowering rule) అంటారు. ఇది వర్ణాల ఉచ్చారణ భేదానికి సంబంధించిన సమీకరణ దీన్ని గిడుగు రామమూర్తిగారు 1912 ప్రాంతంలోనే గుర్తించారు (రామారావు నరసింహారెడ్డి 1972)

పై చర్చనుబట్టి తా ప్రత్యయం పరిమితమైన సమీకరణకు కలిగించగల దని సుబ్బారావు వ్యంజనపూర్వకత నియమం రామచంద్రరావు స్వర దీర్ఘతా నియమం ఈ సమీకరణను నిరోధించలేకపోతున్నయ్యని తేలుతున్నది

ఇవిగాక అకార సమీకరణ జరిగే చోట్లింకా ఉన్నై. ప్రత్యక్ష విధి పరోక్ష విధిగా మారే సమయంలో ఈ సమీకరణ జరుగుతుంది

తిను + అన్నాడు > తినమన్నాడు
అడుగు + అన్నాడు > అడగమన్నాడు

ప్రత్యక్ష విధిలో అడుగన్నాడు అవుతుంది గాని సమీకరణం జరగదు. పరోక్ష విధిలో మకారాగమం జరిగింది అయితే ఈ మకారాగమానికీ స్వర సమీకరణానికీ సంబంధం ఏమిటి ? ప్రకాశం (1972) గుర్తించినట్టుగా స్వర సమీకరణం పదస్థాయిలోనే జరుగుతుంది కాబట్టి అడుగన్నాడు అనే చోట సమీకరణం జరగలేదు పరోక్ష విధిలో అయినా అన్నాడు వేరేపదం అవుతుంది ఇక్కడ అనుకృతిలో వచ్చే అని అనే రూపం అను ధాతు నిష్పన్న క్రియాపద పరకమైనపుడు లోపిస్తుంది

అడుగు + అని + అన్నాడు > అడగమని అన్నాడు > అడగమన్నాడు
అడుగు + అని + చెప్పాడు > అడగమని చెప్పాడు

సుబ్బారావు ప్రకారం-ఇద్దరూ ధాతువులో స్వరసమీకరణ జరిగింతర వాతే మకారాగమాన్ని ప్రతిపాదించారు వారు ప్రత్యేకంగా పేర్కొనకపోయినా

ఆ తరవాత అని శబ్ద లోపం అను ధాతురూపం ముందు జరుగుతుందని గుర్తించి ఉండాలి అయితే అని లోపం తరవాతకూడ ఈ సమీకరణ అట్లాగే నిలవటం విశేషం వర్ణ సమీకారకమైన ప్రత్యయం లోపించి సమీకృత రూపం నిలిచే చోటు ఇంకోటి కనిపించదు ఈ చిక్కున్ని తొలగించాలంటే ఆగమాన్ని అమ్ అనేవిధంగా ప్రతిపాదించవచ్చు అట్లా చెయ్యటంవల్ల అని శబ్దలోపాన్ని సూత్రాలతో ముడిపెట్టకుండా తప్పించవచ్చు అంటే అని శబ్దలోపం ఎప్పుడు జరిగినా స్వర సమీకరణకు ఆటంకముండదు క్రమసూత్రాలు (ordered rules) క్రమరహిత సూత్రాలు (un-rdered rules) ఒకే రకపు రూపాల్ని సాధిస్తే క్రమరహిత సూత్రాలే ఎక్కువ అభిలషణీయం సూత్రాల క్రమత్వాన్ని ఎక్కువ పొదుపుగా వాడుకోవాలని ఇటీవలి పరిశోధకుల అభిప్రాయం

కాని అమ్ - ఆగమ ప్రతిపాదన నిరాటంకం కాదు పెటిల్లుమని గుభిల్లుమని ఖణేల్మని వంటి ధ్వన్యనుకరణ శబ్దాల్లోఆగమం కేవల మకారంగానే కనిపిస్తుంది ఆగమ శబ్దం అమ్ అంటే ఆది స్వర లోపం వేరే చెప్పాలి అని శబ్దాన్ని వర్ణ సూత్రాల క్రమం నుంచి తొలగించటం అభిలషణీయమైనా అమ్-ఆగమ ప్రతిపాదనలేని పోని చిక్కుల్ని తెచ్చిపెడుతున్నది కాబట్టి నిరాదరణీయం వేరే మార్గం తరవాత సూచించబడుతుంది

సుబ్బారావు (1971) అని శబ్దం సమీకరణ కలిగించలేని కొన్ని అను కృత రూపాల్ని ఉదాహరించారు తెలుసు + అని > తెలుసని అయిందే గాని *తెలసని కాలేదు. దాన్ని నిరోధించటానికి తెలుసును + అని మూల రూపంగా ప్రతిపాదించి స్వరసమీకరణ సూత్రం వర్తించిన తరవాత ను శబ్ద లోపం చేస్తే ను శబ్దం స్వర సమీకరణను నిరోధించి తరువాత తను తొలగిపోతుందని వారి వివరణ ను శబ్దం స్వరసమీకరణను ఎందుకు నిరోధించాలి ? అంటే ను శబ్దానికి అటువంటి నిరోధక శక్తిని అదనంగా ప్రతిపాదించాలన్నమాట ఈ ఉదాహరణలు మకారాగమానికి స్వరసమీకరణానికి ఉన్న సంబంధాన్ని తెలియజేస్తున్నై దీని వల్ల అని కి ఉందనుకుంటున్న సమీకరణ సామర్థ్యాన్ని శంకించాల్సి వస్తున్నది

ప్రకాశం (1972) స్వరసమీకరణం జరిగేవి జరగనివి మరి కొన్ని రూపాలు ఉదాహరించారు కదులమ్మా-కదలవమ్మా-కదులయ్యా కదలవయ్యా అనే విధంగా వకారాగమం రానిరూపాలు వచ్చే రూపాలిచ్చి అమ్మా అయ్యా శబ్దాలు బంధుత్వ బోధకాలయితే వకారాగమం రాదని కేవల సంబుద్ధి బోధకాలయితే వ కారాగమం వస్తుందని చెప్పారు అందుకుపబలకంగా కదులక్కా కదులన్నా అనే వకారాగమం రాని రూపాలను ఉదాహరించారు *కదలవే* అనే చోట వకారాగమానికి ఏ ప్రత్యయం కేవల సంబుద్ధి బోధకం కావడమే ఇట్లా అనేకన్నా స్వరాది సంబుద్ధి బోధక ప్రత్యయాల ముందు వకారాగమం వస్తుందని సూత్రించుకోవచ్చు అంటే బంధుత్వ బోధ ప్రసక్తి అనవసరమన్న మాట స్వరాది అనటం *కదలరా* వంటి రూపాల్లో వకారాగమాన్ని నిరోధించటంకోసం ఇక్కడ గమనించాల్సింది *కదలరా*, *కదలవే* అనే రూపాల్లో ధాతువు అత్సమీకరణను పొందటం *కదలరా*లో దీర్ఘాకారం సమీకరణను కలిగించిందంటే *కదలరోయ్* అనే రూపంలో అట్లాంటి పరిసరం లేదు ఇట్లాంటి రూపాలన్నీ విద్యర్థకంలోనె వస్తున్నై కాబట్టి విధిలో ధాతువు కదల అనే విధంగా మారుతుందని ప్రకాశం నిర్దేశించారు ఇట్లాంటి రూపాల్ని సుబ్బారావు కూడా ఉదాహరించి తిను + అ + వోయ్ అని విడదీశారు ఇక్కడ అ కారాన్ని గుర్తించటం సరైనదే ఈ అకారం ఎక్కడ నుంచి వచ్చిందీ సుబ్బారావు చెప్పలేదు ప్రకాశం పద్ధతిలో ఈ రూపాలు విధి ఏకవచన ప్రత్యయమైన ఉ ని అని సంబుద్ధి ప్రత్యయాల ముందు అ - గా మార్చటం వల్ల వచ్చినై ఇక్కడ కూడా ఆగమాన్ని అవ్ అవి ప్రతిపాదించవచ్చుగాని రా రోయ్ ప్రత్యయాలకు అర్–ఆగమాన్ని సూచించలేం

ఇదాది ప్రత్యయాలైన క్త్వార్థక-ఇ, భూతకాలిక సమాపక ఇన్, భూతకాలిక క్రియాజన్య విశేషణ ఇన అప్యర్థక - ఇనా ప్రత్యయాల ముందు అడుగు> అడిగి అనేవిధంగా మారటంలో స్వరసమీకరణ రుజుమార్గంలోనే ఉంది చేదర్థక–తే ప్రత్యయం భూతేతరకాలిక క్రియాజన్య విశేషణ–ఏ ముందుకూడా *అడిగి* అనేవిధంగా రావటంలోనే చిక్కులున్నై అట్లానే అదాది ప్రత్యయాలైన వ్యతిరేకార్థక–అ తుమున్నర్థక–అన్ భావార్థక–అటం వ్యతిరేక క్త్వార్థక–అక ప్రత్యయాల ముందు అడగ– అనేవిధంగా సమీకరణ రావటంలో బాధలేదు కాని పరోక్ష విధిలో వచ్చే వకారాగమం ముందు సంబుద్ధిలో వచ్చే వకారాగమం

ముందు రా రోయ్ ప్రత్యయాల ముందు నిషేధార్థంలో వచ్చే కు ముందు అత్యమీకరణ రూపాలు రావటంలోనే చిక్కులున్నై పరిమితంగానైనా తా ప్రత్యయం ముందు అదంత రూపం రావటం చిక్కే

చాలా రూపాల్లో ధాతువుకు వచ్చే హ్రస్వ స్వరాది ప్రత్యయాలే సమీకరణను కలిగించటం పై ఉదాహరణల్లో గమనించవచ్చు అంటే సుబ్బారావు 97 రామచంద్రరావు 974 ల సూచనలు రెండూ అభిలషణీయాలే అట్లా లేని చోట సమీకరణను వ్యాకరించటం ఎట్లా అనేదే సమస్య

అందుకు ఈ వ్యాసకర్త సూచించే పద్ధతి ఇది

తెలుగు ధాతువుల చివరి అచ్చును ధాత్వంగంగానే పరిగణిస్తే ధాతువును విస్తరింప జెయ్యటానికి ధాతు స్వరూపాన్ని ప్రయోగించటమే కాక ఇ అ అనే అచ్చులను చేర్చే పద్ధతి ఒకటి ఉంది వీటిని క్రమంగా ఇద్విస్తరణ అద్విస్తరణ అని వ్యవహరిద్దాం *కడిగిపెట్టు కడిగివేయు రాలిపోవు* అనే క్రియలో మొదటి ధాతువుకు ఇ ప్రత్యయం చేరింది ఇది క్త్వార్థక ప్రత్యయం కాదు క్త్వార్థక క్రియ భిన్న వ్యాపారా లున్నప్పుడే వస్తుంది ఇక్కడి ఇత్తు ధాతు విస్తారక ప్రత్యయం అట్లాగే *అరగదీయు అరవేయు కనపడు చెడగొట్టు చేరదీయు తిరగబడు* వంటి ధాతు క్రియలో మొదటి ధాతువులో అత్తు తుమున్నంతం కాదు ధాతు విస్తారక ప్రత్యయం ఈ పద్ధతినే అనుసరించి ఇద్విస్తారిత ధాతువుల మీద తే ఏ ప్రత్యయాలు చేరినయ్యని అద్విస్తారిత ధాతువుల మీద కు వద్దు రా రోయ్ వంటి ప్రత్యయాలు మకార వకారాగమాలు చేరినయ్యని చెప్పుకోవచ్చు అప్పుడు ధాతువులకు చేరే ప్రత్యయాలను మూడు విభాగాలు చెయ్యవచ్చు విస్తరణ నిరపేక్షకాలు హ్రస్వస్వరాది ప్రత్యయాలన్నీ ఈ వర్గంలోనే చేరతై అడుగుతే అని వ్యవహరించే భాషలో తే ఈ వర్గంలోనే చేరుతుంది 2 ఇద్విస్తరణాపేక్షకాలు చాలా మంది భాషలో తే క్రియాజన్య విశేషణ ప్రత్యయమైన-ఏ ఈ వర్గంలో చేరతై 3 అద్విస్తరణాపేక్షకాలు ఆగమ మకార వకారాలు సంబుద్ధి రా రోయ్ ప్రత్యయాలు నిషేధార్థకమైన కు మొదలైన వీ వర్గంలో చేరతై ధాతు విస్తరణ em ler ar on రో అవసరమైన ప్రక్రియనే పద నిష్పాదన em n ex on లో కూడా వాడుకోటం వల్ల ప్రక్రియ

ధిక్యం కూడా లేదు ఈ పద్ధతివల్ల తెలుగు స్వర సమీకరణ సులువు అవుతుంది ఇంకా పరిశీలించలేదుగాని క్రియా నిష్పాదనకూడా తేలికౌవుతుంది వ్యాకరణంలో ఈ ప్రత్యయాలను కూడా చేర్చాలి ఉదాహరణ ప్రాయంగా ఈ కింది వాటిని గమనించవచ్చు

తే [చేదర్థ కం ఇద్వి స్తరణాపేక్షకం]
2 ఏ [క్రియాజన్య విశేషణం ఇద్వి స్తరణాపేక్షకం]
3 తా [భూతేతర కాలికం
4 దా [ఉభయ ప్రార్థనం]
5 మ్ [పరోక్ష విధ ను కారకం ధ్వన్యనుకరణాను కారకం అద్వి స్తరణాపేక్షకం]
6 వ్ [స్వరాది సంబుద్ధి బోధక ప్రత్యయ పరకం అద్వి స్తరణాపేక్షకం]
7 కు [వ్యతిరేక విధి అద్వి స్తరణాపేక్షకం]
8 రా [సంబుద్ధి అద్వి స్తరణాపేక్షకం పదపూర్వకంగా ఆదరణార్ధకం]
9 రోయ్ [సంబుద్ధి అద్వి స్తరణాపేక్షకం పరపూర్వకంగా ఆశ్చరా కర్థం]
0 లు [నామబహువచనం సమీకరణ సమర్థకం]

పై ఉదాహరణ ప్రాయమైన పట్టికలో తా దా లకు వి స్తరణాపేక్షను విధించలేదు చెడు చేరు ఆడు పాడు వంటి ధాతువులో మాత్రమే ఉ>అ అవుతున్నది గనుక పరిమిత సమీకరణాన్ని అద్వి స్తరణ లేకుండా సాధించవచ్చు లేకపోతే పరిమిత అద్వి స్తరణాపేక్షకత్వాన్ని ప్రత యానికే విధించవచ్చు ఆ పక్షంలో తా దా లకు విధించే అద్వి స్తరణాపేక్షకత్వానికి ధాతువులో అక్షర సంఖ్య రెండో వ్యంజనం లక్షణాలను పరిసరంగా విధించవచ్చు అప్పుడా పరిసరాన్ని ఈ విధంగా రాయవచ్చు

C V { +వ్యంజనం V+— ; −ఓష్ఠ్యం ; −కంఠ్యం }

C అంటే వ్యంజనం V అంటే అచ్చు ధాతువులను హలంతంగా గ్రహిస్తే రెండో V ని పరిసరంనుంచి తొలగించవచ్చు పైన సూచించిన రెండు పద్ధతుల్లో ఏది గ్రహించినా సమీకరణంగానే అర్థం చేసుకోవచ్చు

విస్తరణ ప్రక్రియ ధాతువుకే జరుగుందని గమనించాలి పూర్ణ క్రియా రూపానికి జరగదు తెలుసురా అనేచోట విస్తరణ జరక్కపోవటానికి తెలుసు అనేది ఇక్కడ పూర్ణ క్రియారూపం అవిస్వర సమీకరణ సమర్థం కాకపోవటం వల్ల తెలుసు సంపూర్ణ క్రియారూపం కావటంవల్ల *తెలసని *తెలసనని అనే రూపాలేర్పడవు

ఇప్పటికే విస్తారమైన ఈ చర్చను ఇంతటిలో ముగిస్తూ ప్రధాన విషయాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు

1. ప్రాచీనాధునిక భాషల్లో ప్రత్యయాల్లో జరిగే సమీకరణను ప్రకృతుల సమీకరణనుంచి వేరు చెయ్యాలి ప్రత్యయాల్లో ఉ>ఇ అనే మార్పు సర్వత్రా ఉంది

2. ప్రాచీన భాషలో నామాల్లో ఇ>ఉ అనే మార్పు క్రియల్లో ఉ>ఇ అనే మార్పు సంఖ్యావాచకాల్లో రెండు మార్పులూ ఉన్నై ఆధునిక క్రియేతర శబ్దాల్లో మార్పులు ప్రాచీన భాషలో మార్పులతో దాదాపు సమానం క్రియల్లో మాత్రం ఉ>అ అనే మార్పు అదనంగా వచ్చింది ఆధునిక వ్యవహారంలో మిగిలిన అన్ ఇన్మధ్య ధాతువులు ఉన్మధ్యాలుగా మారినై ఇత్సమీకరణలో కొత్త పరిసరాలు చేరినై

3. ఆధునిక భాషాక్రియల్లో ధాతువుకు హ్రస్వ స్వరాది ప్రత్యయాలే స్వర సమీకరణను కలిగించేవిగా గుర్తించటం అభిలషణీయం

4. పై నిర్ణయంవల్ల ప్రత్యయాలను అద్విస్తరణ ఇద్విస్తరణ నిర్విస్తరణ— అపేక్షకాలుగా విభాగించి గుర్తించాలి ధాతువులను హలంతంగా గ్రహిస్తే ఉద్విస్తరణాపేక్ష కూడ అవసరం

5. విస్తరణ సామర్థ్యంలేని ప్రత్యయాలు స్వరసమీకరణను కలిగించలేవు ఇందుకు అండి ప్రత్యయం బాధకంగా ఉంది

6. స్వరసమీకరణం ఏకపద తుల్యరూపాల్లోనే జరుగుతుంది

భారతి 1975 సెప్టెంబరు అక్టోబరు

# తెలుగులో (భాషా) శాస్త్ర పరిభాష
## [లక్షణాలు వాదాలు మార్గాలు వ్యూహాలు]

### 1 పుట్టు పూర్వోత్తరాలు

పరిభాష అనేది నాగరక సమాజ భాషా వ్యవహార లక్షణంగా కనిపిస్తుంది అయితే దీన్ని కేవలం నాగరక సమాజానికే పరిమితమైందిగా అనుకోకూడదు పని విభజన వృత్తి విభజన ఉన్న ఇవి లేని సమాజాలు ఇంకా ఉన్నాయనుకోను సమాజాలు అన్నింటిలోను వ వహరించే భాషలో పరిభాష కనిపిస్తుంది అంటే పని విభజన వల్ల ఏర్పడిన సమాజాలు వ్యవహరించే భాషలకు ఇది సహజ లక్షణంగా మనం గ్రహించవచ్చు ఆదిమ సమాజాలలో భూత వైదులు మొదలైన వాళ్ళ వ్యవహారానికి మాత్రమే పరిమితమైన భాష ఉండటం శాస్త్ర పరిశోధకులకు అనుభూతమే మనకు పరిచితమైన సమాజ లో పరిశీలించినా వివిధ వృత్తుల వారికి మాత్రమే పరిమితమైన పదజాలం ఉండటం మన మెరిగిందే వృత్తి పదకోశాలు ఈ విషయంలో గ్రంథస్థమైన ఆధారాన్ని అందిస్తున్నాయి

సమాజంలో సభ్యుల సంఖ్యాభివృద్ధి జీవన విధానాల స్థాయి పెరుగుదల ఉత్పత్తి పరికరాల సాంకేతికాభివృద్ధి వాటితో బాటు కాలం గడచిన కొద్దీ మానవ విజ్ఞాన శాఖల అభివృద్ధి పరిభాష అవసరాన్ని ఎక్కువ చేస్తాయి సమాజంలో స కీర్ణత ఎక్కువ అవుతున్నకొద్దీ పరిభాష అవసరం కూడా పెరుగుతు దని తాత్పర్యం

2 ఈ విషయాన్ని మరికొంచెం వివరిస్తాను మానవేతర జంతుజాలం తమ తర్వాత తరానికి అందించే విజ్ఞానం పరిమితం ఆ తరంలో గ్రహించిన విజ్ఞానమే తమ తర్వాత తరానికి ప్రత్యక్ష బోధద్వారా అందిస్తాయి మానవ సమాజానికి రెండు రకాల సౌకర్యాలు ఉన్నాయి తన పూర్వ తరాల విజ్ఞానానికి తన తరపు విజ్ఞానాన్ని కలిపి తరువాత తరానికి అందించటం

2 ప్రత్యక్ష బోధ ద్వారాగానేగాక పరోక్ష బోధ ద్వారా కూడా తరువాత తరానికి శిక్షణ ఇవ్వటం ఈ రెండూ భాషవల్లే సాధ్యమైనాయి

3 లిపి ఏర్పడిన భాషలకు కేవల ముఖస్థ భాషలకన్నా ప్రత్యేక మైన సౌకర్యముంది మౌఖిక భాషలు తర్వాత తరానికి అందించే విజ్ఞానం మనిషి జ్ఞాపక శక్తికి పరిమితమై ఉంటుంది ఈ పరిమితిని దాటాలంటే భాష కున్న తాత్కాలిక స్థితిని లేక త్వరనాశాన్ని rapid fade ou అధిగ మించాలి అంటే మానవుల జ్ఞాపక శక్తిని అధిగమించి మానవ విజ్ఞానాన్ని తత్కాల స్థితి కన్నా విస్తృతం చేయాల్సిన అవసరం వుంది సరిగ్గా లిపి ఆ పని చేయగలిగింది సంకీర్ణ సమాజావసరాలకు తట్టుకోగల స్థితి భాషకు లిఖిత స్థితి వచ్చిన తర్వాతే సాధ మైంది సంకీర్ణ మానవ సమాజ పురోగతికి లిఖితస్థమైన భాష అవసరాన్ని చెప్పటమే ఇక్కడ ఉద్దేశం

4 విజ్ఞాన శాస్త్రాల సంఖ్య విజ్ఞాన పరిమితి పెరిగిన కొద్దీ ఒకే వ్యక్తికి వివిధ శాస్త్రాలలో పాండిత్యం ఆ మాటకు వస్తే పరిచయం కూడా సంపాదించటం తేలిక కాదు సుమారుగా పందొమ్మిదవ శతాబ్దం వరకు ఒక వ్యక్తి వివిధ శాస్త్ర పరిశీలన సాధ్యమైంది కార్ల్‌మార్క్స్ ఫెడరిక్ ఏంజిల్స్ వంటి బహుముఖ ప్రజ్ఞాశాలురు ఇప్పటి విజ్ఞాన ప్రపంచంలో తయారుకాగల గటం కష్టం

సంకీర్ణత ఈనాటి సమాజ లక్షణం అత్యంత వైవిధ్యం ఈనాటి భాషా లక్షణం ఈ రెండింటిని ఆధారం చేసుకొని పరిభాష పెరుగుదల నిర్ణయ మవుతుంది

5 చలనశీలత మానవ సమాజానికి ఇంకొక లక్షణం అతి ప్రాచీన కాలం నుంచీ భిన్న ప్రాంతాలలో పెరిగిన సమాజాలు ఒకదానితో ఒకటి సంబంధబాంధవ్యాలను పెంచుకోవటం విశేషంగా ఋజువు చెయ్యాల్సిన విషయం కాదు వివిధ సమాజాలు ఒకదానితో ఒకటి పరిచయమైనప్పుడు ఒక సంస్కృతి ఇంకొక సంస్కృతి నుంచి రకరకాల విషయాలను గ్రహిస్తుంది ఆ సమాజాల భాషలు వేరైనప్పుడు ఆయా విషయాలను ఒక భాష నుంచి

ఇంకొక భాష గ్రహించాల్సి ఉంటుంది ఈ గ్రహించే పద్ధతుల్ని భాషా శాస్త్ర పరిశోధకులు కొన్ని రకాలుగా విభజించారు Lo n అప్పు తెచ్చుకొన్న మాటలు Loan trans at on ముక్కస్య ముక్క అనువాద పద్ధతి Loan blend ఆ భాష నుంచి ఒక ముక్క ఈ భాష నుంచి ఒక ముక్క కలిపి సంకర పదజాలాన్ని సృష్టించటం

6 ఈ నాటి ప్రపంచంలో కొన్ని చారిత్రక కారణాల వల్ల కొన్ని దేశాలు మరికొన్ని దేశాలకన్నా సాంకేతికంగా అభివృద్ధి చెంది ఉన్నాయి వెనుక బడిన దేశాలు అభివృద్ధి చెందిన దేశాల నుంచి సాంకేతిక విజ్ఞానాన్ని గ్రహించక తప్పటం లేదు ఒక జాతి ఇంకొక జాతి నుంచి విజ్ఞానాన్ని గ్రహించి తమ భాషలోకి అనువదించుకోవటం సర్వత్రా జరిగే పనే ప్రపంచంలో ఎక్కువ దేశాల్లో ఇంగ్లీషు మాట్లాడేవాళ్లుగాని ఉన్నత విద్యాభ్యాసానికి ఇంగ్లీషును కొంత వరకుగాని పూర్తిగాగాని ఉపయోగించేవాళ్ళు ఉన్నారు అందువల్ల ఆధునిక విజ్ఞానంలో అధిక భాగం ఇంగ్లీషు భాష ద్వారా అన్ని దేశాలకు ప్రసారమౌతున్నది ఇంగ్లీషులో ఉపయోగించే వివిధ శాస్త్రాల పరిభాష మిగతా యూరోపియన్ భాషల్లో ఎక్కువ మార్పులు లేకుండా వాడుకోవటం వల్ల ఈ పరిభాష అంతర్జాతీయ పరిభాషగా చెలామణి అవుతున్నది ఇంగ్లీషులో ఉపయోగించే పరిభాష అయినా పూర్తిగా ఇంగ్లీషు సొంతం కాదు ఎక్కువ భాగం గ్రీక్ లాటిన్ భాషల మూలరూపాల నుంచీ కొద్దిగా జర్మన్ ఫ్రెంచి భాషల నుంచీ గ్రహించినది కావటం వల్ల ఈ పరిభాష యూరోపియన్ భాషలలో బాగా కలిసిపోగలిగింది అంతర్జాతీయ పరిభాషగా వ్యవహరింపబడుతున్నది నిజానికి యూరోపియన్ భాషా పరిభాష మాత్రమే ఆ భాషలన్నీ సాజాత్య సాహిత్యమున్న భాషలు గనక ఒకే పరిభాషను అవి ఉపయోగించుకోగలిగినై ఆసియా దేశాలకు ఈ పద్ధతి అంతగా సరిపడదు

## 2 0 పరిభాషా లక్షణాలు

పరిభాష అనే పదాన్ని ఇంత వరకు నిర్వచించుకోకుండానే వాడుతూ వచ్చాము దేన్ని అయినా అతివ్యాప్తి అవ్యాప్తి లేకుండా నిర్వచించడం కష్టం ఆమాటకు వస్తే భాషకుగాని సాహిత్యానికిగాని అటువంటి నిర్వచనం ఇంతవరకు

సాధ్యం కాలేదు అందువల్ల పరిభాషకు ఉన్న లేక మనం ఉండాలనుకొంటున్న కొన్ని లక్షణాలను గురించి ప్రస్తావిస్తాను

2 భావక్లుప్తి కొన్ని వాక్యాల విస్తృతిని అపేక్షించే భావాన్ని ఒక మాటలో చెప్పగలగటం క్లుప్తత ఒక శాస్త్రంలో ఒక భావం పదేపదే ప్రస్తావనకు వచ్చినపుడు ఆ భావాన్ని కొన్ని వాక్యాలద్వారా చెప్పటం వల్ల విషయగ్రహణ విషయబోధ క్లిష్టతరం అవుతాయి అందువల్ల చెప్పదలచిన భావాన్ని సంక్షేపంగా చెప్పవలసిన అవసరం చాలా వుంది వాక్య పునరుక్తి కంటే పద పునరుక్తి మేలు ఉదాహరణకు వ్యాకరణంలో ఏదైనా ఒకమాట తీసుకుందాం కరణకారకం అనేమాట బోధించే అర్థాన్ని వాక్యంలో చెప్పితే కర్త నిర్వహించే వ్యాపారానికి ప్రకృష్టోపకారకమైన ఉపకరణాన్ని బోధిస్తూ కర్తృ పదాన్ని క్రియతో అన్వయింపజేసే వ్యాకరణ ప్రక్రియ అని చెప్పాల్సి ఉంటుంది ఇంత వాక్యాన్ని పదేపదే వాడితే చెప్పదలచిన ఇంకో భావం నుంచి ఈ వాక్యం పఠిత దృష్టిని మళ్ళించి విషయ గ్రహణ శక్తిని కుంచింప జేస్తుంది క్లుప్తత అనేది కేవలం అందం కోసమే కాదు విషయ గ్రహణ సరిగ్గా జరగ టానికి కూడా అవసరం

2 2 భావ వ్యక్తీకరణ సామర్థ్యం పరిభాషగా వాడే మాటకు భావా న్ని సమగ్రంగా వ్యక్తీకరించే సామర్థ్యం ఉండాలి ఒక పదానికిగాని పద సముదా యానికి భిన్నార్థాలు సాధ్యమైతే ఆ అర్థాల్లో ప్రధానమయిందే పరిభాష బోధిం చాలి ఇటీవల భారతిలో 1974 మార్చి పే 33-35 అచ్చయిన మరో లా ఉందా అనే వ్యాసంలో ఆమె నిన్నుకొట్టేలావుంది ఆమె చందనపు బొమ్మలా వుంది అనే వాక్యాల్లాంటి వాకాల్లో లా అనే శబ్ద ప్రయోగంలో అర్థ వైవిధ్యాన్ని గురించి రచయిత చక్కని చర్చ చేశాడు అయితే ఆయన ఉపయోగిం చిన పరిభాషమాత్రం ఇబ్బంది పెట్టింది ఏకరూపత అన్న అర్థంలో సారూప్యత అన్న పదం ప్రయోగించాడు సారూపత అంటే తుల్యరూపత అనే అర్థం వస్తుంది ఏకరూపత తుల్యరూపత ఒకటి కావు co vent on అనే మాటకు అనుసరణం అని comp e en e అనే మాటకు దళార్థకం అనీ ఆ రచయిత ఉపయోగించాడు ఆ మాటలకు రచయిత ఉద్దేశించిన అర్థాలను బోధించే శక్తి లేదు

2 3 శబ్దలఘుత్వం ఒక భావానికి రెండు మాటలు సాధ్యమైతే అందులో పొట్టి మాటలనే ఎన్నుకోవటం మంచిది ఉదాహరణానికి బాల వ్యాకరణం ధాతుజ విశేషణం అన్నదాన్ని ప్రౌఢ వ్యాకరణం క్రియాజన్య విశేషణం అన్నది పెద్దమాట గుర్తు పెట్టుకోవటంకన్న చిన్నమాట గుర్తు పెట్టుకోవటం తేలిక అన్నది నిర్వివాదం

పూర్వం నేనొక వ్యాసంలో దీర్ఘైక స్వరాంత ధాత్వాదేశరూపాలు అని ఒక మాట వాడాను రా పో తే కా వంటి క్రియా రూపాలను సంక్షేపించటం అక్కడ నా ఉద్దేశం కానీ ఈ మాటకన్నా ఆ ఉన్న నాలుగు క్రియా రూపాలను రాసుకోవటమే తేలిక

2 4 అధిక రూప నిష్పాదన సౌకర్యం ఒక భావ నిరూపణకు ఎన్నుకున్న మా నుంచి సరూపమైన భిన్న పదాలను నిష్పన్నం చేయటానికి వీలుండేట్లుగా పరిభాష ఎన్నుకోవాలి ఒక వాక్యంలో నామపద స్థానంలో మరొక వాక్యం చేరే విధానాన్ని నామ్నీకరణం అని వ్యవహరిస్తున్నాను ఇందులో నామ్నీకృ అనేది ధాతువు దీని నుంచి నామ్నీకరణం నామ్నీకృత నామ్నీకారకం నామ్నీకరించు అనే రూపాల నిష్పన్నమౌతాయి అట్లాగే అనుకృతి నుంచి అనుకరణం అనుకర్త అనుకారకం నిష్పన్నమౌతాయి

2 5 పదసామ్యం లేక జంటతనం ఒకోసారి కొన్ని భావాలు ఒకదాని వెంటనంటి ఇంకోటి జంటగా ఉంటాయి అంటే ఒక భావం యొక్క అస్తిత్వం ఇంకో భావం ఉనికి మీద ఆధారపడి ఉంటుంది ఈ భావాలకున్న సంబంధం వ్యతిరేకత కావచ్చు జన్యత కావచ్చు లేక కేవలం సహచరిత (a oc a on కావచ్చు ఇట్లాంటి భావాల్ని సూచించే మాటల మధ్య కొంత రూపసామ్యం ఉంటే ఆ మాటలను గుర్తుపెట్టుకోవటం తేలిక

పరివర్తన వ్యాకరణంలో ఒక వాక్యంలోని ఒక నిర్దిష్ట స్థానంలో మరొక వాక్యాన్ని చొప్పించటాన్ని emb dd r g అంటారు చేర్చిన వాక్యాన్ని con ue n enc అని అంతకు ముందున్న వాక్యాన్ని ma x en ence అనీ అంటారు ఈ మాటలకు క్రమంగా గర్భికరణ గర్భవాక్యం

గర్భివాక్యం అని తెలగుకో వాడుతున్నాను గర్భ గర్భి వాక్యాలు అతి సన్ని హితమైన భావాలు ఇట్లా-టి భావాలను జంట భావాలనుకుంటే ఈ మాటలు జంట మాటలు అనవచ్చు జంటగా వచ్చే భావాలక జంట మాటలను గుర్తుపెట్టు కోవటం తేలిక ఈ పద్ధతిలోనే తన భాషను గురించి స్వభాషా వ్యవహర్తకున్న అవ్యక్త పరిజ్ఞానాన్ని ప్రతిభ (competence) అనీ అతని భాషాప్రయో గాన్ని ప్రవృత్తి peaforamance అనీ వ్యవహరించాను అలాగే deep structure కి గుప్తనిర్మాణమనీ surface s ructure కి వ్యక్తనిర్మా మని జంటగా వ్యవహరించటం కూడా ఇందుకే ఈ ఉదహరించినవే కాక వ్యాకరణ సూత్ర రచనా పద్ధతుల్లో tem and arrangement అనీ tem and proces అనీ రెండు పద్ధతులున్నాయి వీటిని క్రమంగా స్థితి సూత్రపద్ధతి గతి సూత్ర పద్ధతి అని వాడుతున్నాన ఈ ఉదాహరించిన జంట మాటలలో శబ్దరూపసామ్యం కొన్ని చోట్ల అక్షర పరిమాణ సఘత్వం గమనించ దగింది

2 6 అతీత వ్యవహార శక్తి పరిభాషగా ఎంచుకొనే మాటలు సాధ్య మైనంతవరకు నిత్యజీవిత వ్యవహారంలో ఉపయోగించేవి కాకుండా ఉంటే మంచిది మామూలు వ్యవహారంలో మాటల అర్థాలకు విస్తరణ శక్తి ఎక్కువ ఒక మాటను రకరకాల అర్థాల్లో వాడుతూ భిన్నార్థచ్ఛాయలను ఆపాదిస్తుం టాము మాట అనే మాటకు ఉన్న అర్థచ్ఛాయలను జి ఎన్ రెడ్డిగారు ఒకచోట చూపించారు ఇట్లాటి మాటలకు పరిభాషగా వుండే అర్హత తక్కువ బాల వ్యాకరణంలో ఉపయోగం అనే మాట అట్లాంటిదే అనుకుంటాను ఈ కారణం వల్లనే ఇంగ్లీషు భాష గ్రీక్ లాటిన్ భాషలనుంచి తెలుగు భాష సంస్కృతం నుంచి పరిభాషను కల్పించుకుంటున్నాయి

2 7 మాన్యత ఏకార్థ బోధకాలైనా కొన్ని మాటలకన్నా మరి కొన్ని మాటలకు ఎక్కువ గౌరవముంటుంది ఉదాహరణకు యోని వక్షోజం వంటి మాటలకు సమానార్థకాలైన తెలుగు మాటలను తెలుగు వ్యవహర్తలు సభ్యోక్తులుగా పాటించటం లేదు అట్లాగే గుప్త వ్యక్త నిర్మాణము అనే మాటల కున్న గౌరవం లోపలి వెలుపలి నిర్మాణాలు అనే మాటలకు ఉండదు ఇముడ్చు కునే వాక్యం ఇమిడే వాక్యం అనే మాటలకన్నా గర్భి గర్భ వాక్యాలంటేనే గౌరవం

కొంతమంది దేశ భాషాభిమానులకు ఇది అంత రుచించకపోయినా తెలుగు వ్యవహర్తలలో ఈ భేదభావం ఉంది కనుక దీన్ని మనం గుర్తించక తప్పదు

ఆరు ఏడు లక్షణాలు కొన్ని చోట్ల కలిసి ఉండటం కనిపిస్తుంది అంటే సామాన్య వ్యవహారాతీతంగా ప్రత్యేకంగా ప్రయుక్తమయే మాటలకు మానత గూడా ఉండటంవల్ల ఈ రెండు లక్షణాలు కలివిడిగా ఉంటాయి అయినా వీటిని వేరు లక్షణాలుగా గుర్తించటం అవసరమనుకుంటాను

2 8 భేదకత పారిభాషిక పదాలు మామూలు వ్యవహారం నుంచి భిన్నంగా వుండాలని అతీత వ్యవహారశక్తి అనే ఆరో లక్షణంలో చెప్పుకున్నా అందుకు కారణం సాధారణ వ్యవహారం ద్రవ స్థితిలో ఉంటుందని పరిభాషకు ఘన స్థితి అవసరమని వేరే మాటల్లో చెప్పుకున్నాం

ఈ క్షణంలో చెప్పదలచుకున్న భేదకత పైదానికన్నా భిన్నమైనది సన్నిహిత్ల సంబంధమున్న శాస్త్రాలలో భిన్న భావాలకు భిన్న పరిభాష వాడటం ఉచితం ఒకేపదం భిన్నార్థాలతో ఒకే శాస్త్రంలోకాని దగ్గరవైన భిన్న శాస్త్రాల్లో కాని వాడటంవల్ల స్పష్టత నష్ట అవుతుంది ఉదాహరణకు comp teence అనే మాటకు సమానార్థకంగా నేను వాడిన ప్రతిభకు ఆ ప్రమాదం వుంది సాహిత్య శాస్త్రంలో ప్రతిభ కు జన్మత వచ్చే శక్తి అనె అర్థం వుంది భాషా శాస్త్రంలో ప్రతిభ వ వహర్త స్వయంగా అలవర్చుకొన్నది సాధ మైతే ఇట్లాంటి చోట వేరే మాటల్ని వాడుకోవటం మంచిది

తెలుగులో భాషా శాస్త్రం మీద ఆసక్తి ఉన్నవారికి సాహిత శాస్త్రంలో కూడా పరిచయం ఉండటంవల్ల ఈ రెండు శాస్త్రాల విషయంలో మరింత జాగ్రత్త అవసరం

ఈ పై చెప్పిన ఎనిమిది లక్షణాలు మాత్రమే పరిభాషను సంపూర్ణంగా నిర్వచించగలవని నా ఉద్దేశం కాదు మరికొన్ని నిర్దేశక లక్షణాలను ఊహించటం సాధ్యమే ఈ పై చెప్పిన లక్షణాలలో కొన్నిటిని ఒకటిగా కలిపేయటం కూడా సాధ్యం కావచ్చు ఈ లక్షణాలలో కొన్నిటిని ఇంతకన్నా నిశితంగా

చెప్పాల్సిన అవసరాన్ని నేనే గుర్తించాను అయితే పరిభాషకు నిర్వచనం ఇటు వంటి లక్షణ పరిగణన ద్వారా సాగాలని మాత్రం నా నమ్మకం

ఈ లక్షణాలన్నీ ఉన్న పరిభాష ఏర్పడటం లక్షణాలు చెప్పినంత సులభం కాదు ఈ పైన చెప్పనిది అన్నిటికన్నా ముఖ్యమైనది ఒక లక్షణం ఉంది అదే సమాజ సమ్మతి ఎంత నిర్దిష్టమైన పరిభాషైనా ఆ శాస్త్రంతో సంబంధం ఉన్న వర్గం సమ్మతించకపోతే ఆ పరిభాషకు శాస్త్రంలో స్థానం ఉండదు

ఈ పైన చర్చించిన లక్షణాలను సాధించటంలో చాల సాధక బాధ కాలున్నై ఈ లక్షణాలు ఆయా భాషల శక్తి సామర్థ్యాల ననుసరించి కూడా ఉంటాయి ఉదాహరణకు అధిక రూప నిష్పాదన సామర్థ్యం అన్న లక్షణం ఒక్కో భాషకున్న శబ్దోత్పత్తి ప్రక్రియ der vat on) మీద ఆధారపడి ఉంది ఒకే ధాతువు నుంచి క్రమబద్ధంగా వివిధ నామ క్రియా విశేషణాలను నిష్పన్నం చెయ్యగలిగిన శక్తి సంస్కృతానికున్నంతగా తెలుగుకు లేదు బహుశా గ్రీక్ లాటిన్ భాషలకు కూడా ఇట్లాంటి శక్తి ఉందనుకుంటాను కారణాలు ఏమన్నా కానీ ద్రావిడ భాషలకీ శక్తి ఉన్నట్లు నాకనిపించటంలేదు కొంతవరకు భాషల శబ్ద లఘుత్వం కూడ ఈ అధిక రూప నిష్పాదన శక్తి మీదనే ఆధారపడివుంది భావక్లుప్తికికూడా సంస్కృతంలో సమాస రచన ఉప యోగిస్తుంది చివర చర్చించిన అతీత వ్యవహారశక్తి మాన్యత అనే లక్షణాలు కూడా సంస్కృత భాషా శబ్దాలకే బాగా అన్వయిస్తాయి ఇందుకు కొన్ని శతా బ్దాలుగా ఈ దేశంలో సంస్కృత భాషకున్న చారిత్రక విద్యా సాంస్కృతిక గౌరవం అతి ప్రాచీనకాలం నుంచీ సంస్కృతాన్ని విద్యాప్రయోజనాల కుప యోగించటంవల్ల ఈ సౌకర్యాలు ఆ భాషలో ఏర్పడి ఉండొచ్చు సహజంగానే ఉన్న లక్షణాలకు సామాజిక చారిత్రక కారణాలు తోడవటంవల్ల సంస్కృతంలో కొన్ని ప్రక్రియలు అభివృద్ధి చెంది ఉంటాయని భావించటంలో అసామం జస్యం లేదు

ఈ పైన చర్చించిన పరిభాషా లక్షణాల్లో అధికభాగం సంస్కృత శబ్దా లకు సరిపోతున్నప్పుడు ఆ పదాలనే గ్రహించటం వల్ల వచ్చిన నష్టం లేదు

3 0 వాదాలు తెలుగులో పరిభాషని నిర్మించుకోవటం విషయంలో కొన్ని రకాల అభిప్రాయ భేదాలు కనిపిస్తున్నై వాటిని ఈ కిందివిధంగా కొన్ని వాదాలుగా విభజిస్తే పరిశీలన తేలికవుతుంది

3 మణి ప్రవాళ వాదం లేక అంతర్జాతీయవాదం అంతర్జాతీయంగా అమలులోవున్న పరిభాషను అట్లాగె వివిధ భారతీయ భాషలకు వాడుకోమని ఈ వాదం చెబుతుంది ఏ శాస్త్రంలో అయినా లోతుకు వెళ దలచిన వాళ్ళు ఎప్పటికైనా అంతర్జాతీయ పరిభాషను నేర్చుకోక తప్పదు ఆ నేర్చుకునేదేదో మొదటే నేర్చుకుంటే అనువాదం చేసే శ్రమ తప్పుతుంది ఒకే భాషను రెండుసార్లు రెండు భాషల్లో నేర్చుకునే అవస్థా వుండదు ఆ గ్లభాష గట్టిగా చదువుకున్న వాళ్ళలో ఈ అభిప్రాయం బలంగా వుంది ఇది చాలా అభ్యుదయకరమైన భావంగా కనుపిస్తుంది

అయితే అంతర్జాతీయ పరిభాష ఉచ్చారణ స్పెల్లింగ్ నేర్చుకోవటంతో శ్రమ వుంది తెలుగు లిపిలోకి మార్చినా ఉచ్చారణ కష్టమే అవుతుంది ఆ పదాల కూర్పులోని అన్ని ధ్వనులను తెలుగు లిపిలో రాయలేం అలవాటైన ధ్వనులు కూడా అలవాటైన క్రమంలో వుండకపోవటంవల్ల పదాలను గుర్తుపెట్టుకోవటం కష్టం

ఇంగ్లీషు తెలుగుల మణి ప్రవాళశైలి వాగ్వ్యవహారంలో ఉన్నంతగా లిఖిత సంప్రదాయంలో లేదు అందువల్ల రకరకాల ఇతర భాషా పద బంధాలను తెలుగు రచన అధికంగా భరించలేదు పారిభాషిక పదాలు విశేషణాలు క్రియలూ ఉండొచ్చు వీటన్నిటికి అంతర్జాతీయ పదాలే ఉపయోగిస్తే రచన పేరుకు మాత్రమే తెలుగు అవుతుంది

తెలుగులో మౌలికమైన పరిశోధన కూడా జరగొచ్చని మణి ప్రవాళవాదం ఊహించదు అప్పుడైనా తెలుగులో స్వతంత్రంగా పద నిర్మాణం జరగాలి అందువలన తెలుగులో పరిభాషా నిర్మాణాన్ని గురించి ఆలోచించాల్సిందే ఇతర శాస్త్రాల మాట ఎట్లాఉన్నా భాషాశాస్త్రంలో మాత్రం తెలుగులో మౌలికమైన పరిశోధన జరుగుతున్నది చూ 5

అంతర్జాతీయ పదజాలం నిజానికి యూరోపియన్ భాషలకే పరిమితం రష్యన్ జాపనీస్ చైనీస్ భాషల్లో మౌళిక పరిశోధన జరుగుతున్నది ఆ భాషల్లో పరిభాషా పదాలను తెలుగులోకి మార్చుకోవలసి వస్తుంది

మఱి ప్రవాళ వాదుల్లో తాత్కాలిక మ ప్ర వాదులూ శాశ్వత మ ప్ర వాదులూ అని ఇంకో రెండు భాగాలున్నై ఈ పైన చెప్పింది శాశ్వత మ ప్ర వాదుల్ని గురించి తాత్కాలిక మఱిప్రవాళ వాదులు కొన్నాళ్ళ పాటు అనువాదం చెయ్యొద్దంటారు సరైన పదాలు దొరికే వరకూ అంతర్జాతీయ పదాలు వాడు కోవాలని అనటంలో అనౌచిత్యం లేదు కానీ ప్రారంభం మాత్రం జరగాలి ప్రభుత్వ సంస్థల విద్వాంసులు పదాలను విడివిడిగా అనువాదం చెయ్యటాన్ని నిరోధించటం తాత్కాలిక మ ప్ర వాదులు ఉద్దేశం అనుకుంటాను

3 2 సహజ పరిణామ వాదం ఏ భావమైనా ప్రజలలో కలిగితే వాళ్ళే పరిభాషను సృష్టిస్తారు అందువల్ల అట్లా సహజంగా పరిభాషను పరిణామం చెంద నివ్వటం మంచిదనేవాళ్ళున్నారు

ప్రయత్నం లేకుండా భాషలో మార్పులు జరిగేమాట నిజమే అయితే ప్రయత్నం ద్వారా అవసరమైనవి కల్పించుకోవటంలో దోషం లేదు సహజ పరి ణామానికి వ్యవధి ఎక్కువ కావాలి ఆధునిక విజ్ఞానాభివృద్ధి కాల విలంబనను సహించదు సమయం కలిసి రావాలని ఈ వ్యాసం తరవాత సెక్షన్ (4 3 లో పేర్కొన్న సర్కారీ మార్గాన్ని అనుసరించగూడదు

3 3 విపరి భాషా వివరణ వాదం పరిభాష విషయ గ్రహణకు ఆటంకమనీ పరిభాష అసలు వాడక్కర్లేదనీ ఆ స్థానం వాక్యం ద్వారా వివరించ వచ్చుననీ వివరణ వాదుల్లో తీవ్రవాదులంటారు అట్లాంటి తీవ్రవాదులు ఇప్పు డెవరూ లేరనుకుంటాను

పరిభాష వాడకంలో కొన్ని చిక్కులున్నమాట నిజమే రచయితలు తమ తమ అభిరుచుల్ని అనుసరించి ఒకే అంశ ప్రస్తావనలో భిన్న పదజాలాన్ని వాడొచ్చు అప్పుడు ఒకరు వాడింది ఇంకోరికి అర్థంకాకపోవచ్చు లేక పాఠకులకు

క్లేశం కలగవచ్చు ఉదాహరణకు నేను Ra n అనే మాటకు హేతు వాదులు అని వాడితే బి వి యల్ నారాయణరావుగారు అంతశ్శక్తి వాదులు అని వాడారు హేతువాదులు అనే మాటకన్నా అంతశ్శక్తి వాదులు అనే మాటకే భావస్ఫురణ ఎక్కువగా ఉంది ఆధునికంగా హేతువాదులు అంటే మూఢ విశ్వాసాలను ఎదిరించేవారనే అర్థంలో డాక్టర్ కోవూర్ డాక్టర్ మిత్రా యం వి రామ్మూర్తి ఇట్లాంటివాళ్ళు గుర్తొస్తారు కాని ఇక్కడ ఉద్దేశించింది దేకార్త్ లీబ్నిజ్ వంటి 7 వ శతాబ్దపు తత్త్వవేత్తలను మానవులు విజ్ఞాన సముపార్జన చెయ్యటానికి వాళ్ళకు జన్మత వచ్చిన అంతశక్తి nnate deas) కారణమని వారి నమ్మకం

అయితే ఇట్లా భిన్న పదాలు భిన్న రచయితలు వాడుకచేస్తే కొంత వైవిధ్యం వచ్చేమాట నిజమే అయినా విషయగ్రహణకు గండిపడేంత ప్రమాద లేదు వీటిల్లో కాలక్రమేణ ఒక గుంపు et మిగిలి బలహీనమైనవి పోటీకి తట్టుకోలేక భాషలో నుంచి జారిపోవచ్చు లేదా కొన్ని సమ ఉజ్జీయిగా నిలబడనూ వచ్చు దానివల్ల నష్టం లేదు

శాస్త్ర రచనను కొన్ని వాక్యాలలో వివరించటం సరి అయిన మార్గమే కాని శాస్త్ర-రచనే అట్లా ఉండటం సరికాదు సంక్షిప్తత నైశిత్యం అవసరమైన రచనల్లో పరిభాష తప్పనిసరి

4 0 మార్గాలు

పరిభాష అవసరాన్ని అంగీకరించాక పరిభాషను కల్పించటానికి ఏ మార్గాన్ని అనుసరించాలి అనే ప్రశ్న వస్తుంది భాషా శాస్త్రానికి సంబంధించి నంతవరకు తెలుగులో మూడు మార్గాలు కనిపిస్తున్నై వాటి గుణగణాల్ని ఈ భాగంలో కొద్దిగా ప్రస్తావించుకుందాం

4 బోధనా మార్గం ఆంధ్ర వేంకటేశ్వర ఉస్మానియా విశ్వ విద్యాలయాల్లో చాలాకాలం నుంచీ తెలుగులో భాషాశాస్త్రం ఒక అంశంగా బోధి స్తున్నారు ఎ జి సెంటర్లుగా ఉంది ఇప్పుడు విశ్వ విద్యాలయాలైన నాగార్జున కాకతీయలలోనూ ఇంకా కావలసిన అనంతపురం కేంద్రంలో కూడా భాషా బోధన

జరుగుతున్నది తూమాటి దోణప్ప జి ఎన్. రెడ్డి, కోరాడ మహదేవశాస్త్రి, నాయని కృష్ణకుమారిగార్లు తమ తమ సెంటర్లలో బోధనద్వారా కొంత పరిభాషను సృష్టించారు ఆయా సెంటర్లలో తాము ప్రయోగిస్తున్న పదాల పట్టికలను తయారుచేస్తే అన్నిటినీ కలిపి ఒకే పట్టికగా మార్చొచ్చు

4. 2 రచనా మార్గం : ఇంగ్లీషులో అంతగా పాండిత్యంలేని తెలుగు వారికి కూడా భాషాశాస్త్ర విషయాలు తెలియాలనే సదుద్దేశంతో తెలుగులో వ్యాస రచన చేస్తున్న వారున్నారు

1959 భారతిలో ' భాష : వ్యాకరణం'' ' ధ్వని : వర్ణం'', 'తెలుగులో వర్ణసమామ్నాయం అనే వ్యాసాలతో తెలుగులో ఆధునిక భాషాశాస్త్ర రచనలకు భద్రిరాజు కృష్ణమూర్తిగారు మార్గం వేశారు. మళ్లీ 1970లో ' పదం : పదాంశం'' అనే వ్యాసం రాశారు. ఎన్నో కారణాలవల్ల ఆయన ప్రయోగించిన ఏ పరిభాషా పదమైనా ఇట్టే వ్యాపించేది. వర్ణం (phoneme) పదాంశం (morpheme), రూపశూన్య (zero) అర్థశూన్య (empty) పదాంశాలు ఇట్లాంటివి. ' నిజానికి పదాంశం అన్నమాట morpheme కు అంతగా సరిపోయినట్లు నాకనిపించ లేదు ఇంకా కొందరికి కూడా అట్లానే అనిపించి ఉండొచ్చు. కాని ఇంకోమాట ధైర్యంగా వాడినవాళ్ళు లేరు. ఆయన వాడిన మాటకు వ్యాప్తి, ప్రమాణం త్వరగా దొరుకుతై

భాషా శాస్త్రంలో పరివర్తన సిద్ధాంతం అనే పేరుతో 1971 లో ఒక వ్యాసంలో పరివర్తన సిద్ధాంతాన్ని గురించి వివరిస్తూ ఆ సిద్ధాంతానికి సంబంధిం చిన పదజాలాన్ని నిర్మించే ప్రయత్నం చేశాను నామ్నీకరణ వ్యాసాల్లోనూ, ఇతర పరిశోధక వ్యాసాల్లోనూ తెలుగువాక్యం అనే పుస్తకంలోను పరిభాషను విరివిగానే వాడాను. అందులో ఎన్ని నిలుస్తయ్యో చెప్పలేము. గుప్త నిర్మాణం వ్యక్త నిర్మాణం నిల్చినట్టే కన్పిస్తున్నై నామ్నీకరణం అనే మాట తప్పని సంస్కృత పండితులంటున్నా nominalization అనే అర్థంలో ఆ మాట నిలుస్తున్నట్టే అనుకోవచ్చు.

వెన్నెలకంటి ప్రకాశం, కుంటముక్కల లక్ష్మీనారాయణశర్మ మొదట తెలుగు అకాడమీ "తెలుగు" లోనూ, తరువాత "భారతి" లోనూ కొన్ని వ్యాసాల్లో కొంత సిస్టీమిక్ (systemic) సిద్ధాంత (దీన్ని వారు వ్యవస్థా వ్యాకరణం అంటున్నారు) పదజాలాన్ని వివరణలు లేకుండా అమాంతం తెలుగులోకి దించే ప్రయత్నం చేశారు. కాని ఈ పదజాలం తెలుగులో అంతగా కాలూనినట్టు కనిపించదు.

తెలుగు అకాడమీ బులెటిన్‌లకు రాసిన వివరణలోను 'తెలుగు పత్రికలో రాసిన వ్యాసంలోనూ పి సి. నరసింహారెడ్డిగారు కొన్ని పదాలు వాడారు.

లింగమనేని బసవశంకరరావు 'తెలుగు—వాక్య నిర్మాణము' (భారతి 1978 ఫిబ్రవరి) అనే వ్యాసంలో subject కు ఉద్దేశ్యం అనీ predicate కు విధేయం అనీ వాడారు ఈ ప్రయోగాలు సరికావు ఒకరకం వాక్యాల్లో మాత్రమే subject ఉద్దేశ్యంతోను, predicate విధేయంతోను సరిపోతుంది. అన్ని చోట్లా కాదు.

| వి. సి. గారు | వచ్చారు |
|---|---|
| ఉద్దేశ్యం | విధేయం |
| subject | predicate |

| వచ్చింది | వి. సి గారు |
|---|---|
| ఉద్దేశ్యం | విధేయం |
| predicate | subject |

ఈ బొమ్మలో ఇంగ్లీషు మాటలకు శంకరరావుగారి తెలుగు మాటలకు ఎట్లాంటి వ్యత్యయం వస్తుందో చూపించాను. ప్రౌఢ వ్యాకరణం ఉద్దేశ్య విధేయాలకు ఇచ్చిన నిర్వచనాలు చూసుకుంటే తెలుస్తుంది.

direct speech కి సముఖ వ్యవహారమనీ, indirect speech కి అనువాద వ్యవహారమని వాడిన మాటలు బాగున్నై. కాని ప్రత్యక్ష పరోక్ష అనుకరణాలు అనే మాటలకు ఈ వ్యాసంలో ప్రతిపాదించిన లక్షణాలు ఎక్కువగా వర్తిస్తై.

4.3 సర్కారీ మార్గం: సర్కారు వారి అధీనంలో ఉన్న సంస్థలవారు తయారు చేసిన పదపట్టికలు ఈ వర్గం కిందకు వస్తాయి. అన్ని విషయాల్లోలాగే

భాషా విషయంలోకూడా శాసిస్తామంటారు ఈ సర్కారువారు. సదరు సర్కారు వారికి తెలియని విషయమంటూ ఉండదు. కనుక ఉపయోగించే శైలి మొదలు వాడే పరిభాష వరకూ శాసిస్తారు. ఆ ప్రయత్నంలో కొన్ని పదపట్టికలు ప్రకటించారు తెలుగు అకాడమీ వారి భాషా శాస్త్ర పారిభాషిక పదకోశంలో ఒక సుగుణం ఉంది బహుళ వ్యాప్తిలో ఉన్న వర్ణం, పదాంశం సన్నిహిత సంబంధి, నిర్మాణం, గుప్తనిర్మాణం వ్యక్తనిర్మాణం వంటి పదాలను వారి కోశంలో గ్రహించారు. కాని కొన్నిచోట్ల కొన్ని పదాలను ప్రకరణ రహితంగా తెలుగుచేసి పడేశారు. మచ్చుకి కొన్ని. Item and arrangement కి పద సన్నివేశాలు అనీ Item and process కి పదప్రక్రమాలు అని వాడారు. వీటికి భావస్ఫూర్తి లేదు. ఇవి విషయాన్ని అర్థం చేసుకొని నిర్మించిన మాటలుకావు. వీటికి సమానార్థకంగా స్థితి సూత్రాలు గతి సూత్రాలు అనే మాటలు కన్పిస్తున్నై ఈ మాటలకున్న స్ఫూర్తి అకాడమీ వారి మాటలకు లేదు.

Prosody అనే మాటకు ఛందస్సు అని తెలుగు చేశారు. కాని భాషా శాస్త్రంలో ఇది ఛందస్సు కాదు. అనునాసిక్యం nasalization స్వరపురస్ పశ్చాత్ అధః కరణాలు (fronting, backing, lowering of vowels) మూర్ధన్యీకరణం (retroflexion) వంటి భేదక లక్షణాలను prosodic features అంటారు. వీటికి ఛందస్సుకూ సంబంధం లేదు బ్రిటిషువారి వర్ణ శాస్త్రంలో స్థిర వర్ణాలు (Phonematic units) చర వర్ణాలు (Prosodic units)అని విభాగం చేస్తారు స్థిరవర్ణాలకు వరస (linearity) ఉంటుంది. చర వర్ణాలు సమ సామయికాలు (simultaneous).

Generative grammar కి 'వికాసక వ్యాకరణం' అన్నారు. ఇది మామూలు అర్థాన్ని తీసుకున్నందువల్ల చేసిన తప్పు. బి.వి.ఎల్. నారాయణరావు గారు వాడిన నిర్వచనాత్మక వ్యాకరణం' ఇంతకన్నా మెరుగు వాక్యాల నిర్మాణాన్ని స్పష్టంగా వ్యాకరణ దృష్ట్యా నిర్వచించేది Generative grammar. ఇట్లా ఎన్నో ఉదాహరణ లియ్యవచ్చు ఇట్లాంటి మాటలు ఎన్ని ఉన్నయ్యనేది ఇక్కడ ప్రధానంకాదు అసలీ పద్ధతి అనుసరణీయమా? కాదా? అనేది ముఖ్యం.

పైన చెప్పిన మూడు మార్గాల్లో మొదటి రెండు మార్గాలు ఒక దానికి ఒకటి దోహదకారులు సర్కారీ మార్గం అనుసరణీయం కాదు మొదటి రెండు

మార్గాల్లో ఏర్పడిన పదాలను ఏరి పట్టికగా కూర్చటమే సర్కారువారు చేయ దగిన పని.

5. 0. వ్యూహాలు: ఇప్పుడు తెలుగులో కనిపించే భాషాశాస్త్ర రచనలు పరిశీలిస్తే పరిభాష కల్పనలో కొన్ని పద్ధతులు ఉన్నట్లు కనిపిస్తాయి వీటిని 'వ్యూహాలు' అంటున్నాను. పరిభాష కల్పనలో పదాల నిర్మాణానికి పరిశోధకులు, రచయితలువ్యక్తంగాగానీ అవ్యక్తంగాగానీ అనుసరించిన కొన్ని పద్ధతులను వ్యూహాలు అనొచ్చు.

5. 1. పునరుద్ధరణ: ఇప్పుడు చెప్పదలచుకున్న శాస్త్రానికి ఆ సమాజంలో ప్రాచీన సంప్రదాయం ఉంటే సాంప్రదాయికమైన మాటలను వాటి మూలార్థాలలో కాని లేక కొద్దిగా మార్చుకొని గాని ఇప్పటి రచనల్లో వాడుకోవటం పునరుద్ధరణ వ్యూహం దీనికి సంప్రదాయపరిచయం అవసరం. కృష్ణమూర్తిగారు వర్ణం సవర్ణం అనే మాటలని సంప్రదాయం నుంచే గ్రహించారు. వర్ణం అనే మాట ఇప్పటి Phoneme కి బొటాబొటిగా సరిపోతుంది. పాత వ్యాకరణాలలో భేదక లక్షణం (contra t) లేని కొన్ని ధ్వనులకున్న లేఖన చిహ్నాలనుకూడ వర్ణాలనే అన్నారు కొన్నిచోట్ల ఒక అక్షరం (syllab.e) కూడ వర్ణం అనే వ్యవహరించబడింది సవర్ణం అనేమాటను కృష్ణమూర్తిగారు allophone కి వాడారు. ప్రాచీన వ్యాకరణాల్లో వాడుకకీ దీనికీ సాధర్మ్యం తక్కువ. నేను deep case కి కారకమనీ క్రొవ్వ శక్తిపి చేదాద్యర్థకాలనే మాటలను ఆ అర్థాలలో వాడటం ఈ పునరుద్ధరణ వ్యూహంలో భాగమే

5.2. యథాధానువాదం: ఇంగ్లీషులో ఉన్న పదాలను ఉన్నవి ఉన్నట్లు అనువదిస్తే కొన్ని మాటలు సరిపోవచ్చుగాని కొన్నిచోట్ల సరిపోవు. నేను Rationalists అన్న మాటకు హేతువాదులు అన్న మాట ఇట్లా చేసిందే.

నామబంధం (noun phrase) క్రియాబంధం (verb phrase), విభక్తిబంధం (case phrase) సనామబంధ లోపం (equi-NP deletion), సమీకరణ వాక్యాలు (equational sentences) కర్త్రుద్ధరణ (subject ra sing) ఇట్లా అనువాదం చేసినవే అయినా విషయానికి సరి

పోయినవి అయితే విషయాన్నుంచి విడదీసి అనువాదం చేసినవి కాకపోవట వల్ల అట్లా సరిపోయినవి.

5. 3. స్వతంత్రానువాదం: ఇంగ్లీషు మాటల నుంచే ప్రేరణ పొంది యథాతథంగా అనువదించకుండా వాటిల్లో అంశాన్ని బట్టి, ఏది స్ఫూర్తి నిస్తుందో దాన్ని కల్పించటం ఇది అన్ని విధాలా ఉత్తమమయింది. Generative grammar ని తెలుగు అకాడమీ కోశంలో వికాసక వ్యాకరణం అనటం యథా తథానువాదం ఇది సరిపోదు. స్థితి సూత్రాలు (Item and arrangement) గతి సూత్రాలు (Item and process) అనే పదాలు స్వతంత్రాను వాదాలు ఈ రెంటికీ అకాడమీ కోశంలో వాడిన పద సన్నివేశాలు, పద ప్రక్రమాలు అన్న మాటలకు భావస్ఫూర్తి లేదని ఇంతకుముందే పేర్కొన్నాను. పాక్షిక నియత క్రమ సూత్రాలు (Partially ordered rules), పరిసరా పేక్షక- పరిసర నిరపేక్షకాలు (context sensitive and context free) మూలరూపం (underlying form) వంటివి కొంతవరకు అనువాదాలే అయినా కొంత స్వతంత్రత ఉంది.

5.4. స్వతంత్ర కల్పన: మౌలిక పరిశోధనను తెలుగులో రాస్తేటప్పుడే స్వతంత్ర కల్పన సాధ్యమౌతుంది నేను కొన్ని వ్యాసాలు తెలుగులో రాసిం తర్వాతనే ఇంగ్లీషులో రాశాను అవి చేసేపని స్వర సమీకరణ' అనే వ్యాసాలు తెలుగులో వచ్చిన తర్వాతనే ఇంగ్లీషులోకి మార్చాను అప్పుడు కొన్ని పదాలు ఆ అవసరాలకు అనుగుణంగా రూపొందించుకోవాల్సి వచ్చింది. తెలుగు వాక్యంలో కూడా అట్లాంటి సందర్భాలున్నై

కొన్ని ప్రత్యయాల మూల ధాతువులో జరిగే మార్పును స్వర సమీకరణ నుండి వేరు చేయాల్సివచ్చినప్పుడు ప్రత్యయాలను అద్విస్తరణ ఇద్విస్తరణ ఉద్విస్తరణా పేక్షకాలు అని స్వర సమీకరణంలో వాడాను

ప్రత్యక్షానుకృతి శబ్ద ప్రధానమని పరోక్షానుకృతి అర్థ ప్రధానమని ముందు తెలుగులో వాసి తరువాత code centered and information centered అని ఇంగ్లీషులో వాడాను. తెలుగు వాక్యంలో ఆధార

దళం, ఆధేయ దళం క్రియా విభక్తి సంధాన సూత్రం ఇతరత్రా ప్రయోగించిన కర్తృ క్రియా సన్నికర్ష వ్యూహం క్రియా సృష్టి గారడీ అవాంతర వాక్య సంధానం వంటి మాటలు పరిభాషగా వాడినవే స్వతంత్ర కల్పనలు కూడా

ఈ వ్యూహానికి పై వాటితో పోటీలేదు. అనువాదం చేసుకోవటానికి వీటికి అంతర్జాతీయ పదాలుండవు. స్వతంత్ర పరిశోధన చేస్తున్నప్పుడే స్వతంత్ర కల్పన.

5.5. కర్త్రనుబంధత. పరిశోధన చేసిన కర్త పేరుతో అతను కనుక్కున్న విషయాన్ని పిలిచే పద్ధతి ఒకటి కొన్ని సైన్సుల్లో ఉంది ఫిజిక్సులో రామన్ ఎఫెక్ట్ ఇకనామిక్స్‌లో Recardos Theory of Rent ఇట్లాంటివి. భాషాశాస్త్రంలో ఇండో యూరోపియన్ ద్రావిడ భాషల పండితుల్లో ఈ అలవాటు కనబడుతుంది. గ్రిమ్స్ సూత్రం వెర్నరు నియమం ఇండో జర్మానిక్ హల్లుల మార్పుని గురించి చెపుతున్నపుడు వాడుతారు ద్రావిడ భాషలో ధాతువుల్లో కనిపించే హ్రస్వ దీర్ఘ బేదాన్ని నిరూపించే సూత్రాన్ని కృష్ణమూర్తి సూత్రమనీ, వాటిప్రవర్తనకు చూపించిన నియమాన్ని సాంబశివ రావు నియమమని అంటారనుకొంటాను పరివర్తన వ్యాకర్తలలో Chomsky adjunction అనీ, Ross constraints అనీ వాడుక కొంత కనిపిస్తుంది నేటి తెలుగు భాషా పరిశోధకుల పేర్లమీద ఇట్లా ప్రక్రియలను పిలిచే అలవాటు తెలుగులో కనబడటం లేదు కాని అవసరమయితే ఈ వ్యూహాన్ని కూడా ఉపయోగించుకోవచ్చు.

5. 6. సంస్కృతీకరణ — విసంస్కృతీకరణ : పదాలను కల్పించటం అనువదించటం పరిభాషను కల్పించే వ్యూహాలే అయినా వీటికి అనుబంధంగా ఆలోచించవలసింది ఈ ఉప వ్యూహం కొందరికి సంస్కృత పదాల మీద మోజు మరికొందరికి తెలుగు మాటలమీద మోజు నేను వాడిన మాటల్లో ఎక్కువ భాగం సంస్కృత మాటలుండటం ఈ సందర్భంలో ఆశ్చర్యకరంగా గమనించాను సరూప పదాలను ఎక్కువగా కల్పించటం వీలవుతుందనే ఉద్దేశంతో సంస్కృతం వైపు మొగ్గు చూపిస్తున్నానేమో గర్భ గర్భి

వాక్యాలను తల్లివాక్యం, పిల్లవాక్యం అనమన్నారు భద్రిరాజు కృష్ణమూర్తిగారు. కానీ గర్భీకరణ' అన్నపుడు 'తనలో ఇముడ్చుకోవటం' అని వాడాల్సివుంటుంది. సంస్కృతంలో ఉన్న సరూప పద కల్పన, సమాస విధివల్ల పరిభాషకు విస్తర ణావకాశం, ప్రగాఢ బంధత్వం ఏర్పడుతున్నై. తెలుగుభాషకు ఈ శక్తులు లేవని తెలుసుకోవటం స్వభాషా ద్రోహంకాదు, వాస్తవాన్ని గుర్తించటమే.

ఒకసారి కృష్ణమూర్తిగారు Subject raising కి కర్త్రుద్ధరణ అనే మాటని తానే సూచించి తనే ఘోరంగా ఉందని వ్యాఖ్యానించారు. నాకంత ఘోరంగా కనబడకపోవటంవల్ల 'తెలుగు వాక్యం' లో ఉపయోగించుకొన్నాను.

Phrase structure rules ని పదబంధ నిర్మాణ సూత్రాలనీ Transformational rules ని పరివర్తన సూత్రాలనీ వాడుతున్నాను. నారాయణరావుగారు 'కూర్పు' సూత్రాలు, 'మార్పు' సూత్రాలు అని సూచి స్తున్నారు. ఇవి కూడ బహుశా వ్యాప్తి పొందవచ్చు. ఇక్కడి విసంస్కృతీ కరణలో లాఘవం కనిపిస్తున్నది. మొదట్లో deep and surface structures ని లోపలి - వెలుపలి నిర్మాణాలని వాడేవాణ్ణి. Christopher Caudwell రాసిన Illusion and Reality అనే కవిత్వతత్వ నిరూపణ గ్రంథంలోని latent content and manifest content అనే మాటల్ని కె వి. రమణారెడ్డిగారు సంవేదన (1938 అక్టోబరు) సంచికలో 'గుప్త వస్తువు, వ్యక్త వస్తువు' అని వాడారు ఆ మాటల్నే గుప్త నిర్మాణం, వ్యక్త నిర్మాణం అని వాడటం మొదలు పెట్టాను. ఇవి ఇప్పుడు బాగా వ్యాప్తి చెందినట్టే కనిపిస్తున్నై. ఇక్కడ సంస్కృతీకరణలో లాఘవం కనిపిస్తున్నది.

6. ముగింపు: తెలుగు దేశానికి భాషా శాస్త్రాన్ని గిడుగు రామ్మూర్తి గారు పరిచయం చేసినా భద్రిరాజు కృష్ణమూర్తిగారు భాషారంగంలో ప్రవేశించా కనే దీనికి విస్తృత వ్యాప్తి కలిగింది అయన 1954 నుంచి భాషా శాస్త్రాన్ని బోధించటం ప్రారంభించారు. 1959లో భాషా శాస్త్రం మీద తెలుగులో రాయటం ప్రారంభించారు. భాషా శాస్త్ర రచన తెలుగులో మొదలై రెండు దశాబ్దాలు గడచినాయి అయినా తెలుగులో రాసేవాళ్ళు పట్టుమని పదిమంది అయినా లేరంటే ఆశ్చర్యమే.

ఈ రెండు పదుల కాల వ్యవధిలో బోధనా, రచనా మార్గాల్లో వక్తలూ, రచయితలూ ప్రయోగించిన పరిభాషను ఉత్సాహవంతులైన పరిశోధక విద్యార్థులు సేకరిస్తే చాలా ఉపయోగం. అన్ని రకాల పదాలను సేకరిస్తే ప్రమాణీకరణ సంగతి తరువాత ఆలోచించవచ్చు వాటికి సమర్థులైన వారు వివరణచేర్చి ఒక కోశగ్రంథంగా కూర్చవచ్చు. అంతేకాదు తెలుగులో భాషా శాస్త్ర విషయాల మీద వచ్చిన పరిచయ, వివరణ, పరిశోధనాత్మక వ్యాసాల గ్రంథాల పట్టికను విద్యార్థులు సేకరించవచ్చు. ఆ వ్యాసాలన్నింటినీ కాపీ తీయించి ప్రభుత్వ సంస్థలవారు భద్రపరిస్తే భావి తరాలవారికి చాలా ఉపయోగం. ఇవన్నీ ఇప్పుడప్పుడే జరుగుతయ్యన్న దురాశావాదిని కాకపోయినా ఎప్పటికీ జరగవని నమ్మే నిరాశావాదిని కూడా కాను.

[తెలుగు సారస్వత సమాఖ్య, న్యూ ఢిల్లీ, ప్రత్యేక సంచిక
1981 అక్టోబరు, పే. 1-9]

# పారిభాషిక పదాలు

అంతర్గత - nterna
అంతస్సంధి - nternal sandhı
అనంతత్వం - nfın ty
అనుకరణ సూచకం - quotat on marker
అనుకర్త/అనువక్త - eporter
అనుకారకం - quotat on marker
అనుకృతి/అనుకరణ - quotat on
అనుభవవాదం - emp r c sm
అనుభోక్త - exp riencer
అనుశ్రోత - hearer (of the report)
అపృర్థకం - concessıve
అభిప్రాయ ప్రకటన - c mmu ı ca on
అమూర్త - abstract
అర్థప్రధానం - ınfo m t on centred
అవయవం - const tuent
అవయవి - const tute
అవయవి సూచకం - c nstruct on marker
అవ్యక్తకర్త - unspecıf ed agent
అవాంతర వాక్యసంధానం - n erpo atıon
అశ్లిష్ట వాక్యం - s mple ser ter ce
అస్తిత్వబోధకక్రియలు - verbs of ex s ence
ఆఖ్యాతం - pred cate
ఆఖ్యాతబంధం - pred ate phrase
ఆత్మీయతావ్యక్తీకరణం - t mat zat on
ఆధారదళం - cond t onal c ause

ఆధేయదళం - cond t oned c ause
ఆనుపూర్విక - chronolog cal
ఇంద్రియ వ్యాపారబోధక ధాతువులు - verbs of perception
ఇచ్ఛాపూర్వత - vol t on
ఉతార్థకం - alternat ve coord nat on
ఉద్దేశ్యం - head
ఏకైకసంబంధం - somorph sm one to one correspodence
కథానాత్మకవాక్యం - narrat ve sentence
కర్త - operator/agent
కర్తృక్రియాసన్నికర్షవ్యూహం - sub ect - verb prox m ty strategy
కర్మణిసూత్రం - pass ve ru e
కాంక్షార్థకం - ntent ve (nom na )
కారకం - deep case/ca e ralat on
కారకబంధం - case phrase
కారణవాక్యం - causal c ause
కార్యవాక్యం - result c ause
కాలబోధకప్రత్యయవాహకం - tense carr er
క్త్వార్థకం - p rfect ve part c p e
క్రియాబంధం - erb phrase
క్రియాబంధసంహారం - verbphrase con unct on
క్రియాసృష్టిగారడీ - pred ca e mag c
గతి - process
గతిసూత్రాలు - tem and proce s (ru es)
గమనార్థకక్రియలు - mot on verbs
గర్భవాక్యం - embedded entence
గర్భవాక్యపురస్కరణం - comp e n nt foreground ng
గర్భివాక్యం (ప్రధానవాక్యం) - mat x or ma n clause

గుప్తనిర్మాణం - deep structure
గుప్త (నిర్మాణ)కర్త - deep (structure) subject
గుర్తు - symbol
చర్య - action
చేదర్థకం - conditional
జన్మగతభావాలు - innate ideas
తక్షణభవితవ్యం - inceptive
ధాతువిస్తరణప్రత్యయం - stem extending suffix
ద్వైధనిర్మాణం - duality of patterning
ధాతువిస్తరణ - stem extension
ధ్వనిలిపి - phonetic script
ధ్వనిసంకేతాలు - speech symbols
ధ్వనిసామ్యం - phonetic similarity
ధ్వనిసూత్రాలు - phonetic rules
నామం - nominal / noun
నామబంధం - noun phrase
నామ్నీకరణం - nominalisation
నామ్నీకారకం - nominalisation marker
complementizer
నియతక్రమసూత్రాలు - ordered rules
నిరధీనత - uncontrollability
నిరనుబంధ - disjunctive
నిర్మాణవర్ణన - structural description
నిశ్చయార్థకం - assertive
నిష్పత్తి - derivation
నిష్పన్ననామబంధం - derived noun phrase
పదక్రమవ్యత్యాసం - change of word order
పదనిష్పాదన - stem inflexion

పదబంధం - phrase
పదబంధ నిర్మాణం - phrase trucure
పదబంధ నిర్మాణసూచిక - phrase marker
పదాంశం - morpheme
పదాంశవిధేయసూత్రాలు - morpholog cally
co dıt oned rules
పరప్రయోజనార్థకం - ben fact ve
పరిణామార్థకం - evolut onary
పరిణామబోధక క్రియ(లు) - change of state verbs
పరిపూరణ - complementat on
పరిపూరణార్థకం - complet ve
పరివర్తన - transformat on
పరివర్తన సిద్ధాంతం - transformat on theory
పరివర్తనసూత్రం - ransformat ong ru e
పరిశీలన సమగ్రత - observat onal adequacy
పరిసర నిరపేక్షకసూత్రం - context free rule
పరిసరాపేక్షకసూత్రం - context sens t ve rule
పరోక్షానుకృతి - nd rect report
పరోక్షప్రశ్న - nd rect quest on
పరోక్షవిధి - nd rect mper t ve
పునరావృత్తి సూత్రాలు - recurs ve ru es
ప్రక్రియాగతి - grammat cal process
ప్రతిభ - competence
ప్రత్యక్షానుకృతి - d rect report
ప్రధానక్రియ - ma n verb
ప్రధానవాక్యం - ma c au e
ప్రమేయం - func on
ప్రయోక్త - n at r/causer
ప్రయోక్త 2 - user/ peak r

ప్రయోజనార్థకం - purposive
ప్రవృత్తి - performance
ప్రవృత్తి 2 - funt on
పారస్పర్యార్థం - rec procat ve
ప్రవృత్తివాదం - behaviour sm
ప్రాధాన్యవివక్ష - focus
ప్రేరణ - st mulus
బహిస్సంధి - external sandhi
బింబప్రతిబింబభావం - m rror mage
బుద్ధ్యర్థకాలు - cogn tives
భాషాయంత్రాంగం - ingu stic system
భాషాప్రయోగం - language use
భాషాసామాన్యాలు - language un versals
substant ve universals
భాషాసిద్ధాంతం - l nguistic theory
భాషీకరణ - linguist c codif cation
భౌతికవ్యాపార క్రియ(లు) - phys cal process verbs
మనుష్యబోధ - human reference
మనోవ్యాపారక్రియ(లు) - mental process verbs
మూలద్రావిడరూపం - proto Drav d an form
మూలనిర్మాణం - underly ng structure
మూలరూపం - underlying form base form
భాషావిజ్ఞానబోధకాలు - l ngu st c markers
మూలవాక్యం - kernal sentence
మూలవిభాగం - base component
మూలసూత్రాలు - underlying rules
యత్తదర్థకాలు - correlatives
రీత్యర్థం - manner
లక్ష్యార్థం - goal

వక్త - speaker
వచ్యర్థక క్రియ(లు) - speech verbs
వర్ణం - phoneme
వర్ణనసమగ్రత - descr ptive adepuacy
వర్ణవిభాగం - phonolog cal
వర్తులక్రమం - cyelical order
వాక్యగర్భీకరణ - sentence embedding
వాక్యభాగం - clause
వాక్యసంహారం - sentence con unction
వర్ణవ్యత్యయం - metathesis
వర్ణవిధేయసూత్రాలు - phonolog cally conditioned rules
విధేయం - attr bute
విభక్తి - surface case/case mrker
విభక్తిబంధం - case phrase
విభక్త్యర్థకనామ్నీకరణం - part cipial relat v zation
వివరణసమగ్రత - explanatory adequacy
విశ్వవ్యాకరణం - un versal grammar
విశ్వసూత్రాలు - universal laws
విశేషణీకృతం - ad ectiv sat on
విశేషనామం - specific/proper noun
విషయం - Informat on
విషయార్థకనామ్నీకరణం - fact ve nom na zat on
వ్యక్తనిర్మాణం - surface structure
వ్యక్త(నిర్మాణ)కర్త - surface (structure) sub ect
వ్యక్తనిర్మాణనియమం - surface structure constra nt
వ్యక్తవ్యాకృతి - surface grammar
వ్యవహారసమ్మతి - acceptab l ty
వ్యాకరణప్రవర్తన - grammat cal f nction

వ్యాకరణనియమాలు - grammat cal constraints
వ్యాకరణమూలరూపం - underlying form
వ్యాకరణవిరుద్ధం - ungrammatical
వ్యాకరణసంబంధాలు - grammatical relat ons
వ్యాకరణసామాన్యాలు - l ngu stic universals
formal universals
వ్యాఖ్య - comment
వ్యాపారం - operat on/action
శబ్దపల్లవీకరణం - poly lexical zation
శబ్దప్రధానం - code cei tred
శత్రర్థకం - durative part c ple
శత్రర్థబోధ - durat on
శ్రవణార్థక క్రియ(లు) - hear ng verbs
శైలీవిన్యాసం - stylist c difference
శ్రోత - hearer
సంకలన సంయోజన - add tive co-ord nation
సంఘటన - event
సందేహార్థకం - dub tative
సంభావన - expectation
సంభావ్యమాన - conceivable
సంయుక్తపదబంధం - co-ordinate Phrase
సంయుక్తవాక్యం - compound sentence
సంయోజన - con unct on con o ning
సంశ్లిష్టవాక్యం - complex sentence
సంక్షిప్తత - s mpl c ty
సనామబంధలోపం - equi-NP delet on
సమబోధకత - co-referent al ty
సమసామయిక - s mu tane‿us
సమీకరణము - q‿uat on harmony

సమీకరణ వాక్యాలు - equat onal sentences
సర్వనామపరివర్తన - Pronom ra ch nge
సరూప పదాలు - cognates
సాధ్యనామం - derived noun
సాధారణనామం - common noun
సాధారణపదక్రమం - un-ma ked word order
సాధారణీకరణం - general sat on
సానుబంధ - con unct ve
సామర్థ్యార్థం - ab l tat ve
సామ్యం - analogy
సిద్ధనామం - bas c noun
సృజనాత్మకత - creat v t
సౌలభ్యం - economy
స్పందన - response
స్వతస్సిద్ధభావాలు - innate deas
స్వరసమీకరణం - vowel harmony
స్వాధీనత - control
స్వామ్యార్థం - possessive
స్థితిభేదం - difference of state
స్థితిబోధకాలు - statives
స్థితిసూత్రాలు - item & arrangement rules
హేతువాదం - rat ona sm
హేతువు - reason

# ఉపయుక్త గ్రంథ, వ్యాస సూచిక

కృష్ణమూర్తి భద్రిరాజు 1959 నేటి తెలుగువర్ణసమామ్నాయం భారతి
1970 పదం - పదాంశం భారతి ఏప్రిల్

గోపాలకృష్ణయ్య వడ్లమూడి 1959 వ్యావహారిక భాషా వ్యాకరణం రాజమహేంద్రవరము అద్దేపల్లి అండ్ కో

చిన సీతారామస్వామిశాస్త్రి వఝల 1952 ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయము

జోగి సోమయాజి గంటి 947 ఆంధ్ర భాషా వికాసము విశాఖపట్టణం ఆంధ్ర విశ్వవిద్యాలయము

రామకృష్ణారావు అబ్బూరి & దివాకర్ల వేంకటావధాని 960 నన్నయ పద ప్రయోగ కోశము హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

రామకృష్ణారావు అబ్బూరి & దివాకర్ల వేంకటావధాని 1965 నన్నెచోడ పద ప్రయోగ సూచిక హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

రామచంద్రరావు సి 1975 తెలుగులో బహువచనం తెలుగు 4 పే 44-5

రామచంద్రరావు సి 1976 తెలుగు బహువచనం×తెలుగు బహువచన ప్రత్యయములు తెలుగు 5 పే 44-50

రామమూర్తి దూసి 9౦0 బాలవ్యాకరణ సారస్య సర్వస్వపేటిక మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

రామారావు చేకూరి & పి సి నరసింహారెడ్డి 972 భాషాకృషి గూడ వేంకటసుబ్రహ్మణ్యం ఇరివెంటి కృష్ణమూర్తి వంగపల్లి విశ్వనాథం (సం మహతి సికింద్రాబాదు యువభారతి పే 32-43

లక్ష్మీరంజనం ఖండవల్లి 1975 తెలుగులో బహువచన ప్రత్యయములు తెలుగు 4 పే 149-155

వేంకట నరసింహ భాష్యకారాచార్యులు భాష్యం 19౬3 త్రిలిఙ్గ లక్షణ శేషము అను ప్రౌఢవ్యాకరణము-తత్త్వబోధినీ వ్యాఖ్యానసమేతము ఇచ్ఛాపురము శ్రీవిలాస ప్రచురణములు

వేంకటావధాని దివాకర్ల 960 నన్నయ భారతము హైదరాబాదు రచయిత సొంత ప్రచురణం

17-T

# BIBLIOGRAPHY


Ages a ngam S 1967 A Generat ve Grammar of Tamıl Annama a ngar

Ananthanarayana H S Karaka theory and Case grammar

Arden A H 1955 A Progress ve Grammar of he Te ı gü Language Madras The chr st an terature Soc ety

Berman Ar ene 1970 Agent Exper encer and Controab ty Mathemat ca ngu st cs and automat c trans at on Report N S F-24 Cambr dge Mass A ken Ccmputation laboratory Harvard

B oomfie d L 1933 Language New york Ho t

Burrow T & M B Emeneau 1960 A Drav d an Etymoog ca D ct onary Oxford

Chomsky Noam 1955 The Log ca Structure of L ngu st c Theory

1956 Three Mode s for the Descr pt on of Language In I R E Transact ons on Informat on Theory Vo ume I T-2 PP 113 124

Chomsky Noam 1957 Syntact c structures The Hague Mouton

Chomsky Noam 1959 Rev ew of Sk nner (1957) Language-35 PP 25-58

Chomsky Noam 1961 Some Methodo og ca Remark on Genera ve Grammar Word-17 PP 219-239

Chomsky Noam 1966 Cartes an L ngu st cs New York Harper & Row

Chomsky Noam 1965 Aspects of the Theory of Syntax Cambr dge Mass MIT Press

Chomsky Noam 1966 Top cs n the Theory of Generat ve grammar The Hague Mou on

Chomsky Noam 1967 Language and M nd New-York Harcourt Brace & Wor d

Chomsky Noam 1968 Po tical Prospects for the Seventies L nk, Volume-19, No 1 PP 94-96

Chomsky Noam 1969 American Power and New Mandarins New-York Pantheon

Hockett C F 1958 A Course in Modern L ngu st cs New-York Macmi an

Hockett, C F 1960 Log cal eons derat ons in the study of An mal Commun cat ons In W E Lanyon and W N Tavo ga (eds ) *Animal Communication* PP 392-430 Wash rgton American Inst tute of Biolog ca Sc ence

Hockett C F 1967 The State of the Art The Hague Mouton

Hockett F F & R Ascher 1964 The Human Revo ution Current Anthropo ogy-5 PP 135-158

Hooton B A 1937 Apes Men and Morons New-York

Katz J J 1964 Menta sm in Linguistics Language-40, PP 124-137

Katz J J 1966 The Phi osophy of language New-York Harper & Row

Kelley Gera d 1959 Te ugu vowe Phonemes Indian Lingu stics Turner Jub le volume

Kel ey Gerald 1963 Vowel Phonemes and External Sandhi in Telugu Journal of the American Or ental Soc ety Volume-83 No 1

Kel ey Gerald 1965 A Grammar of Telugu (M meographed)

Kel og W N & L A 1933 The Ape and the Child New-York

Kr shnamurt Bh 1957 Sandhi in Modern Colloquial Telugu Ind an L ngu st cs Taraporewala Memorial Volume

Krishnamurti Bh 1961 Te ugu Verbal Bases A Comparat ve and Descr pt ve Analys s Berke y Cal forn a University Press

Krishnamurt Bh 1969 Konda or Kubi A Dravidian Language Hyderabad Tr bal Cultnral Reserch Institute

Kr shnamurt Bh & P S vananda Sarma 1968 A Basıc Course ın Modern Te ugu Hyderabad

Lakoff George 1970 Presuppost ons and Re at ve Grammat cal ty Report N S F-24

Langacker R N 1967 Language and ts Structure New-York Harcourt Brace & World

Lenneberg E H 1967 B o og ca Founda ons of Language New-York John w ey

Lyons John 1970 Chomsky London Fontana

Panna a Usha (Un-Pub shed M Ph d ssertat on) Hyderabad Osman a Un vers ty

Prakasam V 1972 A System c Treatment of Certaın Aspects of Te ugu Phono ogy (Un-Pub shed Ph D d sser-tat on) York-U K Unıvers ty of York

Ramachandra rao C 1974 Vowe (Harmony n Te ugu Paper presented at the Sem nar on Te ugu phonet cs H/dera-bad (Un-Pub shed)

Ramarao C 1969 A Grammat ca sketch of Te ugu (To be publıshed by Govt of Ind a )

Ramarao C 1975 Drav d an Ev dence for Abstract Phonology Osman a papers n L ngu st cs-1 PP 30-44

Ross John 1969 On Dec arat ve sentences In R Jacobs & P Rosenbaum (eds ) Read ngs n Transformat ona grammar Boston Blacksdell-G nn

Subbarao K V 1971 Vowe Harmony n Te ugu and Parenthes s and Infin te Ru e Schemata Papers from the 7th Reg ona Mee ng of the Ch cago L ngu st c Soc ety Ch cago U S A PP 543-552

Sk nner B F 1957 Verba behav our New - York Appleton century Crafts

Tam Lex con 1927 Madras

Venkatavadhan D 1965 Case Term nat ons n Nanne-choda s Kumara Sambhava Journa of Osman a Unıvers ty Vo -3 Hyderabad

W nfie d W W 1928 A Grammar of the Ku Language ca cutta The As atıc Socıehy of Bengal

